శ్రీరస్తు.

శ్రీరామచంద్రాయ నమః

# శ్రీ మోక్షగుండరామాయణము

## యక్షగానము (హరికథ)

శ్రీ తాళ్ళూరి నారాయణ సత్కవి విరచితము

ప్రచురణ :

**తిరుమల తిరుపతి దేవస్థానములు,**

**తిరుపతి.**

**1979**

SRI MOKSHAGUNDARAMAYANAM

YAKSHAGANAMU (HARIKATHA)

by

SRI THALLURI NARAYANA

T.T.D. Religious Publications Series No. 17.

Subsidised Price: Rs- 5-00



*Published by:*

P. V. R. K. PRASAD, I.A.S.,
Executive Officer
Tirumala Tirupati Devasthanams,
Tirupati.



Printed at:
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati.

# ముందుమాట

రామగాథకు నెలవైన గ్రంథం రామాయణం. ఉత్తమోత్తమమూ, పూజనీయమూ అయిన ఈ ఆదికావ్యంలో అనేక ఆధ్యాత్మిక రహస్యాలు వున్నాయి. కుటుంబానికీ, సమాజానికీ ఆదర్శప్రాయాలైన విధానాలు రామాయణంలో వివరించబడ్డట్లు మరోకావ్యంలో సూచించబడలేదనడం అతిశయోక్తి కాదు.

రామాలయం, రామభజనలు, రామాయణ పారాయణాలు, రామనామ జపాలు సర్వాంధ్రదేశ సాధారణాలు, జానకీరాములు తెలుగువారి ఇలవేల్పులు. భారతీయ రాజవంశాలలో సూర్యవంశం నాయకమణిలాంటిది. మానవజీవిత సాఫల్యానికి ఏనాడో పునాదులు వేసిన ఇనవంశ్యులు వందనీయులు. వారి చరిత్రను చక్కగా వివరించే రామాయణం ఆంధ్ర వాఙ్మయంలో సాహిత్యశాఖ లెన్ని అవతరించాయో అన్నింటిలోనూ అల్లుకుని వున్నది.

రామాయణకావ్యంలోని కర్తవ్యోపదేశం హృదయాన్ని అర్థంచేసి మానవులను అప్రయత్నంగానే ఆచరణోన్ముఖులను చేస్తున్నది. రాముడి పితృవాక్యపరిపాలనం, ఏకపత్నీవ్రతం, స్నేహానురక్తి, ప్రతిజ్ఞాపాలనం, శిష్టరక్షణం, ఔదార్యం ఆదిగాగల మహాగుణాలు మనకు అనుసరణీయాలవుతున్నాయి. సీతామహాదేవి పాతివ్రత్యమహిమ. కష్టసహిష్ణుత, ఆదర్శ గృహిణీ ధర్మనిర్వహణం, పుత్రవాత్సల్యం లాంటి ఉదాత్తధర్మాలు మహిళాలోకాన్ని ఉద్ధరించ గలుగుతున్నాయి. అదే విధంగా దశరథుడి పుత్రప్రేమ, భరతాదుల భ్రాతృప్రేమ, లక్ష్మణుడి సేవాదీక్ష, ఆంజనేయాదుల భక్తి

ప్రపత్తులు, సుగ్రీవుడి స్నేహధర్మం, విభీషణుడి ఆత్మధర్మ నిర్వహణం వంటి గుణాలు ఎందరినో తీర్చి దిద్ద గలుగుతున్నాయి.

యక్షగానం ఒక ప్రక్రియాభేదం. గేయనృత్యరూపం. గానానికి నృత్యంకూడా అనుబంధమైన యక్షగానంలో ఆంధ్రవాఙ్మయ విధాన సర్వస్వ మున్నదని కొందరి అభిప్రాయం. శ్రీ తాళ్లూరి నారాయణ సత్కవి యక్షగానంగా వ్రాసిన ఈ మోక్షగుండ రామాయణం తెలుగునేల నలు చెరగుల కీర్తించబడుతున్నది. తిరుమల తిరుపతి దేవస్థానం వారు ప్రచురించిన ఈ గ్రంథం కూడా అందరి ఆదరాభిమానాలు పొందగలదని ఆశిస్తున్నాము.

డిశంబరు 6, 1979
తిరుపతి

పి. వి. ఆర్. కె. ప్రసాద్,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

ఓం.

శ్రీ గురుభ్యో నమః

# విషయసూచిక

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

అవిఘ్నమస్తు

# శ్రీ మోక్షగుండరామాయణము

## హరికథ

### బాలకాండము

* * *

శా. శ్రీమద్భూమిజ వామభాగమునఁ బ్రాచిన్ గేసరీ పుత్రుఁడున్,
సామోదంబునఁ బార్శ్వ యుగ్మమున నాశత్రుఘ్నకైకాత్మజుల్,
ప్రేమన్ బశ్చిమమందు లక్ష్మణుఁడు నావేష్టింపఁ, జెల్వొందు శ్రీ
రామబ్రహ్మపదారవిందముల నారాధింతు నశ్రాంతమున్.

మ. మఖముంగాచి, విరాధముఖ్యరిపులన్ మర్దించి, సుగ్రీవునిన్
సఖుఁగా నేలి, దశాస్యు ద్రుంచిఁ యవనీజం గూడి సాకేతమున్
సుఖియైచేరి స్వరాజ్యభోగములచే శోభిల్లు శ్రీరాఘవుం
డఖిలాఘంబులఁ ద్రుంచి, భక్తులకు నిత్యానందముం గూర్చుతన్.

బేహాగ్ : ఆదితాళము.

రామా మహీజావరా! పరంధామా! సుగుణాకర ॥ రామా! త్రిలోకాభిరామా! దనుజవిరామా! వినుతసుత్రామా! దశరథ ॥ రా ॥ సంగరహరా! విహంగతురంగ! ఘనాంగ! కలుష విభంగ! జనకజ ॥ రా ॥ ఖండేందుమౌళికోదండవిఖండన! పండితనుత! మోక్షగుండపురరఘు ॥ రా ॥ వారణదుఃఖనివారణ! త్రిలోకకారణ! తార్క్ష్యారినారాయణార్చిత ॥ రా ॥

మలయమారుతము : అటతాళము.

శ్రీగురుప్రభో చిదఖండరూపభో ॥ శ్రీగు ॥ బాగుగ నీపాదభజనముచే భవసాగరముదాట–గా గల్గె ధన్యుఁడు ॥ శ్రీగు ॥ చక్షురగ్రమున సత్యరూపమున, మోక్షగుండమందు-సాక్షిగ వెలకొన్న! యక్షయతేజ నారాయణశర్మహృల్లక్షిత! పూర్ణవిలాస! వేంకటశివ ॥ శ్రీగు ॥

ఆదితాళము : ( రవికులతిలక-వలె )

నను దయగనవే పరమేష్ఠిరాణి ॥ నను ॥ ననుగైకొనవే ఘనపాపనివే ॥ నను దయ ॥ ఆపదల్మాపగన్ – బాపముల్వాపగన్–నీపాటివారలు రూపింపగా లేరు ; నీపదయుగళము బ్రాపగు ॥ నను ॥ భావంబునన్ సేవించెదన్ – నావాక్కునన్ నీవెప్పుడుఁ–ఠీవిగ నిలిచి సభావహ మగు నటు, గావింపు జగత్పావని ॥ నను ॥ మోక్షగుండమం దనయము నీపు రంజిల్లి–యూక్షితినారాయణకవి నేలెడుతల్లీ యక్షయకటాక్షమునఁ దీక్షమీఱ వీక్షింపుము ॥నను॥

శంకరాభరణము : రూపకతాళము,

శ్రీయుమాకుమారా ! పాహిశ్రీ డాయరాదా ! యఘాశిద్రోయ బాహి ॥ శ్రీ ॥ పాయక నీపదాబ్జములు సదా గొలుతు శ్రీయు ॥ కాయేంద్రియపరిహారా ! కాయజ సుకుమారా ! తోయజాతభవవందిత శ్రేయము లిడరాదా । శ్రీయుత నారాయణ కవిరాయ వినుత ॥ మోక్షగుండనాయక ! నిర్విఘ్నంబుగ నాయభీష్ట మొసగూర్పుము ॥ శ్రీయుమా ॥

ఆ. వె. ప్రస్తుతమున నాకు వాసార్హమై యొప్పు
మోక్షగుండనామపురమునందు
భవ్యరాఘవోత్సవమును విళంబి వ
త్సరమునందుఁ దనరుచైత్రమందు.

వ. యథావిధిగ నాచరింప నమకట్టి ప్రవాళ రజత నీల స్ఫటిక తేజో రాజితంబగు నొక్కదివ్యమందిరంబున నష్టదళవిరాజిత భద్రపీఠంబుపయి భరత శత్రుఘ్న లక్ష్మణ సీతాసమేతంబుగఁ గోటిసూర్యప్రభాభాసమానుండయి వేంచేసియున్న శ్రీరామచంద్ర మహా ప్రభు కొలువు సేయం గోరి సర్వేంద్రియవ్యాపారంబుతోఁ గలియకుండ మనంబును మారుతముతో జతపఱచి పంపఁగ నవి రెండేకీభవించి, పెద్ద మార్గంబులు రెండింటిని విడిచి, నడిమి సన్న బాటను జని తన్మందిరంబునకుఁ గల ద్వారపాలకుల నాశ్రయించి మొదటి వానికి నాఱునూఱులు, రెండవవానికి నాఱువేలు, మూఁడవవానికి నాఱువేలు, నాల్గవవానికి నాఱువేలు, నైదవవాని కొకవేయి, యాఱవవాని కొక్కవేయి, కడపటివాని కొక్కవేయిగ - నీప్రకారము లంచమిచ్చి వచ్చుచుఁ బోవుచుండుటకు నిరాతంకముగాస్వతంత్ర మేర్పఱుచుకొనిచేరి యర్ఘ్య పాద్యస్నానంబులు గంగాదిననదీజలంబులుగ, షట్కమలంబులు పూజాద్రవ్యంబుగా, సూర్యచంద్రులే హారతులుగ, నిజానందంబే నైవేద్యంబుగ భావించి యాత్మారాముని సేవించుచుఁ దన్మయత నున్న సమయంబున.

ఉ. తంబుర( గాలిగజ్జెలుసు దాళమృదంగము లాదిభవ్యనా
దంబులు పొల్పుమీఱ హరిదాసచయం బరుదెంచి నృత్తగ
తంబుల రామమూర్తిచరితంబును బాడుచు నుత్సవంబు సొం
తంబగు నంతదా(క భజనంబు లొనర్చిరి సంతసంబునన్.

వ. ఇట్టి సత్కాలక్షేపంబు సర్వజననేత్ర శ్రోత్ర మానసానందకరంబుగనున్న కాలంబున.

సీ. శ్రీరమణీయ వేమూరిసదన్వయ క్షీరాంబునిధిపూర్ణశీతకరు(డు
మహనీయసత్సభామండలరంజిత సంగీతవిద్యావిశారదుండు
దేవ మహీదేవ దేశికసజ్జనాదులయెడ సద్భక్తినిలుపువా(డు
పాపార్యవర్యుండుపర(గ శేషాంబికయందు(గన్నట్టినెయ్యంపు(గొడుకు

గీ. సుబ్బయార్యునికూరిమి సోదరుండు,
నలరు నరసింహశర్మకు నగ్రజుండు,
శ్రేష్ఠశుభరామనామైక చింతనుండు,
యజ్ఞనారాయణుండు సత్యవ్రతుండు.

వ. ఉత్సవారంభదివససాయంతనంబున( బూజాసమయంబునను వచ్చి యందు వేంచేసియున్న సాకారరామమూర్తిని వీక్షించి.

ఏకతాళము : దిలలగాహి

కలిగె నాకు శ్రీరాఘవునిగొలువ ॥ గలి ॥ ఘల్లుఘల్లున జిఱుగజ్జెలు మెఱయ । నలినాక్షుని కడ నాట్యము జేయ ॥ గలి ॥ తాళ మృదంగ ఫిడేలు; తంబుఱలు । బాళినిమ్రోయభజన(జేయ ॥ గలి ॥ భూమిజయుతు(డైపొద ; లెడురాముని । వేమరుగన్నుల వీక్షింప(గను ॥ గలి ॥ అక్షరుడయినా, రాయణు నేలెడు । మోక్షగుండపతి మ్రోల నిలువ ॥ గలిగె ॥

వ. ఇట్లత్యానందంబు నొందుచు హరిదాసబృందంబులం గలిసి భజన మొనర్చి యవభృథానంతరము మదంతికంబున నిలిచి నమ్రభావంబున.

సీ. శ్రీవత్సనంజ్ఞరాజితగోత్రభవుండ వార్వేలకులాంబుధిద్విజవిభుఁడవు
తాళ్లూరికృష్ణ ప్రధాని జ్ఞానాంబయందాదరంబునగన్న యాత్మజుఁ
డవు ; ఘనమైలవరపువేంకటశివాచార్యకృపాలబ్ధవిజ్ఞాన భాసితుఁడవు ;
మూర్తిత్రయాతీతముఖ్యసచ్చిత్సుఖమయవస్తుతత్త్వవిమర్శకుఁడవు ;

గీ. కేవలాఖండమోక్షలక్ష్మీయుతుఁడవు,
భక్తి శ్రీరామచంద్రోత్సవవ్రతుఁడవు ;
సరసపదపద్యనిర్మాణసక్తమతివి
హతదురితకర్మ నారాయణాఖ్యశర్మ.

అని సంబోధనచేసి యిట్లనియె ;

క. రామాయణంబు హరికథ
గా మీరు రచించియిందు కారుణ్యమునన్ ;
నేమమున నేఁబఠించెద ;
భూమిని నాకొదవు భుక్తి ముక్తులు రెండున్.

వ. ఈమహోపకారంబుఁగట్టుకొం డని ప్రార్థించిన సమ్మతించి వారిని సమర్యాద ముగాఁ బంపి పిమ్మట నొక్కనాఁడు నామనంబున.

సీ. ఛందోవిచారంబు నలుపఁగానైతిని ; వ్యాకరణంబు నేర్వంగలేదు
కావ్యంబులనుమాటగలలోనెఱుంగను ; నైఘంటికంబులనంగవినను ;
సపరసాలంకార నైపుణిలేదయ్యె ; భరతశాస్త్రంబుచొప్పరయలేదు ;
రాగతాళములమార్గముగోచరముగాదు ; స్వరవిభేదంబులజాడలెఱుఁగ

గీ. నీమహాకావ్యరత్న మింకేవిధమున
హరికథ నొనర్తు శక్తి లేదనక నేను
సమ్మతించితి, నిదియెట్లు చక్కబడునొ !
యొండు శరణంబులేదు రాముండు దక్క.

వ. అని యోజించి రాముని బ్రార్థించి యారాత్రినిద్రించుసమయంబున నాపాలి ప్రత్యక్షదైవం బగు శ్రీరామమూర్తి మదీయకారణాచార్యులగు వేంకటశివార్యవర్యరూపంబున స్వప్నంబునఁ గనఁబడి దయారసం బొలుక యిట్లనియె.

తే. గీ. వత్స! వాల్మీకిముఖమునివరులు, నితర
నరులు, మును సంస్కృతాది నానావిధస్వ
భాషలను శక్తికొలఁదిని భక్తిచేత
నెన్నిరీతులనో రచియింపలేదె!

క. అందఱిలో నీ వొకఁడవు;
సందేహము నీ కిఁ కేల! సద్గురుకరుణా
నందంబున రామాయణ
ముం దగ హరికథ రచింపు ముదము దలిర్పన్.

ఉ. చొక్కపుహేమ మెవ్వరెటు సొమ్ములు సేసిన వన్నెవచ్చి న
ట్లెక్కువ రామమూర్తికథ నెవ్వరు సెప్పిన నొప్పిదంబగున్:
జక్కఁగ దత్కథారచన సాంగముగా నెఱవేర్చి భక్తితో
గ్రక్కున మోక్షగుండపురరామున కర్పణ సేయు పుత్త్రకా!

వ. దీనికి మోక్షగుండ రామాయణమను నామం బొసంగుము. నీకు మేలయ్యెడు మని సెలవిచ్చి వాఁడు కను మొఱంగిన నేను మేలుకాంచి శ్రీమద్వేమూరి యజ్ఞనారాయణా ఖ్యహరిదాస ప్రోత్సాహంబున కనుగుణంబుగ సద్గురుకటాక్షంబు గలిగెఁగదా! యింక లోపం బేమియని యానందించి యిట్లనుకొంటి.

ఉ. ఈయవనిం గవీశ్వరు లనేకులు నేర్పరు లుండియుండ రా
మాయణమున్ రచింప నను మన్ననఁ బ్రేరణచేసె యజ్ఞనా
రాయణపాటి మిత్రులు ధరంగలరే! యిక నాదుభాగ్య మెం
తో యధికం బటంచు ధృతితోఁ దలపోసి యనంతరంబునన్.

వ. ఒక్క శుభదినంబున నుపక్రమించి యిష్టదేవతా సద్గురు సత్కవీశ్వరులఁ బ్రార్థించి:—

షష్ఠ్యంతములు, అటతాళము (కలియుకర్నాడ)

1. రామునకు జితభృగు — రామునకు జగదధి — రామునకు దానవ
రామునకు మోక్షగుండ ॥ రా ॥

2. ధీరునకు నిగమసం చారునకు రణరంగ । హరునకు శరధి గ
భీరునకు మోక్షగుండ ॥ రా ॥

3. ఖండశశిమౌళి ఘనో — ద్దండ కోదండ వర ।। ఖండీకృత బా
బలా । ఖండునకు మోక్షగుండ ॥ రా ॥

4. దివ్యనకు సుజనసం । భావ్యనకు మరుత్సుతసేవ్యనకు
మం । తవ్యనకు మోక్షగుండ ॥ రా ॥

5. ప్రీతునకు భువన వి । ఖ్యాతునకు రవివంశ । జాతునకు సీతా
మేతునకు మోక్షగుండ ॥ రా ॥

6. నారాయణశర్మ హృద్వి । హారునకు ననంతావ । తారునకు
మం । దారునకు మోక్షగుండ ॥ రా ॥

వ. సమర్పితంబుగా నానేర్చుకొలంది సేయంబూనిన శ్రీమోక్షగుండ రామ
హరికథా విధానం బెట్టు లనిన —

క. శ్రీమత్కైలాసాచల
ధామంబుననున్న చంద్రధరునిం గని త
ద్వామార్ధశరీరిణి యగు
హైమవతీరమణి మ్రొక్కి యడిగెఁ బ్రియమునన్.

క. మంత్రములలోన నుత్తమ
మంత్రం బన నెద్ది దాని మహిమంబును ద
న్మంత్రాధిదైవమును, ద
న్మంత్రానుష్ఠానవిధము మఱిఁ దెలుపవే.

వ. అని మహావినయంబునఁ బ్రార్థించిన నానందభరితాంతఃకరణుండయి - కాంతా మణీ! ఋష్యాదులకు నగోచరంబగుగూఢవిచారంబు నన్నడిగితివి: ఐన నీయందలి దయచే నద్దానివచించెద వినుము.

### శివునికీర్తనము-ఏకతాళము

రామమంత్రము, కడు రమ్యమంత్రము! భూమిలోనలేదు దానిబోలుమంత్రము!
మంచిమంత్రము! విబుధు లెంచుమంత్రము, మించి జన్మవార్ధిని దాటించు మంత్రము ॥ రా ॥
నిత్యమంత్రము! విమల సత్యమంత్రము! ప్రత్యగభిన్నాత్మతానై పరగుమంత్రము ॥ రా ॥
దీక్షమంత్రము కడు దివ్యమంత్రము! మోక్షగుండమందువెలయు ముఖ్యమంత్రము, రామ పరమమంత్రము, యిదే చరమమంత్రము, ధరను నారాయణ మనోజ్ఞస్ఫురితమంత్రము. ॥ రా ॥

గీ. రమణి విను మిది శ్రీరామ రామరామ
యనుచు బ్రహ్మాదివిబుధులు మనములందు
గని రమించుచు నుండిన కారణమున
రాముఁ డను పేరు వచ్చెఁ బరాత్పరునకు.

వ. కాఁబట్టియమ్మంత్రరాజంబు నీ వనుష్ఠింపఁదగినది. దీని యనుసంధానంబున బునరావృత్తిరహితశాశ్వత బ్రహ్మానందపదవి ననుభవింపవచ్చునట్టి రామమూర్తికిని నాకును భేదంబులేదు సుమీ యని యమ్మంత్రంబుపదేశించిన నానందించి యోపరమేశ్వరా! రాముండు పరమాత్ముండయినను మాయతోఁగలసి యవతారంబు లెత్తినట్లు పురాణవచనంబుగలదు. అందు వలన నతని కేమిప్రయోజనంబు సెలవిమ్ము మహాత్మా! యని వేడిన నానందించి శంకరుం డిట్లనియె:

క. ప్రకృతి విలక్షణుఁడగు నా
త్మకు సృష్ట్యాదులు వికల్పితంబులు లేమా!
యొకటిని నంటక యాతఁడు
సకలంబును జేయుచుండు సర్వాధికుఁడై.

వ. ఇట్లు గావున జగత్సృష్టిస్థితిలయకారణకర్తయైనపరమాత్మదుష్టనిగ్రహ శిష్ట పరిపాలనంబుల కొఱకును ధర్మసంస్థాపనంబు కొఱకును బ్రతియుగమునందు మాయాసహి తుండై యనంతావతారంబు లెత్తుచుండు. అందొక్కటియగు రామావతార చరిత్రము లోక త్రయపవిత్రంబై శ్రోత్రానందకరంబయి యలరారునది, దెలిపెద సావధానచిత్తవగుము.

పల్లవి. తోహార. రామరామయనవే! శ్రీరామాయణకథవినవే! రామా! రఘుకుల రామా! సీతారామా! రామా! యనవే! రామామణిరో రమ్యంబగు శ్రీరామాయణకథ వినవే ॥ రామా ॥

వ. ఓపార్వతీ! ఈప్రపంచంబున నార్యావర్తంబునఁ గోసలదేశంబున మాంధాతృ సగర దిలీపేక్ష్వాకువులు మొదలగు సూర్యవంశ రాజులకు ముఖ్యపట్టణమయి యయోధ్యయను నొక్కనగరంబువెలయు. నవరత్న స్థాపితమయిన దివ్యభవనంబులచేతను, విశాల ములయిన రాజవీధులచేతను, రమ్యంబులగు విపణిమార్గంబులచేతను, నగాధములగు నగడ్తల చేతను, మోదప్రదంబులగు శశికాంతవేదులచేతను, బచ్చలతోరణములచేతను, ముత్యాల ముగ్గులచేతను, దనరారి వర్ణాశ్రమాచార నియతులయిన చాతుర్వర్ణ్యములవారికి నివాస యోగ్యంబయి యలకాపురంబుకన్న మిన్నయై వన్నెఁగన్న యన్నగరంబున.

తోహార. దశరథుఁ డనునొక ధరణినాథుఁడు తరణివంశ సంభవుఁడు! దశదిశలందును విశదంబుగఁ దన యశము నిండఁగా నెగడు ॥ రామా ॥

వ. మున్నూటయేఁబదియుంది భార్యలలోముఖ్యులయిన కౌసల్య, కైక, సుమిత్రలను ముగ్గురు భార్యలతోఁగూడి సమస్త సుఖంబు లనుభవించుచుఁ బెద్దకాలంబు రాజ్యంబు జేయు చుండి తనకు సంతానంబులేని కొఱంతచేఁజింతించి సుమంతుఁడు లోనగు సేనమంత్రిమంత్రులను రావించి సభచేయించి వసిష్ఠాదిమునులను బిలిపించి పూజించి ముకుళితహస్తుండయి దశరథుం డిట్లనియె :

దశ-కీర్తన : ఆదితాళము

మునులారా! నా మొఱ వినరే! యోహెూహెూ హితులారా! ధారుణిఁబుత్రులు లేరిఁక నాకు నే తీరునఁ గోరిక తీరునో నూరివరులారా ॥ సంతతిలేకను సద్గతిలేదఁట యెంతయు వంత పడింతు సేవింతుబుధు లారా ॥ మోక్షగుండ కమలాక్షుని కృపాకటాక్షము గలుగునె యక్షయముగ ॥ బుధులారా ॥

వ. "అపుత్రస్య గతిర్నాస్తి" సుతులు లేని వారికి గతులు లేవని శ్రుతిస్మృతులు పలుకుచున్నవి. పెక్కుకాలంబయ్యె; నొక్కతనయుండయినఁ గలుగండు కాఁబట్టిసంతానంబు గలుగు తెఱంగెఱింగింపుఁడు.

సంధి : తోహర.

అని యిటు దశరథుఁడాడిన పలుకులు ! వినిరి మునులు మోదమున ! ఘనరఁగ సూతుఁడు దాను విన్నదంతయును దెలిపె వేగమున ॥ రామా ॥

సూతు-కీర్తన-కమాచ్ ఆది.

విను ధరణీనాయకా, వినుధర, సురుచిరితసుజిత సుమసాయక విను ॥ ధర ॥ సంతతి లేదని చింతయేల మీ సంతనమున మనవి నిలిపి ॥ విను ధరణి ॥ ఎలమిఁబుత్రకామేష్టిజేసినను ॥ వెలయఁగదనయులు గలుగుదు రిల విను ॥ ధర ॥ అవని మోక్షగుండాధిపు కృపచే ! వివిధ సుఖంబుల పీఁగగలవు విను ॥ ధర !

వ. ఓ దశరథమహారాజా ! పూర్వంబున అంగమహీపాలుండగు రోమపాదుండను రాజు తనరాజ్యంబున ననావృష్టి దోషంబు ప్రాప్తించి జనక్షోభము గలిగిన నది నివారించుటకయి ప్రాజ్ఞులవలన వర్షహోమాది క్రియలు చేయించియు వానలు లేకున్న జింతించుచుండఁగా నప్పుడు కొందఱు పెద్దలు విభాండకుని తనయుఁడు ఋశ్యశృంగుఁడను నతఁడు జన్మించి నది మొదలు తపస్సంపన్నుఁడయి యున్నవాఁడమ్మహానీయుండున్న దేశంబునదుర్భిక్షభయంబులు దొలఁగుఁగాన నతని నిందు రప్పింపుఁడని పలుకఁగ విని రోమపాదుండు చాతుర్యనిపుణలగు గణికాంగనలఁ బిలిపించి యమ్ముని తపోవిఘ్నంబు సలిపి తోడి తెండని పంచిన పంచిదని.

రూపకము, (రామల్ నలుగు) - వలె.

వారల్ చనిరి మోదమున ! నొయూరముమీరన్ ॥ వారల్ ॥ సారెకుఋశ్యశృంగుణ ధీరున్ వలపింపగఁ గోరి తదాశ్రమవనికిని జేరన్ ॥ వారల్ ॥ మాటల్ చెఱకు రసము వలెన్ మాధుర్యము గారన్ ! మాటికి నయ్యాటలతోఁ బాటలు వాడుచు గను గీతులఁడగ చిఱునగవులతోడన్ ॥ వారల్ ॥ మౌనిస్ మఱపించి ధరా జాని పురముఁ జేర్చన్ ! బూనినటా మోక్షపుర శ్రీనాథుని పదములు ! ధ్యానించెడు మునివర్యుని గానన్ ॥ వారల్ ॥

సీ. విరహిణీమృగముల వేటాడ గమకించి మరుడు వైచిన పుష్ప ॥ శరములనగగ
గడు వేడ్కతోఁ బాల ॥ కడలి నిజన్మించి జగతికి వచ్చున ॥ చ్చరలనంగ
ధారాధర వినిర్గ ॥ తంబులై దెసలకు బఱతెంచు క్రొక్కాఱు ॥ మెఱుపులనఁ
శృంగారరసములం ॥ జేరి క్రీడింపంగఁ గదగిపచ్చెడు రాజ ॥ కన్యలనఁగ

గీ. నించుకైనను మది సంశ • యించ కపుడు
మించుబోణులు మిగులఁ గా • మించి సంత
సించి మునియాశ్రమముఁ బ్రవే • శించి యతనిఁ
గాంచి పలపించి కొనిపోప • నెంచి రంత

ఉ. వీనుల విందుఁ గొల్పఁదగు వీణల మీటుచు నాట్యయుక్తమై
గానము సేయుచుఙ మఱియుఁ గాంతలు సంతయు భీతిలేక య
మ్మౌనిని దాఁకుచుఙ గడఁగి మాటలు నీటు చెలంగఁబల్కుచుం
బూని విచిత్రమార్గముల మోహితుఁజేయఁగఁ గొల్చిరాతనిఙ.

వ. ఇట్లు కొన్నిదినంబు లతని నాశ్రయించి తమ స్వాభావిక చేష్టల గనపఱచు చుండిన నతండు పూర్ణ సమాధిని జాలించి.

తోహర. కన్నులు విచ్చి య ఖండ తేజములఁ గనఁబడువారలఁ గాంచి। ఎన్నఁడు జూడని యీ వరరూపము లేమిటివో యని యెంచి ॥ రామ ॥

వ. స్త్రీపురుష భేదా భేదంబు లెఱుంగని యతండు వారలఁదన వంటి ఋషు లనుగా భావించి యిట్లనియె.

ఋశ్య, కీర్తన, ఏకతాళము : (కనలిపని) - వలె

ప్రమదప్రమరగ మిముఁ జూడగలిగెను । తమ యాశ్రమములెంత దవ్వుండు దెల్పుఁడంత సముచిత సమభాషణములాడఁ గల్గెను॥ ప్రమ॥ మాకుగొమ్మొండు మఱితల నుండు । మీకు రొమ్మునరెండు॥ మేలైన కొమ్ములుండె । మాకంటె మహనీయులే కదా త లఁపను ॥ప్రమ॥ మీరెన్నడిటకు రారిదివరకు సారెకు మోక్షగుండశౌరి సత్కృపతోడ । జేరిన కారణము జెప్పగఁ దగును॥ ప్రమద మ॥

ఉ. అక్షయమైన తళుక్కులహాహా దెసలఙ వెలిగించుచున్న రు
ద్రాక్షలు కంఠమందు వెలయఙ ధరియించితి రార్యులార! యీ
వృక్షము లెచ్చటఙ గలవివెట్లు లభించెను మీకుఁ దెల్ప నే
నాక్షణ మేగి తెచ్చుకొనిహారముఁగూర్చి ధరింతుఁ గుత్తుకఙ.

క. పరిమళము గల్గు భస్మము
ధరియించితి రంగములను దగ నిది గనుఁడీ
దొరికినదో! చేసినదో!
కరము గురుతుఁ దెలుపరయ్య కవివరులారా!

గీ. హంస దండంబు లెచ్చటనలవడె? నివి
చేతముట్టిన నాదంబుఁ జేయుచుండు?
నిట్టి చిత్రాసనంబు లేతట్టుకలవొ
మావనంబున దొరకవు మౌనులార!

వ. ఇట్లు వారియందు బద్ధానురాగుండై తపస్సమాధిఁజాలించి వారిరోఁలసి యిచ్ఛా విహారంబుగాఁ జరించుచు గాలంబు బుచ్చు చుండ నొక్కనాఁడు వారాంగన లిట్లనిరి;

క. మా యునికిపట్లు సేరఁగఁ
బోయెదమో మౌనివర్య! పొందుగ నెన్నా
ళ్ళాయెనిటువచ్చి యిఁక సెల
వీయుము మాకన్న నాతఁడింతుల కనియెన్.

ఋషి, కీర్తన: ఏకతాళము, హంసధ్వని, (రవికుల) వలె

విడువ దగునా మహనీయులారా । తగునా । వగఁ ద్రోయఁగ మే లగునా ॥ విడువ। ఈడుగఁడీ । జోడుగఁడీ । దోడుగఁడీ । గూడియుఁడీ । వేడుకతోడుత విహరించియు విడ నాడఁగదలఁచుట పాడియె॥ విడువఁగఁ దగునా॥ నే వచ్చెదన్ । మీవెంబడిన్ వేవేలు గన్ భావింపకన్ । బావనులార । కృపావహులైకొని । పోవుదు నమ్మితిఁ । గావున ॥ విడువఁగఁ దగునా॥ ఒంటిఁడీ । ఈ వనమున నే నుంటిఁడీ । మిము వేడుకగాఁ గంటిఁడీ । గలసి మెలసి యిం దుంటిఁడీ । ఇఁక ననువిడువఁగఁ దగునా ॥ మోక్షగుండవిభులదలఁచుచు మీ యాశ్రమముల్ । వీక్షింపఁగ మాకిచ్చవొడమె నిదిమేలు ॥ ఈక్షితి మి-మ్మెడబాయఁడీ - ఈక్షణమున రానీయుడు॥ విడువంగఁ దగునా॥

వ. అని యిట్లు వెంబడించిన వారకాంతలు దమ యిష్టార్థంబు సిద్ధించెనని సంత సించుచు నా ఘనుని యంగ దేశంబునకుం జేర్చి రంత నాదేశంబున వర్షంబు గురిసి కాలంబు సుభిక్షంబయ్యెను. రాజు తన సుతయగు శాంతను ఋష్యశృంగునకిచ్చి పెండ్లి

చేసిన సతఁడు గృహస్థుండయి యా రాజునింట భార్యాయుక్తంబుగనున్న వాఁడమ్మనిసి దోడి తెచ్చిముం దశ్వమేధ యాగంబుచేసి పిమ్మటఁ బుత్రకామేష్టిసేసిన సుకుమారులయిన నలుగురు కుమారులను బడసెదవు. నిశ్చయమ్ము సనత్కుమారునివలన నీ వార్త మును వి వినియున్న వాఁడఁ గానఁజెప్పితి నా ప్రకార మాచరింపుడు.

తోహర. అని సూతుఁడు తెల్పిన దశరథుఁడతి హర్షాంబుధిలోఁ బొదలి చనియు రోమపాదుని నగరమునకు మునినిఁ బిలుచుటకుఁ గదలి॥ రా॥ శాంతతోడ ఋష్యశృంగుని దా సాకేతమునకుఁ దెచ్చెఁ, సంతానమునకు, జన్నముజేయించఁగఁదగ వినుతియొనర్చెఁ॥ రా॥ అతని సమ్మతిని, నశ్వమేధమున కపుడు ప్రయత్నము చేసెఁ, అతివేగ వసిష్ఠాద, మునులఁ జ-య్యన ఋత్విక్కులఁ జేసెఁ॥ రామ॥

కీర్తన : జంఝూటి, రూపకము.

అశ్వమేధ మఖముసేసె నవనిపాలుఁడు శాశ్వతముగఁ గీర్తి వెలయ సత్యశీలుఁడు ॥ అశ్వ ॥ గురులు వసిష్ఠాదిహోని వరులు జెల్వగ ॥ సరగ వేద మంత్రములను జదివివేల్వఁగ ॥ నశ్వ ॥ స్పష్టముగ సర్వజనులు దుష్టినొందఁగ ॥ నిష్టమయినభోజనంబు లిచ్చిపొందుగ॥ నశ్వ కోరినట్లు ధనచయంబు గోట్లకొలఁదిని । ధారుణీసురాదులకును దానమొసగుచు ॥ అశ్వ ॥ ఈక్షితి నారాయణ కవిరక్షకుండగు మోక్షగుండదేవుని కటాక్షమొందుచు ॥ నశ్వ ॥

సంధితోహర. ఇటుజన్నముసే, యించి పుత్రకా, మేష్టియొనర్పింపఁగను, దిటముగ యాగహ, విస్సులుపొందిన, దేవతలందఱుదగను ॥ రా ॥

వ. సత్యలోకంబున కరిగి బ్రహ్మకుఁ బ్రణమిల్లి తండ్రీ! మీరిచ్చిన వరగర్వ వశమున రావణాసురుండు విజృంభించి సాధువులకు బాధ చేయుచున్నవాఁడు. వాని ధాటికు లోకంబులు తేకువచెడి చీకాకుపడి యున్నవి. కావున నతని పొంగడంగు తెఱఁ గెఱిగింపవే! యని వేడిన దక్షణంబున,

సంధితోహర. వనజభవుఁడు దేవతలను దోడ్కొని, వైకుంఠమునకుఁజేరి, యనుపమ నారాయణమూర్తికి వందనములొనఁగిమదిగోరి ॥ రా ॥

కీర్తన : ఆదితాళం. ( హరిచరణస్మరణా ) వలె

పరమపురుషహరి । పాహిజనార్దన । సరసిజలోచన । సురవినుతా॥ శరణాగ మముఁ జల్లనిచూపుల, నరసిప్రోవవె । హతదురితా ॥ పరమ॥ నీ పక్షిలమునకు నీ దాతవు, నీ వెఱుంగనిది లేదు చూడు ! దేవమునుల బాధించుచు రావణుఁ డీవిశ్వమును

జయించినాడు ॥ పరమ ॥ దురమున నాతని ॥ దునిమి మాబాధలు సరగున బాపుము శశివదనా ! ధరను నారాయణదాసవినుత ! కరి వరద ! మోక్షగుండ పురసదనా ॥ పరమ ॥

వ. శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకా ! మహానుభావా ! విశ్రవసుబ్రహ్మ కుమారుఁ డగు రావణబ్రహ్మ లంకలో నివసించి లోకకంటకులగు పెక్కండ్రు రక్కసులం గూర్చుకొని భీకరంబుగ లోకంబులఁ బీడించుచున్నాఁడు. దేవతలు తమయునికిపట్టుల నిలుచుటకు వెరవులేదు. కాఁబట్టి పుత్రులకొఱకయి యశ్వమేధ యాగంబొనర్చి సిద్ధుఁడైయున్న దశరథుని భార్యలయిన కౌసల్య కైక సుమిత్రలయందు మూరు నాలుగు రూపంబుల నవతరించి దశకంఠుని రూపుమాపి మమ్ము రక్షింపవే !

సంధి తోహర: అని వేడిన బ్రహ్మాదుల పలుకులు, విని హరిదయతో గనియెన్, జనుడిఁక మీయిష్టానుసారముగ, సలిపెద నేనని యనియెన్ ॥ రామ ॥ అంతట సురలకు నజుఁడు తెలిపె మీ, యంశంబుల వానరుల, నింతమీఱఁ గల్పించి దోసపడు, టెంతయు బ్రమంతు సమరుల॥రామ॥

సంధి. వ. అని విరించి యెంచి వివరించిన మంచిదని దేవతలు, స్వస్థానంబులకుఁ జని తమతమయంశంబుల డెబ్బదిరెండు వేల్వనచరుల బుట్టించిరి. వార లతిబలశౌర్యధైర్య సాహసంబులు మెఱయ గొందఱింద్రనందనుండగు వాలిని, గొందఱు సూర్యతనయుఁడగు సుగ్రీవుని, గొందఱు వాయుసుతుండగు హనుమంతుని, గొందఱువహ్న్యంశ సంభవుండగు నీలుని నిట్లొక్కొక్క మొనగాండ్రతోఁ గొంతకొంత బలగము చేరికొలుచును దుర్గమంబులగు పవిన మార్గంబుల సంచరించు చుండిరి; ఇక్కడ నయోధ్యయందు,

## కీర్తన, అటతాళము

ఒకదివ్యపురుష డుదయించె నంతఁ । బ్రకటహోమాగ్నిలోపలనుండి వింత ॥ యొక ॥ హరినీలనీలాంగుఁ దరుణతేజుండు, సరుణాంబరుండు సాహసవిక్రముండు ॥ నొక ॥ పాయసపాత్రను బాణితలమునఁ బాయక ధరించి పరమహర్షమున ॥ నొక ॥ గురుతరముగ మోక్ష శ్రీహరిని, స్థిర భక్తితో నుతి సేయుచు ధృతిని ॥ నొక ॥

ఆ. వె. తనను జూచియద్భుతం బందుచును లేచి
వినుతుఁడైన విభుని వెలయఁ గాంచి
భూమినాథ యజ్ఞ పురుషుండ సుతుల నీ
యంగ వచ్చితిని ప్రియంబుమీఱ.

తో. అనుపుగ నీపర మాన్నమ్మును నీ యంగనలకుఁ బంచిమ్ము ఇనకులవర! నీ-యిష్టార్థంబును, ఇంకను బొందెదవు సుమ్ము ॥ రా ॥

వ. అనియిట్లుయజ్ఞపురుషుండు పాయసమహిమంబుసెప్పితత్పాత్రను దశరథున కిచ్చి యదృశ్యుండయిన ధరణీవిభుఁ డక్కలశంబులోని పరమాన్నంబును గౌసల్యకు సగము, కైకకు సగము నిచ్చినవారిద్దఱుఁ దమ యంశంబులోసగము సుమిత్రకు నిచ్చిననంతటవార దిపుచ్చుకొనిరి. పిమ్మట భూవిభుండుఋష్యశృంగాదిఋత్విక్కుల స్వదేశంబులకుపీడ్కొలిపి తాను గాంతాయుతంబుగ స్వకీయసౌధంబు జేరి సుఖలీల నుండె. అప్పాయసమహిమ వలనఁ గౌసల్యాదికాంతలు గర్భవతులయిరి: అంత.

ఉ. మన్నురుచించె నెన్నడలుమందములైతగె; మోముదమ్ములున్
గన్నులుఁ దెల్లవారెఁ బొసఁగన్ నలుపెక్కెను జూచుకంబులున్;
అన్న మసహ్యమయ్యె; బహుళాభరణాంబరపఙ్క్తి భారమ
య్యె; న్నెల లంత కంతకును హెచ్చఁగఁ గాంతల కబ్బురంబుగన్.

వ. ఇట్లు గ్రమక్రమంబున పండ్రెండు నెలలు నిండిన.

## శ్రీరామాది పుత్రజననము.

### కీర్తన - కమాసు; రూపకము.

పుత్రోదయమాయెనప్పుడు, మిత్రకుల పవిత్రుండగు, ధాత్రీపతి - చిత్రమొందఁ ॥ బు ॥ చైత్రశుద్ధ నవమి పగలు సౌమ్యవాసరాదితి నక్షత్ర కటకలగ్నయుత పవిత్రంబగు వేళను శుభ గాత్రియైన కౌసల్యకుఁ ॥ బు ॥ ప్రాకటముగఁ బుష్యతారఁ, బదిరెండవ లగ్నమందు, గేకయరాజ పుత్రియైన శ్రీకరకుచ జిత మంగళి కోకకు నా కైకకు నొక ॥ పు ॥ పాత్రంబగు కటకంబున, ఫణితారను గ్రహములు నతి, మైత్రిమెలఁగంగను శత పత్రాయత నేత్రకు శుభ, గాత్రకు సుమిత్రకు బహు ॥ పుత్రో ॥ రక్షకుఁడయి తాళ్లూరి నారాయణ కవి నేలుచుండు మోక్షగుండనిలయ కృపా వీక్షణమున నా క్షణమున, నక్ష యశుభ లక్షణులగు ॥ పుత్రోదయ ॥

క. తనయులు గలిగిన దశరథుఁ
డనుపమ సంతోషపులకితాంగుం డగుచున్
దనర వసిష్ఠుని బిలిపిం
చిన నాతం డరుగు దెంచిచిత్తం బలరన్.

సంధితోహర - నామకరణ పుణ్యాహవాచనము లామునివర్యుఁడొసర్చెన్ - రామ భరత లక్ష్మణ శత్రుఘ్న సునామములవు డేర్పఱిచెన్ ॥ రామ ॥

వ. ఇట్లు వసిష్ఠమహర్షి స్వస్తివాచనమైన పిదప భార్యాత్రయ శిశుచతుష్టయ యుతంబుగా దశరథుని పీఠంబులపయి నాసీనుఁజేసి సభాసదుల సమక్షంబునఁ గౌసల్యాసుతునకు రాముండనియు, కైకేయికొడుకునకు భరతుండనియు, సుమిత్రాసంపనులకు లక్ష్మణ శత్రుఘ్నులనియు, పేరులు పెట్టి రాజువలన బహుమతులు పడసి చనియె. అంతసంకల్ప సిద్ధిమై నందులకు భూకాంతుడు సంతసించి కాంతలతోఁ గూడి సుఖంబుండె. పిమ్మట శ్రీరామ లక్ష్మణభరత శత్రుఘ్నులు తల్లులవలన దాదులవలనను సాఁకఁబడుచు బాలసూర్యులవలె దిన దిన ప్రవర్ధమానులయి చిన్న వయస్సునందే యాటలాడ నాసక్తులై,

కీర్తన - ఏకతాళము. (ఈశరాసనంబుబాయ) - వలె.

వార లాటలాడి రీదు వారిఁ గూడుచున్ ; కోరి - చీరి చేరుచున్ బాయుచున్ బౌటపంబులున్, సారెకు నెగడన్, బౌరులు వొగడన్ ॥ వారలాట ॥ నొవ్వన్, నవ్వన్, జివ్వకున్, గప్పుచున్, నవ్వడిగనిసన్ । బువ్వల చెండున్ - రువ్వుచు మెండున్ ॥ వారలాట ॥ డాగి - మూగి, లోగకన్, వాగకన్, యోగిరంబులున్, బాగుగఁ దినకన్, వేగమె చనకన్ ॥ వారలాట ॥ దీక్షన్, గక్షన్, దక్షులై తలఁగకన్, మోక్షపుర పతియక్షయ కరుణావీక్షణ గలుగన్ ॥ వారలాట ॥

వ. ఈలీల బాలక్రీడాలోలురై కాలంబు పుచ్చుచున్న సమయంబున.

సంధితోహర : కైక దాసి యొక్కతె మంథర వేళాకోళంబని యెంచి, చేకొని చేతులఁ -జెండుదట్టుటయు, శ్రీరాముఁడుగోపించి, కట్టెదీసికొని కొట్టెనంత నొక - కాలు విరగ సత్తరుణి, యట్టిమదిని జెరగొట్టుచు గొణుగుచు నవతల జనె సత్తరుణి ॥ రామ ॥

క. ఈలీల బాలురాటల
పాలయి క్రీడించుచుండఁ బరికించి మహీ
పాలుఁడు వసిష్ఠమౌనిని
మేలుగఁ బిలిపించి పలికె మృదువాక్పటితిన్.

దశ, కీర్తన, దర్బారు అటతాళము - (రమ్మని పిల -) వలె.

మ్రొక్కెద నార్య, మునికుల వర్యా, అక్కట బాలకులాటల మరిగిరి ॥ మ్రొక్కెద ॥ చదువులు సాములు, చదివించివీరల, ముదమున నీతి కోవిదులను జేయవే ॥ మ్రొక్కెద ॥ మోక్షగుండాధిపు సాక్షిగ బిడ్డల, నక్షయ విద్యా దక్షుల జేయవే ॥ మ్రొక్కెద ॥

క. బాలురను బుద్ధికౌశల
శీలురఁ గావింపుఁడని వసిష్ఠునితో భూ
పాలుఁడు పలుకఁగ విద్యా
శాలకుఁ గొనిపోయి చెప్పెఁ జదువులు సాముల్.

వ. ఇట్లు దశరథుని నియోగంబున రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల విద్యా శాలకుఁ గొనిపోయి వసిష్ఠమహాముని స్వల్పకాలంబుననే చౌషష్టి విద్యాపారంగతులఁజేసి తోడితెచ్చి యొప్పగించిన భూపాలుండు సంతసించి వారివలననే యుపనయనంబులు సేయించి వివాహంబునకు యత్నింపుచున్న సమయంబున.

సంధితోహర. దంతికమండలు, ధారుణగుణు మో, దంబున గాదేయుండు, కుండలిశయనుని - గొనియాడుచు గ్రక్కునను వచ్చెఁ ఋషియంతు ॥ రాము ॥

కీర్తన : అటతాళము

రామ కృపాకర! రఘుకుల శేఖర! స్వామి, నిశాచరసంహార! శ్రీకర! ॥రామ॥ మత్స్య కూర్మ కిటి నరసింహ వటువామనభృగు వంశజ రాఘవ! ॥ రామ ॥ సాక్షి స్వరూపక! మోక్షగుండపురాధ్యక్ష నారాయణ దాసనుతా! జయ ॥ రామ ॥

తో॥ వచ్చిన మునివరు వార్తతెలిసి భూ వల్లభుఁడెదురుగనరిగి జెప్పెరదోయిని, వచ్చి సుఖాసన మిచ్చి పలికె దానెఱిఁగి ॥ రాము ॥ ఏమిపనికి మా ఇటకు వచ్చితిరో యెఱిఁ గింపుడు దయతోను; స్వామీ, నేను - నిశ్చయముగ నా పని సలిపెద నిపుడని యనెను.

విశ్వా : కీర్తన - నాద నామక్రియ - చాపుతాళము.

ఓహోరాజా! నా మనవి విను ॥ మోహో ॥ అహహా నేనొక్క యాగము జేయు ను । బాహు మారీచులు । బహువిఘ్నములు సేతు ॥ రోహో ॥ భూమిపయి వారిని, బొలి యించుటకు మన - రామ లక్ష్మణులను బ్రేమతోఁ బంపించు ॥ మోహో ॥ అక్షయముగను నా రాయణ కవినేలు మోక్షగుండేశుఁడు రక్షించు మిమ్ము నో ॥ హోహో ॥

వ. నేను యాగంబు సలుప సమకట్టిన త్రిలోక కంటకుండగు దశకంఠునిచే నను జ్ఞాతులై మారీచ - సుబాహులు వచ్చి విఘ్నంబులు చేయుచున్నవారు, కాఁబట్టి వారిని జంపి యజ్ఞంబుపరిసమాప్తినొందింప నీ కుమారులలో రామ - లక్ష్మణుల నా వెంట బంపు మని విశ్వామిత్రుం డడిగిన దశరథుండు ;—

దశరథునికీర్తన : దర్బారు, రూపకము.

వీరి నంపఁ జాల మౌనివీర నీడు వెనువెంటను! జనుదంచును క్రూర రాక్షసులతో బోర! నేరరు నా కుమారులు సుకుమారులు గద ॥ వీరి ॥ తల్లుల నెడఁబాయలేరు; విల్లమ్ములు పట్టనెరుఁగ; రల్లయుద్ధభూములలో నుల్లంబుల నల్లన భీతిల్లరె! యిక ॥ వీరి నంప ॥ మోక్షగుండపురనివాసు సాక్షిగ వినుఁ డీరు యజ్ఞ దీక్షబూను డేనవచ్చి, యాక్షణమున రాక్షసులను శిక్షింతును ॥ వీరినంప ॥

సం ॥ తో ॥ దశరథు డిటువలెఁ దనతోఁ బలికిన - తాత్పర్యము నాలించె, విశదంబుగనా విశ్వామిత్రుఁడు వినక యనియెఁగోపించి ॥ రా ॥

విశ్వా-కీర్తన-బేహాగ్: ఏకతాళము.

బలే, బాగునీమాటమహారాజా ! బలే ॥ బాగాయెగా – యౌగాసెబాస్‌బలే ॥ బాగు ॥ నే గావించెద నీపను లనుచును వేగముతోవాగితివి; మేలు సెబాస్ బలే ॥ బా ॥ భానువంశజులు పలుక రబద్ధము; నీ నాఁడుగాన బడె; మేలు సెబాస్ బలే ॥ బా ॥ మోక్షగుండవిభు సాక్షిగ నభలో నీక్షణమే యే మంటి? మేలు సెబాస్ బలే ॥ బా ॥

సం ॥ తో ॥ విశ్వామిత్రుఁడు వీరావేశము - వెల్లివిరియఁ బలుకగను; విశ్వంభరపతి వెఱచుచు గురునకు వినతు డగుచు నిట్లనెను ॥ రా ॥

దశ. కీర్తన : ఆదితాళము.

వినవే మునివర! వినవే తెలిపెద; వినవే నామొర వినవే! కడువడి ॥ విన ॥ విను వసిష్ఠవర మునిచంద్రమ! మొర ॥ వినవే ॥ రామ లక్ష్మణుల వే మఖరక్షణ కై ముని బిల్వఁగఁ గదలి వచ్చె నిది ॥ విన ॥ తాపసవరుని వృథాగను బంపినఁ, గోపము తోడను శాపము వెట్టును ॥ విన ॥ లేక లేక కల్గిరి వీరలు నా కీకాలమునకు! నెటులబంపుదును! ॥ విన ॥ మోక్షగుండకమలేక్షణుకృపతో! దీక్షగ నా సందియముఁబాపవే ॥ విన ॥

వ. కం. అనితనతో నాలోచిం। చినభూపతి వాక్యములను జిత్తం బలరన్ విని యవ్వశిష్ఠమునిపతి। యనుపమమృదువాక్యసరణినపు డి ట్లనియెన్.

వశిష్ఠునికీర్తన - హిందూస్తాని - కాఫీ : అటతాళము

రాము నంపిన భయ మేమో తెల్పు భూమిపాల! ॥ రా ॥ రాముఁ దన సామాన్యుఁడె శ్రీమహావిష్ణువగురాము ॥ ఉరగపతిలక్ష్మణుఁడు : ధర - సుదర్శనములు భరత శత్రుఘ్న

లల పరాశక్తియె సీత ॥ రాము ॥ రాక్షసుల శిక్షింపఁగ, నీక్షితి నారాయణాఖ్య రక్షకుండు మోక్షగుండాధ్యక్షుఁ డయి కలిగె నీకు ॥ రాము ॥

వ. ఈ గాధేయునకు మొదట కోరిన దాని నిచ్చెదనని చెప్పి యిప్పుడు బొంక వచ్చునా! సూర్యవంశరాజులు సత్యవంతులనియెన్నికఁగన్నకీర్తి యేల పోనాడెదవు? రామలక్ష్మణులకు రాక్షసులవలన గీడు మూడునను సంశయము మానుము. దీనివలన నీకు దప్పక మేలు గలుగును. నీ కుమారులను యజ్ఞసంరక్షణకొఱకు గాధిపుత్త్రుని వెంటఁ బంపుము.

సంధిః తోహర : అనివశిష్ఠుఁ డి ట్లనుటవలన నెమ్మనమున నానందించి, జననాథుఁడు రాముని సౌమిత్రిని దనచెంతకు రావించి ॥ రా ॥

దశ - కీర్తన - అటతాళము

నాయన యీ మునినాయకు వెంబడి నీయనుజునిగూడి పోయి రాపోయి ॥ నా ॥ ఈయన యజ్ఞము చేయఁగ దానవు లాయెడఁ గొనసాగ నీయరఁట దాన ॥ నా ॥ యాగ విఘాతకు లగు మారీచాదుల వేగమె త్రుంపుము ; సాగు నామీఁద ॥ నా ॥ ఈక్షితిలోపల మోక్షగుండేశ్వరుఁ డక్షయ శుభముల నాక్షణ మిచ్చును ॥ నాయన ॥

ఉ. మాటికి బుద్ధిదెల్పెదఁ గుమార కులార ; పరస్థలంబునం
దాటలఁబాటలన్ దిరిగి యారడి నొందక యాగ మేచు నా
తాటకలోనుగాగలుగు దైత్యసమూహము మించి నొంచి యి
మ్మేటికిఁబ్రీతిజేయుఁడట మీఁద యశం బలరారు మీకిలన్.

వ. అని కుమారులకు బోధించి విశ్వామిత్త్రమునిని గాంచి దశరథుండు గర కమలంబులు ముకుళించి.

దశ-కీర్తన-అటతాళము-హిందూతోడి.

తల్లిదండ్రుల చాటువారలు తాపసోత్తమ వీరలు ; మెల్లనను గొనిపోయి వేగమే యిల్లుచేర్చుడు మీరలు ॥ తల్లి ॥ ఆకటికి దప్పికిని నొక క్షణమైన నోర్వగజాలరు ; నీ కృపా రస మెట్లుజూపెదొ! నీకు దాసులు బాలురు ॥ తల్లి ॥ మోక్షగుండపురీశు కృపతో ముదము తోనేతెంతురు ; ఆక్షణంబున వచ్చి మఖసంరక్షణము గావింతురు ॥ తల్లి ॥

సంధిః తోహర : అని గాధేయున కప్పగించి తన తనయుల నటు దీవించి, చనుడని పంపించిన తఱిలిరంత మునివెంబడి మోదించి ॥ రామ ॥

వ. ఇట్లు శ్రీరామ లక్ష్మణులు మునివల్లభునితోఁగూడి యా రాత్రికి అర్ధయోజనము నడిచి సరయూనది తీరమునకుఁ జేరి మహాశ్రమ నొందుచున్నఁ గరుణించి విశ్వామిత్రుండు దాను మున్ను బ్రహ్మవలన దపోమహిమచే నార్జించిన బలాతిబలలను దివ్యమంత్రముల నుపదేశించిన నామంత్రయుగప్రభావమ్ముచే రాజపుత్రులు క్షుత్పిపాసలు మొదలగు బాధల నొందక దృఢగాత్రులయిరి. అంతనారాత్రి యక్కడ నివసించి మరుదినము ప్రయాణమై పోవుచు నా చెంగట నొక మహాధ్వని విని యిదియేమియని రాముఁడడిగిన మునీంద్రుఁ డిట్లనియె.

విశ్వా-కీర్తన-ద్యాండు స్వరము: ఆదితాళము.

రామ రామ విను మది రాజితగంగానది యీ మహానదిని మున్నీశునితలనుండి ప్రేమభగీరథుఁడీమహికిని దెచ్చె ॥ రామరామ ॥ పట్టుగా నయోధ్యను జుట్టివచ్చి యిచటను దిట్టముగా నీనదీసంగమం బగునటులగాన మహాధ్వని గల్గెను ॥ రామ ॥ అక్షయఫల మిచ్చును, నఘములఁ బోకార్చును, మోక్షగుండపురాధ్యక్ష, నారాయణ రక్ష. మీ పదముల రహిని బుట్టె మున్ను ॥ రామ ॥

వ. ఇట్లు గంగానదీప్రభావంబు గాధేయునివలన విని యానందించుచు నాస్థానంబు గడచి యంగాశ్రమము మొదలగు ప్రదేశములు చూచుచుఁ బోవుచున్నయెడ.

సంధి తోహర : కన్నుల నిప్పుల కణము లురుల దిక్కరులుమదిని బెదరఁగను, దన్ను గెలుచువారు ధరలే రనుచును దాటక వచ్చెను దగను ॥ రా॥

వ. అప్పుడు శ్రీరాముఁడు లక్ష్మణునిఁ జూచి,

రాముఁడు, కీర్తన-ఆదితాళము 'భజియింపవే మనసా' వలె

కనుగొంటివా! లక్ష్మణా! కనుగొంటివా! దనుజ వచ్చెడితీరుఁ ॥ కనుగొం ॥ మిడిగ్రుడ్లు కోఱలు దెఱచి, మిన్నువగులఁగ బెడబొబ్బలిడుచు బుడమి యదరఁగ ॥ కను ॥ మోక్షగుండవిభుని నిన్ను, ముట్టడించిన రాక్షసి పోవఁగ గలదె ప్రాణముతోన ॥ కనుగొంటివా ॥

వ. అని తెలుపుచుండ.

సంధితోహర : అంతట రక్కసి మిడిసి పైకిఁ దా గంతులు వైచుచు రాగా, పంత నమున దాని మర్దింపుండని మౌనివర్యుఁ డనె వేగ ॥ రామ ॥ మంచిదనుచు నొక మహి తశరము సంధించి రాముఁడటు వేయుమించి యురము భేదించి ప్రాణము వధించిన నది పడిపోయె ॥ రా ॥

క. తాటక మడసిన, రాముని । గాటముగాఁగౌఁగిలించి, గాధిసుతుం డ మ్మేటికి సమంత్ర కంబుగ । నూటిగశస్త్రాస్త్రములనుసొంపుగనిచ్చెన్.

వ. ఇట్లొసంగి ప్రియంబున నారాజసుతులఁ దనయాగస్థానంబగు వామనాశ్రమభూమికిఁ గొనిపోయిన, రాముండు.

రాముని కీర్తన, బేగడరాగము: ఏకతాళము

మఖము జేయుఁడు, మౌనితిలక మీరు ॥ మఖము ॥ అఖిల ఋషులఁగూడి, యమితమోదమున ॥ మఖము ॥ అసురవీరులు నేడదిచెరుపగను ; గుసుమశరారిని గూడిరా విడువ ॥ మఖము ॥ భూమి మోక్షగుండ పురమున వెలసిన స్వామి కృపచేత, నన్ముని చంద్రమ ॥ మఖము ॥

వ. ఇట్లు చెప్పిన,

ఉ. అంతట గాధిసూనుఁడు మహాముద మొందుచు రామునాజ్ఞచే
నెంతయు దీక్షఁబూని సమునీశ్వరుఁడై మఖ మాచరింపఁగా
మంత్రము లుచ్చరించుచును మౌనులు హోమము చేయుచుండ భూ
కాంతుసుతుల్ ప్రియంబునను గాంచుచునుండిరి పంచరాత్రముల్.

సంధితోహర : వరమారీచ సుబాహులు గడపడవచ్చి మాయలకు జొచ్చి, పోరి మలమూత్రంబులు హోమాగ్నుల గురిపింపఁ గడు హెచ్చి ॥ రా ॥ రాముఁ డొక్కశరరాజము వైచిన, నా మారీచుని వడిగ, దామసించి తత్తరపడవైచెను నామహాబ్ధిలో బడగ ॥ రా ॥ పదపతి మఱియొక బాణమువైవ సుబాహుఁడు నీలిగె నంత ముదమున శ్రీరాముని దీవించుచు మునులు పొగడి రాచెంత ॥ రామ ॥

మునుల కీర్తనము-యదుకుల కాంభోజి: ఆదితాళము.

శ్రీరామరామరామ, సునాశీరాదివినుతనామా, సారెకు నీ మాయ దాటనేరము భక్తికామా ॥ శ్రీరామ ॥ నీకంటె నొండేవియు లేక నిండియున్నావనియు బ్రాకటముగ, శ్రుతులు పలుకు నొకట నిక్కమదియు ॥ శ్రీరామ ॥ యాగముగాచినావు, తాటకాదుల దునిమినావు ; రాగ రహిత యోగులకు బాగుగావించినావు ॥ శ్రీరామ ॥ మోక్ష స్వరూపుఁడవు ; శ్రీ మోక్షగుండేశుఁడవు సాక్షా న్నారాయణ కవిని రక్షింతు వెపుడు నీవు ॥ శ్రీరామ ॥

వ. అని కొనియాడి మును లిట్లని యాలోచించిరి.

తోహరి : జనకుఁడు శంకర చాపము సారించిన వరరాజనుతునకు దనకూఁతురు
తను నిచ్చెద నేనని చాటించెను నటకు ॥ రా ॥ మన రాముని గొని చనినశుభంబగు నని
ను, లాలోచించి, దినకరకుల జాతుని రాముని గనుగొనిపలికిరి మోదించి ॥ రా ॥

మునుల కీర్తన - కషూస్ : ఆదితాళము.

పోదమురా! రాఘవ ॥ పో ॥ సముచిత సంభాషణములతో బోదము; అనిమిషాదు
కు నలవిగాని యొక ధనువు గలదు జనకుని పురిలో । మనము దాని గను గొని వత్తము
పోదమురా ॥ నయముగ తాళ్ళూరి నారాయణకవి ప్రియమున గొలువఁగ దయ గనుచు.
యమున మోక్షగుండ రమణ! రామ ॥ పోదమురా ॥

క. అని రామలక్ష్మణులఁ దో
డ్కొని గంగాతీరముసకుఁ గూరిమితోడం
జనునెడ నిర్జన మగు నొక
వన మగుపడఁ గాంచి మౌనివరునకు ననియెన్,



రాముని కీర్తన - కషూచ్ - ఆదితాళము.

ఈవన మెవరిది సుధీవర! తెల్పు ॥ మీ ॥ ఈ వనము పావనము గేవలము
ావులు దీవులు తావులు గలిగిన ॥ దీవన ॥ శ్రీకరమై శేఖరమై ప్రాకటమై కేకులమూకల
కలు గలిగిన దీవన జనులెవరు । గనఁబడరు మును పిచట మునులుండిన తా వని తోచెను
ది ॥ ఈ వన ॥ మోక్షగుండధ్యక్షకృపావీక్షణచేలక్షణవృక్షములక్షయముగ గల ॥దీవన ॥
సంధితోహర : రాముండిటువలె రయమున నావిశ్వామిత్రునితో నడుగ, స్వామి,
లిపెదను జక్కగ విను మీస్థలవిశేషమును వేగ ॥ రా ॥

విశ్వామిత్రుని కీర్తన : ఆదితాళము.

గౌతమవనమిది కనుగొను రాఘవ! యాతని భార్యయహల్యయగు, నాతరుణిని
రుహూతుఁడు గలియఁగఁ బ్రీతితోనెంచె గామాతురుఁడై ॥ గౌ ॥ కుక్కుటరూపుఁ గైకొని
డిరేయినిఁ గొక్కురొ కోయని కూయగను । జక్కఁగ నమ్మని స్నానార్థము జన నిక్కడ
తుల నుఖింపఁగను ॥ గౌత ॥ కాలముగా దని క్రమ్మరి వచ్చియుఁ జాల వారిచేష్టలకలిగి
ాలిని గని శిలయటు లగు మని యా వేళను మౌని శపింపఁగను ॥ గౌత ॥ రక్షింపుము
ాప మోక్షము దెలుపుము ; కక్షవర్ధనగ, గరుణతోను మోక్షగుండరామునిపాదము సోక
ాక్షణమే తీరు నని యనెను ॥ గౌతమ ॥

వ. ఇట్లు శాపవిమోచనకాలంబు చెప్పి గౌతముండు హిమవంతంబునకుఁ జనియె అదిమొద లీ వనంబు నిర్జనమైయున్నది. రామా ! పరంధామా !

తో. కావుననో రాఘవ యీరాతిని గావింపుము వనితగను, నావుడు రాముఁడు, నవ్వుచు నటులనె కావించెద నరి యనెను ॥ రామ ॥ రాముం డామార్గంబుననేగియు రాతి మీఁద బద మిడగఁ గోమలియై గ్రక్కునలేచి శ్రీరాముని బొగడగదొడగెన్ ॥ రామ ॥

అహల్య, కీర్తన - ఆదితాళము : (తంగమెట్టు) వలె.

వందనమో రఘువర్య, మందరధైర్య । సుందర పాదారవింద యుగ్మమునకు ॥ వంద ॥ నా పాపమున శిలా రూపము నొందిన శాపము బాపిన నీపాదపద్మములకు ॥ వంద ॥ భువనత్రయంబును బవిమలముగజేయు దివిషత్స్రవాహిని భవమైన పదములకు ॥ వంద ॥ మూఁడడుగులు భక్తితోడ నిచ్చినబలి మాడుపైనుంచిన మంగళపాదములకు ॥ వంద ॥ భాసుర మోక్షగుండ వాస నారాయణ దాసమనోబ్జనంవాసిత పాదములకు ॥ వంద ॥

తోహర. అని యిటు వందన మాచరించి రాముని పేర్కొనియకాంత ! పనివినియెను దన భర్త చెంతకును నినకుల సంభవుడంత ॥ రా ॥

వ. గంగానదినిజేరి యన్నదిని దాఁటుటకు నావ యెక్కబోవు రామునకు నావికుం డిట్లనియె.

ఆ.వె. రామ ! తమ పదాబ్జరజమునోకంగనె
కఠినమయిన రాయి కాంతయయ్యె !
నావ దారుమయము ; నాతిగానుండునే !
యెటుల బ్రదుకువాఁడ నినకులేశ !

వ. కావునఁ, దమపదంబులు గడిగికొనక నావయెక్కవలదన్న, నవి యటులనే కా నిమ్మనినఁ, గణాధారుండు గంగానదీ జలంబులచే రామపాదద్వయ ప్రక్షాళనంబుఁజేసి వస్త్రంబుచేఁ దుడిచి యారోహింపఁజేసి, నది దాటించిన, పిదప,—

తోహర : తాపసవర్యుఁడు దామును వర మిథి లాపురి కేగగ నెఱిగి ॥ ప్రాపుగ జనక ధరాపాలుఁడు దా బిరుగున నెదురుగ నరిగి ॥ రామ ॥

వ. తోడుకొనిపోయి సభాస్థానంబునకుఁ జేర్చి రత్నసింహాసనాసీనులం జేసి.

క. రంగుగ గౌశికునకు సా
ష్టాంగ నమస్కార మొసఁగి యర్పించి యనం
గాంగులగు రామ లక్ష్మణు
లంగని సంతోషమునఁ జెలంగుచుఁ బలికెన్.

జనకుని కీర్తన-సురటరాగము : ఆదితాళము.

మునీంద్రా! వీరెవరో తెలుపుము ॥ మునీం ॥ మనోజ సుందర మంగళరూపులు ॥ మునీం ॥ మరునమానసుధీరులు సతినుకుమారులు నెవరికుమారకులో వీరిటురాగను గారణమేమో ॥ మునీం ॥ వేడి వెలుగు ఱ వెలుగులవలెనే జోడుగూడి మీతోడుతను వేడుక తోడుత నేడు వచ్చిరి ॥ మునీం ॥ మోక్షగుండపురమున వెలసి జగద్రక్షణచేయు పరాత్పరుని దీక్షమీర వినుతించుచు తెలుపుము ॥ మునీం ॥

వ. ఉల్లంబులురంజిల్ల పిల్లమ్ములు గరపల్లవమ్ముల నల్లనల్లనధరియించి మెల్లమెల్లన వచ్చిన యీ మారసమాకారులు సుకుమారులెవరి కుమారులో దెలుపవే! మహానుభావ! తపఃప్రభావ!

తో. అని యిటువలెవేడిన యాజనకుని వినయ వాక్కు లాలించి, ముని బాలుర వృత్తాంతము, మునివిభుఁడు దెలిపెమోదించి ॥ రామా ॥

విశ్వా-కీర్తన-జంఝూటి-ఆటతాళం.

మహారాజా! దశరథ తనయు లాదినరాజకుల ఘనులు; దినరాజకులఘనులు! శ్రీరామ-లక్ష్మణులు ॥ మహా ॥ చనుదెంచి మారీచుని సుబాహు జయించి యాగమ్ము జయించి యాగమ్ము, సాగించిరి. దినమ్ము ॥ మహారాజ ॥ శిలరూపయైన యహల్యశాపము వాపిరి వీరు; వెత బాపిరి వీరు; కృపతో గనినారు ॥ మహా ॥ మీ యింటగల హరచాప మును గను గొంటకై కోరి, కనుగొంటకై కోరి, నా వెంటవచ్చిరి ॥ మహా ॥ శ్రీమోక్షగుండా ధ్యక్షు కృప నిట లాక్షు విలు చూపి, నిట లాక్షు విలుచూపి, పరీక్షగనుడోపె ॥ మహా ॥

చ. మునివిభుఁడిట్టు లాడఁగఁ బ్రమోదముతో జనకావనీశుఁ డం
పిన పదివేలమంది భటవీరులు దోర్బలవంతు లేఁగి, య
మ్మనసిజవైరి విల్లుగల మందస మీడిచి తెచ్చి తత్సభా
ఘనముగ నిల్పఁగాంచి నృపకాంతుఁడు కౌశికుఁగాంచి యిట్లనెన్.

జన-కీర్తన-కాఫీరాగము-రూపకము.

విన్నపమయ్యా మన్నింపుము మౌనివర్య ॥ విన్నప ॥ మున్నుభూమి దున్నగ నా కన్నియ వేగమున దొరకె ॥ విన్నప ॥ కూఁతుగగొంటి; ఖ్యాతిగ నే సాకుచుంటి: చే మలర సీత యనుచు బ్రీతిగ నే బిలుచుచుంటి ॥ విన్న ॥ అక్షయపదవి సాక్షాన్నారాయణ కక్షయ మీక్షితి నిడి రక్షించెడి మోక్షగుండ విభుసాక్షిగ ॥ విన్నప ॥

వ. ఇట్లు గారాబంబునఁ బెంచుచుండ నబ్బాలికారత్నంబు శుక్లపక్ష చంద్రు బోలె దినదిన ప్రవర్థమానయై యలరార.

గీ. పటికనార్చిన కనకంబుపగిది, మృగమ
దంబుఁ గూర్చిన దివ్యచందనముభాతి,
సానబట్టిన వజ్రంబుచందమునను
యౌవనస్ఫూర్తి నవహియించి యలరె సీత.

ఇట్లు జవ్వనంబు నిండారి యున్నతఱి,—

జనక. తో: మాళవ ఘూర్జర మగధ నిషధ పాంచాల సింధు కాశ్మీర, వంగ నేపాళముఖ్య దేశాల నృపులు వేర్వేర ॥ రా ॥

వ. చతురంగబలంబుతోఁ గూడి వచ్చి మద్రాజధానిం జేరి క్రమక్రమ నిట్లని యడిగిరి.

రాజుల కీర్తన-కమాచ్ : ఏకతాళము.

వినవయ్యా జనకభూవరా! వినవ ॥ నెయ్యముతోడ మీ వియ్యము గోరి, దకును మే మేతెంచితిమో ॥ యయ్యా ॥ నిరుపమగాత్రికి నీ వరపుత్రికి సరియగు బరికింపు ॥ వినవ ॥ మాలో నెవరికి బోలునో వానికి, నా లలనామణి నర్పించు ॥ వినవయ్యా ॥ అంతపాయక మోక్షగుండవిభుఁడు బ్రోచుచుండుసదా మిము నురు కృ ॥ వినవయ్యా ॥

వ. అని యడిగిన వారికి నే నిట్లంటి.

తోహర: ఈశునివిలు మాయింట గలదు దాని నెక్కిడు రాకొమరునకు । వాణిని నిచ్చి పెండ్లిగా వింతు నన్న వినియటకు ॥ రా ॥ రాకుమారకు లనేకులు గు ప్రాకటబలులై చేరి, యా కోదండము నెక్కగ నోపక నిందించిరి కనువారి ॥ రామరామ ॥

క. ఈపింటఁ గూల్చెఁ ద్రిపురము ;
లీవింటగజాంధకాద్యనేక రిపుల ముం
దే వధియించెను ; శంకరుఁ
డీవింటనె దక్షయాగ మేడ్తెర నడచెన్.

వ. అప్పుడు మా మూలపురుషుండగు నిమిచక్రవర్తికి నాఱవ తరంబువాఁడు దేవ రాతుఁడు సాయపడి దేవతలఁ దోలిన మెచ్చి యతని కీశ్వరుఁ డీ విల్లునిచ్చె.

తో : అది మొదలుగ మా యన్వయజాతులు హరదత్తశరాసనము, ముదముస మందసమున నిడి సంతతమును బూజింతురు నిజము ॥ రామ ॥

జనక-కీర్తనము-కాఫీ : ఏకతాళము.

ఈ శరాసనంబసాధ్య మేరి కైనను। గౌశిక మునిచంద్ర ! యీ మహీశు లరయను ॥ ఈ ॥ భీతిలేక రాముఁడెక్కు పెట్టితిగిచిన, సీతనిచ్చి నేను బెండ్లి సేతు బ్రియమున ॥ సీత ॥ ఈ క్షితి నారాయణాఖ్య రక్షకుం డగు మోక్షగుండనగర విభునిసాక్షిగవినుఁడు ॥ ఈ ॥

వ. అని జనకమహారాజు సెప్పుచుండ, సీతాదికాంతలంతఃపురంబుననుండి యాలించి, సోరణగండ్లనుండి శ్రీరాముని వీక్షించి సీతకుంజూపుచుఁ జెలులిట్లనిరి :

క. రాకొమరు లనేకులు నేఁ
డీకార్ముక మెత్త వచ్చి యిందుండి, రిదో
యోకోమలి, వా రెవ్వరు
నీ కమనీయాంగు బోల రిది నిజముసుమీ !

ఉ. ఆ నగుమోముసుందరము, నాకరపల్లవ కోమలంబు, నా
జానువు లంటు బాహువులచందము, నాకనుదోయి యందముల్
మానిని, గాంచుమా త్రిదివ మర్త్య రసాతలలోక వాసులం
దీనవమోహనాంగునకు నీ డగు వా రొక రైన లే రహా !

చెలి-కీర్తన-శహనరాగము : రూపకతాళము.

నీకు దగిన మగడు గదవే ! నీలవేణిరో ! శ్రీకొమరునియాకారముం జేకొనినాడొ కోమలి ॥ నీకుదగిన ॥ మున్నునోచినట్టినోము లన్ని చేకూరె, నీవు మున్ను కన్నారగఁ గన్న

పటె! పన్నలచే జిన్నలచే ॥ నీకు ॥ పుండరీకనయనమోక్ష గుండపిభుఁ డగు ॥ పుం
దండిగ గోదండంబును ఖండించును ఖండితముగ ॥ నీకు దగిన ॥

వ. అనిపలికిన సిగ్గుపడి జానకీదేవి యవతలజని చెలికత్తియలు వినకుండ
మనంబున—

క. మాతండ్రి పల్లు విఱిచిన
యాతనికే నన్ను నిత్తునని తన ప్రతినన్
భూతలి జాటింపించెను :
సీతనిచే నౌనొ! కాదొ! యెటు సేయఁ దగున్!

తే. ఇదిపఱకు గొంద ఱరుదెంచి యెత్తలేక
పాఱిపోయిరి; వారితోపాటు సీతఁ
డేగునో! లేకమోపెట్టి యెలమి నన్ను
గొనునొ! నాప్రాప్త మెటు లౌనొకో! తలంప!

సీత-కీర్తన-ఆరభిరాగము: ఆదితాళము.

మరునికోపు మాపు రూపు మరునితూపు మాపుజూపు ॥ మరుని ॥ కరిగతి
సోపు నడకలు; గమలారికిదాపు వదనము; నరసిజముల పస గరిములు వాపు కుచ
తతులను బరుపడిలేపు ॥ మరుని ॥ కంబుడంబు గలకంఠంబు; నంబరంబు అమధ్య
భంబుల జెలువంబు గలుగు సఖంబుల పొంకంబు మోక్షపురంబులోన నారాయణ
వరంబులిచ్చు శ్రీరమణుని సుతుడగు ॥ మరు ॥

వ. ఇట్లు సీతాదేవి రామసౌందర్యం బుపలక్షించి వర్ణించుచుఁ దండ్రి నుద్దే
మనంబున.

తే, కమఠ పృష్ఠకఠోర మీకార్ముకంబు
నమితసుకుమారమూర్తి యీయర్భకుఁడు
దీని నెక్కిడునటుల విధించుటకట
తాత, మీ రిడు పణ మతిదారుణంబు.

వ. అంత.

క. ఈవార్తఁ జెప్పిపంపక
యే వేగులవలనఁ దెలిసి యెలమిని సీతా
దేవిని గొన మిథిలకుఁ దా
రావణుఁ డరుదెంచి జనక రాజునకనియెన్ :

రావణుని కీర్తన-జంఝూటి ; ఆదితాళము: (వాసంతికా--వలె)

నీకన్యకామణి నీరా జనక ॥ నీకన్య ॥ నాకన్నను జగదేకవీరు లీ లోకమునను గలరే! యొకలోపము లేదిక ॥ నీకన్య ॥ కులగోత్రంబులు, గుణమును రూపము బలిమియు గలిమియును, గలవరునకు నీ దగు ॥ నీకన్య ॥ మోక్షగుండపతి ముద్దుకొమరుని కటాక్షము బొందితిని విను రాక్షస విభుఁడను ॥ నీకన్యకా ॥

వ. అనిపలికిన రావణాసురునిగాంచి,

జనక-తోహ : శంకరునిశరాసనము గలదు మాసదనంబున నదిదాల్చి, కొంకక నీవును గుణము సారించినఁగూతునిత్తునన లేచి ॥ రామ ॥

రావణ, కీర్తన-ఆదితాళము : మంగళంహరి.

ఏదిరాయోరి! ధనువేదిరా యోరి ॥ యే ॥ ఏదిరా చాప మేమంతు భూప! నాదు ప్రతాపవైభవము దోప ॥ నేదిరా ॥ పట్ట నేరనా! మోపెట్టజాలనా! పట్టికి నిట్టిపంచెము గట్టి పెట్టెలోఁ జుట్టి పెట్టితివట్టి ॥ దేదిరా ॥ ఎల్ల రాజులవలె నెంచి తౌ బళా! ముల్లసజల్లు మోపెట్ట జెల్లువెల్లున విల్లు గిల్లును డుల్లు ॥ నేదిరా ॥ మోక్షపురపతి గన, సోక్షమాపతి, అక్షీణబలుఁడు నతివిక్రముఁడు రాక్షసవరుఁ డూరకపోడు జూడు ॥ యేది ॥

వ. అని పరాక్రమంబున నాడిన, మంచిదని విల్లున్నమందన దెలిచిన, నప్పుడు రావణుండు——

తోహ : ఎడమకరంబుల నెత్తగ నాధను వేమియు లేవకయున్న । గుడిహస్తంబులఁ గోరి యెత్త దలపడినను గదలకయున్న ॥ రావ ॥

వ. దశదిశలు కలయఁ జూచి దశవదనంబులఁ గోపంబు జేగురింప నపుడు కలిచుచు

క. ఇరువది కరముల నెత్తఁగ
దొరకొన బరువైన నతని దోర్బల మెల్లం
దఱిఁగి నరివారు నవ్వఁగ
వెఱచుచు ధరమీఁద వెల్ల వెలకిల బడియెన్.

వ. ఇట్లు పెలకిలఁబడిన రావణుని యురంబున హరశరాసనంబుపడియె. నా భారంబు దుస్సహంబయిన లేవలే డయ్యె; నప్పుడు,—

క. లాలా మూత్ర స్వేదము
లాలో నేబు లయిపాఱె; నక్షులు దిరిగెఁ;
నాలుకలు సాచె; నిలపయి
వ్రాలెఁ గిరీటములు; మేను వడకఁ దొడంగెఁ.

వ. ఈ యవస్థ గనుంగొని యచ్చటనున్న రాజులు పక్కున నవ్విరి. అదిచూచి జనకధరారమణుం డురుకృపారస పరిపూరితహృదయుండై సభయం దున్న రాజన్యులతట్టు చేయిసాచి యిట్లనియె.

### జనకుని కీర్తనము -- కమాస్ : ఆదితాళము.

లేరైరే శూరులు! రారైరే ధీరులు! ॥ లేరై ॥ వారక నీ సభ వారెల్లను గన్నారఁగ గను చున్నారదేల? ॥ లేరై ॥ వింటి క్రిందఁబడి పీడు తన్నుకొను చుంటఁ గాంచి యూరకుంటిరేల? ॥ లేరై ॥ త్రాణలేదు వాస్తవముగ నీతని ప్రాణంబులు గాపాడువారు ॥ లేరైరే ॥ మోక్షగుండపతి సాక్షి జీవసంరక్షణజేయ నుపేక్ష యేల? ॥ లేరై రే ॥

వ. అని యిట్లు రావణుని విషయమై దయానుహాస్యంబులు గనుపట్ట జనకుండాడిన వాక్యంబులు విని....

క. అక్కువయినున్న చాపముఁ
జక్కగఁ దొలఁగించి ప్రోచు శక్తి నృపులలో
నొక్కరికిని లే దయ్యెను;
గ్రక్కున రాముండు కాంచె గాధితనూజుఁ.

వ. అప్పుడు శ్రీరామభద్రుని యభీష్టంబెఱింగి విశ్వామిత్రుండు –

### కీర్తన, బేహగ్ --- ఆదితాళము.

ఇఁక లెమ్మా! శ్రీరామా! లేచి రమ్మా! నీవిమ్మహాధనువు చేకొమ్మా ॥ ఇక లెమ్మా ॥ లెమ్మా ॥ రమ్మా కొమ్మా కోదండ! ॥ మిక లెమ్మా ॥ ఆది వరాహమై మున్ను నీషు కోర వసుంధరయెత్తిన మేటివవురా! ॥ అలుపు వెలుపు మఱపు లేకయ ॥ నిక లెమ్మా ॥

ఈ కార్యమెంతది రఘురామా! జనవర్యులు జూడ గుణధామా! శౌర్యధైర్యస్థైర్య ధుర్యుఁడ ॥ వికలెమ్మా ॥ తఱిగొండ మూపున నెత్తలేదా! మోక్షగుండేశ! యెక్కుపెట్టరాదా నిండియుండు బెండు వంటిది ॥ లే లెమ్మా ॥

వ. అని యిట్లు గాధేయుం డుత్సాహంబు గల్పించిన రాముండు కట్టాయితుండై:–

క. కోదండపాణి తనవర
కోదండము లక్ష్మణునకుఁ గొమ్మని యిడి త
త్కోదండ మెత్త మునిపతి
కైదండయొనంగ నడచెఁ గడుచిత్రముగన్.

వ. ఇట్లు చని దశవదనుని యెయిద మొదలు నరసురాసురగరుడోరగాదుల కసాధ్యంబగు ముక్కంటివింటిని రాముండు వామకరంబున సులభంబుగ నెత్తినం దద్భారంబు దొలంగుటచే మెల్లన బొరలి లేచి రావణుండు బోడితలలతోఁ దిరిగి చూడక పోవుచు,—

రావణ-కీర్తన-కమాచ్-ఆదితాళము.

ఈకన్యయేల నా కనుకూల గాకుండు జాలఁ! గైకొనఁజాల! ॥ నీకన్యయేల ॥ కావలయునన్న నీవిల్లు దిన్నఁగా పీరలెన్నగా నెత్తలేన ॥ ఈకన్య ॥ ముమ్మ మోక్షగుండ ఘను గొల్చుచుండఁ గని రోసి పుడమిని పూడ్చినాడ ॥ నీకన్య ॥

వ. అని వదరుచు రావణుండు యథేచ్ఛం జనియె; నంత—

క. రాముఁడు శంకరధనువును
వామకరంబునను బెండువలె దాలిచి, సు
త్రామాదిసురలు పొగడఁగ
భూమీశ్వరు లరయ, జనకభూపతి కనియెన్!

రాముని కీర్తన-కన్నడ: ఆదితాళము.

ఇదిగో ధనువు నరపాల! చూడుమి ॥ ఇది ప్రాతది గద గుణశీల చూడు! ఇది కడుఁజులుకనగాదా! నా కిది యిది నిస్సారం బనరాదా! ॥

ఈ మహనీయుని నే మని పొగడుదు నో మునికులవర్యా! నామనోభీష్ట మీ నాటికిఁ దీరెన: నీమోహనాంగున కిచ్చెద సీతను ॥ ఈ ॥ ఈధరను మోక్షగుండ ధాముని

వ. అని యీప్రకారంబున జనక చక్రవర్తి భూసుతయగు సీతాదేవిని శ్రీరామచంద్ర మహాప్రభువున కిచ్చి వివాహంబు సేయ నిశ్చయించి, పురము సింగారింపుఁడని యాజ్ఞ ఇచ్చి, దశరథమహారాజును కుటుంబ పరివారయుతముగఁ బిలుచుకొని రావలసినదని బుద్ధిశాలురగు మంత్రుల బంపిన వారును ప్రయాణంబై మూఁడుదినంబులకు సాకేతపురికి జేరిరి. అంతలో నక్కడ దశరథుండు తనమంత్రులతో నిట్లనుచున్నాఁడు.

దశ - కీర్తనము హిందూస్తానితోడి - రూపకము - (భుజగ) వలె.

కొడుకు లరిగిరి చాల తడవు సిలిచిరి; గడియమైనఁగాని నన్ను విడిచి యుండరు ॥ కొడుకు ॥ ఎన్నడు గందు! వార్త నెన్నడు విందు! గన్నులకును గట్టినటుల నున్నది యందు॥ కొడు ॥ అరిసఘచేయ జేతనైనదో లేదో! గురుతరమోక్ష గుండవిభుని కరుణ లేదేమో ॥ కొడు ॥

కీర్తన - కమాచ్ : రూపకము.

విల్లు విరిగెఁ బెల్లు పెల్లున ॥ మెల్లన రిపు ఉల్లంబులు జల్లన భీతిల్లగ శివు ॥ విల్లు ॥ అల్లన దశదిక్కు లదర, నల్లదిగ్గజములు బెదరి తల్లడమున బాలి, నల్ల కల్లోలముగా వార్నిధు లెల్లను ఘూర్ణిల్లగ శివు ॥ విల్లు ॥ ధరణిని శ్రీమోక్షగుండ ధాముఁడు శ్రీరాముఁడు గడు దీవరమున దిగి యలగ, నురగవరులు భూచరులును ఖేచరులును గడువెరగుపడఁగ ॥ విల్లు ॥

తో : జనకుఁడు గౌశికమునియు రామ లక్ష్మణులు దప్పనందఱును । మునుకొని యాధ్వని విని మూర్ఛలలో మునిగి పడిరి తందరను ॥ రామా ॥

వ. ఈ ప్రకారంబున శ్రీరాముఁడు ఖండేందుధర కోదండఖండనం బొనర్చినఁ గాంచి, డెందంబున నానందంబు నొందుచు గాధినందనునకు జనక వసుంధరాపురందరుం డిట్లనియె.

జనక - కీర్తన - కాంభోజి: అటతాళము

చూడుమి ॥ పొగడితి నాకడయు దీని తెగగొన నిలువదు, విరిగెను జూడు ॥ మోక్ష గుండపతినై నాకు లక్ష్యమె దీని నెత్తగలేనా ॥ చూ ॥

వ. అని నిర్లక్ష్యంబుగఁ బలుకుచు.

సీ. గాధితనూజుని కాయరోమాంచంబుతోఁ గూడ నెత్తెనుదొడరివిల్లు
నానావనీశ్వరాననకంజములతోడ వంచె నత్తఱిఁ బురవైరి విల్లు;
జనకభూపాలనసంశయబుద్ధితోఁగూడ గదలించె నపుడు శంకరునివిల్లు
జనకకన్యామనస్సంకల్పయుతముగా గడువడి లాగెముక్కంటివిల్లు

గీ. కార్తవీర్యార్జునుని బలాఖర్వగర్వ
నిర్వహణశక్తియుక్తమానితకుఠార
భరిత లసదంసతలుఁడైన పరశురాము
విపులదుర్మద యుతముగా విఱిచె విల్లు.

క. కాకుత్స్థుం డీరీతిని
బ్రాకటముగ శరము బొడిగినటుముష్టిని దా
నాకర్ణాంతము దిగిచినఁ
జీకుపుడకగతిని విల్లు జెచ్చెర విఱిగెన్.

వ. అక్షీణబలదక్షులగు రాక్షసులను శిక్షించి మునియాగ రక్షణ మొనరింపఁ దత్క్షణమున రామలక్ష్మణులేగిరి. యెక్కలంపు రక్కసులచే జిక్కువడిరో! యెక్కడనున్నారో! యొక్కరివలన నైనఁదెలియ దక్కటా!

తోహ: అని తనయులు రానందుకు వగచెడు నాదశరథ విభుఁజేరి, జనకుని మంత్రులు వినతు లగుచు నిట్లని పలికిరి శ్రీమీరి ॥ రామా ॥

మంత్రుల కీర్తన — ఆదితాళము

రాజా దశరథ రాజ మహారాజ! ఆ జనకాధీప నాప్తమంత్రులమో ॥ రాజా । నీ ముద్దుతనయులు, రామలక్ష్మణులు సామోదమున మౌని సవనము గాచినారు ॥ రా ॥ ప్రాపుగ నహల్య శాపము బాపి మిథిలాపురి జేరి శివు చాపము విఱిచినారు ॥ రా ॥ తన పుత్రి సీతను దాశరథికినియ్య, జనకుఁడు తలఁచి మమ్మనిచెను మిమ్ముఁబిలువ ॥ రా ॥ ప్రకటిత మోక్షగుండ పతిని దలంచుచు సకుటుంబ పరివార సన్నాహముగ రండు ॥ రా ॥

సంతోహ: అనిజనకుఁడు పంపిన వస్తువులను నర్పించిన, దశరథుడు, మనమున నలరుచు మంత్రుల నార్యులఁ గని పలికెను దానపుడు ॥ రా ॥

దశ - కీర్తనము - ఆదితాళము : (రామమంత్రము) వలె.

మీరు వింటిరా! సభ వారు గంటిరా! వీరు జనక రాజసచివవీరవరుఁలట! ॥ మీ ॥ గాధిపుత్రునిఁ గూడి కరము మైత్రిని నాదుసుతులు మిథిలలో నున్నారఁట సుఖులై ॥ మీ ॥ లక్షణాంగుఁడై సర్వసాక్షిరూపుఁడై మోక్షగుండ దేవుడు గటాక్షమొసంగెను ॥ మీ ॥

తోహ : అలసురాసురుల కలవిగాని హరువిలు విఱిచెను రాముండు; చెలఁగియాత నికి సీతనిచ్చి పెండ్లి సేయఁదలచి జనకుండు ॥ రా ॥ మమ్ము రమ్మనుచు మంత్రుల బంపెను; నెమ్మది మనమందఱము, నమ్మోదంబునఁ జనుదము ప్రయాణమ్ములు సేయుడు స్థిరము ॥ రా ॥

వ. అని చెప్పి జనకుని మంత్రులకు బహుమతులిచ్చి పట్టణమలంకరింపించి బంధు పులకు శుభలేఖ లంపి వసిష్ఠాదిమునులును భరత శత్రుఘ్నులును దక్కిన పరిజనులును రాజ బంధుపులును దోడరాఁగదలి కరి రథతురంగంబులమీద సమస్త వస్తుసంభారంబులు సాగించు కొని, ప్రయాణంబై నాలుగు దినములకు మిథిలాపురికిఁ జేరిన; నవ్వార్తవిని జనకుం డెదురేగి వసిష్ఠాది మునులకు నమస్కరించి దశరథుని కుశలంబడిగి బంధుపుల సమ్మానించి తోడితెచ్చి విడిదికిఁ జేర్చి యిట్లనియె.

జనక-కీర్తన-ఆదితాళము: (తంగమెట్టు) వలె.

సాకేతరాజ, నీకుమారునకు నాకూతు నియ్యగను బూనితి; మీకు వార్త సంపితి ॥ సాకేత ॥ ఈ వసిష్ఠాదులు నేతెంచుటచేత, మావంశము గేహము జన్మము పావన మాయె గదా ॥ సాకేత ॥ భూపాల పెండ్లికి రేపే మూహూర్తము రూపించియున్నారుగా విబుధులు । లోపములేవుగా! ॥ సాకేత ॥ భాగుణి దాళ్యారి నారాయణాఖ్యాధారుఁడె మోక్షగుండ ధాముఁడు శ్రీరాముఁ డౌ నిజము ॥ సాకేత ॥

క. జనకుఁడు పలికిన వాక్యము
లను విని దశరథుఁడు గడుఁ జెలంగుచు, దన నె
మ్మనమున సంతోషించుచు
వినయముతో సభ్యులెల్ల వినఁగా ననియెన్.

దశ-కీర్తన-బేహగ్ : ఆటతాళము.

మిథిలాధినాథా, విను, నాదుపలుకులు ॥ మి ॥ పృథివిని నాకుఁ బ్రియమగు నీసరి వియ్య మెన్నటికిని జిక్కదు, నాదుపల్కులు ॥ మి ॥ కూర్మిసుమిత్రా నందనునకు నీయూ

ర్మిళాదేవి నీయుము ; నాదుపల్కులు ॥ మి ॥ అరుమగ నీసోదరుని కొమార్తెల భరత శత్రు ఘ్నుల కీయుము ; నాదుపల్కులు ॥ మి ॥ అక్షయశుభము లీక్షితి నిచ్చు మోక్షగుండే శుఁడు మనకును నాదుపల్కులు ॥ మి ॥

వ. అనిన.

తోహ. మంచిది మీసమ్మతమే మాసమ్మత మని జనకుడువలుక, నంచితముగ సభయందున్న వారనిరి తథాస్తని కడక ॥ రామ ॥

వ. అంత జనకుండు నని పురాలంకారము మొదలుగాగల వివాహ యత్నములో నుండె. అప్పుడు విశ్వామిత్రుండు రామ లక్ష్మణులఁదోడ్కొని దశరథుని బసకు వచ్చిన నమ్మహీపతి యెదురుగఁజని పూజించి తొడితెచ్చి కనకపీఠంబుపై వసియింపంజేసిన, దీవించి మౌని యిట్లనియె :

విశ్వా-కీర్తన-రూపకము.

మంగళమగు మంగళమగు మంగళమగు రాజా! పొంగుచు నీయిష్టార్థము బొందెద విన తేజ ॥ మంగళ ॥ నీకొడుకులు నాకార్యము నెఱవేర్చిరి రాజా! యేకొఱతలు లేకుండిరి, నాకడ మహారాజా! ॥ మంగళ ॥ కొడుకులగైకొని, శుభములు, వడయుము మహారాజా! కడువడి మోక్షగుండేశుని కరుణను మహారాజా ॥ మంగళ ॥

సం-తోహ : అని తెలిపెడు తటిఁ దనతనయులు మ్రొక్కిన ముదమున దీవించి, ఘనముగ గౌఁగిట జొనిపి దశరథుం డనియెను మౌనినిగాంచి ॥ రామ ॥

దశ-కీర్తన శంకరాభరణము : ఆదితాళము.

తాపసేంద్ర, దయారనము దోప మీరు చూడఁగ నాపుత్రుల కెన్నటికి లోపము లుండవుగా! ॥ తాప ॥ మీసేవ చేయుట చేత మేటి గుణములందును భాసురముగ బ్రవీణులై పరగిరి వీ రెందును ॥ తాప ॥ దీక్ష నారాయణకవిని రక్షించుచుండెడు మోక్షగుండ విభునకును మ్రొక్కి కొలుచుచుండను ॥ తాప ॥

వ. ఇట్లు ప్రచుసించుచున్న తటి శతానందుండు దశరథ మహారాజు దర్శనార్థమై వచ్చిన, వారికి దగిన మర్యాద నిలిపి పీఠంబొసంగి కూరుచుండఁజేసి పూజించి ప్రస్తావ వశంబున దశరథుం డిట్లనియడిగె.

క. జనకునకుఁ బురోహితుఁ డవు;
ఘనుఁడ! యహల్యాత్మజుఁడవు; గావున, సర్వం
బును వేద్యం బగు నీకును;
వినిపింపఁగ దగును సీత వృత్తాంతంబుల్.

వ. ఈ సీత జనక క్షమాపతియౌరస పుత్రికయా? దత్తపుత్రికయా? అటులయిన నామెను గనిన తలిదండ్రు లెవరు? వివరింపవే మునివరా, యని వేఁడిన, శతానందుండు:

శతా - కీర్తన త్రిశ్రజాతి.

విన్నవించెద వినుము పీనులలర ॥ విన్న ॥ నన్ను దెలుపుమని, యన్న జనకసుత పూర్వచరిత ॥ విన్న ॥ మునుపద్మాక్షుఁడను జనపాలుఁడొక్కరుఁ డెనలేక దనరాజ్య మేలు చుండెను ॥ విన్న ॥ తనయగ లక్ష్మిని, గని సాకగా గోరి ఘనమైన తపమును గావించె నా రాజు ॥ విన్న ॥ ఆమె ప్రత్యక్షమై యారాజవర్యుని కామిత మెఱింగి గ్రక్కునఁ బలికెను ॥ విన్న ॥ నేనస్వతంత్రనుగాన ' మోక్షగుండ శ్రీనాథువేడుము భూనాథ యని మొఱగె ॥ విన్న ॥

వ. అంత నా భూకాంతుండు శ్రీకాంతుని బహుకాలం బారాధించిన సతఁడు ప్రత్యక్షంబయి,

విష్ణు-తోహర: ఏమిగోరి తప మిపు డొనరించెద విస్తారము వివరింపు భూమి పాలక! ప్రేమనిత్తునిఁక బొనఁగ దపముఁ జాలింపు ॥ రామ ॥

వ. అని నుడిపిన నద్భక్తిపూర్వకంబుగా మ్రొక్కి పద్మాక్షుండు—

పద్మా-కీర్తన ఏకతాళము : (కంజలోచనా) వలె.

"ఓన్నమోనారాయణాయ" యోగివిధేయ, సన్నుతింప నెంతవాఁడ, సజ్జనధ్యేయ ॥ ఓన్నమో ॥ కన్నియగ లక్ష్మిని నేగాంచి సాకంగనున్నది కోరిక యటు లొనగవే వేగ ॥ యో ॥ నంతసించు మోక్షగుండస్వామి, యావయ్య యింతకంటె నొండుకాంక్ష యేమి లేదయ్య ॥ ఓన్నమో ।

అని యడిగిన సంతుష్టుండై —

సం. తో: శ్రీతరుణీపతి క్షితివిభునకు నొక మాతులుంగ ఫలమిచ్చి, యాతరుణం బున, నంతర్ధానుండైన ఫలము గొని తెచ్చి ॥ రామా ॥ కాంచిన నందొక కాంచనాంగి

యగు, కన్నియయుండిననలరి, పెంచుచుండెను ప్రీతి పద్మయని పేరిడి ముచ్చటలూరి ॥ రామా ॥

వ. గారాబంబున బెంచుచు నంకతలంబునఁ గూర్చుండఁ బెట్టుకొని ముద్దాడుచు నుండగాఁ గొంతకాలంబునకు బాల్యంబు గడచిన నెమ్మనంబున —

పద్మా - కీర్తన - కన్నడ : అటతాళము.

కన్యకైనయగు కాంతుఁడెవ్వాడో! యీ ॥ క ॥ ధన్యుడైనట్టి రాజన్యుఁ డెందు న్నాడో! ॥ క ॥ రూపవయోగుణ సంపన్నతలను లోపములులేక లోకములో మన ॥ కన్యకైన ॥ నరుల లోపల విద్యాధరులలో బన్నగ వరులలో మఱియు ఖేచరులలో గాంచిన ॥ క ॥ మోక్షగుండప్రభు వక్షయకృపా కటాక్షముచే నిచ్చినట్టినా నెయ్యంపు ॥ కన్యకైన ॥

వ. అని యోజించి, యనంతరంబ స్వయంవరంబు చాటించె. అప్పుడు —

చ. నరులును ఖేచరుల్ సురలు నాగులు యక్షులు సిద్ధచారణుల్
గరుడులు రావణాద్యసురకాంతులు మౌనులు వార్ధులున్ గిరుల్
దరువులు కామరూపములు దాల్చి మహావిభవంబుతో స్వయం
వరమును జూచు కోరికను వచ్చిరి తన్నగరంబుఁ జేరఁగన్.

వ. ఇట్లు వచ్చిన వారందఱు విన.

తే. రహిని నాకాశనీలవర్ణంబురీతి
నెవనితనుకాంతి వెలయునో, యపని నతని
కి శుభాంగిని నిచ్చి నే నిపుడు పెండ్లి
చేయఁ బూనితి నని పల్కె క్షితివిభుండు.

వ. పద్మాక్షుని వాక్యంబున కందఱు కుపితులై యిట్లనుకొనిరి:

రాజులకీర్తన-కన్నడ: రూపకము.

బలుమోసకాడుగాడె యీతడు! బలు ॥ కడు నాసకొల్పి మనలను రాఁ జేసి యిటుల భాషించెడు! ॥ బలుమోస ॥ ఈ కన్నెచక్కదనము ఏ కన్నె లందుగనము! చేకొన్న వాని భాగ్య మది యెన్ననలవిగా కుండును ॥ బలుమో ॥ ఆ చందమైన రూపు,

మన యందు నెవరి కొదవు! భువియందు మోక్షగుండ విభునందు నుండఁ గాఁ జెల్లును ॥ బలుమోన ॥

వ. స్వయంవరమని పిలిపించి వంచించి యెందునులేని యొడ్డనము బన్నియున్న వాడు. ఇన్నరాధమునిఁ గదనంబున వధించి యీ కన్నియను గైకొంద మని యెంచి యందఱును, యుద్ధాభిముఖులయిన నెఱింగి పద్మాక్షుండు——

తోహర : వారల నెల్లను వాడి శరంబుల వైచుచు బోరాడగను, హరత, బోవిడి సురలు మానవులు స్రుక్కి యవలఁజనగాను ॥ రా ॥

వ. పద్మాక్షుఁడు విజృంభించి తఱుముచుండిన సహింపనోపక దానవులు మాత్రము వెనుదీయక పోరాడి,

### మత్తకోకిల.

అక్షయంబుగ బాణముల్ గొని యాతనిన్ పడివైచి, రూ
క్షేక్షణంబులఁ జూచుచుఁ దగ నేపుమాపిన, సుక్కిప
ద్మాక్షుఁ డాహవభూమిఁ గూలిన నందఱున్ జెలిఁగైకొనన్
ఆక్షణంబున రాఁగ దాఁచెను నామె దేహము వహ్నిలోఁ.

వ. ఇట్లగ్నియందు దాఁగి కనబడకుండిన నా కన్నియను వెదకి వేసరి యా పురం బంతయు గాల్చి శ్మశాన తుల్యంబుఁ జేసి యందఱు యథేచ్ఛంజనిరి. లక్ష్మీకామతత్పరుండై పద్మాక్షుండిట్టిదశననుభవించె.

క. పరియింపదు లక్ష్మిని ధీ
పరు లెన్నఁడు నెమ్మనమున భయ శోకంబుల్
పురణముఁ జిత్తచలనమును
సిరిఁ బొందిన వారికెపుడుఁ జేకురు నసుచున్.

వ. అంత నతని పత్నులు వేయిమంది సహగమనం బొనర్చిరి. పిమ్మట బహు కాలంబునకు దశకంఠుండు విమానారూఢుండై దిగ్విజయార్థంబరుగువాఁడా మార్గంబున వచ్చిన——

తోహర : అనలకుండ బాహ్యప్రదేశమున నాపద్మ చరింపగను గని సారణుఁడా, కన్యను దశకంఠున కటుజూపఁగఁ గనెను.

వ. ఇట్లు కాంచి యతఁడు మోహంబుచే విమానంబు క్రిఁదికి బిలుపుచు,

రావ-కీర్తన. పూరికల్యాణి: అటతాళము.

ఉం డుండవె యోచెలి ॥ యుం ॥ దండిమగండ ప్రబలుండదయ నిండారఁగ ॥ నుం ॥ లోను లనేకులు నీకొఱకైగద యీకడ జీకాకుగ దాకిమును వేగూలిరి ॥ యుండు ॥ అప్పుడు దప్పిన, నిప్పుడు దప్పునె! యొప్పులకుప్ప ముదమొప్పనను మెప్పజేయు ॥ ముం ॥ రాక్షస రాజను రావణనాముడ. నీక్షితి మోక్షగుండాధ్యక్షువరసాక్షి యగు ॥ నుం ॥

వ. అని పలుకుచు డాయం జనిన, నామె మరల నగ్నికుండంబునం బ్రవేశించినఁ, గోపించి,—

రా ॥ తోహర : బహుజనమును బాధించెను దా దహనుని లోపలఁజేరి, యహాహా! యిప్పుడు నటులనె జేసెను నతివ కడు చమత్కారి ॥ రామ ॥

వ. అయిన నీరహస్యంబుఁ దెలిసితిఁగదా! ఇఁకను సాధించెదనని యెంచి.

సీ. అంతట రావణుం డాయగ్నికుండంబు
జల్లార్చి చూచిన, సరగ నందుఁ
బంచరత్నంబులేర్పడఁ గనుపట్టిన,
నవి పెట్టెలోఁ దాఁచి, యది విమాన
మున నుంచుకొని పురమున కేగుదెంచి త
త్పేటిక దేవమందిరమునందు
నునిచి, యారాత్రి మందోదరితో ననె
'భామిని, నే రత్నపంచకంబు

తే. నీకునై తెచ్చి, దేవమందిరమునందు
బెట్టినా' నన, నామె యా పెట్టెకడకుఁ
జేరి యెత్తంగఁ జాలక సిగ్గునొంది
భర్తతోఁదెల్ప నద్భుతపడుచు నతఁడు.

వ. ఆ మందిరంబునకుఁ జని,

సం—తో : కదిలించిన నది కదలకయుండిన౯ గడురోమము పెనగొన్న, నెట మెచ్చుచు నిరుపదికరములతో నెత్తిన లేవకయున్న ॥ రా ॥

వ. అతండు మహాపరాక్రమంబున లాగి మూఁతదీసిన, నందుఁ గోటిసూర్య ప్రభావిరాజమానమైకన్నుల మిఱుమిట్లు గొలుపుచున్న కన్నియయున్నఁ గన్నులారఁ గని మందోదరి—

మందో-కీర్తన-బిలహరి : రూపకము- (ఘోరపా) వలె.

ఏమి యీ విధము నా మనంబులో సంశయ మగు ! ॥ నేమి ॥ స్వామి, రత్నము లేవిలే విట ! యీమె యెవ్వా రగు ! ॥ నేమి ॥ మేలు మే లగు ! బాలికామణి నేల దెచ్చి తీ వేళ నెచ్చట లీల గన్పడెఁ । జాల దెల్పుము జాలమేటికి ! ॥ యేల ॥ కూరిమి మోక్ష గుండ శ్రీహరి నారి గాబోలు ! వేరువా రింత భార మోదురే ! తేరిచూడఁగ నేరరెవ్వారును ॥ ఏలయీ ॥

వ. అని యడిగిన రావణుఁడు పద్మాక్షభూపాల కులసంభూతయగు సీమెకొఱకుఁ బూర్వంబు తమపడిన పాట్లన్నియు, నగ్నికుండంబునఁ దాఁగిన నామెను దాఁ దెచ్చిన విధం బును దెలిపినవిని, మందోదరి యదరిపడి:—

మం-తో. స్వకులధ్వంసమునకు సీమెను లంకకుఁ దెచ్చితి నగునేడు ! అకటా ! యిది బాలిక యని యెంచకు మాదిశక్తియగు జూడు ॥ రా ॥ నీ వంశంబును నీఱు జేయు నిక, గావున, నిటునిల్పకుము ! రావణ, వనములలో విడిపించిన బోవు నచట నత్యమ్ము ॥ రా ॥

మం-కీర్తన-హిందూస్తాని కాపీరూపము (నను మారు) వలె.

మరు మాటతెలుపవలదు వినుము మానవాశనా ! పేటిగయం దీమె నుంచి పేర్మి తోడను నొకచోట భూమిద్రవ్వి, యందు మూయ దగును ॥ మరు ॥ వరగృహస్థు డయ్యు విషయవాంఛ దవులక, ధరబరగు రాజయోగియింట వెరుగు ముందిక ॥ మరు ॥ సర్వమును మోక్షగుండస్వామి మయముగ గను నిర్విచారు గమునందు నిలుచు నింపుగ ॥ మరు మా ॥

వ. ఎంతమాత్ర మీ సమయమందిచ్చట నుంపవలదని నొక్కి వక్కాణించిన, భయకంపిత గాత్రుం డయి రావణుండు—

తో : మందసమందా సుందరి నుంచ విమానముపయి నుంచుకొని, యెందైనను ధరయందు బూడ్చిరండిప్పుడె యని చెప్పవిని ॥ రా ॥

వ. రాక్షసభటులు సిద్ధపడు నప్పుడు సర్వులువిన, నాకన్య యిట్లనియె :

సీ. ఈసారి లంకకు నేతెంచి రావణుఁ
బుత్త్రమిత్త్రులతోడ బొలియఁగూల్తు;
మూఁడవసారి నేర్పున వచ్చి పొంగ్రకు
శతకంఠు రావణు సంహరింతు;
నాల్గవసారి మానక వచ్చి మూల
కాసురుఁ డనుఘటకర్ణసుతుని గూల్తు
నని చెప్పనాలించి యసురులెల్లను మృత
ప్రాయులైరంతట రావణుండు

గీ. భయము నొందియు, నదియు లోపల నడలంచి,
దీని నిప్పుడె పట్టి వధింతు ననుచు,
కత్తిఝుళిపించి పైకి శీఘ్రమున నుఱుక,
నడ్డమై నిల్చి మయ కన్య యనియె నిట్లు.

మందో-కీర్తన-ఆదితాళ: (నీతితో) వలె.

చాలునీ కింత మూర్ఖమేల గలిగె రావణా! ॥ చాలు ॥ బాలికామణిని జంపఁ బోలునె! యోరావణా ॥ చాలు ॥ ఎన్నడోవచ్చి యిచట నిన్ను ద్రుంతుననుచు నన్నమాటలకు నులికి, యబల ద్రుంతుననుచు నున్నవాడ! వెంతవెఱ్ఱి యుక్తిదోచె! సయిచు ॥ చాలునీ ॥ ముందువచ్చు మరణ మిపుడెయెందుకుఁ గోరెదవు మందబుద్ధి పెంపుజేసి మంచి త్రోవ గానవు! పొందుగా శ్రీమోక్షగుండమందిరుని నెఱుఁగవు! ॥ చాలునీ ॥

వ. నీకు మృత్యుప్రాయమై యవతరించినది నిజమైన నిప్పుడే చంపిన నేమి చేయఁ గలవు? కాలాంతరమందలి గతియోజింతము. ఇంతటితో నీయింతిని విడుపు మని యన్న, విని మిన్నకుండె. అంత రాక్షస భటులు.

ఉ. మానినియున్న పేటిక విమానమునందిడి శీఘ్రతన్నభో
యానమునం గమించి, మిథిలాధిపుదేశమునందు నొక్కచో
దానిని బాతిపెట్టి, చని దానవనేతకు విన్నవింపఁగాఁ,
దా నలరారుచుండెఁ గ్రమతం జిరకాలము దాటినంతటన్.

క. ఒక సూర్య గ్రహణము నాఁ
డకుటిలమతితో విదేహుఁ డాభూమిని బా
నొక విప్రునకు సమం
త్రకముగ దానంబు సేయఁ, దద్విజుఁ డంతన్.

వ. బహుకాలంబు పరిశీలించి యొక్కచక్కని ముహూర్తంబునాఁడు దున్నుమని యొక్కహాలికుని నియమించిన నతండు,

సం. తో. నాగలిచే దున్నగను హలాగ్రమునాటి మందసములేవ, వేగవే శూద్రుఁడు విప్రుని చెంతకు నేగి మ్రొక్కి, 'భూదేవ ఎంచగ నీవు వచించిన లగ్నము మంచిది యగునే' యనిన, 'మించి ధనము గనుపించె నీదికొను' మంచు నొసగ మోద మున ॥ రామ ॥

వ. ఆపెట్టె యెత్తించుకొని జనకమహారాజు సభకుఁజేరఁబోయి ద్విజుండు.

విప్ర-జనక సంవాదము కీర్తన- ఆదితాళము.

వి-'భూమిపాలవరా! ప్రేమను నా మనవిని వినదగు? ॥ భూ ॥'
రా-'భూమిదేవరా! ధీమతితోఁ దెలుపఁగ దగు నది ॥ భూ ॥'
వి-'తామొసంగిన భూమి దున్నఁగ నేమొ కాని యిది యొక టుండె ॥ భూ ॥'
రా-'ఏమియున్నను నేమి కర్తలు స్వామి తామే; సంశయమేటికి ॥ భూ ॥'
వి-'దాన మిడునది ధారుణియకద! యీనిధాన మిడి యుండితివే ॥ భూ ॥'
రా-'దాన మిచ్చిన ధరణినుండిన, దాని నేనుదగఁ గైకొందునె ॥ భూ ॥'
వి-'ఈక్షితికి రాజేంద్రులే యధ్యక్షులౌదు రంతటికిని నిను ॥ భూ ॥'
రా-'మోక్షగుండాధ్యక్షుని పదసాక్షిగను సర్వము తమదే ॥ భూ ॥'

వ. అని విప్రరాజన్యులు వివాదపడుచుండ సభవా రి ట్లనిరి:

తోహర: వలదు వలదు సంవాద మేమిటికి వాకిలి దీసియు గనిన నెలమి బెట్టె నేమియున్నదో తెలియుద మందఱమనిన ॥ రా ।

వ. మంచి దని భటులచేత మూతఁ దీయింప నంతమేఘవినిర్గత విద్యుల్లతికయ బోలె బాలికామణి వెడలి వచ్చిన నాశ్చర్యకలితులై సభానదు లిట్లనిరి.

క. తన తండ్రియైన సాగరు
గినవచ్చిన లక్ష్మిబోలెఁ, గన్యామణి చ
య్యనఁ దన గేహమునఁ జేరెను
మనుపం దనఁ గూఁతుగాఁగ మనుజాధీశా.

వ. అని పలికిన సభ్యుల పలుకుల కలరి యిలాపతి యందున కియ్యకొనియె. ద్విజుండును బాలామణిని జనకభూపాలున కర్పించి నిజ గృహంబునకు జనియె; అంత—

సం. తో. ఆడిరి గుమురై యచ్చరబోటులు, పాడిరి గంధర్వులును; కూడి దేవతలు కుసుమవర్షములు గురిపించిరి యచ్చటను ॥ రామ ॥

వ. మాతులుంగఫల సముద్భూత గావునమాతులుంగియనియు, నగ్నికుండంబున వసియించినది గావున నగ్ని గర్భయనియు, రత్నాంతరవాసి యగుటవలన రత్నావతియనియు, ధరణినుండివచ్చుటచే ధరణిజయనియు, జనకునిచేఁ బెంపఁబడుటచే జానకియనియు, సీతాగ్రమునకు దపులుకొని వెడలుటచే సీతయనియుఁ, బద్మాక్షనృపాలకులజాతయగుటచేఁ బద్మయనియు, ననంతసార్థక నామంబులచే నామెను జనులు పిలుచుచుండ, జనకుండు సుశీల యను భార్యతోఁగూడి గారాబంబున సాకుచుండె.

క. బాలక్రీడ లొనర్చుచు,
హాలిశరాసనము నెత్తి యులుకగ సీతన్,
బాలికబలమును గని భూ
పాలుఁడు విస్మయము నొంది భావములోనన్.

వ. ఈ కోదండం బెత్తుటకసాధ్యంబగు! ఈమె మనుష్యరూపంబున నవతరించిన పరాశక్తియై యుండవచ్చు నహాహా! నా ప్రాప్తంబు మంచిది. ఈ హరశరాసనం బెత్తి యెక్కుపెట్టిన వాఁడు గాని యీమెను జెట్టపట్ట నర్హుండు గాఁడని యెంచి శపథంబు బూని యుండె.

శతా—కీర్తన—కల్యాణి, ఆదితాళము: (మునవినిపలె.

దశరథభూరమణా! మహాప్రభో! దశరథ, యశమురంజిలగ, నాయయి స్నిహ యలరారెను నీను మహాప్రభో ॥ దశ ॥ ఘనుఁడు రాముఁ డాకాశ నీలనిభతనువు వీక్షి

॥ దశ ॥ నలుగురు కోదండ్రను గైకొంటివి ; వెలసె భవత్కులము : మహాప్రభో ॥ దశ ॥ భవదగ్రసుతుం డవని మోక్షపుర ధవుఁడగు రాముండు మహాప్ర ॥ దశ ॥

శతా. తో : తమరడిగిన సీతావృత్తాంతము దాపక దెలిపితి నేను ; విపులచిత్తమున వింటిరి, పెండిలి సమయమయ్యెబోయెదను ॥ రామ ॥

వ. మీరు వివాహమందిరమునకు దయచేయుం డని చెప్పి, శతానందుండు వోయె. ఇక్కడ జనకుండు వివాహమునకు సమస్తము సిద్ధముచేయించి వధూవరులను గైసేయుండని యాజ్ఞాపించినఁ గాంతలు సని రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులను, సీత యూర్మిళ మాండవి శ్రుతకీర్తులను వేఱువేఱ నలంకరింపఁ బ్రయత్నించిరి.

మధురగతి రగడ:

పల్లవి : సీతారాములనుఁ గైసేసిరి వేడుకను ; పెండ్లికుమారుల బ్రియమున గొందఱు, పెండ్లికూఁతులను బ్రేమను గొందఱు ముత్తైదువులటు ముదమున బిల్వగఁ జిత్తరు చవికెను చేరిరి చెల్వుగ ; బీటలమీఁదను బెంపుగ నుంచియుఁ, బాటలు బాడుచుఁ, బరువము గాంచియు, నంపెఁగెనూనెను నరగున బూయుచు, సొంపుగ నలుగుల శోభిలఁ జేయుచు, నను వొందగ స్నానము గావించిరి ; చెలువుగఁ దడి యార్చిరి మోదించిరి ; వన్నెగలుగు దువ్వలువలఁ గట్టిరి। కన్నుల సొగసుగఁ గాటుకఁ బెట్టిరి, ముద్దులమోముల ముదితలు గూర్మిని దిద్దిరి కస్తురితిలకముఁ బేర్మిని ; బరిమళగంధము బాగుగ బూసిరి ; పరువడి వరధూపంబులువేసిరి సురుచిరసుమముల సరులు ఘటించిరి ; వరకంచుకముల వాసి ధరించిరి ; నవరత్నాభరణంబులు దాల్చిరి, నవనీరజనమనయనలు గొల్చిరి ; మకరికలప్పుడు మమతను వ్రాసిరి ; ప్రకట భూషలొప్పగ గైసేసిరి ; అంతట జనకుం డందఱుఁ గూడను, సంతోషంబున నభ్యులతోడను, మంగళకరహితమహిత నాదములు పొంగుచు మ్రోయఁగఁ బౌలఁతి మొత్తములు, సేనలుచల్లగఁ జెలగుమనములను వాసిమీఱఁగను వరపూజనమును వారకచేసి, వివాహమందిరము వారలఁ దోడ్కొనివచ్చి, సుందరముమీఱగజేర్చి యమేయ విభవముగఁ దీరుగ లగ్నముఁ దెలిసి విభవముగ ॥

* * *

# సీతాకళ్యాణఘట్టము

* * *

కీర్తన - కళ్యాణి : అటతాళము.

కళ్యాణ మొనరించెఁ గన్యకామణులను, కళ్యాణరాగ సంకలితుఁడై నృపుఁడు వాక్య ముసు రూపంబు దేజమును సుగుణమును గని, కౌసల్యాతనయుఁడె పాత్రుఁడనుచును నెంచి మించి సాకల్యముగ రామునకు సీతను గరిమ మీఱఁగ ధారవోసి ॥ కళ్యాణ ॥

ఊర్మిళాకన్యను నుల్లములోపల నర్మిలితోడుత నాలక్ష్మణునకు గూర్మితో మాండవిని భరతునకు శ్రుతకీర్తి నెంతో పేర్మితో శత్రుఘ్న ధరునకు మెచ్చి, యిచ్చి, కడు నిర్మలుండగు జనకభూపతి నిందు వేడ్కతో ధారవోసి ॥ కళ్యాణ ॥

ధరను నారాయణదాస సన్నుతుఁడైన పరమోక్షగుండ నివాసుఁడచ్యుతుఁడు, నరగ దమ్ములు దాను ప్రీతిగను సీతాదికాంతల గళముల మంగళసూత్రములు దగను గట్టి, పట్టి, సత్వరితముగఁ దలఁబ్రాలుఁపోయగ, వరుసగా జనులెల్ల సరయగ ॥ గళ్యాణ ॥

వంధి-తోహార : బంధువు లందఱు బరమానందము నొందఁగ బంచాహాములు, విందు లొనర్చుచు వేడుకతో గావించెను కళ్యాణములు ॥ రా ॥

తటుకున విప్రోత్తములకుఁగోరిన యటులనిచ్చె బహుమతులు. నటువిమ్మటఁ గన్యా-వరులకుఁ దా నరణ మిచ్చె సత్కృతులు ॥ రా ॥

గావించినవారు గదలి యయోధ్యకుఁ బోవ నిర్నిమిత్తమున ద్రోవమధ్యమున దుర్ని మిత్తములుఁ దోచిన నృపతి భయమున ॥ రా ॥

వ. వడవడ వడంకుచు వసిష్ఠమహామునిం జేరి ప్రాంజలిబద్ధుండయి యిట్లనియె.

దశ-కీర్తన హిందూస్థానికాఫి : ఆదితాళము (శ్రీపతి యింతటి) వలె.

ఈ విపరీతము లేల దోచెను సామి! ॥ ఈ ॥ భావిక కార్యములు వడసి యుత్సా హామున బోవ నుత్పాతము లావహిలెను గటా! ॥ ఈ ॥ గాలియత్యంతమున గదిరిసి వాగఁబూనె! ధూళి సూర్యునికాంతి తొలఁగఁ గ్రమ్మెను గటా! ॥ ఈ ॥ ధరణని మోక్ష గుండ వరకృపరాదాయ! గరితుంగాదులకు: వెలుపు గలిగెఁ గటా ॥ ఈవిపరీతము ॥

వ. అని యడలున నడిగిన దశరథునకు వసిష్ఠముని యిట్లనియె.

వసి. తోహర.

అదటను ముందు మహాభయ మొక్కటి యూపహించి త్వరలోను, అది తొల
నాపిదప నయోధ్యకు నరుగవచ్చు మేలగును ॥ రా ॥

వ. అని చెప్పునంతలో—

సీ. తండ్రియానతిని నౌదలమోచి తనతల్లి,
కంఠంబు దునిమె నే గణ్యసుతుఁడు
పితృవిరోధిని గార్తవీర్యార్జునుని బట్టి,
ప్రాణముల్ దీసె నే ప్రథితవీరుఁ
డిరువదియొకమాఱు దిరిగి నిర్బాహుజ
మొనరించె నుర్వి నేయుగ్రమూర్తి
కశ్యపునకునిచ్చి కాశ్యపి యనునామ
మొనఁగె నీధరకు నే యనమశూరుఁ,

గీ. డట్టి సిద్ధప్రతిజ్ఞుఁ డధ్యాత్మవిదుఁడు,
పరశురాముండు దివ్యచాపంబు కేలఁ
గ్రాల శ్రీరామచంద్రభూపాలమౌళి
మ్రోల నిలఁబడె ముల్లోకములు వడంక.

వ. ఇట్లు కట్టెదుట నిలిచిన పరశురామునిం గని శ్రీరాముండు కరంబులు ము
నమస్కరించిన నతం డిట్లనియె :

పర· తోహర : మ్రొక్కిన విడుతునె! మును రాజన్యులఁజెక్కండ్రను గూల
జిక్కితి విక ననిసేయుము! నిన్నును జక్కాడెద నే ధృతిని ॥ రా ॥

వ· అనిన నవ్వుచు శ్రీరాముం డిట్లనియె :

రాముడు-మత్తకోకిల.

ధారుణీతలమెల్లఁ గశ్యపతాపసేంద్రున కిచ్చిపి
స్తారశాంతుఁడవై తపంబును సల్పుచుండుటచే నమ
స్కార పాత్రమవంచుఁ జేసితి గాని నీకు భయంబునన్
జేరి మ్రొక్కినవాఁడగాను : హసింపనేటికి భూసురా!

వ. అనిన రోషించి పరశురాముం డిట్లనియె :

పర. కీర్తన-కానడ: రూపకము.

ఆహా నే తాపసుండ నౌదు నే సుమా! శ్రీరామ! యాహా ॥ ఆహవమున సహస్రబాహార్జున ముఖ్యనృపుల మోహరించి చంపినట్టి సాహసుండ నౌదుగాక ॥ యాహా ॥ రాముం డనఁగ నే నిల రాజిల్లఁగ, నీ వింకొక రాముఁడ నని వచ్చితివా! రాజపునిను బోనిత్తునె ॥ యాహా ॥ ముల్లోకవిభుఁడు శివుఁడు, మోక్షగుండనేత నాకు విల్లువిద్యగఱపె నసని విల్లుద్రుంచి తట! యోర్తునే ॥ యాహా ॥

వ. అందునకు శ్రీమద్రామభద్రుం డిట్లనుచున్నాడు ;

రామ : కీర్తన-హిందూస్థాని కాఫి: ఆదితాళము.

నెమ్మదిఁ విను భార్గవా ॥ నె ॥ ఇమ్మహి నాభుజసత్వ మిట్టిదని కానవు ॥ నెమ్మ ॥ నేను వినోదముగ లాగ గానె విఱిగె; నాకర్ణాంత మూనిదీయునంత కలదె-యుగ్రుని కోదండము ॥ నెమ్మదిఁ ॥ గోవుల విప్రులజంపఁ గోర రఘు వంశజులు, నీవె గ్గ లెన్నియాడిన నీకె చెల్లె-నిన్నోంప ॥ నెమ్మ ॥ సదయుఁడౌ మోక్షగుండేవ సాక్షినానుత్తుక యిది ; యదియె నీ గొడ్డలి ; యుచిత మైనరీతి జేయుము ॥ నెమ్మదిన్ ॥

వ. అనువాక్యంబులకు నత్యంతకుపితస్వాంతుండయి జామదగ్న్యుఁ డిట్లనియె.

ఆ. నీవు క్షత్రియుఁడవు ; నేను విప్రుఁడను
గర్వ మున్నదటులఁ గాంచఁ బోకు :
నాపరాక్రమంబు నాభుజశక్తి యు
నీకుఁ జూపువాఁడ నిశ్చయముగ.

వ. అని పలికి.

పర. కీర్తన - ఆదితాళము : పోహామ్మ.

పోనియ్యఁ బోనియ్య రాఘవ! నిను ॥ బోని ॥ పూనికతో నిన్నుఁబట్టి పొంగడంగఁ జేయక నే ॥ బోని ॥ సారహీనమైన విల్లుఁ బూరిపుడకరీతి విఱిచి, వీరుఁడ ననుచు వి...

వయిన నెక్కువెట్టిద దీని లేకయున్న శ్రీమోక్షగుండ శ్రీరఘురాముఁ డని యెన్ని నిన్ను నా ముందర నీ సామర్థ్య మేమి పనికి వచ్చు నింక ॥ జోసీ ।

వ. జనకుని యింట నీవు విఱిచిన విల్లును, నే ధరించిన విల్లును విశ్వకర్మ యేక కాలమందు నిర్మించియున్నాఁడు. అందొక్కటి త్రిపురాసురహరణ కాలంబునందు హరునకు సురలచే నియ్యఁబడియె. దానిచేఁ ద్రిపుర సంహరణం బొనర్చి తన శక్తిని ఈశ్వరుండు పొగడుకొనుచున్న విష్ణుండు శరాకృతిచే సహాయపడ. శివుండు జయించె నని దేవతలాడిరి. ప్రమధులవల్ల విని శివుండు కోపించి హరిని యుద్ధంబునకు రమ్మన వేఁడ కాండాన నంబు హరికి నిచ్చి దేవతలు పురికొలుప హరి-హరులకుఁబోరు ఘోరంబయ్యె అప్పుడు హరికరనిర్ముక్త శరంబుదాఁకుటచే హరునివిల్లు నొచ్చి పేటెత్తిన శివునిబలంబు లోటువడియె. అది గని, దేవేంద్రాదు లుభయులను ప్రార్థించి యుద్ధంబు మాన్పిరి. శంకరుండు తన ధనుస్సు దేవరాతున కిచ్చుటచే నది జనకునింట నిలిచె విష్ణువు తన కోదండంబు రుచికునకు నిచ్చిన నతండు జమదగ్ని కొసంగె. అతండు నా కొసంగె మొదటఁ గైటభారి ప్రేటునకు నోటువడి పేటెత్తి పేటిక యందు మాటియున్న భూతపతి చాపంబుగాదు పెటుక్కున విఱువను! నా చేత నున్నది వైష్ణవచాపంబు. దీనిబలంబు నీ వెఱుంగవు మంచిది! దీనినెత్తి గుణము సారించిన నీవు మొనగాఁడ వని యెంచెద. లేనిచో నసద వని తలంచెద; నిన్ను వధించెద ననిన.

సం-తో: ఇవ్విధమున నతఁడెదిరిన రాముం । డవ్విలు చాఁజేకొనియెఁ; నప్పుచు నొక బాణము సంధించి, మనంబుల నలరుచు ననియెన్ ॥ రామ ॥

**రాముని కీర్తన-ఆదితాళము - (పోపొమ్ము) వలె.**

మంచిది మంచిది భార్గవా! బళి ॥ మంచిది ॥ మించి దీన నీపాదములు ద్రుంచి త్రుళ్ళడంచెదను ॥ మంచిది ॥ సాక్షాద్విప్రుఁడని నిన్నుఁ జంపనైతి; కాని నా దీక్షతో రాజులపగ, దీర్పక నే విడిపింతునా! మోక్షగుండాధ్యక్షుఁ డని వీక్షింప లేవైతి వీవు ॥ మంచిది ॥

వ. ఈలీలఁ గాలాంతకునిబోలె బలాబలంబులు దెలియక ప్రేలుచు మ్రోలనిలువం బడియున్న పరశురాముని కేల నున్నవిల్లుఁ గొని యల్లెత్రాఁడు పెల్లున లాగి భల్లం బొక్కటి తొడిగి నీ కాళ్లుడుల్లసేయుదు ననిన.

తో : పర్వీన దయ నిటు పలికిన రాముని పలుకులు విని భార్గవుఁడు, పూర్వజ్ఞానము పొడమి యభవుఁడని పొగడఁ దొడఁగె దానవుఁడు ॥ రామ ॥

పరశు - కీర్తన - కమాచ్ : రూపకము.

రామ! మేఘశ్యామ! బ్రోవవే! సకలలోకాధి ॥ రామ ॥ రామా! రణభీమా! ఘననామా! పరంధామా! రఘు ॥ రామ ॥ అజుఁడవవ్యయుఁడవు పరుడవు నానందమ యుఁడ వాదిమూలకారణుండవు నిజమాయాగుణ యుతముగ సృజియింతువు ప్రజలను; రఘు ॥ రామ ॥ సంగసహితులయిన వారలు నిను గాంచలేరు; సంగరహితులయిన ధీరులు రంగుగ దమమనములలోనం గని యానందింతురు ॥ రామ ॥ మోక్షగుండ పురవిహారకా! నారాయణ కపిరక్షక! షడ్భావదూరకా! మోక్షప్రద! దేహాదుల వీక్షింతువు సాక్షి వగుచు ॥ రామ ॥

పర. తో : ఆదియందు నేహరిని గూర్చి తప మాచరింపఁగా నతఁడు, నాదరమున బ్రత్యక్షంబయి యిటు లనుచుఁ బలికెఁ దానవుడు ॥ రా ॥

మచ్చిదంశమున మహిని గలిసి నీవు నిచ్చలు హైహయనృపుల మెచ్చక త్రుంచి యమేయ యశంబును మెఱయఁ దాల్పు మే నవల ॥ రా ॥

రాముఁ డనఁగ దశరథ కౌసల్యలకీమహిలో నుదయించి, నీమము తోడుత నీకు దర్శనము నే నొసఁగుదు దయ యుంచి ॥ రా ॥

అని పలికిన నా హరివే నీపై యవతరించి తని వేడి, చనియె మహేంద్రాచలమున కాతని యనుమతిఁ గొని కొనియాడి ॥ రా ॥

వ. ఇట్లు పలికి పరశురాముండు చనిన పిదప రాముండు, భయభ్రాంతచిత్తుండై యున్న దశరథునకు నమస్కరించిన, నాతఁడు కొడుకును గౌఁగిలించుకొని దీవించి యిట్లనియె.

దశ - కీర్తన - పున్నాగవరాళి : ఏకతాళము.

నా పుత్రరత్నమా! నా పెన్నిధానమా! ముద్దులయ్య! ॥ నాపుత్ర ॥
నా నోముఫలమా! నా పాలిభాగ్యమా! చిన్నితండ్రి! ॥ నాపుత్ర ॥
నిను వేగ గంటిని; నేఁగీర్తి గొంటిని; లోప మేమి ॥ నాపుత్ర ॥
వర మోక్షగుండపుర మేలుపుండరీకనయన! ॥ నాపుత్ర ॥

సం. తో: అని యిటు పలుకుచు నందఱు గుమిగా నరిగి యయోధ్యను దరిసి, ఘనముగ బౌడలు, గని ముద మొందగ జనిరి గేహముల బొరసి ॥ రామ ॥

వ. తదనంతరంబున - భానుమంతుండుఁ గోనలుఁడు లోనుగాఁగల వా రెనమండ్రు శ్రీరాముని మేనమామలు తమతమ స్వదేశంబులు పాలించుచు రాముని పాణిగ్రహణ మహోత్సవమునకు రావలసినదని దశరథుండు శుభలేఖ లంపఁగా వారివారి మనంబులలో వారు వారిట్లనుకొనిరి.

తో: రామార్పణముగ రయమున గాంచిన నా ముద్దుల బిడ్డలను, బ్రేమ మీఱఁగ పరింపక సీతను బెండ్లియగుట యెట్లిలను ॥ రా ॥

వ. అయిన దీని విచారింపవలసినదని ప్రతివారును యోజించి భూనీళా విమలజ్ఞాన క్రియాయోగాది నామంబులచే నలరారు తమ కూతుండ్ర నూటయిరువది యెనిమిదిమందిని దోడుకొని యయోధ్యకు వచ్చి దశరథాదుల రాక వేచియుండి, వారు గృహప్రవేశమునకు వచ్చు సమయమున —

క. తనయాయుతముగ రామునిఁ
గన వచ్చిన మేనమామ గారికిఁ బ్రియపం
దనము లొనరించి యుచితా
సనములఁ గూర్చుండఁ జేయ సంతోషమునన్.

వ. ఆసీనులయి యిట్లనుచున్నారు:

మేనమా-కళ్యాణి : రూపకము.

శ్రీకరముగ భానువంశశేఖర! వినుమా! యీకన్యలఁ గైకొని వరియింపుము భరియింపుము నీవు ॥ శ్రీకరముగ ॥

నీ కర్పితముగను గంటిమి కావున దగను, రాకామడల కింకొకరికి రా దియ్యఁగ సత్యంబుగ ॥ శ్రీకరముగ ॥

రక్షోవరహరణా! నారాయణకవిశరణా! మోక్షగుండ పురవల్లభ, మోహించిరి ముదితలు నిను ॥ శ్రీకరముగ ॥

తోహా: వీరికోరికలు దీర్చిచి బ్రోవుము; వీరికి భర్తవు నీవు; వీరు భార్య లిక వెలయఁగ నీకును వేఱుగఁ జూడక బ్రోవు ॥ రా ॥

వ. అని పలికిన మేనమామల వాక్యంబుల విశ్వసించి తండ్రి యుండిన సభకుఁ జని నమస్కరించి రాముం డిట్లనుచున్నాఁడు.

రాము-కీర్తన : రూపకము.

జనక, నా మనవి వినుము! మేనమామ లెనమండుగురు పిరె యే తెంచినారు; ఘనముగ తాముగన్న కన్యల నూటయిరువ దెనిమిది మందిన్ వెనుకఁ గొనుచుఁ గైకొను మనుచుఁ ॥ జనక ॥

ఆ ముద్దుబిడ్డల రామార్పణముగ, దాము గన్నారట! తలగిపోరట! ఆ మోహనాంగుల నన్యుల కీరట! యామాటలకుఁ దలఁపఁ ఏమని యందుఁ ముందుఁ ॥ జనక నా మనవి ॥

ధరను మోక్షగుండ ధామునిసాక్షి నఁ వరియించి కన్యలు వచ్చిరి నేడు। పరిణయ మగుదునో! మరలి పొ మ్మందునో! పరమోపాయం బొందున్ నరగఁ దెలుపఁ వలయుఁ ॥ జనక నా మనవి ॥

వ. అని రామచంద్రుం డడిగినఁ దండ్రి యిట్లనియె :

గీ. అగ్నిసాక్షిగ మొదట బెండ్లాడినట్టి
సీత నెమ్మది యొప్పినఁ జెట్టపట్టు;
లేనిచో మానియుండుము; మేనమామ
బిడ్డ లైనను ధర్మంబు విడువఁ దగునె!

అని వచించిన తండ్రివాక్యంబున కలరి రాముండు సీతాదేవియున్న దెస కభిముఖుండయి నయోక్తుల నిట్లనియె :

రాముని కీర్తన-ఆదితాళము: (కనలిపని) వలె.

కలికి! చిలుకలకొలికీ! యాలింపవే! పిలువక మేనమామ బిడ్డలు నను ప్రేమ దలచిరి; వలచిరి గొలిచిరి; గదవే ॥

నను~ బెండ్లియాడఁగను వేడ్కతోడ జనకుల పసుపున జనుదెంచి రటుగాన, నినుఁ గాంచి, వినిపించితిని మంచి తెలుపవే ॥ కలికి ॥

మునుమున్ను స్పష్టముగ నీయభీష్టమును, దెల్పుతరళాక్షి, మోక్షగుండేశసాక్షి మనమున ననుమానమును బూన వలదే ॥ కలికి ॥

వ. ఇట్లు తనభర్తయడిగినందుకు డెందంబున సందియంబు నొందక యానందంబున ముఖారవిందంబు వికసింప వసుంధరానందన దశరథనందనున కిట్లనియె:

సీత-కీర్తన-కన్నడ: అటతాళము.

వల్లభ! మీరు నావంటివారేకద! యెల్ల ననక నవశ్యముగైకొను ॥ వల్లభ ॥ జననము మొదలుగ నినుఁ బతిగాఁగను మనమునగోరిరట ముగువలు పాపము! ॥ వల్లభ మీరు ॥

ఇందఱుఁ గనుఁగొన, నీ యిందువదనల నందఱిఁ బెండ్లియాడు మగ్నిసాక్షిగ మహో ॥ వల్లభ మీరు ॥

మోక్షగుండాధిప, ముదమున నన్ను మీరిఁ బక్షపాతములేక పాలింపు నాప్రాణ॥ వల్లభ ॥

క. భూమిజ పలికిన పలుకుల
కామోదము నొంది యతుల నౌనని సభ్యుల్
వేమఱుఁ బొగడఁగ నంతట
రాముఁడు తాఁ బెండ్లియాడె రమణుల నెల్లన్.

వ. ఇట్లు నూటయిరువదియెనిమిదిమంది కన్యకల నొక్కలగ్నంబున వామదేవ వసిష్ఠాదిమునుల సమక్షంబునఁ బాణిగ్రహణంబు నలిపి సీతతోఁగూడ నూటయిరువది తొమ్మిది మంది భార్యలతోఁగలసి యేకపత్నీవ్రతుండను ప్రతీతితో రాముండు వెలసె. అంత—

సం. తో; అగ్రభార్యయగు నవనీజయుఁ జెలు లందఱు వెంబడిరాఁగా, స్వగృహమునకును జని తల్లులకును సరగున మ్రొక్కిరి వేగ ॥ రామ ॥

సం. వ. వా రానందంబునొంది వారిని - లేవఁదీసి అక్కునఁజేర్చి యాశీర్వదించిరి. అంత—

కం. శ్రీరాముఁడయోధ్యను సీ
తారామయుతంబుగా ముదంబున సత్య
శ్రీరంజిల వై భోగము
లారూఢిని బొందు చుండె నతివేడుకతోన్.

సీ. ఘన వెల్లెడల నల్లగను పిల్లుకొనిన మ
బ్బులు తుల్లి దెసలెల్లఁ దెలుపునొంద,
జలజాకరతటాకములు వాక లెదలేక,
జలపూర్తి నొంది ముచ్చటగ దోప,
ఘనపంకములు డొంకలను నింక సకలంక
గతి జంతుతతికి సంకటము వాయ,
జను లెంతయును సంతసము నొంద ఫలవంత
ముగ సంతతము సస్యములు పెలంగ

గీ. నవనిజయకాంక్షతో రాజు లలరుచుండ,
ధవళకిరణములను సుధాధాముఁ డొప్ప,
నరులు దైవోత్సవముల యత్నములు సేయఁ
దొడమె శరదాగమంబు సంపూర్ణముగను.

సం.—వ. అట్టిసమయంబున దీపావళ్యుత్సవంబు నెఱవేర్ప నుద్యమించి మిథిలా
పురిలో జనకచక్రవర్తి తనమంత్రులఁగాంచి,

జనక. తో: రాముఁడు మొదలగు జామాతల సీతాముఖులగు దుహితలను, ఘనస
హితముగ బనుపది దశరథ భూమీపతి మంత్రులను ॥ రామ ॥

వ. దీపావళిపండుగకు మననగరంబునకుఁ బిలుచుకొని రావలసిన దనిచెప్పిన
వారు నదిలి యయోధ్యకుఁ గొన్నిదినంబులకుఁజేరి దశరథునిచే సమ్మానింప బడి

మంత్రు-కీర్తన : ఆదితాళం: (పోవెపాస్వలంకరింప(గా) వలె

ధారుణీపతి, చిత్తగింపుమా! జనకుండు పంపెను ॥ ధారు ॥ మీరా కన, గోరెఁ
దారాజేంద్రుఁడు ॥ ధారు ॥ వారలు గోడండ్రు, దనయులుఁ జెలికాండ్రు, పౌరులు బంధు
వులు, మీరు రాఁదగు ॥ ధారు ॥ మోక్షపుర పతికృపను మిథిలకుఁ దగన సోపడము
పయాణంబగుడు ॥ ధారు ॥

సం. వ. ఇట్లు జనకుని సచివులు దెలిపిన, దశరథక్ష్మాపతి యానందభరితుండయి
కటులను గనుఁగొని,

దశ-సీ. దీపావళికిసి మిథిలా నగరమునకుమమ్ము
రమ్మని జనకధరావిభుండు
పుత్తెంచెఁ గాన మత్పుత్రులు స్నుషలు మ
త్కాంతలు హితులు ప్రధానులాత్మ
బంధువు లాశ్రితుల్ పౌరులు మఱిజాన
పదులును జతురంగబలమువారు,
దగ ప్రయాణంబులై తఱలి రావలెనని
చాటింపు డంతట సకలవాద్య,
గీ. నృత్తగీతము లలరార నేఁడు వార
కామినులు వందిమాగధ గణము లెల్ల
సిద్ధముగనుండు నట్లాజ్ఞ సేయుఁ డఖిల
యానము లలంకరింపుడు హర్ష మెనఁగ.

సం. వ. తదాజ్ఞా ప్రకారము సర్వము సిద్ధమయిన సంతసించి,

కీర్తన-కాంభోజి:రూపకము-(శ్రవణామృత)వలె

మిథిలాపురమున కేగెను, మిత్రకులుఁడు రథముమీఁద నెక్కి యధికవిభవ
రారఁగ ॥ మిథిలా ॥ రామాదికుమారులెల్ల సామజముల ప్రేమమీఱ నెక్కి ప్రియమున
వెనుక నడవ ॥ మిథిలా ॥ మెల్లన సీతాది యువతులెల్లవెంబడి బల్లకీలలోన నుల్లము లలర
వెడలగ ॥ మిథిలా ॥ కౌసల్యాదులు పౌరులు డాసి; నడవ వాసి మోక్షగుండవా
సన్నుతి సేయుచు ॥ మిథిలాపుర ॥

సం. వ. ఇటుల చటుల విభవంబున శుభంబున బయలుదేరి కొన్ని దినంబు
మిథిలఁ బ్రవేశించిన దద్వార్త విని,—

చ. ఘనుఁడు విదేహరాజెదురుగాఁ జని యందఱ గౌరవించి పా
యనియనురక్తిఁ బౌరులు రయంబున సేనలు జల్ల వారకా
మినులు నటింపఁ, గాయకులు మేలుగఁబాడ, సువాద్యఘోషముల్
దనరఁగ, స్వీయధామము ముదంబున జేర్చెఁ బ్రసన్నచిత్తుఁడై,

వ. పిమ్మట వారిని మృష్టాన్నపానంబుల సంతుష్టి నొందించి దీపావళి
సంబున—

తో. కూతుంద్రకు జామాతల కమితఖ్యాతిని దల లంటించి ప్రీతిగ నలుగులు బెట్టించి శుభస్నాతులనటుగావించి ॥ రా ॥ అతులాంబర దివ్యాభరణాలంకృతు లగునటు చేయించి, చతురంగంబుల నద్దాసీ దానచయంబుల నర్పించి ॥ రామ ॥

సం–వ· దశరథుని దత్కాంతలను దక్కిన బాంధవులను బలువిధ సత్కారంబుల దనిపి దీపావళ్యుత్సవంబు సేయించిన, నానందభరితులై దశరథాదులు——

క. జనకుని వీడ్కొని తమపుర
మున కరుగఁగ మార్గమధ్యమున రామునితో
నని యొనరింపఁగఁ గొందఱు
జనపాలురు వచ్చి రసదృశం బగుబలిమిౝ.

సం-వ. హరధనుర్భంగం బొనరించి సీతను గైకొనిన వైరంబు కారణంబుగ శ్రీరామునితోఁ బోరి జయించువారై చుట్టుముట్టిన నృపులను బరికించి దశరథుండు కంపిత గాత్రుండై మంత్రుల నవలోకించి.

దశ. కీర్తన - ఆదితాళము, (ఆహా బాలా) వలె.

ఈరాజు లనేకు లెంతో శూరు లక్కట! వీరితోఁబోరొనర్ప నేర నొక్కఁడ ॥ నీ ॥
పరిణయమై వఱచునపుడు పరశురాముఁడు వరగనడ్డపడఁగ, భంగపఱిచె రాముఁడు ॥ ఈ ॥
ఇపుడు వీర లేతెంచిరి యీనుదోడను! అపనయము నపయశము నందనాయెను ॥ నీ ॥
మోక్షగుండా ధ్యక్షుని కటాక్షమున్నను, యీక్షితి జయింపవచ్చు; నేమి సేతును! ॥ నీ ॥

సం-వ. ఇట్లు చింతింపుచున్న దశరథుని డగ్గఱి రాముండు వినయోక్తులతో

రా-తో. క్షణమాత్రములో సమయఁజేతు నీజనపాలుర యుద్ధమున! నణుమాత్రము నీవాలోచింపక యనుమతి యిమ్మని యనిన ॥ రా ॥

దశ-తో. బాలుఁడ నీవు నృపాలు రనేకులు నాలములో బోరాడ జాలవు! నేజని చంపెద నుండుము-సైన్యము బ్రోచుచు నీడ ॥ రా ॥

వ. నాకోపలేనియపు డడ్డపడు మన రాముండు–

రాము-కీర్తన, ఆదితాళము: (ఔర యిది) వలె-

తండ్రి! కనుపట్టుగ వైరుల ముట్టెద; నిలఁబడఁగొట్టెదమట్టెదను; వారి నీతట్టునిలువ నీయను, కాలయముపట్టణమును జేర్తును; ఈ వాహినులకు వెలదులను నేమరకు ॥ పట్టుగ ॥ మోక్షపురీశుసాక్షిగను దీక్షగను దెలిపెదను ॥ పట్టుగ ॥

వ. తండ్రికి బ్రణతుండయి యనుజ్ఞవడసి శస్త్రాస్త్రన్యస్తంబైయున్న తండ్రి యరదం బెక్కి లక్ష్మణయుతంబుగఁ గదలినఁ గని,

క. భరతుఁడు శత్రుఘ్నుండును
బరుపడిఁ బదివేలరాజ భటులను వెంటన్
శరకోదండంబులుగొని
నరపాలురతోడఁ బోర నడచిరి బలిమిన్.

నం. వ. ఇట్లు శత్రురాజుల కభిముఖంబుగ నడచి దిగ్గజంబులు మ్రొగ్గ. ధనుష్టంకారం బొనర్చినఁ బగతురును వెనుదీయక యెదిరించి,

రాజుల కీర్తన-ఆదితాళము, (రామనీదయ) వలె.

నేఁడుమమ్మెదిరించి పోరుము శ్రీరామా చూతము ॥ నేఁడు ॥ చూడు జనకుని వీడునందల్లనాడు ద్విజరాజ చూడు! ధనువుఁ ద్రుంచి, యీడు రాజుల కెల్ల సిగ్గొనగూడఁ బెండ్లి యాడి సీతఁ దోడుకొని చనితి వపుడు ॥ నేడు ॥ దాన మాకవమాన మాయెను; గాన నాలము లో గరకుటమ్ము లూని కడువడిమేన వైతుము; మాననములోన నభిమాన నంయుతుఁడ వైన ॥ నేడు ॥ అండయై మోక్షగుండ దేవుఁ డఖండ మగు దయ నిండఁ గనుచు నుండ, ఖండశశిధర చండకోదండ ఖండనోద్దండ సమర్థుండవై! యలరి తపుడు ॥ నేడు ॥

వ. అని తృణప్రాయంబునఁ బలికిన, రాముని సైన్యంబులు మూగి భటుల:—

ఉ. బుద్ధివిహీనులార! బలముం దలపోయక రామమూర్తితో
యుద్ధము సేయవచ్చితి రయో శలభంబులు వహ్ని సేరి న
ట్లుద్ధతి మేము సిద్ధముగ నుండఁగ రాఘవుఁడేల, మిమ్మి దే!
యిద్ధరఁగూలనేతు మిపుడింటను గెల్చియు; నచ్చగెల్వుండీ!

సం-వ. పరశుకుంత భిండివాలాది సాధనంబులు వచ్చుచున్నవి. వీనిఁ దప్పించుకొని పొండని వైరిభటు లార్భటించిన, వాని లక్ష్యంబు సేయక యక్షయరూక్షేక్షణంబుల వీక్షించి యక్షమాధ్యక్షులు.

భు జం గ ప్ర యా త ము

ధనుర్జ్యానినాదం బుదగ్రంబుగా జే
సి, నారాచముల్ పూన్చి, చేబల్మిఁ బ్రేయం
గ, నాబంటు లందుండఁగాలేక దూరం
బున న్నిల్చి రామీఁదభూమీశు లెల్లన్—

వ. సింహనాదంబులు సేయుచు రాముని కభిముఖులైన, భరత శత్రుఘ్న లక్ష్మణు లధ్యగించి

భరతాదులు :—

సీ. తాటకాదుల నిరాఘాటంబుగాఁ దోలి
యాగంబుఁ గాచిన యది యెఱింగి,
పాషాణరూపమై పడిన యహల్యకు
శాపంబు వాపిన జాడ యెఱిఁగి,
మీ కసాధ్యంబైన శ్రీకంఠుచాపంబు
వేయెత్తి విఱిచిన విధ మెఱింగి,
పుడమి నరాజకముగా నొనర్చిన భృగు
రాము గెల్చిన పరాక్రమమెఱింగి

గీ. రాము నెదిరింప వచ్చితి రా! యిదేమి!
యెదిరి బలమును స్వబలము నెఱుఁగలేని
మందమతులైన మిమ్ము నే మందు మిందు
మమ్ము గెలిచిన తదనంతరమ్ముపొండు.

వ. మాబాణంబులు రాకముందు ప్రాణంబులు గాపాడు కొనుడని మిక్కిలి యుక్కుగల పెక్కమ్ము లెక్కు పెట్టి చుక్కలు రాలినట్లు గ్రక్కున నలుదిక్కులు లక్షించి వైచిన వా రలిగి.

తో. బహువిధశరములు వఱపి తత్క్షణము భరతుని మూర్ఛిలజేసి, సహజన్ముల లక్ష్మణ శత్రుఘ్నుల నరకుఁ గొనక వెనుదాసి ॥ రామ ॥ అమితబాణ వర్షముల ముంప, వా రంత యోర్వఁగాలేక, విముఖులైనఁ గని విక్రమమున రఘువీరుజేరి వెనుదాక ॥ రామ ॥

రాము కీర్తన-ఆదితాళము. (సరే సరే) వలె.

బలాబలంబులు దలంప కిటు నను గలంప వత్తువురా! రణకౌశలంబుఁ జూపెదరా! ॥ బల ॥ అజంబులా దిగ్గజంబులను గెల్వఁ జాలునే వినుడీ! దీని నిజంబు గనుగొనుడీ ॥ బలా ॥ దురంత మగు మీ పరాక్రమంబుల తెఱం గెఱిగియుంటి! మిథిలాపురంబులోఁ గంటి ॥ బలా ॥ ప్రగల్భములు పల్కగా నేల మోక్షగుండ పతియాన నిలువఁగఁ దగుఁ రణములోన ॥ బలా ॥

వ. వర్ష ధారలంబోలి వెడలెడు మద్బాణపరంపరల కోర్చినఁజాలునని పలికి, కౌస ల్యాది కాంతలు స్నుషానహితంబుగఁ దన యుద్ధనైపుణ్యంబు జాలరంధ్రంబుల నువలక్షించు చుండ దశరథుం డచ్చెరు వందె.

శా. వాయవ్యాస్త్రము వింట నెక్కిడి కడుఁ వైళంబు బింకంబుగా
ప్రేయఁ వార్ధితటంబునఁ బడఁగ, వారిఁ గొందఱఁ ద్రోసి నా
చాయ న్నిల్చిన వారిగర్వముడుగఁ నమ్మోహనాస్త్రంబు పై
డాయం జేయ; వితాకులై పడిరి చేష్టల్ దక్కి భూనాయకుల్.

వ. రాముండు ప్రియజనకుఁ జేరి నమస్కరించి సోదరుల యవస్థను గుఱించి విచారింపఁ బోవునంతలో. గైక, —

ఆ. సమరతలమునందు సాయకములఁబడి
మూర్ఛ మునిఁగియున్న ముద్దుకొమరు
నురము స్వాంకతలము జేర్చి యత్యంత దుః
ఖాబ్ధి లోన గూలి యడలుచుండె.

కైక-కీర్తన-ముఖారి రూపకము : (హా ప్రాణనాయక) వలె.

నాకూర్మినందనా! నను నిటు దేరి చూడరా! కైక నేరమేమిచేసె! నీకరణిని శోకాబ్ధిని వేఁగూల్చిరి భూకాంతులు ॥ నా ॥ పలువురు రణశూరులుండి, కలనను నిడుమలఁ

బడుచో దలగింపఁగ దలపరైరి ॥ నా ॥ మనుకులమున జనియించిన నిను బగతురు
కెడుచో, జనకుండును గను చుండెను ॥ నా ॥ జగతిని శ్రీమోక్షగుండ నగరేశుఁడు
నడ్డువడగ జాలక వగ ద్రోసెను ॥ నా ॥

వ. ఇట్లు దుఃఖింప దశరథ-కౌసల్యాదులు సేరి యూరార్పుచుండిరి అం
రాముఁడు లక్ష్మణునిజూచి,—

శా—మ. అనుజా! ముద్గలమౌని యాశ్రమముపై యుండునిచ్చోటి, కా
యన దివ్యౌషధ వల్లికల్ బెనిచె; నీ వం దేగి నాయాజ్ఞఁ దె
ల్పిన సంజీవని నిచ్చు దాన సుఖియై లేచుఁ దగఁ గైకజం;
డనుమానింపకపొమ్ము కార్యవిఫలం బౌ జాగు గావించినన్.

వ. రథారోహణంబుసేసి పొమ్మనఁ దత్క్షణంబ లక్ష్మణుండు తదాజ్ఞ శిరసావహి
ముద్గలాశ్రమంబుఁ బ్రవేశించి తదీయశిష్యులంగని :—

సంవాద సీసము :

లక్ష్మ — వటులార! యెందున్నవారు మీ గురువులు?
వటులు — యోగసమాధియం దున్నవారు.
లక్ష్మ — మాకార్యములు దీర్చు మాన్యులిం దెవ్వరు!
వటు — కార్యంబు లెవ్వి చక్కఁగఁ దెలుపుడు?
లక్ష — సంజీవకరణకై చనుదెంచినారము;
వటు — దాని మీకీ నుచితంబు గాదు!
లక్ష్మ — రామాజ్ఞ! లక్ష్మణ నాముండ వచ్చితి;
వటు — నెవరైన నేమి? మే మియ్యగాదు.

గీ. లక్ష్మ — ఎప్పుడది మాకు దొరకునో చెప్పరయ్య!
వటు — ముద్గలార్యుని నడిగి కొం పో గదయ్య!
లక్ష్మ — తడవు జరిగినఁ గార్యంబు చెడును గాదె!
వటు — యందఱకు నిచ్చుటకు గురునాజ్ఞ లేదు.

వ. అంతట నిష్ఫలుండె వేగంబున రాముని కడ కరిగి—

మత్తకోకిల

మౌనివర్యుఁడు నిర్వికల్పసమాధి నుండెను శిష్యులెం
తేని నన్ను నిరాకరించిరి దేశికాజ్ఞకు బద్ధులై;
నే నిజస్థితిఁ దెల్పి కార్యము నెమ్మిమై నెఱవేఱఁగా
వైనముఙ దెలియంగ వచ్చితి; భావిమార్గము జూపవే!

రా. వ. తడవు జరిగిన భరతున కపాయంబు వాటిల్లు.
లక్ష్మణ—దేవరవారి యాజ్ఞ ననుసరించి చేయ సిద్ధముగా నున్నాను.
రా—బ్రహ్మచారుల ధిక్కరించి యౌషధలతలదేనోపుదువా?
ల—ఋషివర్యున కలుక వొడమిన మనకు ముప్పు అనిభయము.
రా—ఈకార్య మనుకూలమయిన పిదప వారికోపశాంతిఁ నేఁజేయుదుఁగదా!
ల—చిత్తము వెళ్లుచున్నాను.

చ. చటులజవంబుతో నరిగి సంయమి యోగసమాధినుంట నం
తటఁ బరికించి యౌషధలతల్ గొననడ్డము వచ్చినట్టి య
వ్వటుల నిరాకరించి బలవంతముగా నవి సంగ్రహించి, పి
మ్మట నరదంబునఙ జని గ్రమంబుననర్పణచేసి మ్రొక్కినఙ.

వ. రాముఁడు పరమానందభరితుఁడయి అమ్మందు ప్రయోగించి నఁ దత్ప్రభావంబున భరతుండు సుప్తునింబోలి మేల్కని తలిదండ్రులకు రామునకుఁ బ్రణమిల్లె. వారు దీవించిరి. కైక పరమసంతోషిత స్వాంతయయ్యె, అక్కడ బ్రహ్మచారులు హాహాకారంబులు సేయుచు గురువును దగ్గఱి,—

వటు-కీర్తన, కన్నడ: ఆటతాళము: (చూడవేల) వలె.

మౌనినాథా! మాయాసురోధ—మానవే! తప మూనవే!, బోధ ॥ భూనాథుఁ డెవ్వఁడో కాని నేఁడే తెంచి, తానౌషధిని ద్రవ్వికొని పోయె ॥ మౌ ॥ మే మెంతదెల్పినఁ దామసమునఁ జూచి స్వామీ, బెదరించి చనియె నేమందుము! ॥ మౌ ॥ మోక్షగుండేశ కటాక్షముఁ గొన్న మీయక్షయతపశ్శక్తి నక్షీణ మాయెను ॥ మౌ ॥

వ. మీరు శాంతంబుతో నున్నచో దపఃప్రభావమునిరర్థకంబు గాదె! అని పలు విధంబులఁ బలవింపుచున్న బాలకుల వాక్యంబు లాలించి కన్నులువిచ్చిచూచి.

ముని :—

ఉ. 'బాలకులార'! యేల యిటు పామరు లట్లు విచారమంద ? మీ
కేల వితాకునొందెద రధీశుడు లేని భటాలిబోలి యే
జోలికి బోక సత్పథముఁ జూచెడుమాకుఁ గొఱంతయేమి యీ
కాలవిపర్యయమ్మ్మ నెఱుగం దగు సర్వముఁ దెల్పుడీ యనన్.

వటులు—వ. మీరు చిత్సమాధి నున్నతఱి నొక్క భూపాల కుమారుఁడు వచ్చి దివ్యౌషధలతలు మమ్ము దిరస్కరించి తస్కరించి కొనిపోయె. మే మశక్తులమైమిన్నకుంటిమి. అది విని మునీంద్రుండు—

ముని :—

సీ. ఏకాలమందైన భూకాంతు లిటువలె
ఋషులకు నెగ్గాచరించి నారె!
ఏజోలి యెఱుఁగము రాజాధములఁ జేరి
యన్నవస్త్రంబుల నడుగఁబోము;
అడవులలోఁ బడి యాకలముల దిని
యుందుము మృగముల చందమునను,
నిరపరాధులము మానిలయంబులకువచ్చి
గొఱియలఁ దోడేలు బొదిపినట్లు

గీ. రేపుచుండుదు రిదివిపరీత మనక
తపము సాత్వికవృత్తి వ్యర్థంబుగాదె!
మూలనుండిన వారిని ముంగిళులకు
దీయ న్యాయమె యీభూమినాయకులకు!
ముని-వాని నామధేయం బెఱుంగుదురా ?
వటు—ఇదివర కెఱుఁగము లక్ష్మణుం డని వచించె.

ముని - క్రోధతామ్రాక్షుండై ఎక్కడి లక్ష్మణుఁడు! మన వనమెక్కడ! నతం డెందుండువాఁడు! అక్రమప్రవేశ మేలచేసె! మదీయ కోపానల జ్వాలలు ప్రజ్వరిల్లిన నతఁడు భరింపఁగలఁడే!

వటు-రాముని సోదరుండని మాతోఁ బలికె. రాముఁడెవ్వఁడో!

ముని-ఏమీ! రామునిసోదరుఁడా? (అని యోజించి దివ్యదృష్టితోఁగని,)

చ. దశరథరాజనందనుఁ డుదారయశోనిధి రామచంద్రుఁడా
కుశికతనూజుతో మిథిలకుం జని తత్పురమందు నున్నయా
పశుపతివిల్లుఁ ద్రుంచి సులభంబుగ సీతనుగొన్న యట్లనే
విశదముగాఁగ వింటి మును వీరవరుం డతఁడే యితండగుః.

వ. అయిన మన మతనిఁ దర్శించి రాఁదగును—అని శాంతంబు వహించి ప్రయాణంబగుచుండ నిక్కడ దశరథుండు విషాదంబున సతీ సుతాదుల నవలోకించి.

దశ-కీర్తన-ఆనందభైరవి-రూపకము (ఓ మహాత్మా) వలె.

ఏమిసేతు నేయుపాయము నా కేది తోవ ॥ దే ॥

ఆ మునీంద్రునాజ్ఞఁగొనక నౌషధములు దెచ్చిరంట! తామసించి శాపమిడక సామాన్యముగాఁ గనునే! ॥ ఏమి ॥

మోసుల విశ్వాసమునకు భూనాథులుపాత్రు లగుదు: రీనాఁ డది ద వ్వాయెను; ఈ నేరం బెట్లువాయు ॥ నేమి ॥ మోక్షగుండవిభుభక్తుల కీక్షితి నపకారంబును బక్షపాతమునఁజేయఁగ నాక్షేపింపరే లోకు! ॥ లేమి ॥

దశ—వ. ఇదిగాక యతనియనుమతంబు వడయక తెచ్చిరి. ఆఘనుండు సమాధి చాలింపక మున్నపోయి క్షమాపణవేడుకొనియెద నని యందఱతోఁ గలసి మునియాశ్రమంబున కరిగె. ఆ మునియు నెఱిఁగి ఎదురుజని,

ముని—

కం. క్షితినాథ, సతీ-సుత-భట
హితయుతముగ వచ్చినారు హృత్తోషము స్వా
గత మొనఁగెద; నీదినమున
నతిథులరై నిలువవలయు నాశ్రమమందుః.

వ. ఇది మదీయేప్సితం బని యనదృశకుసుమసమన్విత వృక్షలతా సముదయంబులపొంత నాసీను లగుటకు వసతులు గల్పింప; అందు వసించి దశరథుండు విన్నదనంబున—

దశ-మునీంద్ర! భవత్పాదారవిందంబుల కనేక వందనంబులు.

ము-దిగ్విజయోస్తు! పుత్రపౌత్రాద్యభివృద్ధిరస్తు!

సంవాద-సీసము

ద-అపకారమొనరించి రయ్య! నా నందను;
లలుగక కృపఁజూడ వలయు నేఁడు;
ము-అపకార మేమి చేయఁగ లేదు భూనాథ
హితమ చేసిరి యుపకృతియ తలఁచి
ద-ఔషధలతలు మీయాజ్ఞఁ గైకొనక స్వ
తంత్రించి తెచ్చుట తప్పుగాదె!
ము-రాముండు సుగుణాభిరాముండు సర్వలో
క స్వతంత్రుండగుఁ గాదె భూప

ద-తే. కోపగించితిరో యని తాప మంది
శాంతి పఱుపంగ నచ్చితి సంయమీంద్ర!
ము-మనుజరూపము దాల్చిన మాధవుండు;
రాముఁడాతని మాకోప మేమిసేయు.

సం - వ. అంతఁ గౌసల్యాదికాంతలు, సీతాదిస్నుషలు, రామాది కుమారులు వేర్వేఱ సుమతీ-ముద్గలులకుఁ బ్రణామంబు లాచరించి వారి దీవన లంది, పిమ్మట వారి యాతిథ్యం బంగీకరించి యాదినమందుండిరి. అప్పుడు—

దశ –

కం. మునివర్య! యొక్క విషయము
వినఁగోరితి మిమ్మునుండి విశ్రాంతిమెయిన్'
అనవుఁడు, తులసీఖండం
బునకును గొనిపోయి వివరముగ నడుగుమనన్.

దశ—తో తమ రెఱుఁగనివిషయము, లుండవు; నాకొమరుఁడైన రామునకుఁగ్రమ మున రాఁగల కాలశుభాశుభగతు లెఱిఁగింపుడునాకు ॥

సం - వ. ముద్గలుఁ డానందకందళితహృదయారవిందుండయి—

ము-కీర్తన-హిం, కాఫి: ఆది (మ్రొక్కెదన్) వలె.

చెప్పెద న్వినుభూధవా! ఇప్పుడు చేసిన ప్రశ్నకొప్ప ప్రత్యుత్తరము ॥ చెప్పెదన్
శ్రీరాముఁడనఁగ నాదినారాయణుండుద్భవించె ధారుణీశ! నీదుపుణ్యకారణమునకు ॥ సీ
జెప్పె ॥ నష్టమైన ధర్మమును సృష్టిపైఁగ్రమ్మఱ నిలుపు; దుష్టులను శిక్షించుచు శిష్టుల
రక్షించుఁ ॥ జె ॥ శ్రీమానినియంశమైన సీతనుజాయఁగ గొని భూమిని శ్రీమోక్షగుం
ధాముఁడై రంజిల్లును ॥ జెప్పెద ॥

ముద్గలుండు,

సీ. కొలఁది కాలంబునకును నీవు దివి కేగ
గలవు వృందాశాపకారణమున;
రాముఁడు దండకారణ్యంబునకు జని
యవల నయోధ్యకు నరుగుదెంచి
రాజ్యంబు గైకొని పూజ్యంబుగా నేలు
లీల బదునొకండువేలయేండ్లు
కొడుకు లిద్దఱు మఱి కోడండ్రు నల్వురు
మనుమ లిర్వదినాల్గుమంది మనుమ

గీ. రాండ్రుపండ్రెండుగురు ప్రపౌత్రాళి యగణి
తంబుగా నిట్లు సూర్యవంశంబు నెంచి
దీవులేండింటిఁ దాన సాధించి యేలఁ
గలఁడు నీయగ్రసుతుఁ డొకకాలమందు.

వ. ఇదియ నీకొడుకు భావికాలవర్తమాన మనిన.

దశ—తో. వృంద యనఁగ నెవ రెందుండును నాసుందరి విభుఁడెవ్వాఁడ
ముందు శాప మా యిందిరాపతికి నెందు కొసఁగె నదినేఁడు ॥ రా ॥

వ. ఆకథావిధానంబు కరుణారసపరిపూరిత హృదయుండవై యెఱిఁగింపు
ముద్గలుండు—

ము. నాట-రూపకము, (జనకా) వలె.

వినుము భూమి పా మునుపు శంకరుని ఘనకోపవహ్ని వనధిని బడిన జనియించె నందులో జలంధరాసురుఁ, డనఁగఁ; వరుణుఁడతనిఁ అనురాగమునం బెనిచెఁ ॥ విను ॥ జాలంధర మనుప్రోలు గల్పించి చాలఁగ నందు శీలవసించి, కాలనేమిగన్న కన్యను వృందయఁ బాలఁ సద్గుణజాలఁ ఆలిం గాఁ దాఁ గైకొనె ॥ విను ॥ దండి పేరుఁ దనఁ దనరివేలుపుల దండించి తొలిదర్పముదూల, సుండఁదాపు లేక వెంతుపతి మోక్షగుండనగర విభుని యుంత జేరి తెల్పిరి ॥ విను ॥

వ. ఇటువలెఁ దనశరణుఁబొచ్చినదేవతల నాదరించి విరించి జనకుఁడు —

విష్ణు-క. పురహరుఁడు దక్క నొరు లె
వ్వరు వాని జయింపలేరు నాస్తవమూకం
కరునారాధింపుండా!
తటిగని నేఁ దోడుపడుదు; దైత్యుఁడు పడియున్.

వ. అంతదేవతలు —

శివప్రార్థన-దేపిలావణి.

పురవైరీ! పురవైరీ! పురవైరీ! పురవైరీ! విధృతవనజారి! వినుత ఘనసూరిని చయ! కరివైరీ! కరివైరియానవర, శౌరి! మహత్తర భూరిభయద నరకారీ! నరకారివినుత పద వారిజాత! స్మరవైరి! హర! గరుడారి! గరుడారితల్పశరధారి! విమతపరిహారి! లోక హితకారీ! ॥ 1 ॥ శ్రీమోక్షగుండధామాక్షదామ! ప్రతిపక్షద్విరదహర్యక్షా! హర్యక్షా! వక్త్రబుభుక్షాక్షురఘనరాక్షసప్రకరశిక్షా! కరశిక్షోపరి రక్షితరావణయక్షరాజసంరక్షా సంరక్షిత మునినుత! దక్షాధ్వర సర్వక్షయదివ్యకటాక్ష ॥ 2 ॥

వ. ఇక్కరణిఁ బెక్కుగతుల నగ్గించిన ముక్కంటి దేవతలదిక్కు వీక్షించి ప్రసన్నుం డయిన, మ్రొక్కులొనఁగి—

దేవతలు —

ఉ. దేవ, జలంధరాసురుఁ డుదీర్ణఁ బలంబున మ మ్మెదిర్చి మా
తావులు దానగైకొనియెఁ; దాశ(గఁజాలము వాని ఘాటికిన్!
యేవిధి నైన వానినమయించి దయార్ద్రుల మమ్ముం బ్రోవఁగా
నీ వసమర్థుఁడౌదు వవ, నింబరులోపరు చంద్రశేఖరా ॥

దే-వ. మాకు శరణ్యుండవుగావే యని ప్రార్థించిన, వారికభయంబిచ్చి యుద్వేగం బడంప నిశ్చయించి,

సం-తో. శూలము గైకొని జాలంధరు నిలఁ గూలుపఁ జనుచుండఁగను వేల దావెదకుచు నెదురుగ వేగ వచ్చెనాతండును ॥ రా ॥

సం-వ. ఇ ట్లిరువు రొకచోఁ దారసిల్లి పో రొనర్చుచుండిరి. అప్పుడు —

సం-క. శీతాద్రిజాత ప్రేరణ
చేతరమానేతఁ దనదుచేతమునంద
త్యాతుర మొందుచు వృందా
పాతివ్రత్యంబు సెరుప బరువడి నరిగెన్.

సం-వ. జాలంధరపురోద్యాన వనంబున నొక శిష్యునితో, బ్రవేశించి నాసీనుండై తపంబు సేయుచుండె.

తే. వృంద నిజభర్త్రు పాదారవిందములను
డెందమున గొల్చి యొకనిశియందుఁ దనదు
మందిరంబునఁ బూపాన్పునందు నిదుర
జెంది కలఁ గని లేచి లోఁగుంది కంది.

వృంద-పాట-ఆది (వలదచటికి) వలె.

కల గనినానే! చెలియ! వినుము తెలియగ ॥ గల ॥ చెలువుఁడు నూ యంటుకొని, వలువ దాలుపకయ యున్నటులను ॥ గల ॥ ముండియై మహిషమ సిశని దండధరునిదిశకు దరలినటుల ॥ గల ॥ మోక్షగుండేశుని యక్షయకారుణ, కలదో! లేదో! తెలియరాదు ॥ కల ॥

వృంద-సీ. వలువేలుపుల డీలు పడిపాఱఁ గాదోలు
నలకాలువన వీఁలునటుల జేయు
దిగఁ బాసి దెసఁ డాసిఁ తనవాసిఁ గనఁజేసి
మఱి యక్షవరుశిక్ష వఱచి వనుపు

సిరిబిడ్డ గనబడ్డఁ జిఱుగడ్డమునులాఁగు
బలుమాఱు జడదారు లలయ దూరు
బనిమాలి వనమాలిఁ గని గేలిసేయును
గుటిమీఱ హరుఁబోరఁ గోరుచుండు

గీ. నెంతదెల్పిన విన డిసుమంతయైన
నిపుడు త్రిపురారి పైకేగె నిపుణుఁ డగుచు
యుద్ధ మగుచున్న దచట మహోగ్రగతులఁ
జెడ్డకలఁగంటి నే నేమి సేయుదాన!

వ. ఈనంతాపంబు కొంత యుపశాంతించుటకు వనాంతరంబున విహరింత మని పలికి; తెల్లవారినపిదప నిరువురు చెలికత్తెలతోఁ గలసి యుద్యానవనంబు సేరి విహరింపుచు ప్రాణనాథుని దలంచి వగపు గలుగ,—

వృంద-కీర్తన-హిం-తోడి రూపకము-(వరధాత్రీతనయా) వలె.

తరుణీ! నావిభుఁడు తడయుటకు గతంబదేమొ ॥ తరు ॥ పురహరుతో బోరుసలుపఁ దర మగునటె తనబోఁటికి! తరు ॥ అశుభసూచకములు దోఁపనాయె నేఁడు నా కిఁక విశదంబుగ క్షేమవార్త వినుపించెడువారు లేరు ॥ తరు। ధరణిని శ్రీమోక్షగుండధాముఁడయిన శ్రీహరి, హరు లజేయు లనుచును బలుమఱుఁ దెలిపిన విన డాయెను ॥ తరుణీ ॥

వ. ఇట్లు విలపించుచున్న :—

చెలులు-క. కలకేమి! కనులు మూసినఁ
బలువిధములఁ దోచు చుండుఁ బ్రతిదినమును నా;
ఫల మనుభవించితిమె! యీ,
కలకును భయపడఁగవలెనె! కంజదళాక్షి!

వృంద—వ. నామనంబునకు మిగుల దిగులును భయమును గలుగుచున్నదమ్మా!

చెలి—వ. నేనుండ భయ మేల తల్లీ!

వృంద—వ. ప్రళయకాలాభీల జగత్కల్లోల దుర్వారజ మేఘ గర్జనంబునుంబోలిన ధ్వనియొక్కటి వినంబడుచున్నదిగదే!

చెలి–వ. ఇంతలో నీకెంత చిత్తచాంచల్యము గలిగినదమ్మా.

వృంద–వ. నాకు చిత్తచలనముగాదు. నీకు బధిరత్వము వచ్చినది. (ఆమె కొంచెమాలోచించి.)

చెలి–వ. నీమాట నిశ్చయమయిన నిజ గుహాంతరమునుండి సింగంబు మాతంగంబు పై లంఘించు గర్జనయని తోఁచెడిని;

వృంద–వ. సింగమయిన మన మాడువారముగదా;—

చెలి–వ. శీఘ్రంబున నడవుము తొలంగుదుము.

సం. ఉ. కొండలు మాఱుమ్రోఁయ దివికుంభినులట్టిటునల్లలాడ, మా,
ర్తాండుఁడు ద్రోవఁ దప్ప, విలయం బని లోకులు దల్లడిల్ల నా,
దండ కులార్భటించుచు మదంబున రాక్షసయుగ్మమప్పుడు,
ద్దండతఁ బైఁబడం దుమికె; దద్దయు భీతిఁగలంగి రంగనల్.

సం - వ. భీషణదంష్ట్రాకరాళనయనంబులతో వెనుకొనినరాక్షసులంగని భయ విహ్వాలులై పఱుంగువారుచు నా చెంగట తపంబు సేయుచున్న మునిపుంగవునింజేరి యాలింగనంబుఁ జేసికొని,

వృంద-కీర్తన-జంఝూటి; ఆటతాళము. (కామియ్యైకా) వలె.

మునివర! నన్బ్రోవవె! కరుణ గనవె! నిను గని ఘనుఁడని మనమునఁ దెలిసితి ॥ మునివర ॥ వెనుకొని దనుజులు నను దఱుమఁగ భయవనధిని మునిఁగితి! ఘనముగ నౌకగతి ॥ మునివర ॥ ముందాపదనొంది, వగఁజెంది వనమందుఁ జేరి యుంద మన, నందుకు దోడిం దొకకీడొంద నాయె ॥ ము ॥ తాపసేంద్ర! మోక్షగుండ! శ్రీపతిబోలి యిపుడీపాపుల కోపాగ్నిని రూపార్పుము! కాపాడుము ॥ మునివర ॥ [ఇంతలో]

తో. పటుభయంకరార్భటులతోడ నచ్చటికి రక్కసులు రాఁగా, నటుఁగని తటుకున నమ్మని హు మ్మన నవ్వల కేగిరి వేగా ॥ రామా ॥

వ. అమ్మహనీయుని ప్రభావంబునకు నాశ్చర్యంబునొంది సాష్టాంగనమస్కారం బొనర్చి వృందాదేవి—

వృంద. సీ భవదీయహుంకార పటురవస్ఫూర్తిచే
మత్ప్రతిపక్షులు మాయమైరి!

మీదయారసము నామీఁద వర్షించిన,
సకలభయాగ్నులు సమసిపోయె,
మీ రెఱుంగని దెద్ది మేదినిలో లేదు
మహనీయులరు మీరు మౌనితిలక,
యడిగెద మి మ్మొకయంశంబుదానియ
ర్థార్థంబు దెల్పఁగా నగును చేన

గీ. నాదుమగఁడు జలంధరనామ దనుజుఁ
డభవు నెదిరించి యనిసల్ప నరిగినాఁడు;
బహుదినంబులు జరిగె నిప్పటికి రాఁడు
వార్త దెలియక యీగతి వనరుదాన!

వృంద-వ. నాయభీష్టంబు దీర్పుఁడని ప్రార్థింప, మునిసత్తముండూర్ధ్వదృష్టితో నవలోకించె, రెండుకోఁతులు వియన్మండలమునుండి క్రిందికివచ్చి నమస్కరించె. మౌనికను సన్నతోఁ దెలిపిన—

క. గగనమున కెగసి రెండుగ
దెగియున్న జలంధరాఖ్యు దేహము గొని, వా
ర్మగుడ జనుదెంచి, వృందకు
నగపడచిరి క్షణములోన నాశ్చర్యముగన్.

వ. భిన్నమైయున్న భర్తృకళేబరంబు గని వృంద మూర్ఛిల్లిన, మునీంద్రుండు కమండలోదకంబు ప్రోక్షింప, మూర్ఛ దెలిసి,

వృంద, కీర్తన-నాదనామ (అదిఎంతదుర్ది) వలె.

దైవదుర్బలమో! నాప్రాతఫలమో! యీవేళ విగతజీవుఁడాయెను పతి ॥ దైవ ॥ ఏకాలమున కేమేలగునో, యేకీ డగునో యెఱుఁగలే మకట ॥ దైవ! విజయము నొంది వే వత్తునని నిజముగ నమ్మి నే నుంటి నయ్యో! ॥ దైవ ॥ గురుతరమోక్షగుండేపఁ గెల్వదర మగునే నీకు! దరి యెవ్వ రింక ॥ దైవ ॥

వ. అప్పుడు మునివర్యుండు సమీపించి,—

ముని:- క. చచ్చినవారలు గ్రమ్మఱ
వచ్చెదరే! శోక మొంద వలదు విబుధులీ,
వచ్చుట బోవుట సమ మని
చెచ్చెర చెప్పుదురుకాదె శితాంశముఖీ!

వ. దుఃఖింపవలదు లె మ్మనదెలివినొందిజడదారిపదములఁబడి—

భుజంగ ప్రయాతము.

వృంద-మునీంద్రా! భవత్పాదముల్నమ్మితిన్నా
మనోనాయకుం గూల్చె మారారి యల్కన్,
బునర్జీవితుంజేయఁ బూజ్యుండ వీవే!
కన న్వేరొకం డోపఁగా లేఁడు ధాత్రిన్.

పంచచామరము.

ముని — పురారిగొన్నవీని ప్రాణముల్ మరల్ప నేఁడు నా
తరంబెయైన మత్కృపాసుధారసంబు నీపయిన్
గరంబుజిల్కఁ జూడు నీమగం డిదే సజీవుఁడై
కురంగటం జరింప జేతుఁ గూడు మంగనామణీ!

వ. అంతలో జలంధరుండు యథావిధిగ లేచి నిలిచిన వృంద యానంద హృదయయై ముని నభినందించుచుఁ బ్రాణనాథుఁ నాలింగనంబుఁ జేసికొనియె మొదలుగ—

సీ. ఖేలానుకూల విశాలలాలిత మాల
తీలతా నికురంబ కూలములను
సారసకల్హారవారవారితదివ్య
చారుసరోవర తీరములను
సంతతసుమఫలసంతాన శోభిత
సంతాపహరతరుప్రాంతములను

మలయానిలాయాతసలలిత సుమరజో
కలితమౌ సైకత స్థలములందు

గీ. అల జలంధరు రూపుగొన్నట్టిచక్రి
వృంద ముదమంద ముఖము చుంబించి మోవి
పానకముఁగ్రోలి చౌసీతిబంధరతుల
గలసిమెలఁగెను దాఁజిరకాల మచట.

వ. ఒకనాఁటి సురతాంతంబున ప్రమాదంబుచే నిజరూపంబున నిదురించుచున్న యాతనిం గని వెన్నుం డని గుర్తించి యా యన్నుల మిన్న కన్నుఁగవఁ గెంపు లొలుక—

కీర్తన-కన్నడ: ఆదితాళము (రాకేందు) వలె.

నీ మాయ దెలిసె! మనసు సొలసె! మాయఁజేయ నాయమగునా ॥ నీమా ॥ అప కారబుద్ధివచ్చినట్టి శౌరి వని కంటి! కపట తపము గావించితివి ॥ నీమా ॥ పరదారసంటి వెంట నుంట గౌరవం బగునా! మేర మీరితౌరా ధీరా ॥ నీమా ॥ గురుండు శిష్యుఁడాయె, మోక్షగుండవర నీకు దండ నుండఁ దగదు తలఁగు ॥ నీమా ॥

గీ. జయవిజయులను నీపారిషదులు నాకు
గీడొనర్చిరి రాక్షసాకృతులతోడఁ
బుణ్యశీల సుశీలు రిప్పుడు కపులయి
నీదు పను పాచరించిరి నిశ్చయంబ.

క. ముం దీవు రాక్షసులచేఁ
బొందుగ నిజసతిని గోలుపోయి మనములోఁ
గుంది కపులఁ దోడ్పడఁ జే
కొందువు కామినిని మగుడఁ గూరిమితోడన్.

వ. దండకాననవిహారంబు భార్యావియోగంబు కపిసహాయంబు వచసంబుసంజేసి నిశ్చయంబుగ నీకు లభింపగలవని,

సం—తో. ఇందిరాపతికి నిటు శాపం బిడి వృంద విభుని స్మరియించి పొందుగ నవలము గూర్చి తనువు నానందమ్మున నర్పించి ॥ రా ॥

వ. పరలోక సుఖంబున కరిగె-

ముద్గ-పాట: ఆట (ఒర్చియుండు మిక) వలె.

రాజరాజ విను దశరథమహా ॥ రాజ ॥ ఆ జయవిజయులె యసురులైనా రిపుడు ॥ రాజ ॥ రావణ కుంభకర్ణ నాములైరి మహా ॥ రాజ ॥ అబ్ధినడుమ లంకయందు వసించిరి ॥ రాజ ॥ లోకకంటకులై యనేకులఁ గెలిచిరి ॥ రాజ ॥ మోక్షగుండేశుపైఁ బూనిరి వైరము ॥ రాజ ॥

ముద్గ-సీ. మనుజేశ నీకొడుకును గోడలును బంచ
వటియందు నుండ రావణుఁడు వచ్చి
రాము నేమరఁ జేసి భూమిజఁ గొని పోయి
తల్లిరీతిని బ్రోచి తనరుచుండు;
వాలినివధియించి వానితమ్మునిఁ గూడి
కపిసేనచే వార్ధిఁ గట్టఁజేసి
రావణాదులఁ గూల్చి రమణితోడ నయోధ్య
జేరి తాఁ బట్టాభిషిక్తుఁడగును;

గీ. యజ్ఞము లొనర్చి మఱి తీర్థయాత్రలాచ
రించి ద్వీపంబులేడు సాధించి యేలు;
నిదియు గోప్యంబు: నీకు నే నెఱుక పఱచి
తిని; మహీవర యొరులకుఁ దెలియనీకు.

శివుని-క. ఈరీతిని ముద్గలముని
శ్రీరాముని భావిచరిత చెప్పిన విని యో
గౌరీ! దశరథుఁడు నమ
స్కారము లర్పించి పలికెఁ బ్రమ్మఁ మునితోన్.

కీర్తన. శంకరాభరణము; అట (వింతలాయె) వలె.

సన్మునీంద్ర సంతసమాయెను ॥ సన్ము ॥ మన్మనోభీష్టము మానుగఁ దీర్చితి ॥ సన్ము ॥ రాముఁడు హరియని భూమిజ రమ యని స్వామితెలిపిరి ॥ స ॥ జోడుగ గొడుకుఁ గోడలుగా నను గూడఁగ నేటికి ॥ స ॥ శ్రీకర మోక్షపురీపతికృపతో నాకథ దెల్పవె ॥ సన్ము ॥

వ. నాపూర్వవృత్తాంతము, దయాంతఃకరణముతోఁ గొంత సెలవిండని ప్రార్థించ
ముద్గలుం డానందభరితుండై.

మ. ధరణీనాయక, సహ్యపర్వతము చెంతన్ వింతగా నొక్క ప్రోల్
గరవీరం బన నొప్ప, నందుఁ గడులీలన్ ధర్మదత్తాఖ్యభూ,
సురుఁడొక్కండు గలండు: సద్గుణుఁడు సుశ్లోకుండు సద్ధర్ముఁడున్.
హరిసేవాపరతంత్రుఁడై మెలఁగు నిత్యం బాత్మ సంతుష్టితోన్.

వ. ద్వాదశాక్షరవిద్యాపరాయణుండై భార్యాద్వయముతోఁ గూడి యతిథిపూజ
యొనర్చుచునుండు. నాతఁడొకపరి—

తో. భాసుర కార్తికమాసంబున హరివాసరమున గుటియుంచి వాసిగఁ దా నుపవా
స నియతిమై వాసుదేవు నర్చించి ॥ రామ ॥

సం-వ. రాత్రిజాగరణకొఱకు హరిమందిరమునకు నరుగుచుండ మార్గమధ్యంబున—

సీ. వెడఁదశరీరంబు విన్ను మున్నున కంటి,
కాటుకకొండతో దీటుగాఁగ,
దీర్ఘ నిశ్వాసంబు ఘుర్ఘురస్వనమును,
దెగువ భీమంబుగ దిశలఁ బర్వ,
రక్తలోచనముల రగులువహ్ని కణంబు,
లల్ప్రళయజ్వాల ననుకరింప,
లంబజిహ్వాగ్రంబు జుంబించు వక్రదం
ష్ట్రలు వరాహంబుతోఁ జెలిమిసేయఁ

గీ. గడుదిగంబరయై పైకి గవయు శుష్క
దేహనొకరక్కసిని గాంచి ద్విజవరుండు
దనువు గంపింప నొక కొంత తడవు భీత
చిత్తుఁడైయందు నిలిచి యోజింపఁ బొడగె.

కీర్తన-కదంబరాగము. ఆది (ఇంతపాప మెన్నడైన) వలె.

ఏమి యీవికారరూప మిటుల నెదుట దోప, స్వామికేమి లోపమే సలిపినాన
తలఁప ॥ నేమి యీ ॥ ఎన్నిసారు లిటు రాలేదు! యెన్నడిచటలేదు! చిన్నిరూపుగాదు!

కొన్నదవలబోదు ! ॥ యేమి ॥ మోక్షగుండహరిని గొలువఁ బోవుచుండ తులువ రాక్షసిటుల నిలువ, జనరా దిఁ కేమిత్రోవ! ॥ యేమి ॥

వ. ఆపన్నివారణుండగు హరియుండ భయపడనేలయని నిశ్చయించి వాసుదేవద్వాదశాక్షరి జపించి తులసీదళయుక్తం బగు నుదకంబు దానిపైఁ జల్లిన,—

క. తులసీదళయుక్తంబగు
జలసంస్పర్శమున గలుషసమితి దొలఁగి యా
వల పూర్వజన్మసంస్మృతి
గలిగి ద్విజన్మునకు మ్రొక్కికడువడిఁ బలికెన్.

తే. నీప్రసాదముచే, బాపనికర మడఁగి
పూర్వజన్మవిజ్ఞానంబు వొడమె మదికిఁ
జెప్పు మనినను సర్వంబు జెప్పఁ గలను
భూసురోత్తమ! యేమి నాపుణ్యమహిమ.

తో: అనవుఁడు నాశ్చర్యము నొంది యతం డనియె నపుడు మోదమున; వెనుక నెవరు నీ వేకర్మముచేతను నిటులైతివియనిన ॥ రా ॥

కీర్తన-కేదార : రూపకము (ఇనకులాబ్ధి) వలె.

వినుము భూసురాగ్రణీ! అనుపమగుణగ్రామణీ! ధీమణీ! ॥ విను ॥ ఇలలోఁ గలహయనంగను! వెలసితినేఁ దొలిబామున। విను ధీరా-సౌరాష్ట్రము నావాసము ॥ విను ॥ భిక్షుండన్! విప్రుండతి బ్రియమున వరియించి–యాక్షితినను బెండ్లాడెను ॥ విను ॥ పతిమాటలు వినకయతిప్రీతిని గనక! నతిధర్మముగొనక! మతిమార్గమువిడక! నతతమిట్లు జరుపుచుందు ॥ విను ॥ శ్రీమిాటిన మోక్షపుర! స్వామిని నేఁ గొలిచి యెఱుంగ ॥ వినుము ॥

కల-క. ఆకొన్న ముందు వంటక
మతిముదమున దినుచు నుందు నతఁడే మనినన్
బ్రతియనక యూరకుండను;
బ్రతిమాలిన ముఖము ద్రిప్పి పలుకకయుందున్.

తో॰ ఇటువలె జేయవె యీపని యనినను రెటమతముగ; జేసెదను; నటుమళ్ళి నతటి దటుకునఁ బెళుఁన మెటికలు విరచెదను ॥ రా ॥

వ. ఇది మదీయనిత్యకృత్యము.

సంవా-సీ. భి-చెప్పినరీతిగ జేయ వే మదినీవు?
కల-చెప్పి చేయింప నీచేత నౌనె!
భి-ముందుగాఁ దిని పండుకొందువటే కొమ్మ!
కల-నీయాజ్ఞ నా మీఁద నెఱపఁగలవె!
భి-దేవపూజయు వైశ్వదేవ మెట్లగునింక?
కల-వేఱుపాకంబు గావించుకొనుము
భి-వేఱవండుకొనునెడ నీ వుండ ఫలమేమి?
కల-నాయింట నుండుట నాకుఁ దగదె!
భి-ఎంతతెగువరి వైతివే యిందువదన!
కల-నీకు లోఁబడుదాననే నిశ్చయముగ!
భి-మాఱువల్కిన శిక్షింతు మగువ నేఁడు.
కల-కూపమునఁ గూలి ప్రాణంబు గోలుపోనె!

కల-వ. నానామంబు సార్థకంబగునట్లు వితండము లాడుచుఁ బ్రవర్తించుచుండ నప కీర్తి లోఁబడియతండు బహుకాలంబు గడపి విసిగి యొకనాఁడు తనప్రియ మిత్రునింజేరి,—

కీర్తన-ఆదితాళము: (రారామబాంగ) వలె.

విన్నావె మిత్రా యీవేళ నాచరిత్ర ॥ విన్నా ॥ వినుటకుఁజిత్ర మీవేళ నా చరిత్ర ॥ విన్నా ॥ ఇంటిలో పో రహా! యింతింత యన రాదు! కంటకమాయె! వేగమె నాచరిత్ర ॥ విన్నా ॥ చెప్పినరీతిగఁ జేయదు పెండ్లాము! తిప్పలబెట్టు! నీతీరు నా చరిత్ర ॥ విన్నా ॥ మోక్షగుండేపనిసాక్షి నాతోఁ బ్రతికక్షగఁజేయు వేగమె నాచరిత్ర ॥ విన్నా ॥

వ. ఇహపరసౌఖ్యంబులకు నాలవాలము దార యను కారణంబున నోరిచి యెంత బోధించినను భస్మహవ్యమువలెవ్యర్థమగుచున్నయది! దీని కేదైనయుక్తిచెప్పుము సఖా! అని వేడిన—

సఖుఁడు:-క. క్రమముగఁ బని చెప్పిన న
క్రమముగ! దా నాచరించుఁ గావుననీ వ
క్రమముగఁ జెప్పుము తా నది
క్రమముగఁ గావించునదియ గార్యము పొమ్మా.

వ. ఈయుపాయంబున కచ్చెరువొంది భిక్షుండు వెంటనే గీముసకుపచ్చి యపి పరీక్షింపఁగోరి,——

దంపతుల వివాదము-మానినీపృత్తము.

భి. మానిని, నాప్రియమిత్రుఁడు ధూర్తుఁడు; మానుగ పిండుకుఁ బిల్వకుమీ! నేనును నాతనిఁ బిల్వను నావుఁడు——

కల. నేరపు జ్ఞానవిహీన ధరిణ వానిసమానుఁడు లేఁడు; కృతఘ్నుఁడ; వాపర మాప్తుని దూరెదవా! మానుగ నేఁ జనివిందుకుఁ బిల్తుసుమా వలదన్నను మానుదునా!

వ. ఇట్లుపలికి యతనిఁదోడితెచ్చి మృష్టాన్నతృప్తునింజేసి పంపితి. అది మొదలు నిషేధోక్తులాజ్ఞాపించుచు సంసారంబు నెఱవేర్చుకొనుచుండి యొకనాడు —

సంవాద-కీర్తన-అటతాళ : (రాము నంపిన) వలె.

భి-ఇద్దినము నాతండ్రిది తద్దినము వినగదె! ముద్దుగుమ్మ నెరవేర్పవద్దు మస మిద్దఱము ॥ ఇది ॥

కల-అద్దిరా? యిదేమి యబ్బతద్దినము మానుదుర! బుద్ధిలేదూరకుండు! పెద్ద లిది మెచ్చెదర ॥ అద్ది ॥

భి-మాటికి నే టేటఁ బెట్టనేటి కిది బోటి! విసు, కూటికై పితరు లిచ్చోటి కరు దెంచెదరె ॥ ఇద్ది ॥

కల-ఏటి కొడుకవునీవు! చేతులకు మూల మిది! సాటివారు వెలివేయరే! టాటోటు మాటలుచాలు ॥ అద్ది ॥

భి-ఆక్షేపణలేకయుంత దీక్షగ నే నొక్కనికిఁ గుక్షి కింతకూడుపెట్టి యీక్షణమె పంపెదను ॥ ఇద్ది ॥

కల-మోక్షగుండ శౌరిపదసాక్షిగను శాస్త్రవిధి లక్షింపక యిచ్ఛాగతి నీక్షితిఁ జరించెదవె ॥ ఇద్ది ॥

వ. ఇట్లు భర్తను ధిక్కరించి తత్ క్షణమపోయి పదునెనిమిదిమంది భోక్తలను నియమించి గృహాదులు శుద్ధిచేసి సమస్తశాక సూపభక్ష్యాన్నములు సిద్ధపఱిచి భోక్తలఁ దోడితెచ్చి శుద్ధాసీనులఁ జేసి యర్చింపుమన,

భిక్షుండు-నాకుశరీరము జబ్బుపడినది స్నానము మానుదునా? కల-ఇంతటుర
చారు(డవా! స్నానముమానిన వృథా శ్రాద్ధముకాదా?

భిక్ష-(స్నానముచేసి వచ్చి యథావిధి నర్చించి)

సంవాదము-ఉత్సాహవృత్తము.

భి-అందఱుఁ భుజించుదనుక నాగలేవు భామినీ
ముందు నారగించి, పిదప భోక్తలకుఁ బెట్టుమా!
కల-మందమతివి ధర్మశాస్త్రమతము నీకుఁ దెలియదా!
ఇందఱిన్ భుజింపజేసి యేను బిదప దినియెదలే.

వ. ఇట్లపసవ్యంబుగఁ జెప్పినపనులెల్ల సవ్యంబుగ నాచరించుచుంటి. అప్పుడ
బిండప్రదానంబుతోఁ గూడ శ్రాద్ధంబు నెఱవేర్చి —

సంవాదము-మత్తకోకిల.

భి-ఈదినం బుపవాస ముండెద నింతి నే భుజియింపనా! మోదమంది భుజించ
మిప్పుడు మూడుజాములు మీఱెనా!

కల-వాదమా! యిదిపైతృకం బుపవాసహేతువు గాదు మర్యాదగఁ దిను మంచు
బెట్టితి; నారగించెను నాత(డుఁ॥

వ. అటుపిమ్మటఁ బ్రహూదంబున —

తో. ఈ పిండంబుల నిపుడుగంగలో నింతి వైచి రమ్మనగఁ, బాప మనక మ
కూపములో నవి పడవైచితినా వెనుక ॥ రామ ॥

వ. ఆ యకృత్యంబున నసూయనొందియు నది లోపల నడంచికొని

క. మలకూపంబుననుంచుము;
జలములలో, వేయఁ దగదు సతియన, మలిన
స్థలమందు నుండనీయక
తలగించి జలంబులందుఁ దప్పక యిడితిన్.

వ. అటి విపరీతకృత్యంబునకు నోరలేక యలుక రెటింపభిక్షుండు

కీర్తన - కేదారగౌళ - ఆదితాళము (ఇంతరంసం.) వలె.

ఎంతగయ్యాళివే నీవు! నా శాంతముఁ బోఁద్రోచినావు; కుంతముందూరిచి గొం
సింపి గొంతులోఁద్రోతునా దోషకారీ! పెంటకారీ తంత్రకారీ! యంతమొందింతు మర్ది
నొంతు నెంత ॥ దీక్షతో నా యిల్లుసేరి ప్రతికక్షఁబూనితి వౌరా! మోక్షగుండేశుని సాక్షిగ
శిక్ష గావింతురు జిక్కబట్టి, రక్షపెట్టి రాతఁగొట్టి భిక్షకుఁ బంపింతు నీక్షణమున ॥ నెంత ॥

వ. కఠోరంబుగాఁబలికి నన్నుఁద్యజించికులశీలసుగుణంబులుగల యొకకన్నియ
పెండ్లియాడిన నేను రోషించి విషపానంబున నసువులు విడిచితి, అప్పుడు—

కల-తో. దండధరుని దూతలువచ్చిరి యుద్దండపరాక్రమమొప్పఁ; జండశాసన
సలుపుచుఁ గొనిచని శమనునిసన్నిధి నిలుప ॥ రా ॥

చ. శమనుఁడు చిత్రగుప్తుఁగని చక్కఁగ నీబిడ చేసినట్టి క
ర్మములు విమర్శచేసి వివరంబుగఁ దెల్పుము నాఁగ నాతఁడా
క్రమము గణించి దేవర! నిరంతర మీచెలి పాపకృత్యముల్
ప్రమదముతో నొనర్చె; నిది బంధురశిక్షకుఁ బాత్రురాలగున్.

చిత్ర సీ. ఇష్టాన్నమును భర్తకీయక తినె గాన,
పల్లి! నీజన్మంబు వడసి స్వమల
భక్షణ యగు, నిజభర్తతో ద్వేషించి
కలహించె నిత్యంబుగానఁ నడపి
పందియై స్వమలము భక్షించుచుండును
బాక భాండమునుండి భర్త సూడ
కుండ ముందుగఁ దిని యుండెనుగావున
బిల్లియైతనుఁగన్న పిల్లలఁదిను

గీ. పతిపుసాధింప నాత్మహత్య యొనరించెఁ
గాన, బ్రేతశరీరంబు పూని ముందు
ననుభవించి యనంతర మవని మూఁడు
తనువు లెతఁగఁదగు బ్రామ్మతనయ! యిపుడు.

చిత్ర–తో, ప్రేతశరీరోపేత యగుచు మరుభూతములన నుండుటకుఁ, బ్రీతిగ నాజ్ఞాపించి పంపఁ డిదె దూతల వెంబడి నటుకు ॥ రా ॥

వ॰ ఇది క్రమమైన శిక్షయని చిత్రగుప్తుడు పలికిన విని యముండు నిజభటుల కాజ్ఞాపించిన—

కల-ఉ. దూతలు నన్నుఁ దెచ్చి పగతోమరుభూమినిజేర్చి యిచ్చటన్
ప్రేతశరీర మిచ్చి విడిపించిరి: పంచదశాబ్దముల్ సనెన్!
జేతము క్షుత్పిపాసలఁ గృసింపఁగ దాళఁగ లేక నేను గృ
ష్ణాతటమందుఁ జేరఁ గని నన్నట నుండఁగనీక క్రమ్మఱన్—

వ. హరిహరదూతలు గొనితెచ్చి యీ నిర్జలప్రదేశమున పీడిరి.

కీర్తన-తోడి: ఆదితాళము (వినవే యొకమనవి) వలె.

ధరణీసురతిలక, తత్ప్రభృతి యిందునే తాళి యుందు ॥ ధర ॥ తరము గాదింకను భరియించుటకును! తఱిగె బలమంతఁ। దసరె బలుచింత ॥ ధర ॥ అలసితి గడు దాహమునఁ। వ్యాకులము గలిగె నాకలికిఁ నిలువ వశముగాదు। నిజముగను నాదు కలుష మడఁచితి; కరుణను గాచితి ॥ ధరణీ ॥ అయ్యో! ముందుత్రివిధ యోనులను బుట్టుయోగమును ధరడుల్లఁగ మెల్లఁగ నల్లనజేయుము ॥ ధరణీ ॥ క్షితిఁ బురాకృతదురాగతంబు హత మొనరించితివి: ధృతపుణ్యమతివి ॥ ధర ॥ వెలయఁ దపో బలముగల తమ మహిమము దెలియ నెవరితరము ॥ ధర ॥ జగన్నుతుండైన మోక్షగుండహరికరుణ వడసిన ॥ ధర ॥

వ. నే నెంతదురంత పాపములుచేసి యింతవంతపాలైనను భవద్దయాంతఃకరణమున నాకొలంతలు దీరె. తమకసాధ్యం బేదియులేదు. నన్నుఁ గడఁదేర్పవలయును. దీనదయాపరా! యని వేడిన విప్రుండు,

సీ. నీవు సేసినపాపనికరంబులెల్లను
నిర్మూలమయ్యెను నేటితోడఁ;
బ్రేతత్వమును బాసి పిమ్మట యోనిత్ర
యంబు నొందఁగఁ జాలనని విచార,
పడెదవు నీకు నపాయంబులేని యు
పాయంబుఁ గంటిని భయపడకుము

జన్మాదిగా నేను సలిపినకార్తిక
వ్రతఫలంబున నర్ధభాగ మిపుడు

గీ. ధారవోసితి గొనుమని ద్వాదశాక్ష
రమును జపియించి తులసియుతముగ జలము
పాణియం దుంప బ్రేతరూపం బడంగి,
విమలలావణ్య యగునొకవెలఁది యయ్యె.

వ. అంత నాయింతితేజోభిరామయై ధర్మదత్తునకు, బ్రణమిల్లి

స్రగ్విణి.

నీప్రసాదంబునన్ నేను ధన్యాత్మనై,
సుప్రభాయుక్తమౌ సుందరాకారమున్,
విప్రచూడామణి, వేగఁ గైకొంటి నా
నాప్రకారంబుల నాకు మే లయ్యెడిన్.

వ. ఇట్లనుచుండునంతలో దేదీప్యమాన మగు నొకవిమానముగొని విష్ణుదూత లరుదెంచినఁ గని, ధర్మదత్తుండు వారికి సాష్టాంగ నమస్కారంబులర్పించి.

ధర్మ-తో; ఈవిమానమును నెవరికొఱకు మీరిచటకిఁదెచ్చితిరిపుడు? ఆవైనము నా కానతియ్యుడని యడిగినంత వారపుడు ॥ రామ ॥

విష్ణుదూతల కీర్తన. కమాచ్ : జుల్వ-(నేర మేలజార) వలె.

నేలవేలుపా వచింతు మాలకింపుమా! మేలుగ భువన మేలెడు వనమాలిబహిర్ద్వార పాలురముమేము ॥ నేల ॥ ప్రేతరూపంబున నీతెరవున నున్నపాతకురాలి ని దే నీతపోబలము నాతిని చేసితి; నాతరుణియు పునీతురా లయ్యెను ॥ నేల ॥ శ్రీమోక్షగుండేశుఁడౌ మాధవుండు దా వైమానికము బంపెను; భామలతో నీవు నీమానినిమణి యీమేటిపుష్పక మెక్కుడు పోదము ॥ నేల ॥

ఉ. పిన్నటినుండి శ్రీహరికిఁబ్రీతిగఁ గార్తికమాస సువ్రతం
బెన్నఁగఁ జేసినావు; జపియించితి వెప్పుడు ద్వాదశాక్షరిన్

బన్నగజాగరంబు నుపవాసములున్ జరిగించినావు; నీ
కన్న ఘనుం డెవండు! త్రిజగంబుల భూసురవంశ శేఖరా!

గీ. అట్టిపుణ్యంబునందు నర్ధాంశ మిపుడు
దాన మొసంగితి నీమెఱుఁ; దానఁజేసి
ద్విగుణ మయ్యెను బుణ్యంబు; ద్విజవరేణ్య
విష్ణుమూర్తికి నది మహాప్రీతి యయ్యె.

క. సుకృతార్ధంబును గొనుటను
సకలాఘంబులకుఁ బాసిసద్గుణఖనియై
యకలంకరూపతేజము,
లకు దానక మయ్యె నీమె లావణ్యనిధీ!

వ. ఈకారణంబున మీకు విష్ణుసాయుజ్యంబు గలిగె; భక్తపరాధీనుండగు వైకుంఠుని దయారసం బపారంబు, వినుము

సీ. హరిని నారాధింప నౌత్తానపాదికి
దారకామండలస్థాయి దొరకె;
గ్రాహగృహీతయై గజరాజు ప్రార్థింప
గ్రాహంబు దునిమి నాగమును గాచె;
హరిచక్రమునఁ గూలినట్టి యాగ్రాహంబు
విజయుఁడై జనించె; గజము జయుఁడు
నాఁ బుట్టి యిరువురు నారాయణునిపార్శ్వ
చరులైరివారలవ్వరుసనేము

గీ. విష్ణుఁ గొల్చుచు నుందు మావిష్ణునాజ్ఞ
మిమ్ముఁ గొనిపోవ నీవిమానమ్ము వెంట
వచ్చినాము హరిప్రభావమునఁ గాదెఁ
మాకుఁ జెడిపోనిపదవి సంభావ్య మగుట.

వి,దూ. కీర్తన-కాఫి: ఆది. (ఆనతిమ్మ) వలె.

ఆనందాబ్ధిలోన దోఁగుచు గదలుఁ డిపుడు ॥ ఆనం ॥ మేనుప్పొంగ గాను నీవివ
సమున మఱి యెక్కుడు ॥ ఆనం ॥ నారాయణునిఁ జేరిచెదము ; మీరాఘనుని కారుణ
మునుగోరినిర్విచారసుఖములారూ ఢముగ ననుభవింపు ॥ డానం ॥ దీక్ష పుణ్యము క్షీణిం
నాక్షణంబునను మోక్షగుండ సంరక్షునిపనుపున నీక్షమాతలి కరుదెంతురు ॥ ఆనం ॥

ఆ. ధర్మదత్త నీవు దశరథుఁ డనుపేరఁ
బ్రొద్దుకాలముందుఁ బుట్టగలవు;
నీ సతీమణులును గౌసల్యయు సుమిత్ర
యనఁగ బుట్టి భార్యలగుదు రపుడు.

క. జగతీసుర, నీ సుకృతము
నగముం గొనినట్టి కలహ జనియించును గై
కగ; నామె నీకు మూఁడవ
మగువ యగున్; భావి వర్తమాన మిది సుమీ

గీ. దేవతాప్రార్థనమున శ్రీదేవవిభుఁడు
రాముఁ డన నీకు నుదయించి, రావణాది
దనుజులను గూల్చి, ధర్మసంస్థాపనంబు
సేసి, రాజ్యంబుపాలించుఁ జిత్త మలర.

సీ. మాధవచైత్రోర్జమాఖమాసంబుల
నుదయంబునను స్నానమొనరఁజేసి;
తేకాదశీవ్రత మెలమినొనర్చితి
బృందావనము వేసి పెంచి తరసి
బ్రాహ్మణులను మఱి వైష్ణవులను గోవు
లనుభజియించితి వనుదినంబు;
మదమత్సరంబులు మానియారీతిని
జన్మవ్రతంబుగఁ జలిపినావు

గీ. గాన పిష్ణుండు ప్రీతుండు గాకయున్నె?
నీకు సాయుజ్యఁ మాకున్నె నిన్నుఁగనుట
చేత మేమును ధన్యులమైతిమహహ
హరిని దర్శింపఁ బోదము నరగ రమ్మ.

సం-వ. అని పలికి జయవిజయులు వారిని విమానారూఢులఁ జేసికొని దేవ తూర్యరావంబులు నిగిసి చెలంగఁ దక్షణంబున వైకుంఠ పురంబున విష్ణుసన్నిధిని జేర్చిరి.

ముద్ద కీర్తన-భైరవి; ఆదితాళము, (దుర్యోధనా) వలె.

ధాత్రీశ్వరా! దశరథనామా ॥ ధా ॥ ధర్మదత్తుఁడెంతయు వింతగను ॥ ధాత్రీ గోత్రధరుని గురురూపము నేత్రములఁ గని నివ్వెఱగంది ॥ ధాత్రీ ॥ మిత్రకులజను పవిత్ర శౌరిపుర చిత్రములను వీక్షించుచు, గడుమైత్రిని జిరకాలము వసించినాఁడచట ॥ ధాత్రీ ॥ నిర్మలినంబగు నిజకృతి పుణ్యసుకర్మ మడఁగినంతట నందుండక ధర్మదత్తుఁ డీపుడమిని దశరథవర్మయనఁగ నవతరించె; నెవరన నీవ నుమి ॥ ధాత్రీ ॥ అతని భార్య లిరువురు గౌసల్యా సతినుమిత్రలైరిపుడు గలహా యను నతివ కైక యన నలరెను ముప్వురు, క్షితివర నతులై చెలఁగిరి నీకును నిశ్చయము ॥ ధాత్రీ ॥ శ్రీమీఱఁగ శ్రీమోక్షగుండ హరిచావ శంఖచక్రములు గ్రమముగను రామ లక్ష్మణ భరత శత్రుఘ్న సునాములు నీకుఁ గుమారు లైరి విను వీరె కను ॥ ధాత్రీ ॥

వ. జన్మాంతర సుకృతపరిపాక విశేషంబున నిన్ను ధన్యునింజేయం గోరి యీ జన్మంబున భగవంతుడు నాల్గురూపంబుల నీయం దవతరించె. ఈతని కతంబున నీకు విష్ణుసాయుజ్యంబు గలుగు; నిశ్చయము.

క. నీ వడిగిన స్వచరిత్రము
నే వినిపించితిని; ధారుణీపర యింకన్
దేవులతోఁ బుత్త్రులతో
వేవేగ నయోధ్య సేరి విశ్రాంతిమెయిన్.

వ. నిజరాజ్యపాలనంబు సేయుచు సుఖంబున నుండు మని యాశీర్వదించిన, దశ రథుండుఁ గళత్ర-పుత్త్రసహితంబుగ మునీంద్రునకనేక ప్రణామంబు లాచరించి వారిని వీడ్కొని, యనంతరం బోపార్వతీ, !

శివుడు-తో; వందిమాగధులు బృందములై తమ ముందుఁ బొగడుచునడువ, దుందుభి లోనగు తూర్యరావములు సందడియలరఁగ మొఱయ ॥ రామ ॥

వ. నిజయానంబుల నారోహించి రెండు మూఁడు దినంబులకు నిజరాజధానియగు నయోధ్యకు జేరి యానందమున నగరు ప్రవేశించిరి. అంత దశరథుండును గొలువుండి సభి కులు విన భరతున కిట్లనియె.

కీర్తన - జంఝూటి - ఆదితాళము.

పొమ్మిఁకఁగేకయ భూపతిపురికిని నెమ్మదిఁబొదలఁగ భరతా ॥ పొ ॥ నెమ్మదిని నిన్నిపుడు రమ్మని మామేనమామ సమ్మతమునఁ బిలువ వచ్చె ॥ పొ ॥ తాతకు నవ్వకు నిరతము ప్రీతిని దండము పెట్టుము భరతా ॥ పొ ॥ మాతులుని మదిగొలుపు నీతో; గూడ శత్రుఘ్నుని ఖ్యాతిగాను బిలచుకొని ॥ పొ ॥ కోరిన చదువులు నేరుచుకొను మచ్చట నీవు కొదవల నుంపక ॥ పొ ॥ పొరులను భక్తిగను ధారుణిని మోక్షగుండ ధాముని నమ్మిచు వెడలి ॥ పొ ॥

అంత.

క. భరతుఁడు జనకుని యాజ్ఞను
సరగున శిరమున వహించి శత్రుఘ్నునితోఁ
బరువడి గేకయ రాట్పురి
కరిగెను నిజబంధు దర్శనార్థముగాఁగన్.

కాండాంతతోహర. అని తాళ్ళూరి నారాయణకవి రామాయణమును హరికథను ఘనముగఁ జెప్పెను గద యం దిది బాలకాండము చిలుకును సుధను ॥ రా ॥

ఇది వినువారల కిహసౌఖ్యంబులు గొదవలేక చేకుఱును; ముదమునఁ దుదకును ముక్తి లభించును మోక్షగుండ హరికృపను ॥ రామా ॥

క. నాచేత నయినకొలఁదిని
జూచి రచించితిని దీని; సుజనులు పెరసుల్
దోఁచినయెడ దిద్దుదు రని
నాచిత్తములోన నమ్మినా ననయంబున్.

శ్రీ మోక్షగుండ రామాయణమునందలి బాలకాండము సమాప్తము

———

శ్రీరామచంద్ర గురు పరబ్రహ్మణే నమః

అవిఘ్నమస్తు

# శ్రీమోక్షగుండ రామాయణ

## హరికథ.

## అయోధ్యా కాండము.

* * *

క. శ్రీరాముఁడు జానకితో
నారూఢిగఁ గలసి మెలసి యంతఃపురిలోఁ
గూరిమిని నున్న వేళను
నారదుఁ డరుదెంచి దర్శనము జేసికొనన్.

కీర్తన-కళ్యాణి-ఆదితాళము.

సీతాధిప కరుణాసాగరా ॥ సీతా ॥
ఆధారాది షడబ్జసమన్విత బోధరూప గుణభూషణా-గుణభూ ॥ సీతా ॥
శుద్ధస్ఫటిక విశోభితచిన్మయ సిద్ధయోగిహృద్గోచరా ॥ సీ ॥
వ్యష్టిసమష్టిమయప్రపంచమున సృష్టిస్థితిలయకారణా ॥ సీ ॥
రాక్షసహర నారాయణకవినుత మోక్షగుండపరిపాలకా ॥ సీ ॥

తో: అరుదెంచిన యాసురముని కెదురుగ; దరుణితోడఁ దా నరిగి, సరగ
పతి సాష్టాంగ నమస్కారము లిడియెనుజెలఁగి ॥ రామ ॥

మునినాయక మాబో,టిగృహస్థుల కనయంబును మీవంటి ఘనుల దర్శన
గుట దుర్లభ, మనఘుఁడ నైతిని మంటి ॥ రామ ॥

వ. అనిన నారదుఁ డిట్లనియె:

కీర్తన - ఫరజురాగము.

నీమాయను దాటఁగ నేర్తునా రామ ॥ నీ ॥
ఏమాత్రము నీ యెఱుక లేకయ సామాన్యముగను సర్వేశా హరి ॥ నీమా ॥

నీవు హరివి, శ్రీదేవియ జానకి ; దేవ ; నీకృపచేఁ దెలిసితి రామ ॥ నీ ॥
సకలపురుషరూపకుఁడవు నీవే! సకలయువతు లీజనకజ ; రామ ॥ నీ ॥
భువిని మోక్షగుండభవ నారాయణకవినుత, సాధుల గావఁగదే రామ ॥ నీ ॥

గీ. రాజ్యభారంబు దశరథరాజు నీకు
నీయఁదలఁచెను దాని నీ వియ్యకొనిన
రావణాదినిశాటవర్గముల ద్రుంచి
మమ్ము రక్షించు టెన్నఁడు మదనజనక!

వ. అనిన శ్రీరామచంద్రుఁడు నారదున కిట్లనియె :

కీర్తన - ఆదితాళము.

దేవ మునీశ్వర దెల్పెదను నా వాక్యంబులు నమ్మివిను! రావణాది దుర్మార్గుల ద్రుంచి సురావళిఁ బ్రోచుట కవుడెంచెదనే ॥ దేవ ॥ దండకాటవిని దాపసవృత్తిని నుండెద బదునాల్గేం డ్లచట ; మెండుగ సీతా మిషమున ఖలులను ఖండించెద మోక్షగుండేశుఁడనై ॥ దేవ ॥

వ. ఈ ప్రకారంబున శ్రీరామచంద్రుని రావణవధార్థము చనుమని ప్రేరేపించి ముమ్మాఱు నమస్కరించి రాముని సెలవు పొంది నారదుండు యథేచ్ఛఁ జనియె. అంత దశరథమహారాజు రాజ్యపాలనంబు చేయుచు గొలువు కూటంబున బరివేష్టించియున్న సభ్యులఁ గని యిట్లనియె.

కీర్తన-అటతాళము-కాఫీరాగము.

విను డిది సభవారు విన్నప మొక్కటి ఘనముగ ముదిసితి మనమున రోసితి పనిఁ బూని రాజ్యముఁ బాలింప జాలను ; గనుక రామునకును గట్టుదు బట్టము ॥ విను ॥ మీకిది సమ్మతమేకద దీనికి జేకొని సర్వము సిద్ధము సేయుడు మానులమున గల మర్యాద యగు నిది ; యాకరుణాంబుధి యగ్రజు డర్హుఁడు ॥ విను ॥ భరత శత్రుఘ్నులు పరగఁగ లే రిటు నరిగిరి మాతుల పురమును జేరఁగ ధరను నారాయణదాసనుతుఁ డగు వరదుని మోక్షగుండహరిని దలంచుచు ॥ వినుఁడిది ॥

తో. వదలక దశరథువాక్యంబులు సభవారలు దా మాలించి, సదమలమతులయి సంతోషించుచుఁ బిదప ననిరి యోజించి ॥ రామ ॥

కల్యాణి - ఆదితాళము.

ఇది ఘనకార్యము భూవరా! మా ॥ ఇది ॥ ఎదలోపల నీ వెంచిన కార్యము ముదమున జేయుము చాలు ॥ ఇది ॥ మేలుగ త్రిభువన మేలెడు నేతకు నీలోకము నేలు టెంత ॥ ఇది ॥ మోక్షగుండ రామమూర్తిని మా కధ్యక్షుని జేయుము రాజ ॥ ఇది ॥

వ. అనిన.

దశ-తోహార : అప్పుడు దశరథుఁ డావసిష్ఠుఁ గని 'యయ్యా' కులగురువర్యా! ఇప్పుడు రాముని కిది యెఱిగింపఁగ నేగుడు సద్గుణధుర్యా ॥ రామ ॥

క. అనుడు, వసిష్ఠుడు రాముని
గన నేగినవారిరాకఁ గని రాముఁ డెదు
ర్కొని, కాళ్ళు గడిగి తజ్జల
మును శిరమునఁ జల్లుకొనియె ముదితయుఁ దానున్.

వ. ఇట్లు కులగురువును దోడితెచ్చి రత్న పీఠంబుపయిఁ గూర్చుండఁజేసి పూజించి కరకమలంబులు ముకుళించి రాముండిట్లనియె.

ఆటతాళం: (నమిలాం వలె)

మాను శుభంబు మీ రాక కేవలమును శ్రీకరమై యున్నది, ధీరవర ॥ మా ॥ ప్రాకటముగ గృహపావన మాయెను మా కుల మిదె పావలె ॥ ధీర ॥ తమ పాదాంబువు దాల్చుటకతన సార్థకమాయె నాజన్మము ॥ ధీర ॥ అవిరళ మోక్షగుండాధిప గొల్చు మీ రసఘులు ధన్యాత్ములు ధీరవరా ॥ మా ॥

సం-తో. ఇనకుల పర్యుండీరీతిగ పస విని వసిష్ఠమునివరుఁడు మనమున నలరుచు మాబోంట్లను నీవు మాయలఁ బెట్టెద వెపుడు, రామ ॥

నీ పదజలమును నెత్తిని దాల్చెను నీలగళుఁడు ప్రియమునను; నీ పదజలమున నీరజభవుఁడు పునీతుడయ్యె గ్రమమునను ॥ రామ ॥

ఇటుల నుపదేశించుట గాదే యిలలోఁగల జనులకును జటుతరసాక్షివి పరమాత్ముఁడ వను ప్రజ్ఞగలదు మీ వయను ॥ రామ ॥

వశి-జంఝూటి-ఆటతాళం.

దేవదేవుఁడవు నీవు పుట్టినావు! రావణవధకు శ్రీరామా! రామా! వేవేగ మీసేవ గావింప నీదూష్యజీవనమందుంటి నీపటకు ॥ దేవ ॥

అగుణుండ వగు నీవు సగుణుఁడవై యిందు భగవంతుఁడనగను బ్రబలితివి; తగ నిన్నుఁగనుగొంటి ధన్యుఁడ నయితిని జగదీశ మాయలోఁ దగిలింపకే ॥ దేవా ॥

గురుగురుఁడవు నీవు, గురుఁ డని నన్నినుట కరమొప్ప నాభాగ్యగరిమగాదే! ధర పాల, తాళ్ళూరి నారాయణార్చిత, వరద, మోక్షగుండవాన! రామ ॥ దేవదేవుఁడవు ॥

వ. అని పలికిన సంతోషించి శ్రీరామచంద్రుం డిట్లనియె.

తోహర; మీ రరుదెంచిన కారణ మేమో కోరి తెలుపు మో స్వామి! సారెకు నే శిరసావహించి యది సలుపుదు సంశయ మేమి!

వ. అనిన వశిష్ఠుండిట్లనియె.

కీర్తన-మధ్యమావతి-రూపకము.

రఘునందన! రఘునందన! రఘునందన! రామా! రామా!

అఘసంహార, రాజ్యము నీ కర్పింపఁగ నెంచె రాజు ॥ రఘు ॥

ముద్దియతోఁ గూడ నొక్క ప్రొద్దుండుము నేడు; రేపు ప్రొద్దున మీ తండ్రిగారు యొద్దకు నేతెంచినచో ముద్దుగ నన్నియుఁ దెలుపును ॥ రఘు ॥ ఈక్షితి పరిపాలనమున కీవ యర్హుడగుదు వయ్య! మోక్షగుండపురమందిర, సాక్షాన్నారాయణకవిరక్షక, నే పేడ్కొని యెద ॥ రఘు ॥

వ. అనిన.

తోహర: మంచిది మీయనుమతమురీతి గావించెద బొం దని యనఁగ, మించిస భక్తినుతించి దశరథునిఁ గాంచ నేగి యి ట్లనిపెగా ॥ రా ॥

శ్రీమీఱఁగ రఘురామునికన్నియు జెప్పి వచ్చితిని రాజా! క్షేమంబుగ నభిషేక ద్రవ్యముఁ గూర్పుము రవితేజా ॥ రామ ॥

క. అనిన నృపాలకుఁడు సుమం
త్రుని గని యటుఁ జేయు మనిన, దోర్ద్శోభటులన్

గని యతఁ డాజ్ఞాపించుడుఁ
జని కూర్చిరి సకలవస్తుసంభారంబుల్.

రగడ:

అంతనృపాలకు నాజ్ఞను జారులు,
వింతగఁ దెల్పఁగ విని యాపౌరులు,
చెలువుగఁబురిగై సేసిరి చెలఁగిరి;
నిలయంబులు పన్నీటను నలికిరి;
ముత్తెపుమ్రుగ్గులు ముదమునఁబెట్టిరి;
చిత్తరు వలదిరి చిలుకులుగొట్టిరి;
పలుతోరణములుఁబరువడి గూర్చిరి;
చలువపందిళులు చయ్యనదీర్చిరి;
ఎచ్చటఁగన వాయింతురు భేరులు:
ఎచ్చటఁ గన దీవింతురు పౌరులు
తులగానని బహుతూర్యనాదములు;
వెలెసెను నంతట విపుల మోదములు;
కడువడి గాయకగణములు పాడఁగ,
గడనచేడియలు ఘనముగ నాడఁగ,
మంగళజలములు మటి తెప్పించిరి;
అంగుగ నభిషేకార్థమ్మొంచిరి;
పురియెల్లెడలను బొలుపునఁ జూడఁగఁ,
మురియుచు జనములు ముచ్చటలాడఁగ,
నాకలకలరవ మటు మంథర యను
కైకదాసి చక్కఁగఁ దా వినియును,
నొక్కమేడపై కొయ్యన నెక్కియు,
గ్రక్కున నాశ్చర్యంబునఁ బొక్కియు,
రాముఁనిదాదిని రయమునఁ గనుగొని,
భామిని యిట్లని పలికెను ఘన మని:

జంఝూటి : ఆదితాళము

ఏమది ! చెలి ! నామది ! కెఱిఁగింప వమ్మ ॥ యే మది ॥

భామినిరో ! పట్టణము నేమిటి కలంకరించి ॥ రే మది ॥

కానఁగను కౌసల్య దానముల నిచ్చుచున్న ॥ దే మరి ॥

చేడియలు నేఁ డేమొ వేడుకలు సేయుచుండి ॥ రే మది ॥

భూమిని శ్రీమోక్షగుండస్వామి దయతోఁ దెల్పు ॥ మే మది ॥

తోహర : త న్నడిగిన మంథర కా రాముని దాది యిటుల దానని యెఁ : బన్న

రాముని పట్టాభిషేకం బెన్నఁగ రే పన వినియెన్ ॥ రామ ॥ తందర నొందుచు మంథ

కైకేయి మందిరమునకును జేరి, క్రిందటి కసి దీర్చికొన సమయ మని దండడిపడి యాన

॥ రామ ॥

కేళీగృహమున డోలిక మీఁదను బాలపాన్పుపై జాల లీలతోడ బవళించియున్న

లేమ కనియె నవలీల ॥ రామ ॥

కళ్యాణి : ఆదితాళము.

సరోజసమానముఖీ ॥ భరింపఁగ జాల సఖీ ॥ సరోజ ॥

నరేశ్వరుం డరే । యరే । ధరిత్రి నెల్ల రాముఁడే భరింపఁ బరించెఁ బరోక్షం

నఁ ॥ సరోజ ॥

ననుఁ గనుంగొనుఁ బ్రియంబునన్ విభుం డనంగ నే దినంబుఁ ఘనంబుఁ

యుండుదుఁ ॥ సరోజ ॥

క్షమాధిపత్య మెల్ల నీ కుమారు డూన మోక్షగుండమాన్యుండు మీకుఁ బ్రమో

బిడుఁ ॥ సరోజ ॥

తోహర : నీ మీఁదను గడుఁ బ్రేమగలిగినఁ నీకొఁడుకును, బోనాడి రాముని కచ్చ

రాజ్యము దశరథరాజు కపటి వగలాడి ॥ రామ ॥

వ. అనిన విని కైకాదేవి మంథరను గనరివైచుచు నిట్లనియె ;

రామున కియ్యగ రా దటె । రాజ్యము, గోమలి ! నీకింత క్రూరత యెటు గ

॥ రాముని ॥

ఘనముగ గౌసల్య కన్నను మిన్నగ గనుచుండు నన్నును ; గడుగుణవంతుఁ

॥ రాముని ॥

ఈ మేలు వార్త నా కెఱింగించినందుకు ప్రేమతో ముత్యముల దాము నిచ్చెద గాను ॥ రాముని ॥

భరతున కైన నేమి! భరమోక్షగుండా రఘుపతునకు నైననేమి! యిరువు రొక్కటె నాకు ॥ రాముని ॥

వ. అనిన మంథర సహకటపటముచు నిట్లనియె:

తోహర: నీ సంతోషము నీటను గలియను! నీ సుతుండెక్కువ గాదా! ఈసు వహింపవు ఇంత మూర్ఖమా! ఇఁక నయినను వినరాదా ॥ రా ॥

పీలురాగము : ఆదితాళము

తల్లితల్లి! భరతునితల్లి! నన్నుగన్నతల్లి! వినుమాతల్లి! తెలిపెద ॥ తొల్లి నన్ను నీతోఁ గూడ మీతల్లిదండ్రులే దాసిగ బంపిరి ॥ త ॥ తడయక రాముని, ధరణిజను నీ కొడుకును గోడలు గొలువఁగ వలదా! ॥ త ॥ సవతి యయిన కౌసల్యకు లోఁబడి తివిరి దాసివై తిరుగవలదే నీవు ॥ త ॥ అక్షణమే వారిపక్షమగును పతి మోక్షగుండవిభుసాక్షిగఁ దెలిపెద ॥ త ॥

తోహర: భరతుని దేశప్రభుని జేయు మని వదునాల్గేండ్లడవులకు బంపుము రాముని, బంపు మనుచు నీవు నడుగుము! మేలు మనకు ॥ రా ॥

వ. అని త్రివక్రవక్రోక్తులు విని కైక యర్థాంగీకారంబుని—

కీర్తన : ఆదితాళము.

ఏ మని యడిగెద నామనోనాథుని రాముని గానకేమ కంపుమని! ॥ ఏ ॥ అది గితిబో ఏ న్నదలించును గాని, చెడుకార్యంబును జేయునటే సక్షి ॥ ఏ ॥ కైక మానస మెంత కఠినం బనుచును లోకులు నన్ననుకోకను బోదురా ॥ ఏమ ॥ స్వామినారాయణ రక్షకుఁడయి నట్టి మోక్షగుండేశుఁడె మోహన రాముఁడు ॥ ఏమని ॥

ద్వి: అని యిటు పలికిన నాకైకతోడ
ననియె నా మంథర యతిహర్షమునను:
యువతి! దేవాసుర యుద్ధంబునందుఁ
దవిలి యే తెంచియు దమకుఁ దోడ్పడఁగఁ

నింద్రుడుగోరిన, నేగెను దశర
థేంద్రుండు; నీవప్డు డేగితి వెంట;
రథచీల యూడంగ రణమధ్యమందు
రథచీలగా నీకరం బుంచి తబల!
నీదు ధైర్యమునకు నృపుఁ డలరారిఁ
నీదు కోరికదెల్పు, నే నిత్తు రెండు
వరముల ననియె: నీ వలన నేవింటి;
మఱచితి వీవు నే మఱువంగలేదు
ఒకదానికిని రాము నుగ్రాటవులకు
బ్రకటితంబుగఁ బంపఁ బదునాలుగేండ్లు
మఱియొకదానికి మన భరతునకుఁ
గరుణతో బట్టంబుఁ గట్టునట్లుగను
గోరుము నీకోర్కె కొనసాగువిభుఁడు
సేరవచ్చెడు వేళఁ జెచ్చెర వచ్చె

వ. మఱియు ——

బేగడ: ఏకతాళము

జవదాట కే చాసరో నామాట ॥ జ ॥ ధవళాక్షి నీకోపభవనము జేరుము ॥
అలివేణి! సొమ్ములలంకరింపకు; మలినాంబరము మానక గట్టుము ॥ జ ॥ క్రిందఁ బరుం
సుందరీ! నాథుని జిందరవందరచేయుము; నామాట ॥ జ ॥ మోక్షగుండేశుని
బల్కెద దీక్షతో నీకోర్కె దీరుసు; నామాట ॥ జ ॥

తోహార: అపుడు కైకదాసి యగు మంథర తన కుపదేశించిన కరణి, జపలతన
నలుపదలఁచి కోపసదనము జేరియు దయణి ॥ రా ॥

భూమిపయినిబడి పొరలుచు నుండఁగ భూమీశ్వరుఁ డేతెంచి, కామిని బా
గానక కావలికాని నడిగె వివరించి ॥ రా ॥

'కైక యేదిరా! కనబడలే దనఁ, 'గారణ మెఱుఁగను రాజా!' ప్రాకర
గోపభవనము చేరెను బరికింపుడు' మారాజ ॥ రామ ॥

క. ద్వారకుఁడు తెలుపఁగా నా
నారీమణివార్తఁ దెలిసి నరపాలుం డే
కారణమో యని పొగులుచుఁ
జేరగఁ జని దేహమును స్పృశించుచుఁ బలికెన్.

కీర్తన: ఆదితాళము.

ఇది యేమే! సుదతీలలామా! యిటు మళ్ళిచూడవే భామా! ॥ ఇది ॥
కోమలీ, నీ కింత కోపము గల్గుట కేమిలోపము వచ్చె ॥ నిది ॥
వెలలేనిచీరలు విడిచి యీరీతిగ మలినవస్త్రము గట్టు ॥ నిది ॥
కొమ్మరో! రత్నపుసొమ్ముల నొల్లక నెమ్మది వగవగను ॥ నిది ॥
మృదునుపుతల్పము వదలి యీనేలను సుదతి పరుండగను ॥ నిది ॥
శ్రీమోక్షగుండస్వామియె సాక్షిగ నీమాట మీరలేదే ॥ యిది ॥

తోహర. ఎవ రయినను ని న్నొగ్గులు పలికిన వివరింపుము నాతోను । భువిఁ జెలు లయినను, ఋషులు నైనను, బొరిగొందుసు వ్యథ మాను ॥ రా ॥

నిను మన్నించిన నిరుపేదల నైనను ధనికుల జేసెదను! నిను దూరినచో ధనికు లయిన నిర్ధను లగునటుఁ జేసెదను ॥ రా ॥

రామునిసాక్షిగ రమణిరో సీతల పై మయినను సేదిస్తు; భామినిరో! నా ప్రాణము లిమ్మని పలికిన నవి యర్పింతు ॥ రా ॥

వ. అని దశరథుడు ప్రతిజ్ఞగాఁ బలికిన వాక్యంబుల కలరి కస్పాత్తి చూచి తిన్నగా లేచి గద్గదస్వరంబున నిట్లనియె :

జంఝూటి-అటతాళము.

మాట దప్పను రామచంద్ర! కోటిసేయును నీదుగుణము భూమీంద్ర! ధాటిగా దేవ నిశాటులయుద్ధము నాటినరద్వయ మీనాడు నెరవేర్చు ॥ మాట ॥ ఒక్కదానికి భరతు నను గ్రక్కున బట్టము గట్టు కాదనకు తక్కక రెండవదానికి రాముని నిక్కడ నుంచక నిలువెళ్ళ నంపు ॥ మాట ॥

దండకాటవి కేగు మనుము; పండిగ బదునాలుగేం డ్లుండు మనుము; ఖండిత మిదియ నాకాంక్షితము; మోక్షగుండదేవుని యాన రెండవది కోర ॥ మాట ॥

తోహర: పిడుగువంటి యా నుడుగుకర్ణములఁ బడిన మాత్రమున నపుడు, గడ గడ వడకుచుఁ గడువడి మూర్ఛిల్లి పడియె బుడమిపయి నృపుడు ॥ రామ ॥ కొంతకాలము నకును దెప్పిరి తనచెంతనున్న కామినిని, యెంతయు గని తనమంతన మెరియగ జింతతో ననె నత్తఱిని ॥ రా ॥

ముఖారి—ఆటతాళము.

కలికీ! యిది యేమే! నాతో నిటు పలికి ఫలమేమే ॥ కలికి ॥

కలికి! రాముని దండకావనములకు బంపు మటంచు నాతో పలుకకయ. కఠినాత్మురాలా! పలుక నో రెట్లాడే నీకుఁ ॥ గలికి ॥

నిరతము బొగడుదువు రాముగుణనికర మెన్నుదువు; సరగనా కుపచారములు దానలుపు నాకౌసల్యతోడను। సరిగ ననుచుండుదువు నీ పీవఱకు, నది యిపు డేల మఱచితి ॥ కలికి ॥

ధరలోఁ దాళ్ళూరి నారాయణదాసు కడఁజేరి పరము లిడు శ్రీ మోక్షగుండ నివాసుఁ డెదలో మెచ్చ వలదా! భరతుఁ డిల నేలినను రఘుపతి పురములో నుండంగ దగడా ॥ కలికి యిది ॥

తోహర: అని యిటు భూపతి యతినిష్ఠురములనాడిన విని యా కైక, మనమున గోపము పల్లవిగొనఁగా మగనిమాట గైకొనక ॥ రామ ॥

యదుకుల కాంభోజి-ఏకతాళము.

ననుఁ గారింపక మానుమా! నాథా! నాథా ॥ నను ॥
మనమున నిసుమంత నిను నమ్మగా లేను ॥ నను ॥
వేళాకోళా లేలా! మేలా! మనుజాధిపాల! ॥ నను ॥
పలుమాటలచే ఫలమా! యిల బొంకుల మాని చాలు చాలు ॥ నను ॥

జలజాప్తాన్వయజాతుల్ దెలియ న్నప్పుల కైనఁ గలలో బొంకరు నీ వాకులజాతుండ, బలమర్యాద దలపోయంగవలదే ॥ నేఁడు నను ॥

'మన సొప్పింతు, బనిగావింతు, నిను మెప్పింతు, వినుమానింతు ననుచును మొదటన నని తెలిపిన వెనుకను విన సైపక వెతజెందెదవు ॥ నను ॥

నాకన్న మిన్నయౌకాంత లెన్న నీ కున్నవారు గా కేమి! యింక నీకా వరంబులో కైక యీను పో! కాద టంచుబో(ద్రోలరాదే! యీకపటము లేటు ఘటియించుచు ॥ నను ॥

నరగ మోక్షగుండేప సాక్షిగ శ్రీరామునకుర ధర యిటి నీ దేపులతో, జిరసౌఖ్యంబు దేలు। భరతుడు నేనును మేనుల్ దొరగెద; మా తరువాతస్ నిరంతరము సరాసరిగ జరించినను భరించెదరె। సరెసరే। ధరారమణ! ॥ నను ॥

వ. ఇట్లు కైక మాట్లాడిన కఠోరవాక్యంబులకు బదులు చెప్పటకు( దోచక దశరథుండు మహాదుఃఖాంబుధి మునుంగుచు నా రాత్రి నాలుగుజాములు నాలుగు యుగంబులుంబోలె( గడుపుచుండె. అంత నుదయమైన నక్కడ రాముపట్టాభిషేకమందిరమున కందఱు( జేరిరి.

ఉ. అంతట జానకీసహితు( డైన రఘూద్వహు( డగ్నికార్యము
త్యంతముదంబుతో నలుపునట్లుగ( జేసి వసిష్ఠమౌని ధీ
మంతునిజూచిపల్కెను: సుమంత్ర! ముహూర్తము వేళయయ్యె భూ
కాంతు(డురా(డు; కారణము గన్గొని యాతని( దెమ్ము వెంబడిన్.

తోహర: అంతవసిష్ఠుని, యానతిచేత సుమంత్రు(డంతిపురి కరిగి, యింతి, 'పిభు(డు సభ కేటికి రా'డన, నిట్లు కైక యనె( దిరిగి ॥ రామ ॥

బేహాగ్ : ఆదితాళము.

వినుము మంత్రివర్యా! కనకాద్రిధైర్య! ఘనగుణధుర్య! మన రాజు చర్య ॥ విను ॥ రామునిమీది ప్రేమతో రాత్రి యేమియు నిద్ర యెఱుగకయుండె ॥ విను ॥ ఈవరదనుక లేవ(గలేదు; కావున నీవు గడువడి(బొమ్ము ॥ విను ॥ భూమిపు( జూడ భువి మోక్షగుండధాముని రాము(డగ రమ్మనుము ॥ విను ॥

తోహర: 'రా జదేమికారణమున బలుకడు రాజీవాక్షిరో!' యన(గ; రాజు సెప్ప మన నే( జెప్పితి నింక రాముని రమ్మనుమనెగా ॥ రా ॥

కైక యిటుల బల్క(గను సుమంత్రుండు గదిలిపోయిరఘుపతిని, బ్రాకటముగ గని పదముల కెఱగియు(బలికె నపుడు నెమ్మదిని ॥ రా ।

కీర్తన : ఆదితాళము.

రామ! రమ్మిక రఘురామ! లెమ్మిక; భూమిపిభుని జూడగాను బోద మింపుగ ॥ రామ ॥ నిన్ను బిలువగ రాజు నన్నుబంపెగా, బన్నుగ నాకైకయింట నున్నవా(డుగా

॥ రామ ॥ తడవు సేయక ! రాఁ దగుసుమీ యిక ! బుధమి మోక్షగుండదేవ, పోయి చూడఁగ ॥ రా ॥

వ. అని చెప్పిన.

తోహర: అపుడు రాఘవుం డనుజ యుతంబుగ నరదమునారోహించి, విపుల వేగమున బితృసన్నిధికి పింతగాను జనుదెంచి ॥ రామా ॥

తనపాదములకు దండము పెట్టిన తనయునిలేవగదీసి, కనికరమున దా గాఢాలింగన మొనరించెఁ జేతుల గదిసి ॥ రా ॥

వ. అంతట.

క. హాహా ! యని దుఃఖించుచు
మోహంబున దశరథుండు మూర్ఛ మునింగెన్ !
ఆహా ! యీ దుఃఖంబున
కే హేతువొ యనుచుఁ గైక నినకులుఁ డడిగెన్.

వ. 'ఈ ప్రకారంబున నన్నుఁ బిలిపించి మహత్తరమయిన దుఃఖాంబుధిలో దశరథుండు మునుంగుచున్నాఁ డదేమికారణము తల్లి!', అనిన, రామునకుఁ గైకాదేవి యిట్లనుచున్నది.

కాఫీరాగము : ఆదితాళము.

రాజుదుఃఖకారణంబు రామ తెలిపెద ; దేజమరలనీకెచెల్లు దీనిదీర్పఁగ ॥ రాజు ॥ నాకు రెండువరము లిచ్చినాడు : పిమ్మట శోకమొందుచున్నవాడు చూడు మిచ్చట ॥ రాజు ॥ నరకములకు బాపి తండ్రి నరసి ప్రోచినవరసుతుండె పుత్త్రుఁడనగ బరగు జూచిన ॥ రాజు ॥ ఆడి తప్పలేక యున్నవాఁడు జనకుఁడు : నేడు మోక్షగుండ నగరనిలయ ! పలుకడు ॥ రాజు ॥

వ. అనిన రాఘవుండిట్లనియె.

యదుకుల కాంభోజి ; అటతాళము.

జనకుని కార్యము నలుపలేనట్టి యాజన్మ మేటికమ్మా ॥ జన ॥ జనయిత్రి ; యిట్టి జీవనము కంటె విషమైన ద్రాగుట మేలు ॥ జన ॥ రాజాజ్ఞయైన సీరాజ్యము నైనను భూజాత్ర మైన విడుతు ॥ జన ॥ మోక్షగుండపిపురాధి ...

తోహర: అనిన వాక్యముల కతిహర్షంబున ననియెఁ గైక రామునకు: దనయ! వరద్వయమున కొక్కటికిని: నిను బంపగ వనమునకు ॥ రామ ॥ కడమదానికిని పుడమికి భరతుని యొడయని జేయగ నడుఁగ దడయక ప్రత్యుత్తర మీయక దాబడి యున్నాడని నుడువ ॥ రామ ॥

వ. నీకుఁ బట్టంబు గట్ట యత్నించుచున్న రాజును జూచి భరతునకు బట్టంబు గట్ట మనియు, రాముని జటావల్కలములు ధరించి దండకాటవులఁ బదునాలుగేండ్లుండఁ బంప మనియు నేను గోరితిని, తొల్లి నాకిచ్చిన రెండు వరంబులు లే దన జాలక నిన్నుఁ బాసి యుండ లేక దుఃఖించుచు నీతో మాటలాడుటకు లజ్జించియున్నాఁడు. కాబట్టి పితృవాక్య పరిపాలనము చేసి కీర్తి వడయుము కుమారా! అనిన కైకమాటల కామోదించి రఘునంద నుండు——

ఆటతాళం: (రామకృపా) వలె.

పోయెద బోయెద బోయెద నాతల్లి! హాయిగ నే దండకాటవి జేరగ; భరతునకీ రాజ్యభార మర్పించియు బరువడి బితృవాక్య పాలన జేయగ ॥ బోయెద ॥ ధరణి మోక్ష సుండధాముని సాక్షిగ నరమరలేక నన్నంపు ముమ్మాటికి ॥ బోయెద ॥

వ. అని రాముడు బలుకుచున్న సమయంబున దశరథుండు మూర్ఛదేరి కుమారు నిం జూచి శోకావేశంబున—

తేవారము: హా! నాకుమారా? రామా! హా! త్రిలోకాభిరామా! ॥ మానుగ రాజ్య మిచ్చి మరల గైకొంటి హెచ్చి నేను భ్రాంతాత్మకుండ నీచ వర్తనుఁడఁ! జడుత గానలకు నీవ ననిన బ్రాణముల నిలుపఁ గలనా!

వ. అని పలికినఁ దండ్రికి నమస్కరించి యుత్తరీయంబుచేఁ గన్నులఁ నీరు దుడిచి దుఃఖ ముపనయించుచు రాముం డిట్లనుచున్నాఁడు.

కీర్తన - ఏకతాళం.

వగపేటికి నా తండ్రి! వనసీమకుఁ బనుపండి! తగ పదునాల్గేండ్లుండి తడయక వచ్చెద జండి! లెండి లెండి జగతీశ మాటమీఱ జూడకండి ॥ వగ ॥ తమ వాక్యముఁ బాలింపగ దల్లికి బ్రియమును గూర్పగ అమరుల కార్యము దీర్పన్ అట మౌనుల సేవింపన్ వేగగ బోఁగన్ సమకూరె నాకు గాన భావింపన్ ॥ వగ ॥

పర రాజ్యసుఖముకన్నన్ వనవాస మధికమెన్నన్ భరతుని ప్రభువుగ గొన్నన్ పాలించును గనుగొన్నన్; పత్తున్ జొత్తున్ ధర మోక్షగుండదేవు కృపయున్నన్ ॥ వగ ॥

వ. అని యిట్లు దండ్రిమారడఁ బలికి తత్క్షణంబున రామలక్ష్మణులు కౌసల్య మందిరంబున కరుదెంచినప్పుడు —

తోహర : శ్రీరామునకును క్షేమము గలుగగ గోరి బ్రాహ్మణుల కెల్ల, భూరిదక్షిణలు పొలుపుగ నిచ్చుచు బొదలుచుండె గౌసల్య ॥ రా ॥ ఆమెను గని సాష్టాంగ మొనర్చిన నాలింగన మొనరించి, ప్రేమ ముద్దుగొని ప్రియయును నన్నము వెట్టుద ర మ్మనగాంచి ॥ రా ॥

వ. నాయనలారా! నన్నుఁగన్న తండ్రులారా! ఆఁకొని వచ్చినారు అన్నంబు పెట్టెదఁ గడుపారఁ దిందురుగాక రండు! బంగరుకొండా! ఖండిత ఖండేందు ధరకోదండా? యనిన నమ్మకుఁ జిన్న నుపూరుం డిట్లనియె.

శహన : రూపకతాళము.

దండకాటవులకు బోదుఁదండ్రి యాజ్ఞను ॥ నేదండ ॥ దంత మిదుగో! సెలవొసఁగుము, దండిగ భూమండలి కధిపుం డట భరతు డింకనే ॥ దండ ॥

కైక తల్లి గోరెనిట్లు కన్నతండ్రిని : శోకదప్ప దమ్మ నాకు వ్యాకులమున శోకింపగ నీ కేటికి నూఱడుమా ॥ దండ ॥ ధారుణి శ్రీమోక్షగుండ ధాముని కృపను జేరుదు బదునాలుగేండ్ల; కారూఢిగ నీ రాజ్యమపారంబుగఁ బాలించెద ॥ దండ ॥

వ. తండ్రి యానతిచే నిండిన వేడ్కతో దండక వనమునకేగి పదునాలుగేండ్లుండి మిమ్మట వచ్చెద నవార్య ధైర్యంబున నారాక కెదురు చూచుచుండుము తల్లీ! యాశ్రితజన కల్పకవల్లి!

తోహర : శ్రీరాముం డిటు చెప్పిన పలుకులు చెచ్చెర కర్ణములందు, నారసముల వలె నాటిన మూర్ఛిల్లి నాతి తెప్పిరిలి కుంద ॥ రామ ॥

హిందూస్థానితోడి - ఆటతాళము.

అయ్యయో! యెటువిందును! హావిధిని నేమందును! నియ్యెడనెటు నుందును! యెటుల మఱచి యుందును! ॥ అయ్యొ ॥

భరతుఁడు ప్రియుఁడయినను బట్టము గట్టినను బురము విడిచి నిన్నటు బొమ్మనగ నేటికి ॥ అయ్య ॥

మోక్షగుండనివాసుని సాక్షిగ నిను బాసి నే నీక్షితి నెటు లోర్తును! ఏది దిక్కని జూతును ॥ అయ్య ॥

సీ. పన్నెండేండ్లు నీ చిన్నారి నెమ్మోము
ఎన్నఁడు జూతురా! కన్నతండ్రి!
నాయన్న! నాకూన! నాపట్టి! యని యింక
నెన్నడు పిలుతురా! చిన్నితనయ!
సూపాన్నపాయసాపూపశాకాదు లిం
కెన్నఁడు నిడుదురా యుద్ధచరిత!
అమ్మా! యటంచు నెయ్యమ్మున నను బిల్వ
నెన్నడు విందురా నృపకుమార!

గీ. కంటకశిలాదిదుర్గమ కాననముల
నిడుమలం బడ నెట్లు సహింతు పన్న
కంటఁ బగవట్టి యీకైక కారణమున
బాపురే! బ్రహ్మయిటులెడబాపె మనల.



### కీర్తన. పీల్‌రాగము అటతాళము.

నినుఁ బాసి మే నెట్లు నిలుపుదు సకటా! వనముల దిరుగ నేవత్తు నీవెంట ॥ నిను ॥ ప్రియురాలిమాటకు బ్రియుఁ డొప్పి నేఁడు భయవిపినముల వెంబడి బంపినాఁడు ॥ నిను ॥ నిను సదృష్టశాలి యని గురుఁడనియె జనన కాలమున; నిశ్చయము గాదాయె ॥ నిను ॥ నోము లెన్నెన్నియోనోచి కంటినిరా! యీమేలు సవతి సహింపదాయెనురా! ॥ నిను ॥ మఱిమోక్షగుండేశుఁ డరిగంట నరియ వెఱపులు గలిగె యీ వెతలాయెఁ దనయా ॥ నిను ॥

ద్వి॥ కైకకు వర మిచ్చు కారణంబునను
నాకూర్మితనయ, కానసనీమలకును,

బో మ్మనుచున్నాఁడు, భూపతి నేఁడు;
నెమ్మది వల దని నేనుజెప్పితిని :
నామాట విందువో ? నాయనమాట
యే మఱి విందువో ! యెఱిగింపవయ్య !
తల్లితో సరిగాదు తండ్రియు గుపవు,
నిల్లు విడిచి పోవ నేటికి వినుము :
చినవేని నేనింక విశ్వంబుమీఁద
మనియుండుటే కల్ల మఱి మఱి చూడు ॥

ఉ. ఎక్కడఁ ! గైక ! యావరము లెక్కడఁ ! గానసలం జరింపని
న్నెక్కటి ! పొమ్మటంచు నృపు డంపుట యెక్కడ ! నీవు పోవ
ఎక్కడ ! చాలు నాభరతుఁడేలనరాజ్యము నేలుగాక, నీ
వెక్కడి కేగఁబోకు; మనయింటనె నిల్వుము నిర్భయంబుగన్.

సం-త్రో : అనుచవ్వాడు దన యనుజాతుఁడు విని, యతిశౌర్యంబునలేచి
జేకొని తల్లియు నన్నయు వినఁగ ననియెఁ జేఁజాచి ॥ రాము ॥

లక్ష్మ - బేహాగ్ : ఆదితాళము.

నాసొంపుపెంపు జెంపు గను రామ ! నిలింపులైన నడ్డమే శ్రీ రామ !
వచ్చిన గుణధామ ! కనులఁ గెంపు లొల్క ద్రుంతు మేఘశ్యామ ॥ నా ॥

భరతుని దశరథుఁగూడ బట్టి, వారిబందుఁగు లంచరితోడ బట్టి పురము
వెళ్ళఁగొట్టి నేనరయుదుఁ బట్టము నీకు గట్టి ॥ నా ॥

ఇల నీ కభిషేకము గాకుండ వేగ వల దన్న వారిఁబట్టి కఁడఁలొలుతు;
మోక్షగుండపురనిలయ, సకలదిశల వెలయుచుండ ! ॥ నా ॥

వ. అని విపులోగ్రమహోగ్రహసమగ్రుండయి నిగ్రహంబున నగ్రజుని
భాగంబున నిలిచి పలికిన లక్ష్మణుని వాక్యంబుల కలరి కౌగిలించుకొని యుపశాం
రాఘవుం డిట్లనియె

తోహర; తమ్ముడ, నీవంతటి శూరుడవే నమ్ము ! వెళగాదిపుడు; సమ్మతి
క్షణభంగుర దేహమ్మున నమ్మకు మెపుడు ॥ రాము ॥

సారహీన సంసారములో బడి శాశ్వతమని నమ్మెదరు! సారెకు బుట్టుచుఁ జచ్చుచు
... జనులు భ్రమలఁ బడియెదరు.

బేహాగ్ : రూపకతాళము.

ఏదియు నిజ మనుచు నమ్మరాదు వినుము సోదరా! వాదమేల నింద్రజాలవంతు
! సోదరా! ॥ యేది ॥ ...యము బొందు స్వచ్ఛంద వనితాదివిషయభోగము లనయము
...సౌదామిని విధమున దెలియుము ॥ యే ॥

కాలినలోహమున జలకణముపడి నశించిన పోలిక ప్రతిక్షణ మాయువు పోవు దెలిగి
...న ॥ ఏదియు ॥

సత్య మయినమోక్షసుందర్యము మెఱుక లేకయు మృత్యుపాశైయమబాధ మిణుకు
...లెఁ గాద ॥ యేదియు ॥

ఆ. పాము నోటఁ బట్టుపడియుఁ, సీఁగను గప్ప
తినగఁ బూనినట్లు, దినముఁగాల
మనెడు పాము మ్రింగు టరయక యస్థిర
భోగములను బొందఁ బూనుచుండ్రు.

క. కలవంటిది స్త్రీభోగము;
మిగిలియు మైనీడ సమముగద! యౌవనముఁ
జలబుద్బుద తుల్యం బగుఁ!
దెలియక జీవులు భ్రమింతు స్థిరమని యనుజా!

క. దేహాత్మబుద్ధి కతమున
మోహించిన జనుల కెట్లు ముక్తి లభించున్!
దేహికిఁ గామక్రోధవి
మోహాది విసర్జనంబె మోక్షమనంబడున్.

తోహార: క్రోధముచే నడగును మోక్షంబును; క్రోధముచే మద మలరు;
...ముచే హితగురు పితృభ్రాతలఁ గూల్చుతలపు మదిమెలఁగు ॥ రా ॥ క్రోధముచే
...గూడును విస్మృతి; క్రోధమె ధర్మక్షయము; క్రోధము వదలిన గోరిక లెల్లను గొన

సాగును నిదినయము; ॥ రామా ॥ సంతోషంబే నందనవన మగు; శాంతి కామధేనువగు శాంతివహించిన సజ్జనపాళికి శత్రువులెవ్వరొయెఱుఁగుము ॥ రా ॥

క. కావున దేహేంద్రియముల
కావల వెలుఁగొందు నాన్వయంజ్యోతిని సం
భావించుచు నారబ్ధము
వేవేగమె ప్రాజ్ఞుఁ డనుభవింపఁగవలయున్

గీ. ఎంతకాలముతన్నుఁదా నెఱుఁగ లేఁడొ
యంతదాఁక భ్రమించు దేహాదులందుఁ
గాన నయ్యాత్మనెఱిఁగినవాని నెందు
ద్వేషరాగాదు లంటఁగా వెఱచువత్స!

తోహర : అనుజాన కీరీతిని బోధించియు నాతలికి నిట్లనియెన్ : ననుదీవనల్ వనముల కనుపుము; మనమున వగవకుమనియెన్ ॥ రా ॥

వ. ఇట్లు పలికినఁ గౌసల్య సమ్మతించి యరణ్యావాసంబులందుఁ బ్రయాసమ్ము లేకుండునట్టుగఁ ద్రిమూర్తులు నిను రక్షింతురుగాక యని దీవించె. అపుడు లక్ష్మణుఁడన్న కిట్లనియె :

ఆదితాళము : తంగంమెట్టు.

శ్రీరామచంద్ర ! కారుణ్యసాంద్ర ! ధీర ! నాసంశయము రాఘవాతీఱెను నిశ్చయము ॥ శ్రీరా ॥ నీసేవమాని నే నుండలేను : నీ వెంటనే వత్తును రాఘవా ! నీవు వద్దనబోకుము ॥ శ్రీరా ॥ రావలదన్ననుప్రాణములొల్లను : వే వేగ మోక్షగుండ రాఘవా ! దేవర ! నీసాక్షి ॥ శ్రీరా ॥

వ. అనిన రాముఁడు సమ్మతించి యీవార్త దెలుపుటకు సీతాదేవిగృహంబున కరిగె. ఆయమ్మ యర్ఘ్యపాద్యంబు లర్పించి యిట్లనియె.

తోహర : శ్వేతచ్ఛత్రము, వివిధవాద్యములు, వెలయఁ గిరీటాదులును, ఖ్యాతిగ వదలి యొకండ పిటుల రా హేతువు వినవలె నెనెను ॥ రా ॥

రా-తోహరి : దండాకాటవికిఁ దరలవలెను మాతండ్రి యాజ్ఞచే నబల! పండిన మాయత్తను సేవించుచు నుండుమింట బహువిధుల ॥ రా ॥

వ. అనిన.

క. 'ఏకారణమున భూవిభుఁ
డాకానల కేగు మనుచు నాజ్ఞాపించెన్?
నాకును వివరింపు' మనం
గాకుత్స్థకులుండు తెలిపెఁ గాంతామణితోన్.

చ. భరతున కున్ ధరాతలము బట్టముఁగట్టి నన్నుఁ గాననాం
తరములనుండఁ బంపఁగను దద్దయుఁ గోరిన, దమ్మ కైక భూ
వరుని వరద్వయమ్ము తఁడు సంపురి సూనృతధర్మమూఁది యా
వరములనిచ్చె; నేనరిగి వత్తు నిటన్ వగఁ దక్కియుండుమా!

వ. అను సీత యిట్లనియె.

శంకరాభరణము : ఆదితాళము.

నా నాథ మీమాట యాశ్చర్య మయ్యెడి గానల నీ వుంటె నేనింట నుందున ॥ యానా ॥ ఇట్టుల మొకచోట, నొద్దిక నుండము; వట్టిది పోనుము! వచ్చెద నీవెంట ॥ యానా ॥ పతిసేవ కన్నను సతికి గతులేవింక? నీక్షితి నారాయణకవినుత, మోక్ష గుండేశ ॥ యానా ॥

వ. అనిన శ్రీరాముఁడు,

తోహరి : కంటకంబులును కఠోరశిలలును, గలవు నడువగా లేవు, వంటక మెప్పుడు ఫలములు దుంపలు భక్షింపఁగ లేవు నీవు ॥ రా ॥

ఘోరరాక్షసులు క్రూరమృగంబులు గుమిగూడునటవులను : నారీమణి : కాననములకును రానేర వింటనె నిలుము ॥ రా ॥

హిందూస్థానితోడి - ఆదితాళము.

గడియయయిన గాని మిము విడువఁగజాలఁ బ్రియా! అడవుల యది యింద్రభోగ మగు ॥ గడి ॥ మీ రారగించినంత మిగిలిన ఫలమూలా నవి యమృతోపమాన మగు ॥ గడి ॥ తమతోడ సంచరింప దర్భలు కంట లేక మృదువులయి రాజిల్లుఁగాదే యిక ॥ గడి ॥ వేరాక మాన నీఁక నా ధారుణి మోక్షగుండధామ శ్రీరామరామ ॥ గడి ॥

క. మును జ్యోతిష్కులు పలికిరి:
'తనపతితో నడవికేగు ధరణిజ' యనుచున్;
నను రా నియ్యనిచో నా
ఘను లాడిన మాటలెల్లఁ గల్లలుగావే!

స్రగ్విణి: నన్నురా నీయకే, నాథ, మీ రేగినన్
బన్నుగా దేహమున్ బాయ కెట్లుందు! నా
పన్నసంరక్ష, నాప్రాణముల్ నిల్పవే!
తిన్నఁగా నాదు సందేహమున్ దీర్పవే!

సంధి-తో: ఈమాడ్కిని సతి వేమఱు వేడిన రాముం డిటు నీమది గనుటకు నేనంటినిగా నిన్నుబాయఁగలనా ॥ రా ॥

దండకాటవికిఁ దఱలి నావెంబడి, యండజాక్షి! నీవు రమ్మ! రుంధతికి హారములు దగ నుపాయనము లిమ్మ ॥ రా ॥

వ. ఇట్లు సీత వచ్చుటకుసమ్మతించి వేదవిదులగు బ్రాహ్ సమస్తజనంబులకును దరిద్రతా హతంబగునట్లుషోడశమహాదానంబు లవ లక్ష్మణు లిచ్చిరి. సీతా కౌసల్యా సుమిత్రలు నరుంధతి లోనగు సువాసినుఁ దానంబు సేయుచుండిరి, అప్పుడు —

సం-తో: త్రిజటాఖ్యుఁ డగు ద్విజుఁ డొక్కండు దరిద్రంబున కుటుంబమును నిర్వహించుకొన నేరక యన్నాతురుఁడై ॥ రా ॥

గీ. హాలికవృత్తిని జీవన మాచరింపఁ
దలఁచి గుద్దలి నాగలిఁ దలనుమోచి

కొనుచు నేగి, స్వయంకృషిఁ గోరి చేయు
సతని యిల్లాలు త్రిజట మచటి కరిగి.

కీర్తన : త్రిశ్రజాతి - (సతతంబున) పలె.

ప్రాణనాయకా! ఫలమేమి నీ కిక । ప్రా ॥
మేను కుడిపడఁగ మిగులశ్రమల సలయఁగ నేటికి ॥ ప్రా ॥
అగ్రజాతిని బుట్టి యస్యవృత్తినిఁ జొచ్చి తీ గ్రహచారము నే మందునయ్యయో! ॥ ప్రా । శ్రీరామచంద్రుండవారిగ దానము లీరాత్రి విప్రుల కిచ్చుచున్నాఁడట ॥ ప్రా ॥ నీ పేరు వివరించి! నీ లేమి వచియించి, మాపేరు వివరించి మఱియు యాచింపుము! ॥ ప్రా ॥ శ్రీమోక్షగుండేపఁ ధామహానీయుడు; నీమనోభీష్టము నెఱవేర్చఁ బోవొయ్యి ॥ ప్రా ॥

సం-వ. అని పలికిన భార్యమాటల నెయ్యకొని.

క. వృషసాయుపుఁ బనిముట్లను
నపతలఁ బొఱంగవైచి యాతురమున రా
ముని లక్ష్మణు లుండినయెడ
కననీసురవర్యుఁ డరిగి యతివినయమునన్.

కీర్తన : ఆటతాళము

రామచంద్రమహాప్రభో : నా మొఱ ప్రేమతో వినుమా ॥ రామా ॥ నే మహీసురుఁడ నిత్య దరిద్రుఁడ స్వామి త్రిజటుఁ డను నామము వాడను! దారపుత్రులకున్ నిరతము కోరినట్టుగను గూడును గుడ్డయుఁ గూరిచి పెట్టుట భారమయ్యెను ॥ రామ ॥ నాదరిద్రము దీరగ నను రాదరించి యిష్టార్థపదార్థము లీఁ దగు మోక్షపురీశ వేడెదను ॥ రామ ॥

వ. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె :

తోడు : అన్ని పదార్థము లయిపోయిన వెనక, నావుల మందలు గలవు; సన్నగఱ్ఱ తిని యివ్విసంతివఱ కిచ్చెద గైకొనగలవు ॥ రా ॥

సీ. కుడిభుజమ్మున వ్రేలు కొల్లాయిగుడ్డను
బిఱబిఱ నడుముపై బిగియ గట్టి,
దోవతిపై కెగఁ ద్రోసి జుట్టు విదిర్చి
కుఱుచగా శిఖ ముడి గుదురవైచి,
ప్రాణానిలములు నరమ్ముల బిగఁబట్టి
పాణియం దొక్కపాషాణ మూని,
కేక వేసియుఁ బిడికిలిబెట్టుగాఁ ద్రిప్పి
యెదమీఁద జందె మ ట్టిట్టుఁ దూలఁ,

గీ. నెమ్మదిని రామమూర్తిని నిలిపి పొగడి,
జూచువారలు రాముండుఁ జోద్య మందఁ,
బ్రదుకుజీవన మిది యని బ్రాహ్మణుండు
తనబలంబున సరయువు దాఁక వైచె.

వ. ఇట్లు త్రిజటుండు సరయువుదాఁక రాయివేసి యంతపఱకుండు నాఁ...
రాముం డచ్చెరువొంది యిట్లను చున్నాఁడు :

తోహర : పన్నుగ మొదవులఁ బడిసూర్లిచ్చెద, బాపడ, కోరుమునం... ,
నకు నతిశయ మగున ట్లిమ్మన్న, నిచ్చె పను ఘంగక ॥ రామా ॥

వ. అవి యన్నియుఁ గొని సంతోషంబున దారాపుత్రులం గలసి తు... ...
జని సుఖం బుండె, అనంతరంబున ధనుర్బాణ ధరులయి రామ-లక్ష్మణులు ...
కాంతారంబునకుఁ బోవ నిశ్చయించి యనుజ్ఞకొఱకుఁ దండ్రిగృహంబున కరుగుచు...
జనంబును గటకట పడుచుఁ దమలోన —

హిందూస్థాని : రూపకతాళము.

కైక కోరిన వరము లెంత శోకకరములు! పీనవెటుల దిరుగుదురు ...
॥ కై ॥ సీత సుకుమారి నడవఁ జేత గాదుగా! ధాత్రవ్రాత వాప నేరితరము గా...గా
ఈ క్షితి దప్పింపవలెరి యెవ్వరైనను! మోక్షగుండవర నగరాధ్యక్షుఁ డయినను ॥ ...

వ, అని పరస్పరం బాడుకొనుచు వగచు పురజనుల దుఃఖ నివృత్తి ...
దేవుండను ముని యిట్లనియె :

తోహర : మునుపు దశరథుఁడు దనసుగూర్చి తప మొనరింపగ హరి మెచ్చి, కనబడ నీ కేమి కావలె నన నీవు దనయుఁడ వగు మననిచ్చి ॥ రా ॥ రాజు కోర్కె దీరగ నుదయించెను ; రావణాదులను ద్రుంచు, దేవ మునుల ముని దేవతలను నూరార్చి వేగ బాలించు ॥ రా ॥

ఆదితాళము: (పరమపురుష) వలె.

ఆదినారాయణుఁ డగు నీ రాముఁడు ; నాదిలక్ష్మి సీతయని కనుడు ఆదిశేషుఁడే యగు లక్ష్మణుఁడు । మేదిని బుట్టియు మెలగుచుండు ॥ ఆ ॥ కరుణ తోడ మీన కమఠ వరాహ నరహరి శ్రీవామన పరశురామ వరరూపము లివలను దాల్చి రఘువర తనుపిప్పుడు వడసెను వహా ॥ ఆది ॥ అక్షయు ప్రకృతినిలక్షణుఁడీతడు ; మోక్షగుండపుర రక్షకుఁడు : రాక్షస గణముల శిక్ష యొనర్పగ నీక్షితి బహురూపు లెత్తుచుండు ॥ నా ॥

తోహరి : ఇతని గూర్చి మీ రేల వగచెదరు ! ఇతడు పరాత్పరుడనుచు, సతతము దెలిసియు, సన్నుతి సేయుడు సద్గతి నిచ్చుచు మనుచు ॥ రా ॥

తోహరి : అనవుడు, రాము మహాత్మ్య మెఱిగి యూజనులగ్గించిరి యంత ; జనకుని పలుకులను గౌనజని కైకను గని పలికెను నాకెంత ॥ రా ॥

క. సీతాలక్ష్మణయుతముగ
నాతల్లీ ఘోరమౌ వనంబులకును నే
నీతఱి వెడలుదు ; నీసుడి
నాతండ్రికిఁ జెప్పవచ్చి నాను గదమ్మా !

ద్వి. అని యిట్లు చెప్పిన నాకైక లేచి
మునముగా రామ లక్ష్మణసీతలకును
నారచీరలు దెచ్చి నాతి వేర్వేఱ
నారల నిచ్చిన వరుసతో నంది
రామ-లక్ష్మణులు వస్త్రములు వర్జించి
శ్రీమీఱ దాల్చి రా చీరలు సీత
సట్టంగలేకున్నఁ గాంచి రాఘవుఁడు

వనితలు మొదలైనవారు దుఃఖింప
గని వసిష్ఠుఁడు పల్కె గైకతో గనలి ___

తేవారము : ఏమి దుర్మార్గురాలా! ఇంత కాఠిన్యమేల!

రాముబాయంగ లేక రమణీ పోవంగఁ గైక! భూమిజకు జీరలిడగఁ బోలునే నీకు నడిగ నీముఖం బరిసినంత నిరయ మే తెంచుఁ గాంత ॥

కన్నడరాగము : రూపకతాళము-

ఇది న్యాయ మౌనె నీకుఁబాతకి ॥ యిదిన్యాయ ॥ ఇటుఁ జేయ లోకదూష్యమని తల పోయలేక కావించితి ॥ ఏదినా ॥ మిడిమేలమేల యింత! సరపాల చంద్రునకును ననుకూల పతిపి గాక! ఏది జాలినొంద గావించితి ॥ ఏది ॥ రఘువీరు బాయలేము; చనుదేరగలము వెంట మనసార నందుమీాద బాటూరిలోన నీ వుండుము ॥ ఇది ॥ తనతండ్రితోడ గూడి, ధరితుండు మోక్షగుండపతియుండఁ జెఱుగాక! నీ వుండుచోట దానుండునే ॥ ఇదినా ॥

వ. అని వసిష్ఠుండు కఠినముగా, బలుకుచు ధరాపుత్రి దుకూలాలం బరాభరణంబులు ధరించి పోవునటుల నిరూపించె. అంత రాజు కైక దిక్కుఁజూచి శోకకోపంబులు మల్లడిగొన నిట్లనియె.

హిందూస్థాని, తోడి : రూపకము.

అడిగియుంటివా? నన్నడిగి ॥ పుడమిజాత లక్ష్మణుల నడవి కనుపగ ॥ నడిగి ॥ హానివృద్ధులు గాన వైతివయ్యయో! మానుషాకారమున నున్న దానవురాలా ॥ అడిగి ॥ చీర లియ్యగా నీకు జేతు లాడెగా నారి, మోక్షగుండపురనాథు సాక్షిగ ॥ నడిగి ॥

తో: అని నిష్ఠురముల నాడి భూషణములును మేటి దువ్వలు వలువు, జనకజ కొప్పించిన ధరియించెను దనపతి యను మతమునను ॥ రా ॥

వ. అంత సీతా-లక్ష్మణ సహితంబుగా రాముఁడు మున్నూట యేఁబది మంది తల్లులకుఁ బ్రదక్షిణ నమస్కారము లాచరించి సుమిత్రంజేరి నిలిచిన, నామె దుఃఖ సంతప్త మానసయై ఊరడపలికికొని లక్ష్మణున కిట్లనియె :

క. రాముని దశరథునిగఁ గను;
భూమిజ నను గాఁగ గనుము; భూరివిపినముల్

తోహర: పడుపడ పసి భూపతిని గాంతలను సదనంబులకును ——,సదయత నల కౌసల్యాదులఁ దా విదితుఁడగుచు నూరార్చెఁ ॥

వ. అంత నయోధ్యకుఁ గ్రోశమాత్రంబుననున్న తమసానదీ తీరమునకు నారాత్రి శ్రీరాముఁడు సేరి, యక్కడ విశ్రమించి తనతోవచ్చిన పురజనులఁ గని యిట్లనియె:

తోహర: భరతునిఁ గొల్వుఁడు! పురిని జేరుఁడు! బహుదూరము వచ్చితిరి! బడుపడి బొందని, పలికిన, రాముని బాయమి వారిట్లనిరి ॥ రా ॥

రూపక తాళము: (తావమొందగ) వలె.

మిమ్ము బాయగజాలము మేము వత్తుము రామ నెమ్మదిలో వెంబడిరా నిమ్ము వేగము ॥ రామ । మిమ్ము మీరు విహరించినచోటే యూరగు మాకు రామ ! మీరులేనట్టిచోటే కారడవి మాకు రామ ॥ మిమ్ము ॥ భరతునితోఁ బని మాకేల । బట్టణమేలా రామ ! తరుణీసుత భ్రాతృధన ధాన్యము లేల ! రామ ! ॥ మిమ్ము ॥ కూతరావద్దన్న, మోక్షగుండనాయకా, రామ ! నేడు మాప్రాణములు మేననిలుచు పోక రామ ! ॥ మిమ్ము ॥

వ. అనిన వారల నిశ్చయం బెఱింగి వారి నేమఱించి పోదలంచి యాకేటుకు సుమంత్రునికిఁ దెలిపి యందఱిని శయనింపుఁడనిచెప్పి చొక్కుజల్లినట్లుండఁబు నిద్రించుచుండ.

తోహర : అర్ధమురేయిని ననుజాదులతో నరదమునారోహించి, తద్దయు సాకేతము నకుఁ బోయెడు దారిఁ బట్టుకొని నడచి ॥ రామ ॥

ఇంకొకదారిని నేగిరి యడవికి నెవరి కెఱుకపడకుండ శంకలేక దమసానది దాటిరి నరయుపుదాటిరి యిచట ॥ రామ ॥

వ. ప్రాతఃకాలంబున——

ఉ. పౌరులు మేలు కాంచి రఘువర్యుని గానక చింతనొంది తా
మారథనేమిమార్గమును నారసి చూడ, నయోధ్యదిక్కుగా
బారినయట్లు తోఁచిన, శుభం బని యూరికిఁ బోయి, రాముఁడు
జేరమికై పగంబొగిలి చెచ్చెఱనిండ్లకుఁ జేరిరందఱుఁ

తో : అంతట నాసాయంత్రికి గంగాప్రాంతములకు వారు జన సంతసమున నచ్చట

క. ఫలములుఁ బువ్వులుఁ దేనెలు
వెలమిని గానుకలు గొనుచు నెదురుగఁ జనినా
గిలిపడి దండము లిడి శ్రే
పలభయభక్తులొదవ రఘుపర్యున కనియెన్.

ఉ. నేను నిషాదపర్యుఁడను; నిక్కముదెల్పెద: శృంగిబేరసం
స్థానము నేలుచుందును సజ్జనవంద్య! గుహాభిధానుఁడన్:
గానలకేగ మీరటకు గ్రక్కున వచ్చుటెఱింగియుంటిగా
నా నిలయంబునన్నిలిచి నన్నుఁ గృతార్థునిఁ జేయుదేవరా!

అటతాళము: (ఒకదివ్య) వలె.

స్వామి! నాజన్మము సార్థకమాయె! ఘూమిపై నాపాపములు గూలిపోయె ॥ స్వామి ॥ ఈనిషాదరాజ్య మేలుము దేవా! నేను నల్పుచు నుండు నీపాదసేవ ॥ స్వామి ॥ కంద మూలాదులు గలవు మాయింట విందుగా గొనుము సేవింతు నీబంట స్వామి। మోక్షగుంత ధామ। మునినుతనామ! సాక్షాన్నారాయణ రక్షశ్రీరామా! ॥ స్వామి ॥

వ. అనిపలికిన గుహుని వినయవాక్కుల కలరి రాఘవుం డిట్లనియె:

ఉత్సాహవృత్తము.

దండకాటవులకునేగి, తాపసులను గూడి నీ
వుండు మనుచు దండ్రి వనుపనొప్పి వచ్చినాడనే
నుండఁ దగదు గృహములందు, నూళ్ళయందుఁ గావునన్,
ఖండితముగ నేటిరాత్రి గంగదరిని యుండెదన్.

వ. ఇట్లు తెలిపి సీతాసహితంబుగా జలప్రాశనంబుఁజేసిగుహునిచే నిర్మింపఁబడిన కుశపర్ణాస్తరణంబున శయనించి నిద్రించుచుండ లక్ష్మణుండు ధనుర్బాణధరుఁడయి శ్రీసీతారామచంద్ర గురుపునారాధించుచుఁ బదునాల్గేండ్లవఱకు నిద్రాహారములు వర్జించియుండ నిశ్చయించి నిద్రాదేవిని స్వాధీనము చేసికొని, తానుసుఖుల నయోధ్యకుఁ జేరునంతను నూర్మిళ యందు రెట్టింపుగా నుండు మని యాజ్ఞాపించి రామునికి వచ్చినయిడుముల గుఱించి గుహునితో నిట్లనుచున్నాఁడు,

కాంభోజ : ఆదితాళము.

ఎంత చెల్పుదురా సఖా! వీరలకష్ట మెంతని కాంతును నిక ఇంతకు మూలముకైక ; వంతలపాల్ సేసె గదరా ॥ యెంత ॥ కాంచన పర్యంకమున సుఖముగ శయనించు వీరి కంతలోన నెంచగ నీ నేల బవళింపగవలసెనయ్యో! ॥ యెంత ॥ పట్టుపీతాంబరములు శృంగారముగఁ గట్టి యుండెడి వీరలు, నెట్టననారచీరలు గట్టవలసెనయయో! ॥ యెంత ॥ ఎండ కన్నెఱుగరుగా! శ్రీకర మోక్షగుండవాసుని సాక్షిగ దండిగ గాఱడవుల నుండవలసె నయ్యో ॥ యెంత ॥

వ. అను లక్ష్మణుని దీనాలాపంబులు విని గుహుఁ డిట్లను చున్నాఁడు :

తోహర : పూర్వజన్మకృతపుణ్యపాపమునఁబొదలును సుఖదుఃఖములు ; సర్వము నడుపగఁ జను జీవులకును స్పష్టమివియు స్వకృతములు.

అనుభవింపకయు యజునకునైనను నాముక్కంటికినైన, ననువుగ నారాయణమూర్తికినైనను దప్పనె భువిలోన ॥ రా ॥

క. వగ లరుగ రాత్రి, నిశివో
వఁగఁ బగలును వచ్చునట్లు, వరసౌఖ్యము వో
వఁగఁ దుఃఖము, దుఃఖము వో
వఁగఁ సుఖమును జీవతతికి వచ్చుచునుండున్.

క. జలమును బంకము నొకటిగఁ
కలిసి యభిన్నముగ నున్నగతి సుఖ దుఃఖం
బులు రెండు గూడి యుండియుఁ
బొలుపుగ నే దయిన నొకటి పొందును దేహీ.

అ-తోహర. కావున సుఖదుఃఖములను సమముగ భావింతురు ధీవరులు ; భావము లోపల నీవు వీరికొఱకై వగవను మిక జాలు ॥ రామ ॥

అని వారిరువురనుకొనుచుండగ నంత తెల్లవాఱగను. జనక తనూజానహితముగను రామచంద్రుడు మేల్కని తగను ॥ రామ ॥

తో : వాల్మీకుండను వరమునిచంద్రుఁడు వారల గనుగొనెనంత ; చెల్మిని లక్ష్మణ సీతా రాములు నెలగి మ్రొక్కి యని రంత ॥ రామ ॥ తండ్రియాజ్ఞచేఁ దఱలి వచ్చితిమి దండకావనికి నడుగ ; దండిగ నొన్నాళ్ళుండఁగ నుచిత మగు తావు దెలుపు డన నరిగి ॥ రామ ॥

వాల్మీకి - ఆదితాళము (నీవను) వలె.

నీ వుండనితావు లేవి! యేవి! నీవెఱుంగనితావు లేవి! యేవీ! ॥ నీ ॥ స్థావర జంగమస్థలములలోపల వేవేగంబున వెతకిన గానీ! నీవుం ॥ అంతర్బాహ్యములందు నాది మధ్యాంతరహితమై యలరుచుండి ॥ నీవుండ ॥ నానామౌనివితానహృదయ సంస్థానంబున విజ్ఞాన రూపమై ॥ నీవుం ॥ మోక్షగుండపురిరక్షణ ప్రకృతి విలక్షణ యంతర్లక్ష్యవశ్యమై ॥ నీవుం ॥

క. ఏనామస్మరణంబున,
నేనమలుఁడ నైతినో! గణింపఁగ నదియే
నీనామసత్ప్రభావము
దానిని దెలియంగ నెవరి తరము మహాత్మా!

వ. తొల్లినేను జాతిమాత్రంబున విప్రుండనయ్యుఁ గిరాతవృత్తిచే గిరాతకులం గలసి జీవహింస చోరకర్మాది వృత్తులచే బ్రవర్తించుచు బ్రహ్మర్షుల యనుగ్రహమువల్ల నీనామమును సంపాదించి నిష్ఠతోఁ జపించుచున్న నాపయిని పుట్టలు పెరిగెఁ ; బిమ్మట నీయనుగ్రహమును బొంది వల్మీకమును భేదించుకొనిబయటవచ్చుటచే వాల్మీకి యను నామమువచ్చినది. అంత బ్రహ్మర్షినయియిక్కడ నిలిచి తమనామస్మరణ మఱవక చేయుచున్న కారణంబున —

తోహర : నీయనుగ్రహము నేటికి గలిగియు నీ దేవీసహితముగా, బాయగ నాకును బ్రత్యక్షంబయి తీఱెడ నిష్టము లిడగ ॥ రామ ॥

ఇంకను నాతప మీడేరెను నే నెలమి గృతార్థుడనైతి; పంకజాక్ష! యీపర్వతా గ్రమునఁ బరగఁగ నుండుము ప్రీతి ॥ రా ॥

వ-అని రామునొడంబఱచి, —

క. గిరిమధ్య నీటిదాపున
నరసియు నొకపర్ణశాల నత్యద్భుత సుం

దరముగ శిష్యులచేతను
విరచింపఁగ జేసె మౌనివీరుఁడు గడిమిన్.

వ. అంత సంతోషించి శ్రీరాముండు కాంతానుజసహితుండుగ నాపర్ణశాలయందు వసించియుండె.

క. అంత నొకనాఁడు సీతా
కాంతాంకతలంబు దిండుఁగా దల నిడి య
త్యంతసుఖాప్తిని రఘు కుల
కాంతుఁడు పవళించియున్న కాలమునందున్.

తోహర : కాకి యొకటివేగంబున జనకసుత కాలి వ్రేలుముక్కు నను చీక రక్తమును చీల్ప దోలినను బోక వచ్చు గ్రమ్మఱను ॥ రామ ॥

వ. నిట్లేమఱించి వచ్చి బాధించుచుండినఁ గొంతవడికి రాముండు నిద్రలేచి వ్రేలి యందు రక్తస్రావమగుటఁ దిలకించి యిట్లనియె;

సీతారామ సంవాదము-పాట: ఆది.

రా ॥ సరోరుహాక్షి, రక్త మట్లు గారగన్ గారణంబదేమొ తిన్నగా వచింపుమా! స్రూరు లేరు లేరు సుమ్మిట ॥ సరో ॥

సీ ॥ సుధీర, మీరు నిద్రయందు దేరగన్, జేరియొక్క కాకిముక్కు చేత నిటువలెన్ గీరఁ గారె రుధిరము ॥ సుధీ ॥

రా ॥ సహోదరుండు లేఁడె చాని మోదగన్ బాద మిట్టుజీరినట్టి పాపికాకము ఏది ఏది లేదు చూడఁగన్ ॥

సీ ॥ ఫలాది సంగ్రహంబుజేయఁగా దగన్ నాదు మఱది మోక్షగుండనాథ పోయెను; బోదు మీదమీద వచ్చును ॥ సుధీ ॥

వ. అని వారు చెప్పికొనుచుండ నంతలో —

తోహర : క్రమ్మఱ నక్కాకము సీతాంగన కాలుచీరుటకు రాఁగ, నెమ్మది గని కోపమున నొక తృణమునుపెచెనువేగరా ॥ రా ॥

వ. ఇట్లు రామకరనిర్ముక్తతృణంబు బ్రహ్మాస్త్రంబై వాయసంబుపైకి ఘోరంబుగా గవిసిన, నది కాపుకాపుమని వాపోవుచు, —

యదుకులకాంభోజి : ఆటతాళం.

దేవేంద్ర ! యోశచీదేవీ ! మనోనాథ ! వేవేగఁగావు ! కావు ! ఓ విఘ్నవందన ! యోవాణీవల్లభ ! వేవేగఁగావు ! కావు ! ॥ దేవేం ॥ అక్షయ బ్రహ్మాస్త్రమావరించె దిశాధ్యక్షులారా ! కావరే ! మోక్షగుండేశ్వరిముక్తీశ ! నే నిక । మొక్కెదఁ గావు ! కావు ॥ దేవేం ॥

వ. అని యిట్లు వాపోవుచువేడుకొనుచున్న కాకికేకవాక్యంబుగా వా రంద టిట్లనిరి;

తోహర : రాముడువైచిన బ్రహ్మాస్త్రంబును మేము నిలుపఁగాగలమా ! ఆమహనీయుని నాశ్రయించినను నెత డుడుపుము నిక గనుమా ॥ రామ ॥

వ. అని వారిచేత నియమింపబడి త్రిలోకంబులు దిరిగియు నెందును శరణంబు లేక కాకంబు గ్రమ్మఱవచ్చి శ్రీ రామమూర్తి మఱుఁగుఁజొచ్చి భయభక్తుల ని ట్లని వినుతించె;

కమాచ్ - ఏకతాళం.

సీతాధిపా, శ్రీరామ, త్రిభువననుత ! ॥ సీతా ॥ గౌతముని నాతినపుడు పునీతను జేయవె ॥ సీతా ॥ కావు కావు కలుపాపహార ॥ సీతా ॥ కుజనహరణ, సుజనహృదయ; గురుజలజాతనిలయ ॥ సీతా ॥ ననుగన్న జనకుఁడ వన్న కనుగొన్న నిను నమ్మియున్న నను బ్రోవుమన్న ॥ సీతా ॥ నీకన్న వేఱులోకాధ్యులేరు ! కాకుత్స్థ లేరు కాపాడువారు ! చేకొని పాపముజిందరవందర జేసి శుభము లిడు ॥ సీతా ॥ రామ రామ ! నారాయణకవినుత నామ మోక్షపురధామ ! రాజలలామా ! పాపవిరామసజ్జనకామ ! రూపజితకామ ! నీరద శ్యామ ! శరణు ॥ సీతా ॥

వ. అని ఇట్లు పరిదేవనము సేయుచున్న కాకిని గరుణించి శ్రీరామదేవుండు పలుకుచున్నాఁడు :

క. నాయస్త్రము వృథవోవదు;
నీయంగం బొక్క టిమ్ము ! నేఁ డన, విని యా
వాయస మొక క న్నిడి తాఁ
బోయెను శ్రీరామునాజ్ఞఁ బూని యథేచ్ఛన్.

వ. అది మొదలు గానులకు నొంటికంటి చూపేర్పడె. ఆ పిమ్మట సీతా - రామ - లక్ష్మణులు ఫలాహారంబులు సేసి వాల్మీక్యాది మహర్షుల సాంగత్యంబుచే బ్రహ్మానందంబు నొందుచుండె నిక్కడ —

తో: మంతన మెఱియ సుమంత్రుడు రథమును మఱల అయోధ్యకుఁ జేర్చె; వంత చేత దలవంచుచు జని భూకాంతున కెదుట నిలిచె ॥ రామా ॥

వ. ఇట్లు నిలిచినఁగాంచి దశరథుఁడు వగచుచుఁగన్నెత్తిచూచి,

తోహర: ఇడుమలు గుడుచుచు గొడుకులు గోడలు నెచ్చట నున్నారోయి? యడరుచు నన్నేమని నిర్దయతో నాడి రొ చెప్పగదోయి ॥ రామ ॥ అని యెలుగెత్తియు హా! యని యేడ్చుచు నడిగిన, నాదశరథుని, గనుగొని చింతాక్రాంతుం డగుచును ననియె మంత్రినెమ్మదిని ॥ రామ ॥

ద్వి. రాజేంద్ర, శృంగి బేరము జేర్చినాను;
వేజడలు ధరించి వెడలి. జాహ్నవిని
దాటి, కాల్నడకతోఁ దద్దయు జిత్ర
కూటశైలమ్మునకును జేరినారు;
'తల్లిదండ్రులకు దండముల్ సెప్ప
మల్లన వగవ వద్దను' మనివారు
సాకేతమునకన్న, నకల సౌఖ్యంబు
లాకాననలం దెక్కువని యనినారు;
సీత యత్తలకును, జెప్పె దండములు
భూతలాధిప యిదేపో వార్త లనిన —

మ. విని కౌసల్య విలాప మొందుచు నిభుఁ వీక్షించి 'హా నాథ! నీ
యనుకూలంబుఫలించెఁ! గైకకొడుకుఁ హర్షంబుతో నిందు ర
మ్మని పిల్పించి ప్రభుత్వ మిమ్ము! వల దీయాలస్య మింకేల? నా
తనయుల్ నాకులుఁ గూరలై బ్రతుకరా దైన్యంబునన్ గానలన్!'

వ. అను నుడువు లొడలిపై యుడుకు జల్లి నట్లయిన వాపోవుచు—

సురట : ఆదితాళము

ఎందుకుఁ బల్కెదవే సుందరి ॥ ఎందు ॥ నందను నెడఁబాసి డెందము కుందగ ముందే నే దుఃఖింప నిందఱితో నందుకు దోడుగ నగ్ని జిలిగిన రీతి ॥ ఎందు ॥ నే నింక ప్రాణాలు నిలుపఁగ జాలను! గానఁగ శాపము గలదు నాకు! మానిని, యింతలో మర్యాద బోనాడి ॥ ఎందు ॥ శ్రీమోక్షగుండపురీశుని సాక్షిగ గామిని, నాశాపకారణము వేమరు నే నీకు వినుపింతు నింతలో ॥ నెందు ॥

గి. వేఁట తగులమ్మునం బిన్ననాట పనికి
సరిగి సరయూతటమ్మునఁ దరువుపొంతఁ
బొంచి యుంటిని; యట కొకముని సుతుండు
వచ్చి గుండిగ ముంచెఁ బ్రవాహమందు.

తోహ; బుడబుడ మని చప్పుడు గలిగిన నప్పుడు గజ మని నేఁదలఁచి, జడిగొని వైచితి శబ్దవేది యను శరమును దరిపై నిలిచి ॥ రామ ॥

'హాతాతా! హామాతా! మిము నను నావిధి వాపెనె' యనుచు భూతలిఁబ్రవాలిన ముని సుతు దరిసితి నాతురతఁబడుచు ॥ రా ॥

వ. ఇటుల చెంతకుఁజేరి యిట్లంటి :

హిం. కాఫీ: ఆదితాళము.

నీ వెవరో తెల్పుము నాకు ॥ నీవె ॥ నే వనకుంజరమని, భావించి వేసితిని శరము ॥ నీవె ॥ వేటకు వచ్చితిని; యీయేటిదరిని నుంటిని; ధాటిగ నయోధ్యనాది: దశరథావనీ శుఁడను ॥ నీవె ॥ కానక చేసితిని; తప్పు గావుము మ్రొక్కితిని పూని నన్ను బ్రహ్మహత్య పొందెనేమి చేయువాడ ॥ నీవె ॥ ఏకుల మేస్థలము రా నేలనీవీయెడకు ప్రాకటముగ మోక్ష గుండపాలు దయలేకపోయె ॥ నీవె ॥

వ. అనిన, నతండు—

క. నాపేరు యజ్ఞదత్తుఁడు;
భూపాలక, వైశ్యుఁడను; దపోమహితులు మా
తాపితరులు గల రంధకు
లీపొంతను, నిదిగో కాంచు మీ దయ వెలయన్.

ఆ. వారిదప్పిఁ దీర్ప వారికై పచ్చితి
నాపురాకృతంబు నన్నుఁ బంప;
బ్రహ్మహత్య యనెడు భయము నీ కింక లేదు;
మిగిలినట్టి పనికి వగప నేల!

ధన్యాసి : ఆదితాళము.

ఇఁకబొమ్మా ధరణీవల్లభా ॥ ఇ ॥ అమ్మయు నబ్బయు నతిదాహముచే నల్లాడుచు నున్నారచటికి ॥ నికబొ ॥ ఆకులపడుదు రాచీకులు నాకై! యీ కలశంబును గైకొని నీ ॥ వికబొమ్మ ॥ నాపోబడిఁ గానక నే డయ్యో! వాపోవుదు రీవార్త దెలుప ॥ నికబొ ॥ దక్షతతో వారి దాహము దీర్పగ మోక్షగుండపతి సాక్షిగ నీ ॥ వికబొ ॥

తోహ : శాపం బిత్తురు చను మిక దడయకు; శరవేదన బడజాల! బ్రాపు జేరి యీ బాణములాగుము ప్రాణము విడుతు నీవేళ ॥ రా ॥

వ. అని పలికినఁ, జింతాక్రాంతుఁడ నగుచు డగ్గఱి యతని యెడద నాఁటియున్న శరంబు పెల్లికిన యజ్ఞదత్తుండు దేహంబు బాసి దివంబునకరిగె, అంత నేను విధిని దూఱుచు నక్కలశంబును నెత్తిన మోచికొని మెల్లన నడుగు లిడుచు యజ్ఞదత్తుండు సెప్పిన గుఱుతు ప్రకారము ముదునళ్ళున్న చోటికిఁ బోయినఁ; గాళ్ళచప్పుడు విని,! ఆముదునళ్ళ—

తేవారము :- కొడుక నీ వింత సేపు దడయగా నేలఁజెప్పఁ బడుగులము దప్పిచేత బడలి యున్నాము; ధాత యిడుమలొందంగఁ జేసె నిటుల దలమీద వ్రాసె! గడియయును నిన్ను మేము కానకయ నిలువలేము.

వ. అనిన భయభ్రాంతచిత్తుండయి దశరథుఁడు నీటికడవ నచ్చట డించి వారి పాదంబులపై వ్రాలి,—

తేవారము : నేను మీసుతుఁడ గాను, నిక్కమునేఁ దాపలేను భానువంశోద్భవుండ బాహుబలుండ దశరథుండ; నే నిచట వేఁటలాడ బూనిజనుదెంచినాఁడ గాన కపకార మొకటి గరువముమై జేసినాఁడ.

చ. సరయువుఁజేరి మాకొడుకు చప్పుడుఁ జేయుచు నీరుముంచఁగాఁ
గరి యని శబ్దవేది యను కాండము వైచితిఁ! గూలె బిడ్డ దు
ష్కరమగు గిల్బిషమ్ము నొడిఁ గట్టితి గట్టిఁడి' నంచు మ్రొక్కి వం
దురితిని; వారి దప్పికకుఁ దోయము లిచ్చి సమాశ్వసించితిన్.

తో: నే పాపాత్ముఁడ, నీచవర్తనుఁడ మీపుత్రుని జంపితిని! నాపయి మిక్కిలి గోపము సేయక, నను బాలింపుడు ధృతిని ॥ రామ ॥

మేకొని యుదకము మాకు దెచ్చితివని జేకొని త్రాగుడు వడిగ నాకృత్యము మానసమున నుంపక, నను గృప గనుగొను డనఁగ ॥ రామా ॥

వ. అంత వారు మూర్ఛపోయి కొంతవడికిఁ దెలిసి కొడుకుం గూర్చి—

జోగిరాగము : ఆదితాళం.

మా పుత్రరత్నమా, నీవు మము బాసిపోతివా! ॥ మా ॥ నీవు మాపైనగల భక్తి మరచిపోయితివా! భూపతి నెపమున భువి నింతటిలో బాపురేవిధి యెడ బాపెను మనలను ॥ మా ॥ మా కెవ్వరింకదిక్కు మర్యాద చేయగా! గాకుల కొల్లచేసి కదలి పోతివిగా! యీ కానలలో నెటుల మెలగుదుము! చీకుఁ! మెవ్వరు చెట్టబట్టుదురు? ॥ మా ॥ భూమిపచేత నేడు పాలియగ నాయెగా! శ్రీమోక్షగుండశౌరి ప్రేమ లేదాయెగా! శ్రీమీటి చిరంజీవివి గమ్మని మే మను మాటలు మిథ్య లాయెనుగా ॥ మాపుత్ర ॥

వ. ఇట్లు దుఃఖించి యెట్టకేలకు ధైర్యము బూని,—

తో: క్షితిపాలక నీవు జిచ్చులు జేర్చియు జితిబేర్పుము త్వరలోన నతులితగుణి మాసుతుఁ డరిగిన యాగతికి బోదుమే మనిన—

గీ. అటులఁ జితిఁ జేర్చి తెలిపితి; నంత వార
లగ్నిలోఁ జొచ్చి 'ముందు మాయటుల నీవుఁ
బుత్రశోకాగ్ని చేతనే పాలియగల' న
టంచు శపియించి యొడలు ద్యజించి చనిరి.

తో: కావున నాశాపకాలము వచ్చెను గాదది వ్యర్థము నిజము; వేవేగంబున బోవును బ్రాణము వెలదిరో, నిల్వ నవశము ॥ రామ ॥

వ. అని కౌసల్యకుఁ జెప్పి తత్క్షణంబున —

శా. 'హారామా! సుగుణాకరా! ప్రియసుతా! హాసీత! హాలక్ష్మణా!
మీరుఁ న న్నెడబాసి పోవుకతనఁ మేనుఁ విసర్జింపఁ జే
నూరెఁ కైకను దూఱఁగాదు; విధి బల్ క్రూరత్వముం బూనెనం
చారాటమ్మున మైదొఱంగి చనె నర్ధాంగుల్ ప్రతాపింపఁగా.

అం. తోహర: అంతట గౌసల్యాది మానినులు హాహాకారముతోడ, నెంతయు వగచుచు, నెదలు మోదుకొని వంతము = నిఁగి గోడాడ ॥ రా ॥

కౌసల్య - జోగి: ఆదితాళము.

సుగుణాకరా! రణభీకరా! నృపలోకశేఖరా! యిహలోక భోగముసరిపోక వేగము నిరాకరించి పొందితే! పరలోకసౌఖ్యము ॥ సుగు ॥ నిను దూలనాడితి! గడుజాలిబెట్టితి! సుశీలుఁడవని నీమది గనఁజాల కెన్నితి ॥ సుగు ॥ అలకైకకృత్యము బహు శోకమూలము। అనేకమైనకష్టము లెడ లేక దోచెను ॥ సుగు ॥ ధర మోక్షగుండనాథుఁడు, కక్షగట్టినా సుర క్షితంబుగల్గునా! తలవ్రాత దొలగునా! ॥ సుగు ॥

వ. ఇట్లు రాజకాంతలు దుఃఖించుచుండ.—

తోహ: తెల్లవాఱగను దెలిసియు బురజను లెల్లరుగుములయివచ్చి, గొల్లున నందఱు గూడి యేడువగ గొల్లురేగె; నదిచూచి ॥ రామ ॥

చ. గురుఁడు వసిష్ఠమౌని చని గొబ్బున నందఱ నూఱడించి, భూ
వరతిలకమ్ము దైలమునఁ బక్వముఁ జేయఁగ బంచి దూతనొ
క్కరుని గిరివ్రజమ్మునకుఁ గైక సుతుంగొని తేఱఁబంచె; వాఁ
డరిగి వసిష్ఠునాజ్ఞ భరతాదులకుం దెలిపెఁ వినీతుఁడై.

తోహ: విని భరతుం డతివికలచిత్తుడయి తనవారలు పీడ్కొలువ, గనుల నశ్రువులు గార్చుచుఁగాళులు గడగడలాడుచుఁ గలఁప ॥ రామ ॥

శంకరాభరణము-ఆదితాళము.

ఓహోబంధులార, నే నయోధ్య కేగుదుం గదా! యాహా! నన్ను బిలువ భటుని నంపిరి యోజించెదా ॥ ఓ ॥ రాముఁడెందు బోయినాడో! రాజుమాట దెలియదు! ఏమికార

ణమో ! నా కేమి దోపగాలేదు ॥ ఓ ॥ దక్షుఁడగుచు వసిష్ఠుఁడు దాను బంపెనేమో ! హా ! మోక్షగుండశౌరి కెఱుక మోన మెమో వచ్చె హా ! ॥ ఓహెూ ॥

వ· అప్పుడు శత్రుఘ్న సహితంబుగా భరతుండు శీఘ్రయానంబున సాకేతనగరంబుఁ జేరి కళాహీనముగానున్న యా నగరంబునుగని ఖిన్నుండయి రథంబు దిగి మాతృగృహంబున కరిగి యెంటిగా నున్న తల్లికినమస్కరించిన లేవనెత్తి దీవించి యిట్లనియె :

తోహర : మాతులు దత్తయు మాతామహియునుదాతయు జుట్టంబులును ; బ్రీతిగ గుశలం బేకద ! యన విన మాతకు దా నిట్లనెను ॥ రా ॥

మధ్యమావతి: ఆదితాళం

ఎందుబోయె నాతండ్రినేడు ॥ ఎం ॥ ఎందుబోయె! మదియందు దోపలేదు : ముందు నీదుగృహమందు నిలిచి తనడెందమెంచు నానందమొందు నిపు డిందు లేడాయె తండ్రి ॥ ఎం ॥ దుందుభిరవముల సందడులలరగ వందిమాగధులు బృందములై తనముం దర గొలువగ సుందరముగ జెలువొందు భూమీంద్రుఁ డిపు ! ॥ డెందు ॥ ఈక్షితి నారాయణ కవినేలెడు మోక్షగుండపురదక్షకు దయతో నీక్షణమున ప్రతిపక్ష గణంబుల శిక్ష జేసెడిదక్షు ॥ డెందు ॥

వ. ఇట్లడిగి కించిన్మాత్రంబు దుఃఖితుండయిన, కైకయిట్లనియె–

తో : వగవ నేల నుతవాజి మేధమఖవర యాజకు లేగతికి దగజనుదురో యాస్థాన మునకు మీతండ్రి సేరె సద్గతికి ॥ రామ ॥

తో : అనగా నామాట వినగా మూర్ఛిలి, యవనిపైనబడి పొరలి, గొనకొని శత్రుఘ్నునిసహితంబుగ గొంతవడికిదెప్పిరిలి ॥ రామ ॥

క. నాయన స్వర్గమునకుఁ దాఁ
బోయెడు సమయంబునందుఁ బొలుపుగ మాకుఁ
ఏయేబుద్ధులు గఱపెను ?
నాయెడదయయుంచి తెలుపు నను గన్నమ్మా !

వ. అనినఁ దల్లి యిట్లనియె :

తో : శ్రీరాముని నాసీతను లక్ష్మణు సారెకు దలపోయుచును, దోరపుదుఃఖముతోఁ బొగులుచు గడతేరె ననగ విని యనెను ॥ రామ ॥

వారెచటికి నావలెనే పోయిరొ వారక దెలుపఁ గదమ్మా చేరువ కొకరులు జేరని హేతువు జెప్పుమనగ నాకొమ్మ ॥ రామ ॥

జంఝూటి: ఆదితాళము.

విను తనయా! తెలిపెద ॥ విను ॥ నిను గుఱించి చేసిన నాకృషి ॥ విను ॥ నట్టడవికి రఘునాథు నంపగా పట్టము నీకును గట్టగను గట్టిగగోరితి గాంతునితో ॥ విను ॥ రెండువరములిడి యుండెగానమితాతంఁడ్రియవియు లేదనలేక, దండిమనసుతో దయచేసెను ॥ వినుతన ॥ దీక్షగ సీతాదేవి లక్ష్మణు లాక్షణమున రా నడవులకు, మోక్షగుండపతిసాక్షిగ జనె ॥ వినుతన ॥

ఆ. వారినంపి పిదప వారిపైఁ బ్రియమునఁ
బొగిలి పొగిలి చచ్చె పుడమిఱేడు!
కొదువ యేమి యింక! కుతలంబు నేలుము
తనయ, యనిన, నతఁడు గనలి పలికె.

కీర్తన: ఆదితాళము

పో పోగదే పోగదే పాపాత్మురాల! ॥ పో ॥ నీపట్టినై ధరనెబుట్టుటే రోత ॥ పో ॥ మాత వనుచు నిన్ బ్రీతిగ గన వచ్చునే తంఁడ్రిజంపిన ఘాతకురాలవు ॥ పో ॥ అన్న వనముల కంపి యీరాజ్యము నన్నేలు మనెదవు నాలుకెటులాడె ॥ బోపో ॥ శ్రీమోక్షగుండ పురీశునిసాక్షిగ నీమోము వీక్షింపగాఁనొల్ల ॥ పో ॥

వ. అని యిట్లు కఠోరంబుగాఁ బలుకుచున్నయెడఁ జూడ వచ్చిన వారిలోఁ గొండె మంథరవల్లనే యింతతొందర గలిగెనన, వినిశత్రుఘ్నుండు క్షాత్రవంతంబున లేచి.—

తోహర : గూనిముండ నికఁ గూల్చివేతునని పూనికతో యత్నించి, మానినిహత్యను మదిసంశయపడి మాని కొంత సైరించి ॥ రామ ॥ మఱి కైకను జంపగ దలచిన నిది మాతృ ద్రోహం బనుచు భరతుఁడు పోదము పద కౌసల్యా, వరగృహమున కన వినుచు ॥ రామ ॥

వ. అంతలేచి యిరువురుఁ గౌసల్యనగరంబునకుఁ జని భర్తృవియోగంబునఁ బరితపించు నామెపదంబులపై బడి యేడ్చిన. నాసాధ్వి—

తో: లెమ్ము తంఁడ్రి, సర్వము దల్లిచే నెమ్మది వినియుండుదువు; ఇమ్మహి నెల్లను నేలుము నీ విక నిష్టార్థంబులు నొదవు ॥ రా ॥ రామ లక్ష్మణులు భూమిజయును నారలచీరెలు ధరియించి, ధీమతి నడవులుదిరుగ బోయి రిక దేవుఁడె దిక్కన గాంచి ॥ రామ ॥

వ. అనిన భరతుం డిట్లనియె,

**హిం. తోడి - ఆదితాళము**

యెటుదోప దాయె తల్లీ! యిక నేమిసేతునే! కుటిలాత్మురాలు కైక యిటువలె జేసెను ॥ యె ॥

ఈకృత్య మెల్ల నించుకేఁగి యుందునేని బ్రాకట బ్రహ్మహత్యా పాపము వొందుదు ॥ ఈ ॥ గురుని వసిష్ఠుని తరుణితో గూడనునఁకిన రౌరవనరకము బొందుదు ॥ ఈ ॥ నాతల్లి మోక్షగుండ నాథుని సాక్షిక నీ తప్పునే జేసి యెఱుగను మన్నించు । మెటుదోప ॥

వ. ఇట్లు భరతుండు ప్రమాణపూర్వకముగాఁ బలికె కౌసల్య జాలినొంది కొడుకును లేవ నెత్తి 'నాయనా! నీమనోభావంబుఁ గనలేక పలికితి' నని గారవించుచు నొకరినొకరు గౌఁగిలించుకొని యెలుగెత్తి యేడ్చుచున్నతఱి వశిష్ఠుండు వచ్చి భరతునితో నిట్లనియె.

చ. వగవగ నేల! సర్వమనుభావ్యము! చచ్చినవారు వత్తురే!
జగమున సాధుసజ్జనుల సన్నుతిఁగాంచు కుమారులం గనెన్;
తగిలె సమస్తభోగములఁ; దద్జ్ఞత నొప్పిదివంబుఁజేరె; నా
యగణిత ధర్మశీలునకు నైపలవించుట పామరత్వమౌ!

సీ. దేహ మెల్లప్పుడుదిరముగా నుండదు
మృత్యువు వెన్నంటి మెలఁగుచుండు;
సర్వసంపదలు నశాశ్వతంబులుకర్మ
ఫలితంబు గుడుపక వాసి చనదు;
దారపుత్రాదులు రారు నూ వెన్వెంట
మాయాకృతంబులీమమతలెల్ల;
బాల్యకౌమార యౌవన జరావస్థలు
సమత నెల్లపుడొక్క క్రమతఁ గనునె?

గీ. ఇట్టి తనువుల నెన్నిటి నెత్తినాఁడొ!
పుట్టివచ్చుట సహజంబుభూతతతికి

నశ్వరం బగుదీనిని నమ్మరార్య;
లింక దుఃఖించినను ఫల మేమి భరత!

క. చినిగినగుడ్డలు విడిచియు
మనుజులు క్రొత్తవి ధరించుమాడ్కిని తనువుల్
వెనుకటివి విడచి నూతన
తనువుల్ గాలక్రమానఁ దాల్తురు జీవుల్.

క. కావున విజ్ఞతఁ గైకొని
చావులు బుట్టువులు రెండు సమ మని మదిలో
భావించియు సంస్కారము
గావింపుము తండ్రి కిపుడుగడుభక్తి మెయిన్.

వ. అని బోధించిన వసిష్ఠునివాక్యంబులవలనఁ దెలివినొంది తైలద్రోణంబుననున్న తండ్రి కళేబరంబు దీయించి విధ్యుక్తముగా నగ్నిసంస్కారంబుచేసి దశరాత్రంబులుకర్మ మాచరించి, వేదవిదులగు విప్రులకు షోడశమహాదానంబు లిచ్చి, సభాస్థానంబునఁ బరిజన మంత్రి సహితంబుగాఁ గొలువు దీరియున్న భరతునకు వసిష్ఠముని యిట్లనియె :

క. మీతండ్రికి మాఱుగ నీ
వీతఱి భూభరణముఁ జహింపుము, కౌస
ల్యాతనయుఁడు పిమ్మటఁ బృ
థ్వీతలము భరించుచుండు విబుధహితముగా.

జంఝూటి : రూపకము.

రాముని సేవింప బోదు - రాజ్య మేటికి? ఓమునీంద్ర! ఇహ సుఖము లొల్లను నేనుల్లంబున ॥ రా ॥ నారదపుల రాముఁ డుండ నూరనుందునా! మాఱుమాటలేదు రేపు మనమందఱ మరుదెంతము ॥ రా ॥ నైకదప్ప స్త్రీపురుషులు గడమవారలు ప్రాకటముగ మోక్షగుండ పతికృపతో రావచ్చును ॥ రాము ॥

తోహర : రాముని దోడ్కొని - రయమునవచ్చియు రాజ్యమువేగట్టెదను; ఆమహా
[illegible]

వ. అని నిశ్చయించియేగిన తరువాతవసిష్ఠాది మునులుసుమంత్రాదులును దల్లులును జతురంగబలంబులును బౌరులును గూడి రా భరత శత్రుఘ్నులు గదలి గంగాతీరంబునకుఁ జనిన, గుహుండు సూచి, —

గీ. 'కాననంబుల దిరిగి రాఘవుఁడు మరల
వచ్చునో! యంచుదండెత్తి వచ్చుచున్న
యటులఁ దోచును నీరాక! యైన నేమి
నన్ను గెలిచియుఁ బొమ్మనీ' వన్ననియె :

గీ. 'రాము బ్రార్థించి తోడ్తెచ్చి రాజ్యమియ్యఁ
బోవుచున్నాడ నన్న నుప్పొంగి యతఁడు -
వండ్లు బాలును దేనియల్ బడపలందు
నుంచి యందఱ నదిని దాఁటించె నపుడు.

వ. భరతశత్రుఘ్నులు రామలక్ష్మణుల వలెనే జటావల్కలములు ధరించి యానాడు భరద్వాజాశ్రమంబుఁ జేరిన, నతండు —

తోహర : పురి నీ కిచ్చియు బోయినరామునిఁ బోనియ్యంగా లేవా! భరతా! యిటు వెంబడిఁ బడివారల దఱమగ జనుచున్నావా! ॥ రామ ॥

తోహర : అనిన, భయంపడి 'మునివరా! రామునిఁగొని దెచ్చి ప్రభునిఁ జేయన్, జనుచున్నా' నన. సంతసించి యాయనయాతిథ్యం బీయఁగ ॥ రామ ॥

వ. అందుండి మఱునాడుఁ బయలుదేఱి చిత్రకూటాద్రిఁ జేరవచ్చినఁ గాంచి లక్ష్మణుండు మునిజనపరివృతుండైయున యగ్రజుఁ గాంచి : —

**కీర్తన : ఆదితాళము.**

వారెవరో! చూడుము ॥ వా ॥ వివిధసేనలతో వెడలివచ్చు ॥ వారె ॥ సమరథు లున్నారుగా? అతిరథు లున్నారుగా! రథ హయభట వారణములుగల ॥ వారె ॥ ఇనకులు లచిన్నియ నెనయఁగలిగి మనదెస కలరి వచ్చు ॥ వారె ॥ ప్రతిపక్షవీరులో! ప్రతిమోక్షగుండపురరక్షక యల ॥ వారె ॥

వ. అనిన రాఘవుండు —

తో : భరతుఁడు మనలను బురికిఁ బిలువగా, వచ్చువాడు కాఁబోలు ! సరగున నీమది సంశయముడుగుము సౌమిత్రీ యిక జాలు ॥ రామ ॥

తో : అనుకొనుచుండగ నంతలోన వారరుదెంచిన ముదమంది, జనముల కంజలి సంఘటించి దీవనలఁ గ్రమంబున నంది ॥ రామ ॥

క. కులగురునకు దండము లిడి
యలరుచు 'ధన్యుండ నైతి నయ్యా, మాత
ల్లులుఁ దమ్ములు వచ్చిరి యిట
నలవడి మాయయ్యయేడి ? యగపడ' డనఁగన్.

వ. అనిన వసిష్ఠుం డిట్లనియె —

వ-ద్వి. మిమ్ము గానల కంపి మేదినీవిభుఁడు
మిమ్ముదలంచుచు మృతుఁడయ్యెనంత
భరతునిబిలిపించి, పరలోకవిధులు
బరువడిజేయించి ప్రభువు గమ్మన్న
నొల్లక మిముఁ జూడ నొయ్యన వచ్చె
తల్లులతోఁ గూడ దశరథరామ !
అనువల్కు లాలించి, యారామవిభుఁడు
జనకజా - లక్ష్మణసహితంబుఁగాగ
గడువడి మూర్ఛిల్లి గ్రక్కునఁ దెలిసి
సుడియుచు నిట్లని శోకింప దొడఁగె.

హిం. తోడి : రూపకము

తండ్రి ! పోతివా ! కన్న ॥ తం ॥ తీండ్రమయిన శైకకోర్కెదీర్చి పోతివా ॥ తం ॥ కొడుకులకొఱకు వెతగుడిచియుఁ గడకు బడలి చెంత నెవరులేక బాసిపోతివా ॥ తం ॥ చాల కాలము నీచాటున మేము లీల మెలగుప్రాప్తి మాకు లేకపోయెను ॥ తండ్రి ॥ ఎంతదలచితో ! మమ్మెంత పిలచితో ! నంతతంబు మోక్షగుండస్వామి కెలుకగు ॥ తండ్రి ॥

వ. అప్పుడు వచ్చిన వారందఱు కన్నీరు మున్నీరుకాఁబొఱనేడ్వ, వసిష్ఠుండు శాంతవచనంబులఁ వా రందఱ నూరార్చి రాముని; డగరి, —

క, లోకంబులు గల్పింపను,
ప్రాకటముగ( బెంప( నొంప( బతివయ్యు నిటుల్
ప్రాకృతిని రీతి నీకున్
శోకింప(గ నేల సకల సురగణపాలా!

వ. నీయంతవాని కిది తగునే! దుఃఖించిన( జచ్చినవారు వత్తురే లెమ్మన, గురు వాక్యంబువలన రాముండు దేటి తమ్మునితో( గూడ గంగానదియందు స్నాతుండయి తండ్రికి వాసోదక పిండోదకములనిచ్చి యాదిన ముపవసించి, మఱుదినంబున స్నానంబు(జేసి యథా స్థానంబునకు వచ్చి మునిజనపరివృతుండై యున్న యన్న కు భరతుండు సాష్టాంగనమస్కారము లర్పించిన, రాముం డిట్లనియె:

క. పితృవాక్యపాలనకు నే
ధృతితో(గానలకు( నేగుదెంచితి; నీవున్
క్షితిభారము( దాల్చక యీ
గతి నడవికి రా(గ నేమి కారణ మనుజా!

వ. అనిన( భరతుండు దీనాననుం డగుచు నిట్లనియె:

బ్యాండుస్వరము : ఆదితాళము.

రామచంద్ర, రమ్మిక! రాజ్యమును గొమ్మిక! స్వామి, నిన్నువీడి చనను నేను బురికి(క! భూమిపాలింపగ బోల నేను; శ్రీమీాఅమీాపంపుజేసెదను ॥ రామ ॥ కపటచిత్తురా లగు కైకమాట దలపకు; తపనకులజ, నాయెడ దప్పులేమ చొప్పడ; విపులాటవుల కేగు టిక మానుము' కృప యుంచు నామీద గేవలము ॥ రామ ॥ మోక్షగుండ దేవునిసాక్షిగ నీవు రానని పక్షపాత ముంచిన బాదములు విడుతునా! లక్ష్మణ-సీతలు లలితాంగులు అక్షయ కష్టము లంద లేరు ॥ రామ ॥

వ. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె:

క జనకునియాజ్ఞను దాట(గ
జననా! రాజ్యంబు నీ కొసంగియు నను( గా
వనములకు నరుగ మనియెను;
బనివడి నెఱవేర్చకున్న( బాపము గాదా?

వ. అనిన భరతుండు శోకవ్యాకులచిత్తుండై యొక్క దర్భాసనంబునఁ గూర్చుండి యిట్లనియె!

తో: ప్రాణాయామము బట్టియు సేసును ప్రాణంబులు బోవిడుతు; గాన మీరు రాక యయోధ్యకు నే బోను సత్యమని యనెను ॥ రా ॥

వ. అంత భరతుని మనోనిశ్చయంబునకు నేమి చెప్పుటకు దోఁపక శ్రీరాముండు గన్ను గీటిన, వసిష్ఠుండు భరతున కభిముఖుం డయి యిట్లనియె:

**ఆటతాళము (నాయనా) వలె.**

అగ్రజుశానన మాలింపరాదా! వ్యగ్రతగా నీవు వర్తింపవలెనా ॥ అ ॥ కారణ-కార్యము లారయవలదా! తీరు మిక్కిలిలు దెలియగవలదా ॥ అ ॥ రావణు గూల్చి సురావళి నెల్లను బ్రోవగ బుట్టిన దేవుఁడు గాదా ॥ అ ॥ అవనిదీర్ఘగ నది కడుమే లగు; పాపాత్ము లెల్లరు బలిసిరి భూమిని ॥ అ ॥ మోక్షగుండ పురాధ్యక్షుని వల్లనే రాక్షసకులములు శిక్షింపఁ బడనగు ॥ అ ॥

తో: తిరిగి రాముఁడరు దెంచిన నాపని దీర్చువార లిక యేరీ! చెరియొక కార్యము జేయుదు జనులకు క్షేమంబగు నవె నూరి ॥ రాము ॥

సం-వ. ఇట్లు భరతునకుఁ దెలిపి రామునింగాంచి.

వసి-తోహర: పదియు నాలుగబ్దంబులు నిండన పిదప నయోధ్యకు రండి! సదమలముగ సజ్జను లౌ ననగా బృథివి నెల్ల నేలండి ॥ రాము ॥

వ. అని దెలిపిన,

క. ఇందునురాముఁ డొడంబడె
నందును భరతుండు నొప్పె నటుపిమ్మటఁ దా
నందన మొనరించి సభవా
రందఱువిన భరతుఁడనియె నగ్రజుతోడన్.

గీ. అయ్యతర్వాత ప్రభుత నీదగుసుగాని,
నాకు డగదయ్య! సింహాసనంబు నెక్కఁ
బాదుకల నిమ్మువాని నే భక్తితోడఁ
జేసికొనియెద రాజ్యాభిషేక మింక.

గీ. పాదుకల నిమ్ము; నెమ్మి నీవచ్చుదాఁక
గొలిచి యేల్బడినెట్టులో సలుపుచుందు
గడవులో రాక తడసిన గరళముఁదిని
చత్తునీ పాద మాన నిజమ్ము నమ్ము.

వ. అనిన రాముండిట్లనియె

తోహర: 'తమ్ముఁడ! నీయిష్టమ్మురీతిగా, దప్పక, నే జేసెదను; బొమ్మిక పాదుకలి మ్మంటివి కైకొమ్మని యిచ్చెను దయను ॥ రామ ॥

వ. అంత భరతుం డానందమొంది పాదుకల శిరసావహించి రామునకుఁ బునః పునః ప్రణామంబు లాచరించిన, దీవించి యిట్లనియె:

కీర్తన; ఆటతాళము.

ప్రజలను బాలింపుమీ తమ్ముఁడ! ॥ ప్ర ॥ సుజనులగాంచి సొరిది బూజించి వృజిన పథంబుల నెఱిఁగి తొలంగుచు ॥ ప్ర ॥ నీతి మానక ఖ్యాతిఁ బోనీకఁ దాతతండ్రులబోలి ధర్మనుగుణముగా ॥ ప్ర ॥ పేదసాదలను బ్రీతితోఁగనుచు నాదరమున మితమయిన పన్ను గొనుచు ॥ ప్ర ॥ రాక్షసనాశ మోక్షగుండేశ నక్షయఫలదుని నర్చన జేయుచు ॥ ప్ర ॥

వ. అని బోధించి శత్రుఘ్నుని భరతునికి సహాయంబుగా నుండుమని నియమించి తల్లులకుఁ మగుడ నమస్కరించిన, గైక రాముని కిట్లనియె;

తో: నీవు దేవుఁడవు; నిర్వికారుడవు; కేవల పరిపూర్ణుడవు: నావస జజునను నయిన దెలియ దరమవునే! పరమాత్ముఁడవు ॥ రామ ॥

కపటిని పాపిని కష్టచిత్తను నృపహంతను గావునను, నపరాధము నీకాచరించితిని నపనయించి కావు నను ॥ రామ ॥

వ. అనిన రాముఁడిట్లనియె:

తో: దైవకృతం బీసర్వం బని మది భావింపుము నాతల్లీ! ఈవనవాసము గడపి సుఖముగా నిదెవత్తును నే మళ్ళీ ॥ రా ॥ అస్థిర జీవనమువల ద్రోచి పరమాత్మ ధ్యానము బూను; సుస్థిరపదవికిఁ జూపు మార్గమది; శోకమేటికిఁక మాను ॥ రా ॥

వ. అని కైకమ్మకు విజ్ఞానంబుఁ గఱపి యందఱ వీడ్కొలిపిన, గదలి వచ్చిన మార్గంబులనే శీఘ్రయానంబున సచివభట సహితంబుగా నయోధ్యంజేరి యందఱిని వారివారి నివాసంబుల నిలిపి తా నందుండ నొల్లక భరతుండు —

క. నందిగ్రామము జేరియు
నందుఁ సింహాసనమున నాపాదుక లిం
పొందఁగ నిలిపియు నిరతముఁ
జందనకుసుమములఁ బూజ సల్పుచు మఱియుఁ. —

తో: ఫలభోజనమును వసుధాశయనము బ్రహ్మచర్యమును గాగ, సలలినియమము సలుపుచు దమ్ముని సహితముండెగడువేగ ॥ రా ॥ పాదుకాజ్ఞచేఁ బాలనజేయుచు బదునాలుగు వర్షములు, గాదగుకాలము గణనము జేయుచు గడుపుచు నుండె దినములు ॥ రామ ॥

క. అక్కడ రాముఁడు మదిలో
నిక్కముగాఁ దలఁచె నిచట నిలిచినఁబౌరుల్
ఇక్కడికి వచ్చుచుందురు
చక్కగ నెక్కడికి నయినఁ జనఁ దగు ననుచున్.

తో: అని తాళ్లూరి నారాయణకవి రామాయణమును హరికథను - ఘనముగఁ జెప్పెను గుణిత నయోధ్యాకాండము చిలుకును సుధను ॥ రామ ॥

ఇది వినువారల కిహసౌఖ్యంబులు గొదువలేక చేకురును ముదమున దుదకును ముక్తి లభించును మోక్షగుండ హరికృపను ॥ రా ॥ రామ! రామా! యనవే! శ్రీరామాయణకథ వినవే! గౌరీ! ॥ రా ॥

క. నాచేతనైనకొలఁదిని
జూచి రచించితిని దీని; సుజనులు నెఱసుల్
దోఁచినయెడ దిద్దుదు రని
నా చిత్తములోన నమ్మినా ననయంబున్.

అయోధ్యాకాండము - హరికథ

సంపూర్ణము.

శ్రీరామచంద్ర గురు పరబ్రహ్మణే నమః

అవిఘ్నమస్తు

# శ్రీమోక్షగుండ రామాయణము

హరికథ.

## ఆరణ్యకాండము.

* * *

క. శ్రీరామగుణ కథామృత
సారము జవులూరఁ జెవుల సక్తతఁ గ్రోలం
గోరెడు భాగవతాళికి
వారక కామ్యములు కొంగుబంగార మగుఁ॥.

వ. అంత శ్రీమద్రామమూర్తికిఁ జిత్రకూటాద్రియందున్న ఋషికాంతలు మంగళ
హారతులుపాడి రెటులనిన —

సురట - అటతాళము.

మా రఘుకులజాత! మహిజానమేత! జయమంగళం శుభమంగళం
మారకోటి సుకుమారశరీరా! జయమంగళం శుభమంగళం ॥
మౌనిహృద్గోచర! మహితతేజ! నీకు మంగళం శుభమంగళం ॥
మానితకామక్రోధాదిఖండన! జయమంగళం శుభమంగళం
మండలోజ్జ్వల మోక్షగుండరాఘవ! జయమంగళం శుభమంగళం ॥
మహినారాయణకవి మానసాధీన! జయమంగళం శుభమంగళం ॥

వ. అనంతరము శ్రీరామలక్ష్మణు లచటి మునుల వీడ్కొని గదలి యత్రిమహ
ముని యాశ్రమంబుఁ బ్రవేశించిరి. అమ్మహర్షి యెదుర్కొని తోడితెచ్చి పూజించె. సంత
సించి రాముం డిట్లనియె.

తో: వనయాత్రకు రావలసిన నెపమున నినుగనగలిగె మునీంద్రా అనయము నేన
గృతార్థుడ నయితిని; నన్ బ్రోవు కృపాసాంద్రా! ॥ రా ॥

వ. అనిన, నత్రిమహాముని యిట్లనియె;

కీర్తన - ఆదితాళము.

కరివరద కామితఫలదా! ప్రోవవే కరివరదా! ॥

ధరను నీమాయలో దగులక మెలగగ దరమే యజహరసురలకైన ॥ కరివర ॥ నను బావనుని జేయగ వచ్చిన నీ వనుమాటలు నా కద్భుతములు ॥ గరివర ॥ నారాయణకవి వందిత! నంసారతారక! నేనిక ధన్యుడనో ॥ కరివర ॥ వసుధమోక్షగుండవాస, దయానిధే యనురుల బాధలు హరియింపుము ॥ కరివర ॥

వ. అంత ననసూయాదేవి సీతాదేవిని గని,

తో: అన్ని విషయముల ననుసరింప దగు నధిపతిని బతివ్రతలు, గ్రన్నన నీ వటు గావించుటకయి కదలి వచ్చితివి మేలు ॥ రామ ॥ చేడియ నీగతిఁ జెలగుచు దాఁ గౌని యాడియు సమ్మానించెన్; వాఁడని పూలును, మాయని చీరెలు వరభూషలు నర్పించెన్ ॥ రా ॥

వ. పిమ్మట రాముండు దండకావనమునకు మార్గముఁ జూప శిష్యులఁ బంపుమన నత్రియిట్లనియె:

క. లోకులకుఁ ద్రోవఁ జూపెడు
నీ కెవ్వరు త్రోవ జూప నేర్తురుఁ వేడ్కన్
లోకానుసరణిచే నీ
వీకరణిం గోరితివి పరేశ! యనంతా!

వ. అటులనే బంపెద నని తనశిష్యులలోఁ గొందఱిని బంపె. వారి వెంబడి గదలి.

రగడను బోలిన కీర్తన.

దండకాటవికిని వారు దగఁజొచ్చిరి ధృతిని,
బెబ్బులు లెలుగులుఁ బొబ్బమెకంబులు,
గస్తురిమృగములు ఖడ్గశరభములు,
గండకఖగములు గొండయేనుగులు,

నడవిపందులును, హయచయంబులును,
నక్క లరణ్యపు గుక్కలు దుప్పులు,
జెవులబోతులును జెలగుబాతులును,
కోతులగుములును గొండముచ్చులును,
దాసరిపాములు, నూసరవెల్లులు,
పెనుసివంగులును బునుగుబిల్లులును
నుడుములు కణుజులు నుడుతలు మిడుతలు
ఘూకచయంబులు గాకులమూకలు
మొదలగుమృగములు పురుగులగుంపులు,
భూతగణంబులు భేతాళంబులు,
బ్రహ్మరాక్షసులు పై బై నార్చుచు,
దిరుగుచు జనులను దిగులొందించెడు ॥ దండకా ॥

వ. ఇట్లు దండకారణ్యంబుఁ జొచ్చి యత్రిశిష్యుల వెనుకకుఁ బంపి యొంటిగా నర ణ్యంబునఁ బోవుచుండ,

తో : శూలము భుజమున సొంపుగదాల్చి కరాళవక్త్రమును దెఱచి, వాలాయముగా వచ్చెవిరాధుఁడు వడి నార్చుచుఁ జేజఱచి ॥ రా ॥

వ. ధీరులవలె నీనారీమణితోఁ గూడ గాఱడవిలో దూఱిదూఱి వచ్చెదు మీ రెవరు? చరాచరంబులుగూడి వచ్చినను దురంబున హరింపగల విరాధుండను. బ్రతుకఁ దలచిన నీ సతిని విడిచి మీ యిరవుల కరుగుఁడు, అనిన రాఘవుండు విరాధుని గనుంగొని.

చ. దశరథరాజసూనుఁడను, దానవ! నాది యయోధ్య; తండ్రిచే
విశదముగాఁగఁ బంపఁబడి వేగమె వచ్చితిఁ గానకున్; భవా
దృశమగు రాక్షసాళిని వధించుటయేబని నాకు; పత్ని యీ
శశిముఖి సీత; యీతఁ డనుజాతుఁడు లక్ష్మణు; డేను రాముఁడన్.

వ. అనిన నతండు బెబ్బులింబోలు నా బొబ్బకు మునులుబ్బు చెడి తబ్బిబ్బయి బొలుదురు. మీ రన నెంత, పంతంబు మీఱి యింతింతలుగా మీగొంతులు గొఱికి రుధిరంబు గ్రోలుదురా! నరాధమా!

కమాస్ : ఆదితాళము

నిలునిలు మో భూవరా ॥ నిలు ॥ బలిమిని నిను నే బట్టి వధింతును ॥ నిలు ॥ బలము గలిగినన్ దలగక నీపునిలు ॥ నిలు ॥ ముప్పురి నొకపరి గ్రొప్పు సెడగ నే నవ్వుచు గైకొని నమలుదు నిక ॥ నిలు ॥ రాక్షసులకు నరభక్షణ మగు విధి; మోక్షగుండవిభు సాక్షిగ గదలక । నిలుమో ॥

వ. అని ప్రగల్భంబు లాడుచు శూలంబుచే వైచి సీత నెత్తుకొని యాకాశంబున కెరిగిన.

తో: నరగున రాముఁడు శరములు వైచిన, సరకుగొనక పైకెగయ, బసవడి నొక ఘనశరమున శూలము విఱుగగ రాముఁడు వ్రేయ ॥ రామ ॥ అంతట సీతను నవని ద్రోయ గను నాక్రందనమునరాగ, గాంతుడు రాముడు గరుడాస్త్రంబున గ్రక్కున దించెను బాగ ॥ రా ॥

వ. అప్పుడు.

గీ. ధరణిజంగొని, యర్ధచంద్రప్రయుక్తి
రాఘవుఁడుగూల్చె దైత్యువిరాధు వాని
ప్రాణతేజము దివ్యవిమాన మెక్కి
చనుచు నిటు లనెరెండుహస్తములు మోడ్చి.

తో: విను రఘువర! నే విద్యాధరుడను! దూర్వాసుడు నన్ను గనలి శపించిన దనుజాకృతిమై గడపితి నీక్రియ నేను ॥ రామ ॥ నీచే జచ్చితి; నిన్నునెఱింగితి; నీవు పరాత్పరు డగుదు. నా నీచకృత్యములు నేటికి బోయెను; నేను ముక్తికి జనుదు ॥ రామ ॥

వ. తదనంతరంబ శ్రీరామ-లక్ష్మణులు శరభంగముని యాశ్రమంబున కరిగిన నాతఁడెదురేగి నమస్కరించి,—

బేహాగ్ : అటతాళము.

స్వామి శ్రీరామ! రామచంద్ర నమో! ॥ స్వామి శ్రీరామ ॥ రామ ॥ నీ సహితముగ నీమూర్తి హృత్పద్మమఁగాంచఁ దపమాచరింతును ॥ స్వా ॥ నే ధన్యుడ నయితి; నే గడ తేరితి; నేటికి గోరికలు తీఱె ॥ స్వామి ॥ మోక్షగుండ పురాధ్యక్ష, నారాయణరక్ష, నీ పదములు నమ్మితి ॥ స్వామి శ్రీరామ ॥

చ. అని గొనియాడి గంధ కుసుమాక్షతలుఁ గొనితెచ్చి పూజనం
బొనరిచి, గందమూలముల నొయ్యన నిచ్చిన నారగించి, రా
వెనుకన దత్సమీప మునిబృందము లెల్లను రామచంద్రుఁగాం
చను శరభంగ మౌనియ జనమ్మను డాసెఁగుతూహలమ్మునన్.

తో : రాముఁడు సీతాలక్ష్మణయుతముగ నామునులకు మ్రొక్కగను, నామోదంబున
నందలు రాముని అర్చించిరి భక్తిగను ॥ రామ ॥

వ. అప్పుడు.

హిం. కాఫీ ఆదితాళము.

తాపకదాసులము రామ రామ! భావములను గొల్తుము! నీవు వైకుంఠుడవు శ్రీదేవియె
సీత యగు రామ ॥ తాపక ॥

పరశంఖచక్రములు రామరామ! భరతశత్రుఘ్నుఘనులు; ధర లక్ష్మణుఁడే శేషుఁడ
నగుచును తనరఁ బుట్టినవారు రామరామ ॥ తాప ॥

రాక్షసులనుగూల్పను రామ, రక్షింప సాధులను, నీక్షితి గలిగితివి రామ మోక్షగుం
డేశుఁడవై । రామ ॥ తాప ।

వ. ఇట్లు పొగడి,

తో : తమతమవౌ నాశ్రమములు నూడగ దనను రమ్మనుచు బిలువ, ప్రముదంబున
జని పరికించెను వారు పరమభక్తితో గొలువ । అచ్చటచ్చటను నస్థులు శిరములు నగప
రాముండనెను ; 'నిచ్చదెలుపు డివి యెక్కడి' వనగా—నెలమిని వారిట్లనిరి ॥ రామ ॥

గీ. రక్కసులు రావణునియాజ్ఞ నుక్కుమిగిలి
పరహితార్థుల నిరపాయకరుల మునుల
పలలముఁ మెక్కి పాఱవైవంగఁ బడిన
ప్రోవులియ్యవి పుట్టె లెమ్ములు మహాత్మ!
తాపసులరక్ష నీకు వ్రతమ్ముగాదె!

వ. అనివేడిన,

తో: సాధువులకు గడుబాధచేయు నసురాధములసుబోకుండ నీధర గూల్తును నిక వారల భయమేమి మీకు లేకుండ ॥ రామ ॥

వ. అని శపథంబుగా రాముఁడు పలికిన, మునులందఱుడెందంబుల నానందంబు నొందుచు,

ఆర్యావృత్తము.

జయజయ తులసీదామా! జయజయ రవికుల సుధాంబునిధిసోమా! జయజయ తారక నామా! జయజయ త్రిజగద్విభో! పరంధామా!

వ. ఇట్లు వారు పొగడుచుండఁ గ్రమంబున వారి యాశ్రమంబులన్నియు జూచుచు సుతీక్ష్ణాశ్రమంబుఁ జేరె. అందు,

తో. రామదివ్య మంత్రంబు జపించెడు నా మునిపర్యుఁడు లేచి రాముని కెదురుగ రయమున జని తా నేమముతోఁ దోడ్తెచ్చి ॥ రా ॥

ఆదితాః (గురుమహారాజ) వలె.

దశరథరామా! దశరథరామా! దైవలలామా ॥ దశరథరామా ॥ సరగున నీమంత్రజపమును సలుపగ దరమె! గౌరీతరుణికి దక్కగ ॥ దశ ॥ నీపదసేవయు నీదు దర్శనము నాప్రాప్తంబున నాకులభించెను ॥ దశ ॥ అక్షయ సృష్టివిలక్షణ చిన్మయ! మోక్షగుండపురరక్ష పరాత్పర ॥ దశ ॥

వ. ఇటుల నుతించిన రామచంద్రుండు——

పంచచామరము.

సుతీక్ష్ణ నాదుమంత్రముఁ విశుద్ధితో జపించి హృ
ద్గతుండనైన నన్ను భక్తిఁ గాంచి గొల్చుచుందువౌ!
నతిప్రమోద మయ్యె నాకు నర్థి మోక్ష మిచ్చితిఁ;
క్షితిఁ జనింప వింకమీఁద సిద్ధమో మునీశ్వరా!

వ. అని పలికి మఱియు,

తో: అరయగ మాగురుఁడగు నగస్త్యమునివరుని జూడ బోవలెను; బిబిబిబి

వ. ఇట్లు పోవుచు,

క. సీతారాము లగస్త్య
భ్రాతృగృహాంగణము జని భక్తిని నాతం
డాతిథ్య మియ్యగొని సం
ప్రీతునిగాఁ జేసి చనిరి ప్రియమున నవలన్.

వ. ఇట్లు యగస్త్యాశ్రమంబు సమీపించి సుతీక్ష్ణమునింగాంచి–

తో : మీగురునకు మా యాగమన వార్త సమీహితముగ నెఱిగింపన్, వేగనె
వెడలి సుతీక్ష్ణుఁడు దా గదలెను రాముండంపన్ ॥

తో : ఆ మహితాశ్రమమందు గురుఁడు శిష్యాశితన్నుఁ గూడన్ సామమున
మహిమమును శ్రావ్యముగాఁ బాడన్.

గీ. 'అనుఁగుఁదమ్ముఁడు నర్ధాంగి యనుగమింప
వచ్చె మిముఁ జూడనిదె రఘూద్వహుఁడుస్వామి'
యన్న నుప్పొంగి శిష్యసంపన్నుఁడగుచు
స్వాగతం బిచ్చె నర్ఘ్యపాద్యముల గురుఁడు.

వ. ఇట్లు చని జానకీలక్ష్మణ యుతంబుగా రాముండు మ్రొక్కన లేపనె
నంబుఁ జేసికొని పర్ణశాలకు గొనివచ్చి పీఠంబిడి పూజించి ఫలాహారంబులు వెట్టి
డిట్లనియె :

బిలహరి : ఆదితాళము.

అత్యంతసంతోషముగా, భవదాగమనంబు మా ॥ కత్యంత ॥ ప్రత్యం
శోధించిచూచిన నిత్యానందమై నీదివ్యదర్శన ॥ మత్యం ॥ నీనామమంత్రాను
లకు మానుగ గోచర మౌ నీదుదర్శన ॥ మత్యంత ॥ మోక్షగుండమందు వె
ముతో సాక్షివైనిలిచిన సర్వజ్ఞ మీ రాక ॥ యత్యంత ॥

క. రాజస సాత్త్వక తామస
రాజితగుణములను గలిసి బ్రహ్మహరి శివుల్

గాఁ జనియించియు జగములఁ
నోజను బుట్టించి పెంచి యుడుపుదు వనఘా.

తో: క్షీరాంభోనిధి తీరంబున మును జేరి యజాదులువేడఁ, గ్రూరరాక్షసులఁ గూల్ప దలచి యవతార మొందితివిచూడన్ ॥ రామ ॥

క. అప్పటినుండియు దర్శన
మెప్పటి కగునో యటంచు నెదురారయుచున్
దప్పక యీ స్థలమున నే
నొప్పగఁ దప మాచరించుచుందు ననంతా!

వ. నేటికిఁ బ్రత్యక్షంబైతివి నా మనోభీష్టంబు దీరె నేనుగృతార్థుండనైతి.

ఉత్సాహ వృత్తము.

గౌతమీతటంబునందుఁ గలుగు పంచవటికి నీ
సీతతోడ జేరు; మది వసింప మంచితావగున్
బ్రీతితో మునీంద్రు లందు బెక్కురుంద్రు రుచ్యపి
ఖ్యాతమౌ ఫలాదు లచట నలరెడున్ సమృద్ధిగన్.

వ. అని చెప్పి యక్షయతూణీరబాణంబులును ఖడ్గంబులును మహేంద్రచాపంబు నిచ్చి వీడ్కొలిపిన నగస్త్యునకుఁ బునర్వందనంబులు సమర్పించి పంచవటికిఁ బోవుచున్న, అప్పుడు——

తో: దారినడుమ కొండనుబోలిన యాకారముతో గనబడిన ॥ ఘోరుజటాయువుఁ, జూచి । నెమ్మదిని జోద్యమంది చొప్పడిన ॥ రా ॥ తమ్ముఁడ! లక్ష్మణ! తెమ్ము ధనుర్బాణమ్ములు ద్రుంచెద వీనిలెమ్మ, నవుడాలించి గృధ్రపతి, యమ్మెయిఁబలికెను బూని ॥ రామ ॥

కాఫీ : ఏకతాళము.

రామనృప, జటాయు వనెడు నామమువాడ: నే భూమిపతికి దశరథునకుఁ బొలుపగ సఖుఁడ ॥ రామ ॥ ఈ వనంబునందు నేనునెపుడు మెలగెద నోదేవ మీకు హితము నేను దెలుపఁ దొడగెద ॥ రామ ॥ పంచవటికి బోవుచున్నవారు హిరలు! మించి

దనుజులప్పుడపుడు మెలగుచుందురు ॥ రామ ॥ మోక్షగుండదేవ, నీ వె మా స పో షు మ!
యీక్షమాకుమారి నరసి యేలుచుండుమ ॥ రామ ॥

వ. కావున; నేను పథాధ్వుఁడగాను, మీ హితంబుఁ గోరువాడనసుఁడు, మన్నించి యనంతరంబున ——

మధురగతిరగడ - పల్లవి సహితము

పంచవటికిఁ జనిరి వారు పంచవటికి జనిరి, కుంద కురంటక కోవిదారములు, జందన తిందుక సాలవృక్షములు, మందారంబులు మామిడిగున్నలుఁ, బొందుగఁ జెలఁగెడు పొగడలుఁ బొన్నలు, మాలూరంబులు, మాకందంబులు, దాళంబులు హింతాలచయంబులు, దానిమ్మలును గదమ్బవృక్షములు, నాడెములగు ఘననారికేళములు, కరక లుసిరికలుఁ గంటకఫలములు, మరువకములు న్యగ్రోధవృక్షములు, శ్రీగంధంబులుఁ, జిరుబిల్వంబులు, బాగగు జంబ్రీఫలభూరుహములు, నౌదుంబరములు నశ్వత్థంబులు, మోదుగ లనఁటులు మొదలగు తరువులు, ఫల కిసలయ సుమ భరితము లగుచును, వెలయుచు నుండఁగ వేగమె కనుచును, శుక పికరవములు సొంపుగ వినుచును, బ్రకటిత సీతా రామలక్ష్మణులు పంచవటికిఁ జనిరి ॥

ఆ. ఇటుల బంచవటికి నేగి, నిర్మలమైన
తావుఁ జూచి యచట దాశరథులు
పర్ణశాలఁ గట్టి బాగుగఁ బూజించి
యొసర నందుఁ జేరి రుత్సవమున.

వ. ఇట్లు పర్ణశాలయందు నివసించి మునుల సద్గోష్ఠితోఁ గాల క్షేపము చేయు చున్నంత ——

సీ. అంతట లక్ష్మణుం డన్నను వదినెను
నుపచరించుచు నుండి, యొక్కనాఁడు
ఫలములుఁ దే బోయి వనమున దిరుఁగుచో
నురురుచుల్ దేలెడు నొక్క ఖడ్గ
మధిముఖమైరాఁగ నదిగొని యచ్చటి
వెదురుజొంపంబును జిదురుపలుగ

సఱకె; నాచోటఁ దన్మయుఁడగు ముని చచ్చె;
సౌమిత్రి యామునిచావుఁ జూచి

గీ. వెఱచి, మూర్ఛిల్లి తెప్పిరి వెతఁ గుడుచుచు
నన్నకడకేగి నే బ్రహ్మహత్యఁజేసి
నాఁడ! గతి యేమి యని చరణముల వ్రాలి
పగవ నూరార్చి శ్రీరఘువర్యు డనియె:

తో: అచటి మునులఁ గని, యయ్యా! యిది యెట్లని రాముఁడు ప్రశ్
ప్రచురంబుగ వారలు స్వామీ! భయపడకు డంచు వారింప ॥ రామ ॥

వ. శూర్పణఖమగని విద్యుజ్జిహ్వుఁడనువాని లంకకుఁ గాపుంచి రావ
దిగ్విజయార్థంబుగాఁ జనిననాఁడు—

ఆ. అల్ల లంకఁ దాన యపహరింప దలంచి
మాయ సేర్వ నెటకొ పోయె నతఁడు!
రావణుఁడు వచ్చి బావమఱది మోస
మెఱిఁగి కనలి వెదుకఁ దఱలె వడిగ.

వ. పాతాళంబున నున్న యతనిఁ జేరి యుపక్రమవిక్రముండై—

తో: తప్పక యాతనితల దునుమాడియు దనపురి జేరెను. మఱల; జెప్పన
జెప్పె నీ యిష్టముచొప్పున బొమ్మని యవల ॥ రామ ॥

వ. శూర్పణఖ తనయుండు జంబుఁడనువాఁడు తండ్రిపగఁదీర్చుటకయి సు
గూర్చి బహుకాలంబుఁ దపంబుఁ జేయుచున్న—

గీ. తపమునకు మెచ్చి ఖడ్గమున్ దపనుఁడంపె;
తాను రాకయ నిసుఁబంపెఁగాన నొల్ల
నంచుఁ గోపించి పాదదూఁటి దనుజుఁ డుండె;
నదియ సౌమిత్రిచేఁ బడిసట్టి కత్తి.

వ. ఇట్లుపడిన ఖడ్గముఁ గాని ప్రాతముఁడు—

త్రో. వెదురుఁజొంపమును జిదుమగ జంబుడు. విగతపదనుఁడై యొఱగె; నది గని ముని యని యదరుచు వచ్చెను ఇది మంచిది వెతతరిగె ॥ రామ ॥

త్రోహర : ఈవిధిగానే రావణాదులజయించి బ్రోవు మ మ్మనిరి; తావకచిత్తము దయ యుంచుం డని తాపసు లెల్లరు జనిరి ॥ రామ ॥

క. అంతట సీతారాములనెంతయుఁ బూజించి ఫలములిచ్చి యథేచ్ఛన్
సంతుష్టులఁ గావించుచు
సంతతమును గొల్చుచుండె సౌమిత్రితగన్.

వ. అప్పుడు చుప్పనాక యథాప్రకారము సుతునకు బోనపుటక గొనివచ్చి ఖండిత తనుం డయియున్న కొడుకుంగాంచి దుఃఖించి యగ్నిసంస్కారంబుఁ జేసి సమీప స్థులయియున్న మునులను గాంచి క్రోధతామ్రాక్షయయి.

బేహాగ్ : ఆదితాళము.

ఓహెూ పాపాత్ములారా! యుండు డోహెూ మంచి దోహెూ ॥ సాహసమున నింత ద్రోహము చేసివా రయో ॥ మారులేకయే నా కుమారు జంపినయట్టి వీరు డెవ్వడో వాని పేరు దెలుపుడు నాతో ॥ నో ॥ మోక్షగుండశౌరి యీక్షణమున వారిపక్షమైనను గాని శిక్ష జేయక మాన ॥ నోహెూ ॥

వ. అని కరాళించి పయికి లంఘించిన శూర్పణఖదెబ్బకుఁ దబ్బిబ్బు నొంది జడదారులు వడవడ పడంకుచు,

ద్విపద. అనబోకు మమ్ముల నతివరో యొక్క
ముని కుమారుఁడు వచ్చి ముదమున వెదురు
జొంపంబు నఱకెడుచో నీసుతుండు
జంపంగ బడియె నాజడదారి పిదప
నాపర్ణశాలకు నరిగెను; నీవు
పోపొమ్ము వానిజంపుట కని పంపి
దీనికృతంబున దెగును రావణుఁడు
మానక గలుగును మనకు సౌఖ్యంబు

లని యుబ్బుచుండిరి యచటితాపసులు
చనుదెంచె నాపర్ణశాలదగ్గఱకుఁ
జయ్యన నడుగులజాడవెంబడిని
నయ్యసురాంగన నవ్వడుగాంచి,

క. నవ్వుచు రాముం డనియెను;
నివ్వనమున కేలవచ్చి తెందుందువు నీ
వెవ్వరిదానవు? తెలుపుము
నివ్వెఱఁగగు మాకు నేడు నినుఁ గన్గొంతఁ.

వ. అనినఁ జుప్పనాతి—

తోహర : రాక్షసరాజయి లంకను నేలెడు రావణు చెలియలి నగుదు; నీక్షితి
ప వినుడు శూర్పణఖ; యెఱిగింపుడు మీ రెవరు? ॥ రా ॥

వ. అనియడిగిన రాముండు,—

కళ్యాణి : ఆదితాళము.

ఆకర్ణింపుము భామినీ ॥ నీవాక ॥ రాజకుమారుఁడను రాముడు నాపేరు సాకేత
మాది ॥ యాక ॥ సీతయీయమ నాదుకులాంగన; ఈతడు తమ్ముఁడు నాకు
క ॥ ఈక్షితి దశరథు డెలమి దండ్రియగు మోక్షగుండవిభుసాక్షి ॥ ఆ ॥

ఆ. తండ్రియాజ్ఞ జేసి దండకవనముఁ
దిరుగ వచ్చినాము తెలవ మేము;
నీవు మాకడకును నేడు వచ్చుట కేది
కతము దెలుపవమ్మ గలికిమిన్న!

వ. అని అడుగుటయు,

ఉ. రావణు నాజ్ఞజేసి యీ యరణ్యమునన్ జరియింతు; మౌనులఁ
నీ వనమందుఁ దాపసుల నేరినిఁజూచిన మోహితాత్మనై
నావలవంత ముంతు, మది నచ్చినవానిని నిచ్చదీఱఁగా

భావజకేళిలో బలిమిఁ బట్టి రమింతును, నొప్పకున్న నే
వావిరి బట్టి మ్రింగుదు ధ్రువం బిది; నా కెదురాడ రెవ్వరుఁ౯.

హిం. కాఫీ - అటతాళము.

మారుకేళి దేలింపుమా మారశరీరా నను ॥ మారు ॥ మారుబారి ద్రోయకుమ కోరి నిను మోహించితి ॥ మారు ॥ వేడుకగ నీకు నాను నీడుజోడుగనుండు; నేడు మోక్ష గుండహరితోడు నిను బాయజాల ॥ మారు ॥

వ. అనిన శ్రీరాముం డిట్లనియె,—

తో: పరసతిఁ దల్లిగ భావింతును దుర్భరములు నీదుర్భాషల్, సరగున నాయన జన్మని లక్ష్మణు సరసకేఁగి గనుమాశల్ । ॥ రామ ॥

అనవిని యా దనుజాంగన సౌమిత్రినిగని వలపుల దెలిపె౯। మనమున శ్రీరాముని భావమ్మునుగని యాతండిటు లనియె౯ ॥ రామ ॥

మత్తకోకిల

నేను వీరికి సేవకుండను నేఁడు నన్ను వరించినన్
జాన నీవును దాసి వౌదువు! చాల సిగ్గులుగల్గెడున్
గాన రాముఁడె నిన్నునేలును గ్రక్కునన్ జను మన్న నా
దానవాంగన రాముఁజేరి ముదంబునన్ రతిగోరినన్.

క. ఇద్దటితోఁ బడఁజాలను ;
ముద్దియ లేనట్టివాఁడు ముదితరొ యతఁడే
వద్దన్న నేమి ! యాతని
యొద్దకె చను మన్నఁ గనలి యుగ్రరవమునన్.

తో : అచ్చటి కిచ్చటి కలయ ద్రిప్పుచును హాస్యము లాడెద రౌర । చెచ్చెఱ నే సీతను మ్రింగియు జెలగి నిన్ను దమితీఱ ॥ రామ ॥

తో : కూడుదు ననుచును గూయుచు గదిసిన కూళరక్కసిని జూచి, పోడిమిచె యాభూమిజ వడకగ బొసగ లక్ష్మణుఁడు లేచి ॥ రామ ॥

ఫరజ - ఆదితాళము

కోరికను దీర్చెద - రారావే చెలి ॥ కో ॥ నీరూపరేఖ నే గనినంత పారెను మోహము మీఱె నే నీదు ॥ కో ॥ మది నే గందాపని యంటిని గామిని విడువగ గల నటవే నీదు ॥ కో ॥ మోక్షగుండహరి సాక్షిగ నీపని దీక్షగ నిప్పుడె తీర్చెదనే చెలి ॥ కో ॥

వ. అనిన విని కోపంబు విడిచి యానందంబున సౌమిత్రిని దగ్గఱిన రామునాసతిఁ గయికొని లక్ష్మణుండు——

తో : కరమున ఖడ్గము బిఱబిఱ దాలిచి కదియ జేరి కడునలుకన్, కలకల నాసా కర్ణంబులుదెగ, నఱికెను రక్తమ్మొలుకన్ ॥ రా ॥

వ. ఇట్లు ముక్కుచెవులఁ దుదముట్ట గోసిన, రక్తంబేఱులైపాఱ, సిగ్గును దుఃఖంబును దనను ముంప శూర్పణఖ శీఘ్రయానంబున ఖరాసురుని యాస్థానంబునకుం జనిన, నవ్వికృతా కారంబుఁజూచి, ఖరాసురుండు——

క. నీ కీయవస్థ వచ్చుట
కేకారణ మమ్మ నాకు నెఱిఁగింపఁ దగున్;
శోకింపకు నే నిప్పుడె
లోకేశుల నైన క్షణములోన జయింతున్.

తో : రాముండను నొక రాజకుమారుఁడు భీమబలుడు తమ్మునితో, భామామణితో వచ్చి గౌతమీసామీప్యంబున ధృతితో ॥ రా ॥ నెమ్మది నుండగ నే జని పలచిన నమ్మతి జూపక నేడు, తమ్మునిచే, కర్ణమ్ములు ముక్కును దఱిగించెను నీవు చూడు ॥ రామ ॥

వ. అనిన, ఖరాసురుం డదరిపడిలేచి దూషణ త్రిశిరులువెంట రాఁ జతుర్దశ సహస్ర పరిమిత రాక్షసబలంబులఁ గూడుకొని కదలె. ఆ చప్పుడుప్పరంబు నిండి మెండుకొని దిగంతంబులు బ్రతిధ్వనులియ్యనది విని రాఘవుం డనుజుని జూచి,——

ఉ. రాక్షసకాంత పంపున దురంతకదానవు లొక్కపెట్టునన్
లక్షకొలంది వత్తురదె లక్ష్మణ, చూచితె! నేను వారలన్
శిక్ష యొనర్తు నంతకును సీతను నొక్క గుహాంతరాళమం
దీక్షణ ముంచి ప్రోవు మిఁక వేగ ముటంచును బంపి పిమ్మటన్.

వ. కోదండరాముం డఖండ ప్రచండ మార్తాండ సదృశకాండంబులు తండోపతండంబులుగాఁ గోదండంబున నంకించి యెదురుచూచుచున్నంతఁ దత్ క్షణంబున రాక్షస దళంబులు చుట్టుముట్టి,——

తో: కొట్టుడు తిట్టుడు పట్టుడు ముట్టుడు కోయుడు ద్రోయుండనుచు, నట్టహాసమున నసురులు తరు-శిల లంబులు వైచిరి తఱచు ॥ రామ ॥

వ. అప్పుడు,

తో: బాణపరంపర. బఱపి రాఘవుఁడు పటుతరసేనల నెల్ల బ్రాణంబుల కెడబాపె నిముసమునఁ బరమమునులు రంజిల్ల ॥ రా ॥

వ. అంత ఖరాసురుని యానతిఁజిత్త ంబునఁగొని దూషణుండు భీషణంబుగాఁ జని.

కమాసు : ఆదితాళము.

నీ వన నెంతరా! నరాధమా నాకు ॥ నీ వన ॥ కావరమా తీవరమా చేవ చెడ బ్రేపులు ప్రోవులుగా విదలించెద ॥ నీ వన ॥ మానవులా దానవుల బూని రణక్షోణిఁ జయింపగ, మానుము మానుము ॥ నీ వన ॥ కండలును గుండెలును జెండెదను దండిగ! శ్రీమోక్షగుండవిభుని యాన ॥ నీ వన ॥

వ. అని ప్రగల్భంబు లాడి కొన్ని శరంబుల ముంచి మహాట్టహాసంబుఁ జేసిన నవ్వి శ్రీరాముం డిట్లనియె:

తో: నీవారలగతి నీ వెఱిఁగియు నిటు లీ వేటికి బ్రేలెదవు। చావు మూడి యిచ్చటికి వచ్చితివి గావున నిటు గూసెదవు ॥ రామ ॥

తో: మంచి దుండు మని మహనీయాస్త్రము మించి యురంబును గాడ, నంచితముగ వేయంగ నవనిఁ బడి, యతడు నీల్గె నపుడాడ ॥ రామ ॥

క. పిమ్మటఁ ద్రిశిరుం డతి కో
పమ్మునఁ జనుదెంచి యోర బలవంతుఁడ వే!
రమ్మా నా యెదుటికి బీ
ర మ్మెల్లను గాంతు నని శరమ్ములు వైచెఁ.

వ. నిర్వక్రపరాక్రమంబుగల శక్రద్వేషులు పెక్కండ్రు లెక్కకు మిక్కుటంబుగాఁ బిక్కటిల్లుచు నా చక్కికి వచ్చిన నొక్కొక్కరిని ముక్కలు ముక్కలుగా జెక్కి చిక్కువాపినాఁడ ఎక్కడనో డాగియుండి యిప్పు డొకరుండ విక్కడికి గ్రక్కున వచ్చితివి, తక్కక నీకొక్కఁ జీల్చెద. నీకు దిక్కెవ్వఁడుండురా దానవా! ఇదివఱకు నా ప్రతాపముఁ గానవా!

తో: అని యొకఘన శరమును సంధించియు నతిత్వరితమున వ్రేయుచునుకొని యాతని మూఁడు శిరంబులు, మనిసి నడిమె నాచాయ ॥ రామ ॥

వ. అంత ఖరాసురుండు కోపోద్దీపితుండై యెదిరించి వచ్చినఁగాంచి, రాముఁడు—

పూరికల్యాణి, ఏకతాళము.

ఓరి దానవా, పోరక మానవా! చేర వచ్చినావా! యూరక జనవా! ॥ ఓ ॥ మున్నుజోరి, మన్నుగూరి మృతులై యున్నవారి నన్నుజాఁవోకయే వన్నెదీరి చెప్పుమాటి యనికిని నెన్నజేరి నన్ను జీరితివి ॥ యోరి ॥ దండి మోక్షగుండ రక్షకుఁడ నై మెండు కక్ష జండరాక్షసులనిలిజెండుదీక్ష నొందుదీక్ష వెడలితి; నుండు రూక్ష నింక శిక్షయిది ॥ నోరి దాన ॥

వ. అనిన ఖరాసురుం డిట్లనియె: దిట్ట తనంబునలోకాధికుండగు రావణు తోఁ బుట్టువు మీకట్టెదుటికి వచ్చిన నట్టహాసంబున నట్టి యపకారం బప్పట్టున నట్టిగ నొనర్చితివి! కట్టా యిట్టి చెట్టవాని నెట్టు సహింపవగు. చెగువగల మగవాడ వయిన మగువుతప్పక జగ ఉంబునకుఁ దగులువడుము. నే మగువను గాను, నీపోగు రిసరఁ జేసెదఁ దులువా! నా యెదుట నిలువగలవా! అని పలికి కఱకుటమ్ములు పెక్కులు వైచిన, నొలయక రాముండు—

పంచచామరము.

వృథాభిమానమైనపల్కు పిట్టనీఁగి పల్కఁగన్
బథంబుగాదు; నీవు మేటి బంటవైన నిల్వరా
మథింతు నీదుమర్మముల్! గ్రమంబునన్ రణోర్విలో
వధింతు నీశిరంబు నేడు వ్రయ్యవ్రయ్యలైపడన్.

వ. ఇట్లు పలికి యొక్క యమోఘాస్త్రంబు ధనువున సంధించి,

తో: ఆకర్ణాంతము లాగి విడువగను నది చని యాతని శిరము, బ్రాకటముగ నిలపైన గూల్చె సురవరులు మే లనగఁ గరము ॥ రామ ॥

వ. ఇట్లు ఖరాసురాది రాక్షసుల నిశ్శేషముగ వధించినపిమ్మట సీతాలక్ష్మణులు గుహలో నుండి వచ్చి; నిహతులయిన రాక్షసులగని యాశ్చర్యంబునొంది, రామున కుప చరించి యిష్టగోష్ఠిగా నుండిరి.

తో : అంతశూర్పణఖ యాక్రందించుచు నపుడు లంకకును నడిగె; సంతోషంబున సభకు జేరి రాక్షసపతిపదముల కెఱగె ॥ రామ ॥

వ. అప్పుడు రావణుండు దాని వికృతాకారంబుఁ జూచి.

బేహాగ్ : ఆదితాళము.

అపకార మెవ్వరు చేసిరమ్మ ! వారిపేరు జెప్పుము పిందుకొమ్మ ! ఈతీరున దుఃఖ పడకమ్మ ! నాకె వారిఁ బోరి చంపుదు ॥ నపకార । ఆఖండలాదులు వచ్చినారా । మోక్ష గుండ హరి పంపినట్టి వారా ! పాలనుదిండు లేలత్తపడరైరా ! తుండెములుగ జెండివేసెద ॥ నపకార ॥

వ. అనప్పుడు, దుష్పనాతి యిట్లనియె :

క. ముని వేషధారి రాముం
డను రాజకుమారుఁ డొక్కఁ డతివయుదమ్ముం
డనుచరులై తనుఁగొలువఁగఁ
జనుదెంచెను బంచవటికి నరభసలీలన్.

క. ఆతని యిల్లా లగు నా
సీతాసతి చక్కఁదనముఁ జెప్పందరమే!
భూతలమున నాకంబునఁ
బాతాళమునందునైనఁ బ్రతిలేరునుమీ!

బేహాగ్ : ఆదితాళము.

ఆ సుందరి యింపిమే యందమంత ! జగమందు నెందుఁగాన నా పనందు ॥ ఆ సుందరి ॥ మాటలచే మటని మీటి నేలు ! నెఱసీటు గల్గు వాల్ చూపులు మీలు ! జిగి తేటలయిన చెక్కు లద్దములు । దాని తోటి పొందే చేయు వేనవేలు । మరుని మీటి నేలు ; వాల్ చూపులు మీలు, ఆ చెక్కుటద్దములు పొందే చేయు వేనవేలు ॥ ఆ సుందరి ॥

కొండ లాసిబ్బెపుజనులతీరు । వేదండము తిన్ననినడకసౌరు ! మోక్షగుండ శ్రీనాథుని సతిని మీఱు । బ్రహ్మాండములో జాసిక సరిలేదు! సిబ్బెపుజనులతీరు; తిన్ననినడకసౌరు, శ్రీనాథుని సతి మీఱు సలదానికి సరిలేదు ॥ ఆ ॥

తో: దాని నీకుఁ జే ఋాసి నేను జనఁగానే, తమ్మునిచేత నా నాసాకర్ణములఁ గోయించెను । నే నెటు లుండును భ్రాతా ॥ రా ॥

వ. అంతఁ జింతాక్రాంతురాలయి చని ఖరాసురుని యుద్ధంబునకుఁ బంపిన ఖర దూషణ త్రిశిరాది చతుర్దశ సహస్ర రాక్షసదళంబుల నొక్కండ పిదళించె. వీరినసేల! జతుర్దశభువనము లెత్తివచ్చిన సమ్మోహనీయునకు లక్ష్యమా ! రావణా ! లోకవిద్రావణా ।

కేదారిగౌళ : ఆదితాళము.

నిశాటకులవర్యా ! విను మిక ॥ నిశాట ॥ విశేషముగ నే వివరించెద విను ॥ నిశాట ॥ సీత లోకవిఖ్యాత రూపవతి; భూతలమున నీకే తగును, ప్రీతిగ నది యబ్బిన జాలును విను ॥ నిశా ॥ మోక్షగుండ హరి పక్ష మేమొ కాని, రాక్షసవరులను శిక్షించె నీ క్షణమున నీ వద్ది యెఱుంగుము ॥ నిశాట ॥

వ. అనిన మంచిదని చెల్లెలి నూరార్చి యింటిలోని కనిపి రావణుం డారాత్రి కాలో చిత కృత్యంబులు దీర్చి శయనించి కంటఁ గూరుకు రామిఁ దన మనంబున ——

తో. రాముఁ డెవ్వరో రాగ గారణం బేమి గౌతమీదరికి? ఆ మానవుఁ డీయసురుల జంపుట కేమికార్యమాతనికి ॥ రామ ॥ మానవులకు నీ మహిమ గలుగ సామాన్యమె యోజింపగను, దానవకుల విధ్వంసుడు హరి యవతార మెత్తె నేమోను ॥ రామ ॥

క. కావున నాతనిచేతను
జావిఁక సిద్ధంబు నాకు : సరి యటు లయినన్
ఆ వైకుంఠం బలపడు;
నే వెరపున నైన దీని నెఱుగంగఁదగున్.

వ. అని నిశ్చయించి ప్రభాతంబున రథారోహణంబుచేసి మారీచుని గృహంబున కరిగె. అప్పు డతండు మునిఁబోలి సమాధినిష్ఠుండయి పరాత్పరుని హృత్కమలంబునఁ దాల్చుచు

కీర్తన - రూపకతాళము.

పరమాత్మా ! పరమేశా ! పరమానందస్వరూపా ॥ గురుతర సహస్రారస్థిత గుర
మయసురుచిరదీపా ॥ పర । నీలాంతర్లీలా మునిజాల సుహృత్తేలామరలోలా శ్రీమోక్షగుం
పా లా రిపిఫాలావర ॥ పర ॥

వ. ఇట్లు నిశ్చలత్వంబున నీశ్వరారాధనంబుఁ జేయుచు మారీచుఁడు గన్నుల
దెఱచి రావణుంజూచి సత్కరించి యిట్లనియె :

తోహరి : ఏమిపనికి నీ విచటికి వచ్చితి వెఱిగింపుము దనుజేంద్రా ! శ్రీమాఱ
నేఁ జేయ గల్గినను జేయుదు గరుణాసాంద్రా ॥

సీ. అనవుఁడు రావణుం డనియె; 'నోమారీచ !
తరణివంశజుఁ డయోధ్యాపతుండు
నగు దశరథునకు నాత్మజుం డగు రాముఁ
డనుజుండు భార్యయు ననుసరించి
చనుదేరఁ: దండ్రియాజ్ఞను వచ్చి యాపంచ
వటియందు నిలిచి తీవ్రంబుగాఁగ
ఖరముఖ్యులను జంపి కడువడి మనశూర్ప
ణఖ ముక్కు చెవులును నఱకివైచెఁ;

గీ. గాన నాతనిసతిని దేఁ బూనినాఁడ :
నీవు మాయామృగంబవై నేఁడు పోయి
రాముఁ గొనిపొమ్ము మిగులదూరమున కంత
సీతఁ గొనివచ్చి లంకకుఁ జేర్తునేను.

వ. అనిన నప్పుడు మారీచుండు భ్రుకుటివడి, —

శంకరాభరణము - ఆదితాళము.

అబ్బబ్బా ! రామునిచేత దెబ్బతిన్నవాడను ! నిబ్బరము చాలదు మాయబ్బతో
చాలును ॥ అబ్బ ॥ పిన్ననాడే వార్ధిబడ వ్రేసె బాణమునను ! న న్నిప్పుడు బ్రతుకనిచ్చు
నామది మఱవను ॥ అబ్బ ॥ మోక్షగుండశౌరి యతడు మునిజన సమ్మతుడు ! నీక్ష
సెగ్గాచరించి యెవరు బ్రతుక నేర్తురు ॥ అబ్బ ॥

తో : తర్వాతను నేదండకవనమున దగ నాతం డుంతగను, బూర్వవైరమున బులిరూపంబునఁ బోయి తగిలితిననేను ॥ రా ॥ తీవరమున నొకదివ్యశరంబును వైవ దప్పిపోగాను, జావు దప్పి నే నరగవచ్చి యిచ్చట మునినై యున్నాను ॥ రా ॥

క. రాముం డన, రత్నం బన,
రామామణి యన్నరవము రా జని యన్నన్.
రా మొదలను గలిగిన యా
నామంబులు విన్నఁ గ్రన్ననన్ భయపడుదున్.

వ. అదియునుంగాక యొక్క విశేషంబు వివరించెద.

క. రాక్షసకులంబు నెల్లను
శిక్షింపఁగఁ బూని యతఁడు చెలఁగు నయోధ్యా
సుక్షేత్రంబున బొడమిన
సాక్షాన్నారాయణుండు సర్వజ్ఞుఁ డగున్.

తో: కావున నాతనితో వైరంబునఁ జా వొదవును మనకెల్ల! దేవదేవు డని తెలిసి భక్తితో సేవించుట కడుమెల్ల ॥ రా ॥

వ. అని పలికిన మారీచుని యధైర్యవచనంబులు విని రావణాసురుం డిట్లనియె :

బేగడరాగము : ఆదితాళము.

భయపడ నిదేటికి వేదుర ॥ భయ ॥ నయమతి నీవేళ నామాట మీఱకు ॥ భయ ॥ రా ముడాపరంధాముడు చావైన నేమి వానిచే జచ్చితే ముక్తిగల్గును ॥ భయ ॥ నేను జయించితే వానియిల్లాలితో మానని సుఖములు మానుగ బొందుదు ॥ భయ ॥ మోక్షగుండ రఘుమూర్తినేమరించి యీక్షణమున నేను నిలసుతఁ దెత్తును ॥ భయపడ ॥

తో : పొమ్ము శీఘ్రమున బోనని యంటే పొరిగొందును నిన్ననగన్, నెమ్మది హరించే నీల్గుట మే లని సమ్మతించె దాఁ జనగన్ పేరావ ॥

వ. ఈపర్యాయము రామునిచేత నిశ్చయంబుగా మరణంబు గలుగునని తలంచి మారీచుండు రావణునిరథం బెక్కి యిరువురును మహావేగంబున బంచవటికి నరిగి రాముని పర్ణశాలను సమీపించిన నంత —

క. కాంచనవర్ణము, రజతస
మంచితమగు పాదలు, నీల మగునేత్రంబుల్,
మించగ రత్నపుఁగొమ్ములు,
గాంచనమణి ఖురము లమరఁగా మృగమయ్యెన్.

వ. ఇట్లు మారీచుండు విచిత్రమైన యొకమాయలేడి యాకారంబు ధరించి పర్ణశాల చేరువకు రాఁగా గాంచి రాముండు సీతకిట్లనియె :

గీ. కైతవయతీశుఁడై దశకంఠుఁ డిటకు
వచ్చునిదె! నీదు నైజరూపమ్ము వహ్నిఁ
దాచి, కృత్రిమసీతవై తనరు మొక్క
వత్సరము; వాఁడు సమయుఁ దాపచ్చు నీకు.

వ. అని బోధించిన వల్లె యని యాప్రకారం బొనర్చినసమీపమున జరించు మాయామృగంబును జూచి మాయాసీత శ్రీరామున కిట్లనియె :

హిం - కాఫీ : ఆదితాళము.

రామ, యామృగమ్ము దయమునం బట్టితెమ్ము ॥ శ్రీరామ ॥ హేమాభముఁ దెల్ల పాదలేమొ వింతగానున్నది ॥ శ్రీరామ ॥ ఈడ దీని తోడగూడి యాడుకొన వేడుకయ్యె; నేడు పట్టితెచ్చి దయతోడనాక నియ్య వగు వనవాసము దీఱినంత, మన మయోధ్యఁ జేరినపు డనుపుగ మాయత్తలకుఁ గినజూచి యానందింతు; ఎన్నడిట్టి మృగమును గన్నామె యీవనమందు ! గన్నులకు బండువుగ నున్నదిది మోక్షగుండ ॥ శ్రీరామ ॥

సం - ద్వి. అనుసీతవాక్యంబు లాలించి రాముఁ । డనుజుని జూచి యిట్లనియెఁ; 'దమ్ముఁడ,! దాని నే దెచ్చునంతకును నీ విచట । జానకి గాపాడు జాగ్రత్తగాను । దానవమాయలఁ బగులకు' మనిన 'మానుగా మృగమయి మారీచుఁ డలుక । తో వచ్చి నటువలె దోఁచు చున్నయిది । పోవల' దన్ననప్పుడు రాముఁ డనియెఁ । మారీచుఁడైన, లక్ష్మణ, వానిమాయ । దీడుగామాయించి తెత్తు నే జూడు । సీతకోరికను దీర్చెదనిప్డె' యనుచుఁ । జేత విల్లంబులు జెచ్చెరబూని । పోయి యామెకమును బొంచిపట్టంగ । బోయిన నదియు నద్భుతముగా నపుడు —

తో: చిక్కినట్టుగా దక్కినట్టుగాఁ జేరు వనును దాఁ జేరు॥ మక్కువఁ బట్టగ మరలి పోయినచో జిక్కులఁ బెట్టుచుఁ బారు ॥ రా ॥

వ. ఇవ్విధంబున మోసంబు జేయుచుఁ జాలదూరంబు త్రిప్పిన నది రాక్షస మాయగా నిశ్చయించి రాముండు కోపోద్దీపితుండై —

తో: చాలగ బ్రహ్మాస్త్రంబున మాయలు దూలవ్రేయ నసురుండు, 'హాలక్ష్మణ!' యను నార్తారవమునఁ గూలె నవనిపై నతడు ॥ రామ ॥

వ. ఇట్లు మారీచుండు కూలిన నతని తేజంబు పరాత్పరుండయిన రాముని యందుఁ గలిసె. అంత నాధ్వని విని సీతాదేవి భయాకులిత చిత్తయై లక్ష్మణునిఁ జూచి.

హిం - తోడి : రూపకము.

పొమ్ము లక్ష్మణా! లే లెమ్ము లక్ష్మణా! నెమ్మది రాముండు పిలిచె నిన్ను లక్ష్మణా! ॥ పొమ్ము ॥ ఏల పిలిచెనో! చిక్కు లేమి గలిగెనో! జాల మేల జేసెదవు చాలు లక్ష్మణా! ॥ పొమ్ము ॥ రాక్షసాళుల చేత రాపుగలిగెనో! మోక్షగుండ శౌరి కయిన మ్రొక్కు లక్ష్మణా ॥ పొమ్ము ॥

వ. అను దీనాలాపంబులు విని లక్ష్మణుండు —

క. మారీచుఁడు మాయామృగ
ధారుండై వచ్చె నతని దఱుముచుఁ జని యా
శ్రీరాముఁడు చంపుటచేఁ
బేరెలుఁగున రాము నట్లు పిలిచెను నన్నున్.

తో: వాడు గాడు త్రిభువనములు పైఁబడి వచ్చిన భయమేమమ్మ! కూడ ముట్టియును గూల్చడె గడియలో। కొదువ లుండునే యమ్మ ॥ న న్నిచ్చట నుండ మనిచెప్పెఁ జనినను నాపయి గోపించు; నన్న యాజ్ఞ కాదు రాడ జాల నత డతివేగమె యేతెంచు ॥ రామ ॥

వ. అటు వెనుక సీతాదేవి యత్యంతసంతాపకోపంబులు వ్యాపింప మరఁదిని గాంచి,

స్రగ్వి. రాముఁ డాలీలఁ జీరంగ నాలింపకే
తాపసంబేల ఖేదంబునుం జెందవా!

రాముఁ డిచ్చోటికిఁ రాకయున్నంత నన్
క్షేమ మం చీవు దక్కించుకోఁ జూతువా!

వ. దండకారణ్యంబునందుఁ గోదండరాముని బొమ్మని భూమండలంబుఁ దా నొక్కండ యేల భరతుండు గాంక్షించె రామునిక్షేమంబుఁ గామింపక నామీఁది ప్రేమాతిశయంబుచేత ఈమాడ్కి యుపేక్షించి నీ వున్నవాఁడవు. అన్నమేలు గన్నులఁ గనలేని మీయిష్టదీ సుద్ది బుద్ధికిఁ వశ్యయుం దోఁచె; నీకేల యింతదుర్బుద్ధి! నాప్రతిజ్ఞ వినుము!

తో: గోదావరిలోఁ గూలి ప్రాణములు గోల్పోవుదుగా నికను; నేదక్కుదునే నీకు! భరతునకు నే దని యేడువగాను ॥ రామ ॥ చేతులతోడను చెవులుమూసికొని, చింతాక్రాంతుండగుచు: నోతల్లీ! నేఁ బోయెద రాముం డుండెడి చోటికి ననుచు ॥ రామ ॥

క. వనదేవతలారా! యీ
జనకజఁ గాపాడరయ్య! చనియెద నింకన్
వనుఁ దూలనాడె నీమెయుఁ
గన నాయెడఁ దప్పులేదు కంటిరిగాదే!

వ. అని యొప్పగించి దుఃఖించుచు మెల్లమెల్లగా నడచుచు రాము సహోదర్ధంబుగాఁ జనియె: అంత నట తరుణంబు వేచి యుపాంతంబున దాఁగియుండిన రావణుండు దండకమండలుపులం ధరించి భిక్షుకవేషంబున బర్ణశాలదగ్గరిన సతిని యాథార్థ్యమునిగా భావించి సీతాసతి పర్ణశాలదాఁటి వచ్చి మహానీయునిఁ బూజించి.

తో: కందమూలములు ఫలములు గనవి భిక్షణజేయుడు మునివర్యా! అందముగా నాయధిపుడు వచ్చెడు నంతనుండుడోయార్యా ॥ రా ॥

వ. అనిన, భిక్షుకవేష ధారి యిట్లనియె:

తో: ఎవ్వడు నీపతి యెఱిఁగింపుము సతి యిదిరాక్షస సంవృతము; ఇవ్వనవాసం బేటికి గలిగెను నెవరు పంపి రనవినుము ॥ రా ॥

కాఫీ : ఆటతాళము.

జానకి నాపేరు; జనకునికూతుర; మానుగ నయోధ్య మాది; శ్రీరాముఁడు నానాథుఁడను విను; నామరది లక్ష్మణుఁ డౌను; దశరథుఁడె యగును మామామ ॥ జానకి ॥

తంబ్రి పంపగ నన్ను దమ్ముని తోడ్కొని దండకమునకు నాథపు( డరుదెంచెను దండిగ నొకపని! యుండి పోయిరివార; లుండు డందాక మోక్షగుండేశు దలంచు ॥ జా ॥

వ. అనిన నతండు.

రావ-తోహర: లంకాధిపు డను రావణుడను పౌలస్త్య సుతుడ; శూరుడను; బొంకముగా గొని పోదు నిన్ను మాపురికి వలచియున్నాను ॥ రా ॥

క. మునివేషధారి యగు రా
మని నీ(క విడనాడి నన్ను మోహింపుము; నీ
కనుకూలమైన సుఖముల(
దనిపెద; వనవాసబాధ తలగును లలనా.

వ. అనువాక్యంబులు గర్హితంబులయిన సీతయుల్లంబున భీతిల్లుచు.

కీర్తన : ఆటతాళము.

రణరంగశూరుడు రఘురాజకుల శేఖరుడు బ్రాణతార్తిభంజను డగు రాము నెఱుగవు నీవు ॥ రణ ॥ న న్ననరాని మాట లన్న నిక ఫలమేమి! నిన్ను నొక్కబాణమున నేడు ధరగూల్చు జూడు ॥ రణ ॥ ఉందు మిసుమంత మోక్షగుండవిభు దేతెంచు వేదండమశకము లన( దగును నిన్నుసతని ॥ రణ ॥

వ. అంతట——

తోహర : రాక్షసాధిపుం డక్షయమగురూక్షేక్షణముల వీక్షించె: నా క్షణమున నాయుతివ ముంగల నిజాకారము(గన(బఱిచె ॥ రా ॥ కరములు వింశతి, శిరములు పది యును, గాలమేఘసదృశంబు! గిరి బోలిన యాకృతి తోడ భయంకరముగ బరగె గరంబు ॥ రా ॥

వ. ఇట్లు దన నిజరూపంబు గన(బఱిచి,

క. జనకజచుట్టును భూమిని
దనసఖముల( ద్రవ్వి బాహుతతిచే గడు బ
ల్మిని నెత్తి రథముపై నిడి
వినువీథిని బఱపె నపుడు వేగముతోడన్.

వ. అంత సీతాకాంత భయభ్రాంత స్వాంతయయి చింతించుచు నెలుగెత్తి.

పీలురాగము : ఆదితాళము.

రామా! రామా! జగదభిరామా! శ్రీరఘురామా! వైరివిరామా! రామా! ॥ రా ॥
రామా! నే ననరానిమాటలను నామఁబంది నన్నా నెఱుఁగక జయ ॥ రా ॥

పాపాత్ముఁడు చెఱబట్టి నన్ను పీసి రూపుమాపి ననుఁగాపాడుము రఘు ॥ రా ॥
రాక్షసు డింత పరాక్రముఁ డాయెను; శిక్షింపుము తగ మోక్షగుండరఘు ॥ రా ॥

వ. ఇట్లు దుఃఖింపుచున్నంత —

గీ. ఆ లతాంగి విలాపంబు లాలకించి
పక్షిరాజు జటాయువు పవనుగతిని
నడ్డముగ వచ్చి యోయసురాధమా! భ
యంబు లేశము లేక నయంబు విడిచి.

తో: లోకమాతయగు నీకమలాక్షినిఁ జేకొని పోవఁగఁదగునా! ప్రాకటముగఁ
దత్ప్రతి యుండిన నీప్రాణము గూల్పక విడునా ॥ రా ॥

వ. ఐన నమ్మహనీయుని సేవకుండగు నే నుండ, నీపుండరీకాక్షి కేమి భయము!
మదీయతుండాగ్రమున నీకండలు తుండెములు జేసియెండవేయుదు! గుండెగల దండిమగండ
వైన నుండుమురా! రండా నిలువగలవా! నాదండ నని రాక్షసుని నాక్షేపించి తత్క్షణంబునఁ
దనపక్షయుగ్మంబు విసరి పైకెగసి తుండంబునం బొడిచి,

తో: రథము ద్రుల్చి, గుఱ్ఱములగూల్చి, చూర్ణము గావించెను ధనువు, పృథురోషం
బున బిట్టుదాకి నొప్పించెను రావణుతనువు ॥ రా ॥

వ. ఇట్లు విరథుండయి రావణుండు రోషానలంబు జాజ్వల్యమానంబుగా మండు
చుండ,

తో: ఒక్క ఖడ్గమున నొనర జటాయువు ఱెక్కలు గాళ్లును విఱుగ, గ్రుక్కినగ్రక్కున
బక్కిఱేడు దాన్పక్కిధరణిపై నొఱుగ ॥ రా ॥

క. మఱియొక రథమున సీతను
నురవడినెక్కించుకొని మహోద్ధతి మింటం
బఱచుచు నుండగ మదిలోఁ
బురపురఁ బొక్కుచును వగచె బొలఁతుక యంతన్.

సీత: హిందూస్థాని-రూపకతాళము.

ప్రాణనాథు డున్న వీ డీపాటు పడునా! ప్రాణములతో వీని నవలబాఱ నిచ్చునా! ॥ ప్రాణ! ॥ జనకుని పుత్త్రినై దశరథుని కోడలనై యనయము కష్టము లొందనాయెఁ బుడమిపై ॥ ప్రాణ ॥ పతినిబాసి దనుజునకును పట్టుపడగను, బ్రతిలేక విధాత నుదుట వ్రాసెగా బోలును ॥ ప్రాణ ॥ శ్రీమోక్షగుండేశుఁడైన శ్రీరామునకు నామాట నెఱిగించెడి పుణ్యాత్ము లెవ్వరో! ॥ ప్రాణనాథు ॥

వ. శ్రీరాముని కీపోఁజడి సూచించువఱకు నీ జటాయువు జీవితుండయి యుండుగాక యని మనోవీథి నుద్దేశించి, మఱియు,

తేవారము: హా సుమిత్రాకుమారా! హా మహామేరుధీరా! నీ సమానంబుగానా! నిఖిల లోకములలోనా దోస మన కట్టిమాఁట తూలనాడితిని నోట! ఈ సుతోజూడకన్న! నికను మన్నింపుమన్న,

వ. ఇట్లు సీత విలపించుచుండ రామలక్ష్మణులు వెంబడించి వత్తురేమో! యను శంకచేత లంకాధిపుడు వాయువేగంబున వియన్మార్గంబునఁ దిరిగి చూచుచుఁ బోవుతఱి జానకి యధోముఖియయి యప్పుడు, —

ఆ. ఋశ్యమూక మను గిరి ప్రదేశమ్మునఁ
గూరుచుండి రైదుగురు కపీంద్రు;
లరసి చీరఁ జించి యందు సొమ్ములు మూటఁ
గట్టి వారి యెదుట నట్టెవైచె.

వ. వీరయిన నా వార్త శ్రీరామున కెఱింగింపరా! యని సీతాదేవి సొమ్ములమూట వారి యెదుటఁ బడవైచె; నంత —

తో: అంబుధి దాటి రయంబున లంకను నసురేంద్రుఁడు చనుదెంచెన్; గంబుకంధరిని గడిమి నశోకవనంబు లోపలను నుంచెన్ ॥ రా ॥

వ. ఇట్లునిచి త్రిజట లోనగు రాక్షసాంగనలఁ బెక్కండ్రఁ గాపలియుంచి,

క. అతివేగ మీరు సీతకు
హితవులు బోధించి యెటుల నైనను నన్నున్
సతతంబుఁ గూడునటు స
మ్మతిఁ జేయుం డనుచు మాటిమాటికిఁ దెలిపెన్.

వ. ఈ ప్రకారంబున నాజ్ఞాపించి రాక్షసుండు యథార్థరీతిగా రాక్షస రాజ్య పరిపాలనంబుఁ జేయుచుండె, ఇక్కడ శ్రీరాముండు —

తో: మారీచుని దునుమాడి పర్ణశాలఁ జేర వచ్చుచుండగను, దారిపడుమ ఖేదమున నెదురిపడఁ దమ్ముని గని యిట్లనెను ॥ రామ ॥

శంకరాభరణము, ఆదితాళము.

సుందరి నొంటిగ నుండుంచి యిచటికి నెందుకు వచ్చితి వెఱిగింపు లక్ష్మణ ॥ సుంద ॥
వనమీద సన రూని దనుజులు నసుడెంచి వనితను నేమేని వంత నొందింతురో ॥ సుంద ॥
నీమోము వాడినదేమొ చింతించెదవు శ్రీమోక్షగుండేశుఁ డేమి కావించునో: ॥ సుంద ॥

వ. అనిన లక్ష్మణుండు చిన్న బోయిన మొగంబుతో నన్నకు నమస్కరించి,

శా. మారీచుం డిలఁ గూలుకాలమున రామా నీవలెఁ నన్ను దా
జీరెఁ, నీవని యెంచి శోకపడఁగా సీతమ్మ పొమ్మన్న నో
నారీ! రాక్షసమాయలంచుఁ దెలుపఁ నామాట లాలింపకే
దూరెన్ మిక్కిలి; నెమ్మది న్విసువునన్ దుఃఖించుచుఁ వచ్చితిన్.

వ. అని తెలిపి యన్న పదంబులపయి వ్రాలి.

క. 'నా వలన దప్పులే దిఁక
నా వనదేవతలె సాక్షి; యన్నయ్యా! నీ
సేవకుఁడ నన్ను దయతోఁ
గావు' మనుచు దుఃఖపడఁగఁ గరుణాన్వితుఁడై.

వ. లక్ష్మణు నూరార్చి లేవనెత్తి దేహంబు నిమిరి.

తో : తరుణి మాటలకుఁ దందరఁ నొందుచుఁ దమ్ముఁడ నీవు రానేల! నరగున
దము చాన చెంత నెవ్వరు లే రొక్కతే బాల ॥ రాము ॥

ప. అని యోజించుచుఁ దమ్ముని దోడ్కొని శీఘ్రముగా నమ్మున వచ్చి పర్ణశాలఁ జేరి
రసిన నందు సీత లేకుండినఁ దలఁచుచు మూర్ఛపోయి కొంతవడికిఁ దెలిసి దిక్కులు
లఁ జూచి శోకావేశంబున ——

తోడి : ఆదితాళము.

ఇక నేమి చేయుదు! నిక నెందు జూతును! అకట విధి నాదు ప్రియ నను బాపెను
నిక ॥ ఎవరు వచ్చినారో! యెవరు గొంపోయిరో! వివరించునట్టివార లెవరును గనరాదు!
ఇక ॥ భువి మోక్షగుండ భువుడనై యున్నను, నవిరళసుఖములు ననుభవింపగ బోనా!
ఇక నేమి ॥

సీ. నినుఁ గూడి విహరింప వనవాస మాయాస
మగఁ దోఁపదాయెనే! ముద్దుగుమ్మ!
నినుఁ గూడి భుజియింప నిఁ గందమూలముల్
షడ్రసోపేతమే సారసాక్షి!
నినుఁగూడి శయనింపఁ గను గుశాస్తరణంబు
హంసతూలిక మాన్పె యబ్జపాణి!
నినుఁగూడి వసియింప దినములు గడియలై
వడిఁ బవ్వలిడియెనే భవ్యవాణి!

గీ. కంటగింపుచు మాయామృగంబు రీతి
వచ్చిమారీచుఁ డెడఁబాపె వనిత మనల!
నాదు తల్లి వ్రాత యెంతహీనతకుఁ దెచ్చె!
నింక నొంటిగ నెటు చరియింతు నిచట.

ప. ఇట్లు దుఃఖించుచు సౌమిత్రిని గౌఁగిలించుకొని;

తేవారము : నమ్మి నావెంట వచ్చె నట్టడవిలోనఁ జొచ్చె దమ్ముఁడా! యెచటలేదు
తరుణి గానంగరాదు! సొమ్మసిలె మేను చాలశోకమూర్ఛంగఁ జాలా! నెమ్మదిని దెలియనైతి
వెలతుకను గోలుపడితి.

వ. రాముఁడిటుల శోకించుచుండ లక్ష్మణుండును గొంతవడకుఁ జింతించి పిమ్మట ధైర్యం బవలంబించి యిట్లనియె:

క. జగములు నీలో నుండును;
జగములలో నుందు వీవు; సర్వజ్ఞ! హరీ!
యగుణుండ వయ్యుఁ బ్రకృతిని
దగులుటచే నొదవెశోకదైన్యాదు లొగిన్.

ల-త్రో: అజ్ఞానులవలె నడల నేల! మీయంతవారిపనిగాదు యాజ్ఞోల్లంఘన మాచరించి యెదురాడు వా రిలను లేరు ॥ రామ ॥ తమరు ధనుర్బాణములు ధరించిన సమ యకున్నె త్రిజగములు! కమలాక్షియు నెక్కడ నుండిన నొకగడియకుఁ దెలియదె చాలు ॥ రా ॥

వ. నావంటిబంటు మీవెంటనుండ సంశయ మేల! విపినంబున వెదకి జాడఁ గందము. పిమ్మటఁ గాఁగల కార్యంబు యోజింతము. లెమ్ము లెమ్మని పలికిన, తమ్ముని సాహసవాక్యంబుల ధైర్యంబుఁబూని యిద్దఱుగలసి యచ్చ టచ్చట వెదకుచు:—

జంఝూటి : ఆదితాళము.

కానరే నాప్రాణసఖిని! ఖగమృగభూజములారా! నేను వచ్చునంతలోన నెలఁతలేదు హితులారా ॥ కా ॥ తానెచ్చటికైన బోయిదాగి యున్నదేమొకా! యేనీచకర్ముఁడు వచ్చి యెత్తుకొని పోయెనో! ॥ కానరే ॥ మోక్షగుండహరిని నన్ను మోసగించి యెవ్వడో రాక్షసుండు వచ్చిచెలిని భక్షించి పోయినాఁడో ॥ కానరే ॥

వ. అని యివ్విధంబునఁ నవ్వనంబునఁ దిరిగి సందు గొందులు సూచుచుఁ బోగా నొక్కచోట రథపతాకాదులు విఱిగిపడిన గుర్తులు కనబడిన, నిక్కడఁ గొద్దికాలంబున యుద్ధంబు జరిగినట్లున్న దని యెంచుచుఁ గొండవలె నచ్చటఁ బడియుండినజటాయువునుగని రాక్షసమాయగా నెంచి రాఘవుండు—

త్రో: ఒక్కరక్కసుండున్నాడిచ్చట నుక్కడంతు సౌమిత్రి! యక్కజముగ విల్లమ్ము లిమ్మనఁగ నాలించియుఁ గడుమైత్రి ॥ రామ ॥

జటా-ద్విపద.

నేజటాయువను మన్నింపగాఁ దగుదు, నీజనకునకును నేను మిత్రుండ; రావణా సురుఁడు నీరామ సోరామ!! తావడిగొంపోవఁదాకి నేవాని। రథమును హయుల సారథిని

నడంచి । వధియింపఁ బోయినవాఁడు జిక్కకయె । ఘనఖడ్గమున నాదు కాళ్ళుఱెక్కలును । దునిమినన్నిటుబడ ద్రోచి తాఁ బోయె: । గొనప్రాణముల దన్ను కొనుచు నేమీాకు । జనకజజాడను సరిగఁ జెప్పుటకు । జీవించి యున్నాడఁ జెడును దేహంబు, । దేవ, స్పృశించి మీాదివ్యధామంబు । నమఁగ నిచ్చి కృతార్థుని జేయు । మనివేఁడి ప్రాణంబు లంతట విడిచె ।

వ. అని జటాయువు మృతుండయిన రాముఁడు గొంతతడవు దుఃఖించి.

తో: పక్షివిభుఁడు మనపక్షము గలిగియు, రాక్షసాధముని బోరి; యీాక్షితిఁ గూలెను నితఁడు ధన్యుఁడగు నిఁక జా గేటికిఁ జేరి ॥ రామ ॥

వ. కృతార్థుని జేయఁ దగును లక్ష్మణా యని యన్నదమ్ములిద్దఱుఁ గాష్ఠంబులు దెచ్చి యగ్నిచేతఁబవులు గొలిపి యందు జటాయువు కళేబరంబు దహింపఁ జేసి తాము స్నానంబు జేసి,—

తో: మృగమాంసంబు లిమితముగఁ దెచ్చియుఁ దగ ఖండంబులు జేసి. యగణిత మయిన విహంగజాతులకు నాహారంబుగ వేసి ॥ రా ॥

వ. ఇట్లతనికిఁ బరలోకక్రియలు గావించిన నతండు ధన్యుఁడై, దివ్యవిమానంబునెక్కి వైకుంఠధామంబునకుఁ జనుచు దివినుండి శ్రీరామబ్రహ్మమును నుతియింపఁదొడంగె.

జంఝూటి : ఆటతాళము.

జయరామ! దశరథరామ! సీతారామ రఘురామా! శ్రీరామరఘురామ! సుత్రామనుతనామ! ॥ జయ ॥ నాతల్లిదండ్రియు గురువు దైవము దాత వీ వనుచు, నెఱదాత వీ వనుచు! మదిఁ దలఁతు నినుగనుచు ॥ జయ ॥ భవబంధభయములు వాపుటకు । నాపాలిదేవుడవు; నాపాలిటి । ప్రియభక్తవరదుడవు ॥ జయ ॥ పరమౌని హృద్గుహలందు దోఁచుమహానుభావుఁడవు; మహా సుజ్ఞానరూపుడవు ॥ జయ ॥ నారాయణాహ్వాయదాస సన్నుత తోయభవనయనపర తోయ భవనయన; వరతోయ నిధిశయన ॥ జయ ॥

వ. ఇట్లు కొనియాడి యతండుఁ బురంబునకుఁ జనియె ఇక్కడ వీరు సీతాన్వేషణంబుఁ జేయుచు దక్షిణాభి ముఖులయి పోవుచు.

రాముఁడు-యదుకుల కాంభోజి: ఆటతాళము.

శ్రీకంఠుపిల్లు నే నీకొఱకై విఱిచి చేకొంటిగదె! జానకీ ॥ జా ॥ వనుఁబాయజాలక

జొచ్చి తిప్ప లొదవెనె! జానకి ॥ జా ॥ ఆపద లనితోపవాయెఁగూడ నీ వున్నందుచేతను జానకి ॥ జాన ॥ శ్రీమోక్షగుండశౌరిని నేనై యుండి నిన్నేమఱితిని జానకి ॥ జాన ॥

వ. ఇట్లు మాటిమాటికిఁ దలఁచుకొని దుఃఖించుచు ధైర్యంబు నొందుచుఁ బోవునెడ నొక్కచో వికృతాకారంబున వచ్చి తనుఁగూడుమని లక్ష్మణుని వేఁడిన, నయోముఖికి నసిధారచేతఁ జుప్పనాతికంటె గొప్పసౌఖ్యంబు లిచ్చి చనుచున్న, నొకచోట—

సీ. ఉదరంబు నోరును నొకటిగా నొప్పియు
బాదముల్ శిరము జూపడఁగ లేక,
యోజనాయత మగు నురుబాహువులు గల్గి
యేది చిక్కినను బోనీక దినుచు
నున్నకబంధుని యురుభుజమ్ముల మధ్య
రామలక్ష్మణులు దిరముగఁజిక్కి,
'యన్న, నే వీనికి నాహార మయ్యెద ;
నీవు సీతను జూడఁ నేఁగు' మనుచుఁ,

గీ. దమ్ముఁ డన, రాఘవుఁడు విచారమ్మునొంది,
ఖడ్గమున వానిదక్షిణఘనభుజంబు
ద్రెంచె; వామభుజంబు ఖండించె ననుజుఁ;
డంత నాతండు మీరెవ్వ రనుచు నడుగ

వ. రాముని యాజ్ఞచే లక్ష్మణుఁడు దమ వృత్తాంతముఁ జెప్పి నీ వెవ్వ రని యడిగిన.

కబం—తో : నే గంధర్వుఁడ ; నిఖిలమునీంద్రుల-నెఱిగర్వంబున జెనక, యోని యొకడు శపియించె నన్నునిటు నుగ్రకోపమున డనుక ॥ రా ॥ అసురుఁడ నై నే సమర విభునిపయి నరిగిన నాతడు వడిగ, వెసదనవజ్రము వ్రేసె నాశిరము విపులోదరమున నడగ ॥ రామ ॥

వ. అప్పటినుండి శిరఃపాదవిహీనుండనై దీర్ఘ బాహుమధ్యంబున సంచరించుజంతువుల బిగఁబట్టి మ్రింగుచుఁ గబంధుం డన నిక్కడ నున్నాఁడ మీవలన శాపవిముక్తియగునని మున్ను మునులనుగ్రహించిరి. నా వికారశరీరంబు దహించి నను( గడతేర్పుఁ డని వేడిన

వారటుల జేసిరి. వాఁడు నిజప్రకృతిఁ బడసి గంధర్వుఁడయి వియన్మార్గంబున నిలిచి యంజలి బద్ధుండయి.

తంగంమెట్టు: ఆదితాళము.

రామ! రఘురామ! రవికులాంబుధిసోమ! నీమహిమను దెలియనే నెంతవాఁడను! ॥ రామా ॥ పంచభూతములకు - పంచకోశములకు పంచవర్ణములకుఁ బరుఁడవు గురుడవు ॥ రామా ॥ విశదముగను జతుర్దశభువనము లనన్యశమున నీదివ్యదేహమునందు నిలిచె ॥ రామా ॥ శ్రీమోక్షగుణవాస! శ్రీఫణిశుభ్రలాస! భూమసారాయణదాన పోష! శ్రీ శ్రీనివాస! ॥ రామా ॥

వ. ఇట్లు పొగడిన సంతోషించి శ్రీరాముం డిట్లనియె:

గీ. వినుము గంధర్వ, నీస్తోత్రమునకు నేను
సంతసించితి నీకలుషంబు దలఁగె;
దివ్యయోగంబు నొంది మదీయ దివ్య
ధామమును బొందు మిఁక శాశ్వతంబుగాను.

వ. అని యాజ్ఞాపించిన నానందించి రామునకు రావణుని వృత్తాంతం బాద్యంతంబుఁ జెప్పి, శబరి యాశ్రమంబునకుఁ బొమ్మని త్రోవ సూపి యతండుఁ బరమపదంబున కరిగె; ననంతరంబ —

తో. శబరియాశ్రమస్థలమునకును రామసౌమిత్రులు పోవగను, ప్రజలమోదమునఁ బరికించియు వారిరాక కుబ్బి యెదురుగను ॥ రాము ॥

క. చనుదెంచి వారిపాదము
లను భక్తిని గడిగి తజ్జలంబు శిరమునం
దనువుగ నిడుకొని, యాశ్రమ
మునకుం దోడ్తెచ్చి పీఠముల నిచ్చి తగన్.

వ. మధురపక్వఫలంబులు సమర్పించిన భుజించిరి. పిమ్మట శబరికరంబులు ముకుళించి;

శబరి — భు ॥ ప్ర ॥ పరంధామ మీదివ్యపాదాబ్జసేవా
పరత్వంబునన్ నిన్నుఁ బ్రార్థింప గంటిన్;

నిరాలంబ మీరూపు నేఁ డిందుఁ గంటిఁ;
దురంతంబులౌ నాదు దోషంబు లారెఁ.

వ. శ్రీమన్నారాయణుండు సాకేతంబున రాముఁడై పుట్టి దశకంఠ కంఠలుంఠనంబుఁ జేయ బోవుచో నీయాశ్రమంబున కనుజయుక్తుండుగ వచ్చి నిన్నుఁ గృతార్థునిఁ జేయఁగలఁ డని మద్గురువరుండగు మతంగ మహామునీంద్రుండు చెప్పియున్నందున;

తో. ఇక్కడఁ దపమొనరించుచు మీరాక కెదురుఁజూచు చున్నాను; గ్రక్కునఁ జనె బహుకల్పంబులు నేటి కక్కజముగఁ గన్నాను ॥ రా ॥ నాసంకల్పము సిద్ధిబొందినది, నాకిమ్మిక సద్గతిని, దాసకోటులకు దాసురాలనే దక్కువ జాతిని సతిని ॥ రామ ॥

వ. నిన్నుఁ గొనియాడ సమర్థ నే నౌనె? రామా యని పలికిన విని దయారసం బొలుక రామచంద్రుం డిట్లనియె:

జంఝూటి : ఆదితాళము.

నాభక్తి యొక్కటి చాలు శబరి ॥ నాభ ॥ సభోగంబులు నీరుగానేరని ప్రాపపవిత్ప్వదము సులభంబుగఁ జేరఁగ ॥ నాభ ॥ జాతి నామాశ్రమలింగాదుల రీతు లడుగ వలప దేరికి నైనను నరి ॥ నాభ ॥ మోక్షగుండమున ముదమున వెలిగే యక్షయతేజమును వెలయం గనుగలయగ ॥ నాభ ॥

గీ. యజ్ఞ దానముఖంబులౌనట్టికర్మ
మెన్ని చేసిన నాయందు తిన్ననయిన
భక్తిగుదురక శాశ్వత బ్రహ్మపదము
గడఁగి సుఖియింప శక్యంబుగాదు శబరి.

గీ. 'నీ వనాదినుండి నెంత నాపయి భక్తి
గలిగియుంటిగానఁ గలుగుముక్తి
సీత జాడ. నాకు జెప్పుము తెలిసిన
శబరి' యనుడు నామె నరఁగ బలికె.

ద్వి. నావల్లవినఁ గోరినారంతె కాని! దేవమీరెఱుగని స్థితియేది గలదు? ! రావణాసురుఁడు మీరమణి గొంపోయి । లావుచేఁ జేర్చెను లంకాపురంబు! భూవర, యిటకు

దాపునను బంపా సరోవరంబున్నది రూఢిగా, దాని ! కడ ఋశ్యమూకాద్రిగలదు తద్గిరిని ! గడిమిని వాలితో గలహించి వచ్చి ! యున్నాడు సుగ్రీవు డొసర మీ రటను ! జన్నిమీ తోడను సఖ్యంబుజేయు ! నతనిచే గార్యంబు లన్నియు దీరు. వెదకులాడగనేల ? వెడలు డచ్చటికి ; ! చనుదును నేనంతరాశములోన జొచ్చి ఘనకాయమును బాసి కాంతు మీపదవి ! నని పల్కి వహ్నిని నటురచి [illegible] ! తనమదు. రామమంత్రమును జపించె ॥

కమాచ్ : ఆదితాళము.

మానసమా ! మఱువకె ! ॥ మాన ॥ అనిద్భుత పరమానందమయుని ! ॥ మానసమా ॥ నిత్యనిరంజన నిర్వికార సత్ప్రత్యగభిన్నబ్రహ్మంబును ॥ మా ॥ పిండాండబ్రహ్మాండంబు లలో నిండి వెలుగు మోక్షగుండహరిని ॥ మా ॥ ధారుణి దాళ్వారి నారాయణకవి చారు మనోబ్జ విహారుని నిక ॥ మాన ॥

వ. అని పరంధాముని దారకనాముని సత్వరూపరాముని శ్రీరాముని ధ్యానమాన సంబున నిలిపికొని శబరి యగ్నిం బడి యవిద్యాకల్పిత స్థూలకాయంబును దహింపజేసి, ---

క. శ్రీరామునికృపచేతను
జారువిమానంబు నెక్కి శబరి మహాత్మల్
నేడుపునఁ బొందు పదమును
నారూఢిసి బొందె నిర్మలాంతఃకరణన్.

తో. అని తాళ్వారి నారాయణకవి రామాయణమును హరికథను, అనుపమరీతి నరణ్యకాండమున వినిచెనొల్కఁగా సుధను ॥ రామ ॥

ఇది వినువారల కిహసౌఖ్యంబులు గొదువలేక చేకూరును; మునుముని డందకును ముక్తిలభించును మోక్షగుండ హరికృపను ॥ రామా రామా యనవే శ్రీ రామాయణకథ వినవే గౌరీ ॥ రామ ॥

క. నాచేతనైన కొలదిని
జూచి రచించితిని దీని సుజనులు నెఱసుల్
దోచినయెడ దిద్దుదు రని
నాచిత్తములోన నమ్మినాఁడ మనీతిన్.

శ్రీ మోక్షగుండ రామాయణమునందలి అరణ్యకాండము

శ్రీ రామచంద్ర పర పరబ్రహ్మణేనమః

అవిఘ్నమస్తు

# శ్రీ మోక్షగుండరామాయణము

## హరికథ.

# కిష్కింధా కాండము.

* * *

క. శ్రీరాముఁ డనుజయుతి వే
సారక పంపాసరస్సు సరగునఁ గనఁ గాఁ
గోరి యరుదెంచి దాని యు
దారమనోహరతఁ గాంచి తమ్మున కనియెన్.

బేహాగ్ : ఆదితాళం.

పంపాసరోవరము గణియింప నేరితరము । సొంపుగ దీని వీక్షింపఁగ, నిండుఁ గ్రీడింపఁ గోరరే నిలింప వధూంగనలు ॥ పం ॥ ఇంపైన గాలిచే గుంపులై యానీటి తుంపురు లెల్లఁ బరంపరలుగ లేచె ॥ పం ॥ తమ్ములు గలువమొత్తమ్ములు జక్రవాకమ్ములు గోయష్టికమ్ములు నలరారు ॥ పం ॥ అంచిత కుక్కుట హంస కారండవ క్రౌంచనాదములమించి రహించు నీ ॥ పం ॥ మోక్షగుండపురాధ్యక్షుఁడ నా నాకు నక్షిపర్వముగవీక్షింపఁ గల్గెను ॥ పం ॥

తో : మానసమును గంగానదియు మఱి దీనికసరి రా వనుము; మానితముగఁ గ్రోశమాత్రవిస్తృతంబైనెగడెను గనుగొనుము ॥

మత్తకోకిల.

ఈ సరోవర తీరవృక్షము లెంతొ! యందములైతగెన్;
ఆసతోఁ జిరుకొమ్మలందు శుకాదులెల్లఁ బ్రియంబుగాఁ
గూసెడున్; మధుమాసమున్ సమకూడె దేఁటులు ఝంకృతుల్
భాసురంబుగ జేయ నెమ్మది పండువై కనుపట్టెడున్.

వ. మనోహరంబయిన యీ సరోవరప్రాంతంబుల నిట్టి వసంత సమయంబున విహరింపుచు సీతాసతితోఁగూడి క్రీడించు భాగ్యంబు నాకెన్నటికి లభించును? లక్ష్మణా! అంతఃకరణాలంకృతవీక్షణా!

కాంభోజి : ఆదితాళము

తరుణి నెన్నఁడు జూతురా। మరుబారికోర్వఁ దరముగాదేమిచేతురా! విరహము మీఱె; మేను బరవశ మొందెను; గనుల ॥ దరు ॥ ఒంటిగ నుండగ లేనురా! లక్ష్మణ నాకుఁ గంట గూరుకు రాదురా! తుంటవిల్తుఁడు దూపు లంట వేయఁగఁ బూనె ॥ దరు ॥ పాతకు డింతచేసెను! నానుదుటను విధాత యిటుల వ్రాసెను ఖ్యాతిగ మోక్షగుండనేత కెఱుక యగును ॥ దరు ॥

గీ. జానకిని బాసియొక క్షణమైన నింక
నేను బ్రాణంబులను నిల్పలేను; నీవు
మరలియు నయోధ్యకేగు లక్ష్మణ యటంచుఁ
బలుకు నన్నకు ననుజుండు తెలిపెనిట్లు.

తో: ఇంతిని గొనిపోయిన వానిని వధియించి యతనిసాధించి, యింతట సుఖముల నందవలెనుగాక యడియెల్లను విడిపించి ॥ రా ॥

వ. అవార్యశౌర్య ధుర్యులగు మీయంతవారికి నధైర్యంబు నొందగాదు. ముందు జరుగవలయుదానిని యోజింతము. మీకు దెలుపునంత వాఁడనా! యన్నా! యనిన, నలరి రాముండు తెలివొంది.

చ. వడపడి రామలక్ష్మణులు బాణధనుర్యుతపాణులై వియ
త్పదము స్పృశించు ఋష్యగిరిపార్శ్వమునన్ ఘనశాంతి దాంతిసం
పదనలరారుయోగితతిభాతిఁ జరింపఁగ వేగఁగాంచి నె
మ్మదిఁ గడుభీతినొంది హనుమంతునితో రవిసూనుఁ డిట్లనున్.

బేహాగ్ : ఆదితాళము.

హనుమంత వారిని బరికించి ॥ హను ॥ ఎంతవింత, యంతరంగమున ॥ హ ॥ ధీరులుమౌనికుమారులవలెనే వీరు జటాధారులై తిరుగుచున్నారు ॥ హనుమంతా ॥ నన్ను

జయింప మాయన్న కిరలను జప్పగను జంపినటు లున్న దౌరౌర ॥ హను ॥ మోక్షగుండ విభు సాక్షిగ రాజుల లక్షణము లీయుభయఘనుల నొప్పారు గలిగియున్నారు ॥ హ ॥

వ. తానిక్కొండ నెక్కుటకు నీలులేక నన్నుఁ గూలజేయు మని వాలిఁ బంపఁగా వచ్చిన కపటవేషధారులుగా నున్నవారు; కాకున్నఁ దాపసులకు ధనుర్బాణముల ధరింపనేల! నీవు వటురూపంబునఁ జని వారియామూలాగ్రంబు విచారించిరమ్ము. అని సుగ్రీవుండు పలికిన మంచి దని తత్క్షణంబున —

తో: వటురూపంబున వాయుతనూజుఁడు వచ్చెను రాముని కడకు దిటవుగ వినయ విధేయుఁ డగుచు ముచ్చటలాడుచు నని యపుడు ॥ రా ॥

క. మీ రెవ్వరు మీయూరును
పేరును దెలుపంగవలయుఁ బ్రియమున మీ యా
కారంబులు నగు మొగములుఁ
గారుణ్యరసంబుఁ గన్నఁ గడు వెలుగయ్యెన్.

తో: మీ రిటు నిరుగడ గారణ మేమో! మిము గని మోదము హెచ్చెన్! ధరణి విభూభాతి మదముప నవతార మెత్తినటుఁ దోచెన్ ॥ రామ ॥

వ. అనిన శ్రీరాముఁడు హనుమంతుని కిట్లనియె:

హిం. తో. ఆటతాళము.

అనఘ, మాచరితంబుదెలిపెద నవధరింపుము ప్రియమున; నినకులాధిపులము దశరథు తనయులము తెలియు మనఘ ॥ నన ॥ అన్నదమ్ములమతఁడు లక్ష్మణుఁ డరయ నేరాఘవుఁడను; గన్నతండ్రియనుజ్ఞదండక కానలకు నేతేరను ॥ నన ॥ కక్షగని నాయింతి సీతను రాక్షసుఁడు గొనిపోయెను! మోక్షగుండేశనకు నెలుకగు మోసపుచ్చి పోయెను ॥ అన ॥

వ. అట్టి వానిని వెదకుచు నీప్రాంతములకు వచ్చినారము. నీసుశబ్దాన్వితవాగ్వైఖరి నిన్ను నీవువ్యాకరణ వేత్త వని తోచుచున్నది. నీవృత్తాంతముఁ గొంత ముచ్చటింపుము సచ్చరిత్రా అని పలుకఁగా నాంజనేయుండు —

గీ. వాలి సుగ్రీవులను పేరి వనచరేంద్రు
లన్నదమ్ములు గలహించి; రందు వాలి

దలుమ సుగ్రీవునకు నిల్వ నిరవులేక
నలుగురాప్తులతోడ నీనగముఁ జేరె.

తో: అతనికి సఖుఁడను హనుమంతుండను ననిలనందనుఁడ నేను క్షితివర, మా సుగ్రీవుఁ డంప మీస్థితిఁ దెలియ వచ్చినాను ॥ రా ॥ అవనిని మా ఱేఁడు ఉపదెంచిన మీ కనుకూలముఁ జేసెదను; సుచరిత మీసతిచొప్పు దెలియుటకు, శోధించియు నెఱిగెదను ॥ రామ ॥

క. అని వేడిన శ్రీరాఘవుఁ
డనుకూలము నొంది యట్టుల నౌఁగాక యనన్,
దన రూపముఁ జూపియు మూ
పున వారిని మోచికొనుచుఁ బోయెను గిరికిన్.

వ. ఇట్లు వారిని నెత్తుకొని కొండపై జేర్చి యొకవృక్షంబు నీడను గూర్చుండఁ బెట్టి సుగ్రీవుని జేరఁబోయె.

బ్యాండుస్వరము - ఆదితాళము

మిత్రకులపవిత్రులు; ధాత్రికెల్ల మిత్రులు; మిత్రజ, రామ సౌమిత్రులు పుణ్యచరిత్రులు దశరథపుత్రులు వినుమిక ॥ మి ॥ వీరు నీవు కలసిన మేలుకలుగు దెలిసిన; వారికార్యములు మీరును మీపని వారును సమకూర్చ వచ్చును సత్యము ॥ మి ॥ దండకావనంబున దనుజునిబాసి రయమునఁ గొండలు వనములు గుహలును వెదకుచునుండి వచ్చిరి: మోక్షగుండేన ॥ మిత్ర ॥

వ. వారిచేరువ నొక్క భూరుహచ్ఛాయ నున్నవారు. వారి చేరఁ బోదము, నిర్భయంబున రమ్ము అని తోడితెచ్చి హనుమంతుండొక్క కొమ్మవిఱిచి దాని నమ్మువ్వురికి పీఠంబుగా వైచి కూర్చుండ బెట్టెను.

తో: అన్నయాజ్ఞఁగొని యల లక్ష్మణుఁ డాద్యంతముఁ దమ సంగతిని, విన్నవింప సుగ్రీవుఁడు నెమ్మది వికలంబొందెడు గతిని ॥ రామ ॥

గీ. రక్కసుండొక్కఁడుఁ దంతరాళవీథి
రమణి నొక్కతెఁ గొనిచనుసమయమందు

మాటదబ్బునఁబడె ఋశ్యమూక శిఖరి
విలువమిగిలిన నగలందు విడువఁదోఁచె.

ముఖారి : అటతాళము.

రాముఁడు ;—

అనుజా ! యేమందు ! నీసొమ్ములు గనుల నెటుఁగందు ॥ అ ॥

వనిత న న్నెడఁ బాయజాలక వచ్చినందుకు గోలుపోయితి ! ననదినై రక్షించుకోలేనైతి నిందలఁ బొందితినో ॥ యను ॥ ఆమాయా మృగము చింతకు మూలమాయెఁగదు నిజము ! భూమిలో శ్రీమోక్షగుండస్వామి నైనబురాకృతంబున కేమిసేయుదు ! భామ నను దాపేమి దూరెనొ ! యెంతవినరెనొ ! ॥ యను ॥

వ. అని యి ట్లనంతంబుగాఁ జింతనొందు సీతాకాంతునకు నూర్మిళాకాంతుం డిట్లనియె.

గీ. ఇతనితో సఖ్యమొరించి, యితఁడు మనముఁ
గలిసి పగవాని సాధింప వలెనుగాక
యీవిధంబున శోకింప నేమి ఫలము !
మానవేశ్వర ! ధైర్యంబుఁ బూను మింక.

వ. అనుచుండ సుగ్రీవుండు రామచంద్రున కిట్లనియె :

తో: శ్రీరామా నాచెలిమి జేసితే సీతను దెఱగొన్నట్టి యారావణువధకై సహాయముగ నరుదెంతును జలపిట్టి ॥ రా ॥

వ. అనిపలికిన సందుకు రాముండు నియ్యకొనియె : సంత —

తో: హనుమంతుం డగ్నిని జ్వలింపఁ జేసినఁ రాఘవు డినజుండు నవలుసాక్షిగ మైత్రిని మెలగుద మని యనుకొని రిచ్చట మెండు ॥ రా ॥

వ. ఇట్లన్యోన్యంబు సఖులయియుండునటుల బాస చేసికొని యనంతరంబు సుగ్రీవ విష్టులయియున్నంత : సుగ్రీవుండు దన యుదంతంబు రామునకుఁ దెలుప నారంభించి,

వ. ఇట్లు గుహవెడలివచ్చి నన్నెంత పిలిచినఁ బలుకకున్న మహాగ్రహంబున కిష్కింధకుఁ బచ్చి రాజ్యపాలనంబుఁ జేయుచున్న నన్ను రోషతామ్రాక్షుండయి కాంచి,

తో: దురితాత్మక యోరినీచుఁడా క్రూరుఁడ వైతివి; నీవు కూరిమి నిచ్చట వచ్చియున్నావా! కూడివచ్చెనీచాపు ॥ రామ ॥ తమ్ముడవని నిను నమ్మి దానవునిఁ డఁబడయుచు గుహ జొరగానె, నిమ్మర్కట రాజ్య మేల వచ్చితివి! యిటులఁ జేయ మేలౌనే ॥ రామ ॥

వ. అని పలికి పిడికిట నొక్క పెట్టునఁ బొడిచిన సహింపలేక నేఁబాఱిన వెంట వెంట యెల్లలోకంబులు దిప్పె. అంత నేను మరల వచ్చి యిక్కొండ నెక్కితి; ఇందు—

తో: వాలికి శాపము వచ్చియున్నదీశైల మెక్కరాకుండ బోలగ నందున బోయె మరల దాఁ బురికిదిరిగి రాకుండ ॥ రామ ॥

క. ఈ గతిని నగరుఁ జేరియు
బాగుగ నాసతిని దమను బలిమినిగొని తా
భోగించుచు ధర నేలుచు
బాగుగ నున్నాఁడు సుమ్మి బరవసమలర౯.

వ. ఇది మదీయ వృత్తాంతం బన విని రాఘవుండు—

దర్బారు : ఆటతాళము

వాలిని గూలిచి - వానరరాజ్యము మేలుగ నీచేత నేలింతుఁ జూడుము ॥ వా ॥ నినువెంట ముట్టి నను వెళ్ళగొట్టి వనితను బట్టి పలచి యున్నట్టి ॥ వా ॥ మోక్షగుండపురాధ్యక్షుఁడ నౌనేను ప్రత్యక్షుడు గూడిన ఈ క్షణమందున ॥ వాలి ॥

వ. ఇది నిశ్చయంబోయి సుగ్రీవా యనపుడు, వానరేంద్రుం డిట్లనియె:

తో: వాలిబలము దుర్వారము దేవాదులకును శక్యము గాదు! లీలగాను గెల్చెదమని పలికెదవు: చాల నమ్మకములేదు ॥ రా ॥

వ. అతనియొక్క బలవిస్తారమును దెలిపెద వినుండు;

క. మును దొకపరి మహిషాకృతి
దుందుభియను రక్కసుండు దోర్బలమున సం
క్రందనజునిఁ జంపఁగ గి
ష్కింధకు జని పిలువ వాలి కినిసి వెలువడన్.

వ. ఇట్లు చని కోపోద్దీపితుండయి వాలి వాని బిట్టుదాకిన నొండొరులు ——

తో: పదతాడనముల బాహుయుద్ధముల బలుపిడికిటిపోటులను! వదలక శత సం
ులు దాక వారు పోరి రాపలను ॥ రాము ॥

అంత వాలి వాని నవలీలఁ బైకొని
క్రిందఁ ద్రోచి చంపి కేక లిడుచు
నతని శిరముఁ దన్ని నది యూడి రక్తంబుఁ
నొక యోజనంబు చేరి పడియె.

తో: అది మతంగమునియాశ్రమ మగుటను, నా రక్తము పైఁబడఁగ నెడలోఁ
, పడవేసిన వాఁడెవఁడో వాఁడిఁక పడఁగ ॥ రా ॥ ఈ గిరిమీఁదికి నెక్కిన నీల్గును
చ్చయు మని యనుచు, వేగమె శాపము పెట్టెను గావున నింద్రజునను దెలియును నా

వ. అది కారణంబున వాలి యిమ్మహాశైలం బెక్కఁడు గావున నే నిందుంటి కాలం
పుచున్నాఁడ.

దుందుభితల జూపుదుఁ దా
నిం దున్నదు రేనిమీఁదు నిక్కముగా వా
లిం దునుమఁ గలరటంచును
సందేహము మానియుండు సారసనేత్రా!

వ. అనుచు రామునిఁ దోడ్కొని చని దుందుభికళేబరంబుఁ జూపించిన.

గిరిఁబోలిన శిరమును దన
చరణాంగుష్ఠమున రామచంద్రుఁడు చిమ్మన్
వెఱగున సుగ్రీవుఁడు గనఁ
బరువడి నదిపోయి పడియెఁ బదియోజనముల్.

వ. అది పరికించి సుగ్రీవుండు రామచంద్రున కిట్లనియె.

హంసధ్వని - ఆదితాళము:

దినాధీశ వంశోదయా! ఖరహరణ దయామయ! ॥ దినా ॥ మీ ధైర్యమును బలము తెలిమిని గనుగొంటిని ॥ దినా ॥ వాలిదన్నిన పుడోలి రక్తమాంసాళిమిళిత మగుచు నయమై యున్నదిసుమి ॥ దినా ॥ పాలసతిశిల్యా వశిష్టముగా నీవు దలతల యెంచినది కడు జాలకన యగు గద ॥ దినా ॥ ఇలలో మోక్షపురీశ్వర తగ నీ బల మెన్నుప యనుచు నెటు పల పుడు దలతు! ॥ దినా ॥

వ. అని యింకొక్క పరీక్షయున్నది చూపించెదనని.

తో: ఏడుతాళ్ళపై కెగసి యొక్క మటి యేకావర్తిగ వాలి! నూతి యాకులను గోయుచు నుండును జూడుము నాభూజా లి । రా ॥

క. ఇది యొక్కశిరంబున మీ
రపటీలను ద్రుంచివైచి నటులైనను నె
న్నికవబలశాలి పటంచును
దిపిలి మనము నందుఁ దలతు దశరథరామా!

వ. అని విని రాముండు చిరునవ్వులయ నొక్క యమోఘాస్త్రంబు ధనువు సంధించి దృఢముష్టిని బిగించి సుటీగా విడిచిన నబ్బాణంబుదాఁకి దశయోజన పర్యంతమున్న తాళంబులు చక్రాకృతిగా నలరిసఁ గాంచి.

క. తన పాదాంగుష్ఠముచే
దనుజుని పాదములపైన నప్పుడు రుద్ధం
గను తాళద్రుమములు పె
ల్లున విరిగెను భానుజుడు విలోకింపంగన్.

వ. అని తెలిపిన విని తత్కారణంబేమని పార్వతీదేవి యడిగిన సర్వేశ్వరుం డిట్లనియె;

సురట: ఆదితాళము.

బాలికాతిలక! వివరించెద నీ వాలకింపుమా! నీ ॥ వాల ॥ చాలతాళఫల సప్తకమును-వాలి రాచె నోలి నొకగుహ! ॥ ఓ బాలకా ॥ ఉరగ మొకటి యవి హరియింపఁగ గని నరగ గనలి

తరువులుగ నుండు మని బరుపడి నొక శాపము దానిదె సురవరసుతనయుడు సు॥
॥ సోదా ॥ అక్షయమున నాయుపాపత్తి బలికెను మోక్షగుండరక్షసుని సాక్షి యూపృక్షహంతి
యగు, వీరునిచే నీకు శిక్షయగు నని నీకు శిక్ష. ॥ యోదా ॥

వ. కావున, నాశాపకారణంబునఁ దాళఫలంబులేదును సర్పంబు వయినఁ బహు
లయియుండె నది గుబు తెలిఁగి.

ఆ. ఆదిశేషునంశ నవనిఁ బుట్టుటఁ జేసి
లక్ష్మణుని చరణతలంబు సోకఁ
గలఁగెనాగరాజు తాళద్రుమంబులు
నొఱగె నొక్కపెట్ట నుర్విమీఁద.

సుగ్రీవుఁడు : హిందు-కాఫీ; రూపకము.

విను మనుకులాబ్ధిచంద్ర! యొక్కమునవిచే సేదా? ॥ విసుత ॥ మునువనంబులేయు
మెచ్చుకొనుచు నప్పుడు కశ్యపునకు నొక్కమాల యొసఁగెఁ బలిదాతుఁడు ॥ విను ॥ అది
పురందరునకు నిచ్చె నా మహాత్ముఁడు; పుండు మొదవ వాలికంఠమందునుంచె నాతఁడు
॥ విను ॥ వాలిని గెలువంగ నెంతవారివశ మగు గళసీమాలయున్న మోక్షగుండమాల నిజ
మగు ॥ విను ॥

వ. అని సుగ్రీవుండు నుడివిన రాముం డప్పుడిసుమంత సర్పరాజుఁ గని.

సీ. వాలిశాపంబునఁ దాళభూరుహములు
నిటు మోచుచుంటిని యున్నినాళ్ళు;
తాళద్రుమంబుల ధరఁ గూల్ప నాచేత
శాపమోచన మయ్యె! సర్పరాజ;
ప్రత్యుపకారంబుఁ బరుపడి జేయుము
వాలిదాల్చినకంఠమాలఁ దెమ్ము
పొమ్మన, శేషుండు పోయి యానిశయుందు
వాలిని ద్రుంచెడు కాలమందు

గీ. బొన్నపైనున్న మాలిక పరగఁ దెచ్చి
యినజునకు నిచ్చి రాముని కెలుక పలిచి

ఫణిపతి యచ్చెమ్ముగఁ జనె, భానుజుండు
సంతసంబున రాముని సంస్తుతించె.

కల్యాణి : ఆదితాళము.

మామ్ పాలయ భువనాధీశ్వరా ॥ మామ్పా ॥

ఈలోకంబుల నేలుచుండే! నీలీలలుఁ గన, నేర్తునా ॥ మామ్ ॥ సుతహితదారాన్విత సంసృతిలో సతికింతువు జీవాళిని ॥ మామ్ ॥ మాయాబద్ధుని జేయకు నను నారాయణకపి హృన్మందిరా! ॥ మామ్ ॥ సాక్షిరూప! వరమోక్షగుండపురరక్షక సత్కరుణాకరా! ॥ మామ్ ॥

గీ. మధురవాక్కులచేత రామాయటంచు
నిమిషమేనియుఁ మదిని ధ్యానించువారు
బ్రహ్మహత్యాదిసర్వపాపములనుండి
ముక్తు లగుదురు రామ సంపూజ్యనామ!

వ. కాఁబట్టి ఇది మొదలు నన్ను నీ పాదసేవకునిగాఁ జేర్చుకొని ధన్యునిఁ జేయ వలయును మహాప్రభో! ఆపద్బాంధవా! యని బహు! భంగులఁ బొగడిన మెచ్చి రామ మూర్తి యిట్లనియె :

తో: కొట్టెద వాలిని! బట్టము నీ కిఁక గట్టెద వానరవర్యా! యట్టహాసమున నరిగెను యుద్ధమున కతని పిలువు పటుశౌర్యా! ॥ రా ॥

వ. అని పలికిన సుగ్రీవుండు శీఘ్రంబున రామ-లక్ష్మణయుతంబుగాఁ గిష్కింధ నగరోపవనంబునకు వచ్చి వారి నొక్క వృక్షంబుచాటున నిలిపి, తాను పురద్వారంబుఁ జేరఁ బోయి యాకసంబు బ్రద్దలగునటుల నుద్దండంబుగ బెద్ద కేక పెట్టినఁ దద్దయు నాలించి తమ్ముని యెలుఁ గని తెలిసి, సింహనాదమ్ముఁ జేయుచు వెడలివచ్చె.

క. ఆక్షణమున సుగ్రీవుఁడు
వక్షస్స్థలమునుగులఁ బొడుప, వాలి యపుడు రూ
క్షేక్షణములఁ దనతమ్ముని
వీక్షించుచుఁ బొడిచె మరల వీరాంకుండై.

వ. ఇట్లన్యోన్యంబు సరాసరి పోరునెడ వృక్షంబు చాటున నుండి రాముండు —

తో: ఒకటేవిధముగ నున్నారిద్దఱు నకటా! నాప్రాణంబు ॥ నికనెవ్వని వధియించునో యని వ్రేయక యుంటెను దనయంబు ॥ రా ॥

వ. అంత సుగ్రీవుండు నిరాశుండయి యెట్లులనో తప్పించుకొని శరీరమాద్యంతంబు గంపంబు నొంద మెల్లమెల్లగా నడచుచు తిరిగి తిరిగి చూచుచు రామభద్రుని జేరవచ్చి యిట్లనియె.

జంఝూటి : అటతాళము.

ఎంతవాడవు రఘురామ! యింతమోసము జేయనేటికి రామా! సంతమా సద్గుణ ధామా! వంత నొందింప మీ వంటివారికిఁ దగునా! పింత వాలిని వధియింపవైతివి యెంత రక్షింతు నని పంపి ఇటుల మోక్షగుండేశ యుపేక్షింప మేలా? శిక్షింపఁ దలచితివేల? యక్షయముగ వాలి కప్పగించుటకంటె సాక్షాత్తుగా నీవే చంపఁగ రాదా! ॥ యెంత ॥

వ. అనిన సుగ్రీవుని నిష్ఠురోక్తులు విని గాఢాలింగనము చేసి కన్నుల నీరుంచి యాదరంబున నిట్లనియె.

స్రగ్విణి. ఆతఁడును నీవు నేకాకృతిం బోలుచు
రీతి భావించి గుర్తింపగారాదుగం
జాతమిత్రాత్మజా సంశయగ్రస్తతన్
భీతిచే బాణమున్ వ్రేయఁగా మానితిన్.

వ. అంజియేకాని వేరుగాదు, భానునందనా,

తో: సుమమాలిక గంఠమున ధరించియు సమయ మెఱిఁగి నీవతని! సమరంబున కీసారిపిలిచి పోరుము చూతువు నాధృతి ॥ రా ॥

వ. ఇట్లు స్వామి యాజ్ఞాపించిన నొక పూమాల గళంబునఁ జిహ్నంబుగా ధరించి సుగ్రీవుండు కిష్కింధ సమీపంబున మహాట్టహాసంబుఁ జేసిన, వాలియు ——

తో: మఱల వచ్చెన నీ తమ్ముఁడు నీతని నే మార్కొని తఱుముదు ననుచుఁ! ఐనను బోయెదు వాలి కడువడి పలికె తార వద్దనుచు ॥ రా ॥

హిందూ. కాఫీరాగము : ఆదితాళము.

పోవద్దు ప్రాణేశ్వరా! యనికి ॥ పోవద్దు ॥ ఈవంకను సీతాసోదరి, యితఁడు మరల వచ్చినాఁడు ॥ పోవద్దు ॥ బలవంతు లెవ్వారలో తోడు వదియుండు రేభయాత్! యిలను మోసకరుండు [illegible] నీవు ॥ పోవద్దు ॥

వ. అప్పుడింద్రనందనుం డిట్లనుచున్నాడు,

క. పగతుం డాజికిఁ బిలువఁగ
మగువా పోవ ద్దనంగ మది కొప్పునె! యిం
తగ నతనికిఁబాసటయే
జగతిని న న్నెదురు ధైర్యశాలియెవండో!

వ. అనినఁ దార యిట్లనియె.

తో: అంగదుండు తెలుపంగ వింటినా సంగతి వివరించెదను! రంగుగ రఘుకుల పుంగవులగు శ్రీరామలక్ష్మణులు దగను ॥ రామ ॥ తరుణితోడ నీదండకాటవికి నరుదెంచిన రావణుఁడు, వెఱగొనిబిఱబిఱ సీతను లంకకుఁ జేర్చగ నా రాఘవుడు ॥ రామ ॥

ఉ. తమ్మునితోడఁ గూడి వనితన్ బరికించుచు వచ్చి ఋశ్యమూక
మ్మున భానుజున్ గలసి గ్రక్కునఁ బాసలు సేసె నిన్ను యు
ద్ధమ్మున గూల్చి రాజ్యము కూతమ్మగ నాతని కిచ్చునట్లుగా:
నెమ్మది వింటి దీని నెద నిల్కడగాఁ దలపోయు మిమ్మెయిన్.

వ. ఇది యసత్యం బయిన నీచేత, దఱుమఁబడిన వాని కింతఁ శౌర్యంబు తనంతట గల్గునా! యోజింపుము వాలీ! బలవద్విద్విషారణ్యకీలి యనంత ధైర్యశాలీ!

గీ. యౌవరాజ్యంబు నినజున కీవయిచ్చి
సఖ్యమొనరించి రామలక్ష్మణులఁ గొలువు!
శుభము గలుగును; గులమును! సుతుని, నన్నుఁ
బ్రోవు మని పాదముల వ్రాలి లేవ కున్న.

వ. తిన్నగాఁ గరంబులఁ బట్టి లేవఁదీసి యాలింగనంబుఁ జేసికొని తార నూరార్చుచు వాలి యిట్లనియె.

క. తెలియుదు రాముండై రవి
కులమున హరి బుట్టె నజుఁడు గోరిన కతనన్,
బలవంతుఁడైన రావణు
బొలియింప, నయోధ్యయందుఁ బొలతిరో నిజమే.

వ. ఐననేమి! అమ్మహనీయుండు నిరపరాధిని నన్నేల దండించుతారా! సఖనిర్జిత తారా!

పరజ - అటతాళము.

రాముఁడనగ బరంధాముఁడు లోకాభిరాముఁడు భక్తకాముఁడు ॥ రా ॥ తప్పులేకయ నన్ను దండనజేయునె! చెప్పను మిక రొప్పను ॥ రా ॥ నావారు తెలివారలనుభేద మతని కున్నాడటె! యిది వాదటె! ॥ రా ॥ మోక్షగుండహారిక మ్రొక్కుచు సుగ్రీవు ముట్టెప జూచ గొట్టెద ॥ రా ॥

వ. ఇంతియే! కాని యెంతమాత్రము సుగ్రీవుని మన్నింపను.

తోహర: అని తారను నోదార్చి వాలి యెయ్యన యుద్ధమునకు నడచి। కనుగప గెంపులు; కదురగ సుగ్రీవుని వీక్షించుచు గడసి ॥ రా ॥

బేహగ్ : ఆదితాళము.

పోకురా పోకురా! సుగ్రీవా! యిక ॥ పోకురా ॥ భీకరముగ నిన్నుజంపి పీడ వదిలించెదను ॥ పోకురా ॥ లగ్గనెక్కినట్లు నిన్న డగ్గిరి నీ వోడిపోయి సిగ్గులేక నేడువచ్చి తగ్గక నెదిరించెదవు! మొగ్గులేక నిన్నుబట్టి మోక్షగుండ తొరిచూడ నుగ్గుచూచ జేతునీదు। పెగ్గెపెటాకులఁ జేర ॥ పోకురా ॥

తోహర: అంతట నిసజుం డతిరోషమ్మున నార్చుటించుచును పొడువ! ఐంతమతో నావాలిముష్టిచే బలిమిని నెదపై నడప ॥ రామ ॥

వ. ఇట్టిటువురు సమబలులయి సభానఖి ముఖాముఖి బాహాబాహి బెనఁగునెడ శ్రీరామచంద్రుండు ——

తో. ఇంద్రచాపమున నస్త్రము దొడగియు నాకర్ణాంతము దిగిచి, చంద్రయశుడు రామచంద్రుఁడు పడువగ నరగున వాలిని గడిసె ॥ రా ॥

క. ఉరమున గాఁడిన నాఁతడు
మరువడి నిలఁగూలి మూర్ఛ నొంది పిదపఁ దె
ప్పిరిలి రవితనయ లక్ష్మణ
పరివృతుఁడయి యున్న రామభద్రుని గనియెన్.

రూపకము - భైరవి.

ఇది, వీరా! నాపేర మే మున్నది రఘువీరా! ॥ యిది ॥ యెదుటికి రానను దాగియు నెద నాటగ( గదుపాక్కటి యిదే వ్రేయగ ॥ నిది ॥ భానుజు(డు బంధువు(డు నేనీకును బగ వాడనె! వానరమాంసము గోరుటయే నీతియెయౌనా నిక భూనాథుల ॥ కిది ॥ నాదావును మోక్షగుండనాథ, చేరి పిపరించిన, నాడను జని పాదమ్ములతో( డస్నియు నీ దేవిని వేదేనా! ॥ యిది ॥

ద్విపద- అని వాలి యారీతి నాడువాక్యములు । వినిరాఘవు(డు నవ్వి వేగనిట్లని యె: । ప్రీతిగా వానరవీర యాలింపు । కూ(తురు మఱదలు( గోడలు భగిని । సరి యని యందురు శాస్త్రజ్ఞులదియు । గురిగా(గ నీవు గైకొనక కామమున( । దమ్ముని భార్యను దగ గూడినావు: తమ్ముని( బురివేళ్ళ( దఱిమితివీవు । ఇన్నియధర్మము లెసనీ యందు । నున్నవిగాన నే నుర్వి( గూల్చితిని; । నీయధర్మమె నిన్ను నీలుగావించె, బాయక పంచి పెబ్బరలు పాటించి । శిక్షించుననిగాదె క్షితితలేశులకు! । పక్షపాతమునేల బంధింతునాకు! చాలింపుమని రామచంద్రు(డు పలుక వాలి విజ్ఞానియై వైరంబు వదలి ——

తోహర: ఆపన్నత నే నాడినమాటకు( గోపింపకు మోరామ । నీ పదయుగ్మము, నెఱనమ్మితి మన్నించి ప్రోవు గుణధామ! ॥ రామ ॥

జంఝూటి: ఆదితాళము.

శ్రీరామ, నీవాదినారాయణు(డవు శ్రీరామామణియె యా - సీతాదేవి యవు ॥ శ్రీ రామ ॥ అవతరించితి రావణాదుల( జంప దివిజుల మునుల మోదించి రక్షింప ॥ శ్రీ ॥ అవసానమందు నిన్నరయంగ! గలిగె! నవిసె నాదుష్కృతములు; ప్రకృతి తల(గె ॥ శ్రీ ॥ మోక్షగుండవాస మునిజనోల్లాస అక్షయనారాయణకవితోష ॥ శ్రీ ॥

క. అంగదు(డు బాలు( డగు గా
నం గరుణింపంగవలయు; నాయన యు(క నా
యంగము స్పృశించి నిర్మలు
నింగా నొనరించి ముక్తి నే( బొస(గు హరీ!

క. శరవేదన( బడ(జాలను
సరగున నది యూడ( దీయు సర్వజ్ఞ యనన్.

గరమున హృదయము నంటియు
శరమూడఁగఁబెట్టెనె రామచంద్రుఁడు కరుణన్.

తో: రాముకరస్పర్శమున బునీతుండై మహాశీయులు గోరె! ధామమునకు గపి జనువు విడిచి యాత్రారావతి దాఁ జేరె ॥ రామ ॥

ఉ. అంతట వానరుల్ చని రయంబునఁ దారను గాంచి 'యమ్మ! నీ
కాంతునిఁ జంపె రాఘవుఁడు గావున, నంగదు రాజుఁ జేయ నా
పితంగ; నాల్గువాకిళుల వ్రేయగఁ బంపుము! సూర్యనందనుం
డింతకు రాకముందె యని యేర్పడఁ బల్కిన నామె చింతతోన్.

వ. మూర్ఛిల్లి భూమిపైఁబడి కొంతవడికి లేచి హస్తంబులచే శిరోవక్షంబులు మోదుకొనుచు పనవరలంగనుంగొని.

తో: నానాథుఁడు లేనప్పుడు రాజ్యము నంపనుండు నాకేల? మానక యిప్పుడే మగఁడువడిన కడఁకేసు బోడు నీవేళా ॥ రామ ॥

వ. అనితత్క్షణంబున లేచి రోదనంబు చేయుచు వాలిపడి యున్న చోటికిఁ జేరి పదంబుల పయిఁబడి, —

తోడి : ఆదితాళము.

నాప్రాణనాథా! యిక నా కేది దిక్కు కటా! పాపిష్టివిధి మనలబాపె నే మందు నిల ॥ నాప్రా ॥ నే నెంతఁ జెప్పినను నీమది కెక్కదాయె! హీనపునోము నోచినా నేమొ పూర్వమున ॥ నా ప్రా ॥ శతమఖసుతుఁడనయి ప్రతిలేని హయుఁడవై క్షితి మానవునిచేత జెడ నాయెఁ గడపట ॥ నా ప్రా ॥ శ్రీమోక్షగుండపురధాముఁడే రాముఁ డని నేమందుఁ జెప్పలేదా! నామాట వినవైతి ॥ నా ప్రాణ ॥

వ. ఇట్లు విలపించుచుఁ దలయెత్తిన ధనుర్ధరుండయిన రాముండు దృష్టి గోచరుండయిన నిష్ఠురంబుగా ననుచున్నది :

క. వాలినిఁ గూల్చిన కోలను
గూలిచి సురపురికి నతనిఁ గూడఁగ నన్నున్
దోలుము : సుఖింతు ; వాలికి

వ. పత్నీ వియోగ దుఃఖంబున వేగించుచున్న నీ వెట్టి మేలుచేసితివి. తత్ఫలంబు శీఘ్రంబ పొందఁగలవు! నన్నును నొక్క బాణంబునఁ గూలిచి వాలి చెంతకుఁ జేర్పుము రామా! అని సుగ్రీవునిఁ జూచి,

తో: శ్రీరామునితోఁ జెప్పుము; నన్నును - శిక్షింపుము; వెనుక! నా రుమతో సౌఖ్యము లొందుము; నాపోరు లేకుండును గనుక ॥ రామ ॥

వ. అని యిట్లు దిక్కుందోపక విలపించు తారకు వివేకంబుఁ గలుగఁ జేయఁబూని శ్రీరాముఁడు —

క. నావిభుఁ డని విలపించెదు!
జీవుఁడొ! దేహంబొ! తెలుపు చెలి విభుఁ డవఁగా!
భావింప భూతధాతుమ
యావిర్భవమును జడమ్ము నగు దేహ మిలన్.

తో: జీవుఁ డాత్మమయుఁడై వినువిధమున నీవిశ్వము నంటకను। దావెలయును శుద్ధంబుగ, దేనికినీవు వగచెదవు తగను ॥ రామ ॥

వ. దేహంబు సప్తధాతుమయము; పంచభూతాత్మకము; జడస్వభావము; దుఃఖరూపము; నశించుచున్నది. జీవుఁ డన్ననో। నిరామయుఁడు; నాత్మరూపుఁడు: లింగవిహీనుఁడు; నంతఃప్రకాశకుండు,- దేనిని నంటువాఁడు కాడు. ఈదేహజీవుల రెంటిలో నీభర్తయెవఁడు! నీవు చింతించుట దేనిని గూర్చి తెలుపుము కాంతా! నిర్మలస్వాంతా యనిన తార కొంత యెఱుక గలిగి,

క. జీవుఁడు చిన్మయుఁ డాయెను;
దేవర, జడసంవృతంబు దేహం బాయెన్;
గావున సుఖదుఃఖంబులు
గేవలముగ దేని బొందుఁ గృపఁ దెలుపఁ గదే!

ఆ. నన్నుఁ దెలుపు మనుచు, నాతండ్రి యడిగితి;
నేనుఁ దెలుపునంత దానవే! క
టాక్ష ముంచి నిశ్చయంబు నిరూపించి
నా కనుగ్రహించి నను బ్రోవు.

వ. అనిన, దయార్ద్రచిత్తుండై రాముండు తారను వీక్షించి,

ఆరభి : ఆదితాళము.

తరుణి ! తెలిపెదను వినుమా ! నీప్రశ్నకు నే ॥ తరుణి ॥ ధరణి జీవుఁ డేవఱకు సహంకృతిఁ బొరయునొ ! యంతకుఁ దఱుగదుసంసృతి ॥ తరుణి ॥

తాత్పర్యము : జీవుం డెంతపర్యంతంబు నభిమానముతోఁ గూడి యుండునో యంత పర్యంతమును సంసారము తఱిగిపోదుతారా.

కీర్తన : విషయాసక్తిని విడువఁజాలకయ మృష యగు సంసృతి మెలఁగును జీవుఁడు ॥ తరుణి ॥

తాత్పర్యము : జీవుం డనాదిసంబంధముచేత విషయంబుల యందాసక్తి విడువలేక యపారమగుసంసారమందు నిశ్చయత్వబుద్ధితో మెలఁగుచుండును.

కీర్తన : అఖిలేంద్రియముల నభిమానించుచు సుఖ-దుఃఖంబులఁ జొక్కుచు నుండును ॥ దరుణీ ! తెలి ॥

తాత్పర్యము : చతుర్ద (14) శేంద్రియములలోఁ గలసి పరమార్థముగా భోగించుచు నావ్యాపారముచేత రాఁబడిన సుఖదుఃఖములకుఁ దాను బాధ్యుఁడయి జీవుండు సంతోష-సంతాపము లనుభవించుచుండును.

కీర్తన : మానుగ జగదభిమానము వదలిన, దానె మోక్షగుండధవుఁడయి వెలయును ॥ తరుణి ॥

తాత్పర్యము : ఈ ప్రకారమున సంసారవ్యామోహితుండయి యుండు జీవుం డొకానొక కాలమునకు నీప్రపంచసుఖము లస్థిరములని సద్గురుకటాక్షమువలన తెలిసి దేహేంద్రియములు దాఁ గాక మోక్షగుండ మను సుషుమ్నానాడి శిఖామధ్యమందుఁ గోటిసూర్యప్రభాభాసితుఁడయి ప్రకాశించు ముఖ్యబింబమైన పరమాత్మయందైక్యంబు నొంది తానే పరమాత్ముఁడై ముక్తుఁడగును.

సీ. తార ! నాదెలిపినతత్త్వవిచారంబు
శుద్ధమనంబుతో జూచుకొనుము
దుఃఖంబులెల్లఁ దొలఁగును; సంసార
కర్మబంధము లెల్లఁ గ్రాఁగిపోవు;

నీపూర్వభవమున నిర్మలభక్తి నా
యందు నుంచితివి; నీ కందువలన
దర్శన మిచ్చి యథార్థంబుఁ గఱపితి;
నాస్వరూపంబు మానసమునందు

గీ. ధ్యాన మొనరింపుమా సంతతము మఱక
మానితజ్ఞాన బోధంబు మఱపకుండు
బహుళభవబంధభయమును బాయఁజేసి
శాశ్వతబ్రహ్మపదవి నొసంగువాఁడ.

వ. అని రాముండు బోధించిన తారశోకంబుమాని మహానంద భరితురాలయి శ్రీరాముని జగన్నాథునిగాఁ భావించి కరంబులుమోడ్చినుతింపఁ దొడంగె.

కమాచ్ - రూపకము.

అంతు దెలియ నెంతదానను భువనాధిపనీ ॥ యంతు ॥ అంతర్బాహ్యములందున సంతంబుగ నలరెడు ॥ నీ యంతు ॥ హరిసురాసుర లరయఁ జాలరు : సనకాదిమౌని వరులు నైన నెఱుఁగనేరరు; తరుణీని విద్యాహీతను గుణితెఱుఁగను గుణహీనను ॥ అంతు ॥ మానితనారాయణార్చిత శ్రీమోక్షగుండశ్రీనివాస లోకవందితా! మానవుఁ డని మది నెంచితి గాని నిజము గననైతిని ॥ యంతు ॥

వ. అని ఇట్లు స్తుతించిన సంతోషించి యాదరంబునఁ జూచె. అప్పుడు రామ బోధితమయిన జ్ఞానవాక్యములను సుగ్రీవుండు విని నిర్మలాంతఃకరుణుండయి రాముని సమీపించినం గాంచి,

తో: అంగదుచే మీయన్నకు సంస్కారాదులు విధివంతంబుగ సాంగం బగునటు సలిపింపుము వెలయంగ నీవు శీఘ్రముగ ॥ రామా ॥

వ. అని యిట్లు రాముం డాజ్ఞ యిచ్చిన మంచిదని సుగ్రీవుండు వాలి కళేబరంబు నలంకరించి విమానంబుపై నుంచుకొని వానరులు చేత మోయించుకొని యంగద తారా సహితంబుగఁ జని యగ్ని సంస్కారాది కర్మంబులు సాంగముగా నెరవేర్చి స్నానంబుజేసి మరల రామసన్నిధానంబునకు వచ్చి నమస్కరించి,

తో: పాదసేవకుఁడ భటుఁడను నేమీ సోదరుఁబోలినవాఁడఁ । ఏదిచేయు మనియెదరో చేయుదు నెఱింగింపుము దయతోడఁ ॥ రా ॥

రాముఁడు :----

హుస్సేనిరాగము : ఆదితాళము

పోవోయి యినజా! లేవిగ గిష్కింధను నేలఁగ ॥ పోవోయీ ॥ నీవిరోధుని జావ నేసితి నేవి లేవు । విఘ్నము లదరక ॥ బోవో ॥ వాలి సుతునకు మేలు గలుగఁగఁ జాల యువరాజ్యంబును గట్టుము ॥ పో ॥ వాన లడిగిన వానరులతో జానకిని గనఁగా నరు దెమ్మీఁక ॥ పో ॥ ఈమహాద్రిని ప్రేమ నుందుము; రాము మేము గ్రామంబులకు ॥ పో ॥ వృక్షచర, సౌమిత్రి వచ్చును మోక్షగుండ రక్షకుఁ డలఁచుచు ॥ పో ॥

వ. అని పలికి సౌమిత్రిని గూడఁబంపిన వారినిఁగిష్కింధకుఁజేర్చి యొక్కశుభ లగ్నంబున సుగ్రీవునకు వానరరాజ్యాభిషేకం బొనర్చి యంగదునకు యువరాజ్యంబుగట్టి వారిచే విశేషసత్కారంబులు వడసి లక్ష్మణుండు మరలి యన్నను జేరి నమస్కరించిరాముం డిట్లను చున్నాఁడు :

శహనరాగము : ఆదితాళము.

వానకాలు మునుకొనెను లక్ష్మణా, ఈ నగమందు గుహలో నిరువుగ నుందామా ॥ వాన ॥ ఎల్లెడలను వాన జల్లులు బిక్కటిల్లె మెల్లన గొండలపై మేఘము, లావరించె ॥ వాన ॥ పగవారిపైనఁబోవు పని గా దీరెండు నెలలు; దగనిందు మోక్ష గుండధవు గనుచుండుదాము ॥ వాన ॥

వ. ఇట్లిరువురు నాలోచించి మంచియుదకములు మంచిఫలములుగల యొక్కచో గుహయొక్కటియుండ వర్ష బాధానివృత్తికొఱకు నాగుహను శుభ్రముఁ జేసికొని మునులబోలి యందు నివసించి తత్త్వవిచారంబుఁ జేయుచుండిరి. అక్కడ సుగ్రీవుండు రుమాకాంతా తారలతోఁ గలసి కామోపభోగంబుల మైమఱచియుండె నది గని యాంజనేయుండు ——

క. రామునకుఁ జెప్పి వచ్చిన
దేమీ! యదిమఱచియుండు టేమీ! యిటునీ
వేమఱియుండిన మనవయి
నామహనీయునకు రాదె యాగ్రహ మినజా!

వ. వారికిఁ గోపంబువచ్చిన భరించువారెవ్వరో! చూడుమని పవనజుండు పలుకఁ బలివొందె సుగ్రీవుండు ——

ప్రో: సకలదిశలకును జనుదెంచిన తరుచరులను బిల్వఁగఁబంపు; మిక రాముని పని కేగుద మన్నియు నేర్పాటులు గావింపు ॥ రా ॥

వ. అని యుత్తరు విచ్చిన హనుమంతుండు సమాచార మంపి డెబ్బదిరెండు వేల వానర సైన్యమును బోగుచేయుచుండె, ఇక్కడ రాముండు ——

నాటకురంజి : రూపకము.

సీతజాడ ప్రీతితోడ నాతొజెప్పవా రేరిల । పాతకునిచేతనెంత! బాధనొంది బడలినదొర! ॥ సీత ॥ నాతని రక్షింపుమనంగ జేతగాక బోయెసురా! యే తెఱంగునను నలవు ద్రోతు నెటుల సైతునుర ॥ సీత ॥ మోక్షగుండాఖ్యక్షితనయుఁ డిక్షుధనువు నెత్తెనుర । యక్షయకుసుమాస్త్రములు వక్షమందు నాట నేసెనుర ॥ సీత ॥

వ. నాయంగనను దొంగిలించిన దనుజపుంగవునిమీదికి మనము మాతంగంబు పయికిసింగంబు లెంగునలంఘింపుమిభంగిఁగదిసిపొంగడంగఁ జేయంగవలెనని క్రోధం బంత రంగంబున నుప్పొంగుచున్నది. రంగు మీఱ నాజాడ నెఱుంగఁజేయుసంగడికాఁడు లేఁ డాయెఁ గదా తమ్ముఁడా! సౌమిత్రి! కనుగొంటివిగదా! శతపత్రమిత్రపుత్రునిమైత్రి.

పంచచామరము.

స్వకార్యమైన మీఁద సూర్యసంభవుం డహంకృతిన్:
సకంత యైనఁ దొంగిచూడకున్నవాఁడు గంటివా!
యిఁకన్ సహింపరాదు వానియేపు రూపుమాపి వా
లికిం బ్రియం బొనర్తు నేఁడు లీలతోడ లక్ష్మణా!

వ. అనిన, లక్ష్మణుండు ——

పంచచామరము.

భటుండనైన నేను వెంటఁ బాయకుండ నుండ మ
ర్కటాధముః జయింప మీరు రాగ నేల? పంపినం
తటన్ దటాన నేను బోయి తాఁకి వానిఁ గూల్చి మి
క్కుటంబుగాఁ బురంబునెల్ల గొల్లఁబెట్టి వచ్చెదః.

వ. అనిన రాముం డలరి లక్ష్మణునిఁ గాంచి.

కేదార : రూపకము.

సోదర! పోగదరా! మోదముతో నాదిని మర్యాదగ నీ వాదరముగ నాతని గను ॥ సోద ॥ మునుముందుగ నతనిన్ జెనకకుమీ మనమేలును మఱచినగతి గనబడినను దునుమాడుము ॥ సోద ॥ అభయ మిడితి గానన్, ఉభయులకున్ శుభముగలుగ మోక్షపుర ప్రభుపు కరుణ బడయఁగవలె ॥ సోద ॥

తో: పోలఁగ సుగ్రీవుని రమ్మనియెను! వాల సతఁడు రాకున్న వాలినిఁ గూల్చిన బాణము గల దని వచియించియు రమ్మనినన్ ॥ రా ॥

క. కాలాగ్నిరుద్రుఁడో యనఁ
గేల ధనుశ్శరము లూని గిష్కింధకు న
వ్వేళఁ జని పురము వెలుకటఁ
జాల నిలిచి చేసె నపుడు జ్యానినదంబుల్.

వ. అమ్మహాధ్వనికి విభ్రాంతులై కపిసైన్యంబులు కిచ కిచ ధ్వనులతోఁ జని చూచి లక్ష్మణునిగా నెఱింగి పోయి యంగదున కెఱింగించిన, నతండు సత్వరంబుగాఁ జని పాదంబులకు నమస్కరించిన సౌమిత్రి ఇట్లనియె:

తో: నీపినతండ్రికిఁ గోపఘూర్ణితుఁడ - నేను వచ్చుటను పలికి! ప్రాపుమీఱ నాపజ్జకుఁ దోడ్కొనిరమ్మని సంగదుఁ డులికి ॥ రా ॥

వ. వేగంబునఁజని సుగ్రీవునిం గని యక్షీణరోషతామ్రాక్షుఁడై లక్ష్మణస్వామి వచ్చి తన సమక్షంబున కీక్షణంబున నిన్నుఁ బిలుచుకొని రమ్మన్నాఁడు. వృక్షచరాధ్యక్షా! ఋక్షకుంజరహర్యక్షా! యను పలుకులను నులికిపడి సుగ్రీవుండు హనుమంతునిఁ గని.

తో: అంగదుండు నీవు గడువడి రఘుపుంగవుతమ్మునిఁ జేరి! పొంగుచు మ్రొక్కియుఁ బురములోకిఁ జేర్పంగవలయుమదిఁగోరి ॥ రా ॥

వ. అని పంపిన వారు చని లక్ష్మణుఁ గని నమస్కరించి 'దేవా! రాజభవనంబునకు దయసేయవలయు రాజకాంతలు తమదర్శనము కొఱకు వేచియున్నారు. సుగ్రీవుని యిష్టం బిది' యనుడు, వల్లె యని వచ్చునప్పుడు మధ్యకక్ష్యాంతరంబునఁ దార యెదుర్కొని మ్రొక్కి.

శ్రీరాగము : రూపకము.

రామానుజ! రక్షింపుము । మామిత్రుని మిత్రసుతుని ॥ రామా ॥ మీమది( గనిపించి యతఁడు క్షేమంబని చేయును గద! ॥ రామా ॥ వనచరులకు వార్తబంపె; వత్తురు రేపో! మాపో! పనులన్నియు మోక్షగుండ ఘనునాజ్ఞను సమకూరును ॥ రామా ॥

వ. ఇట్లు పొగడిన హర్షించుచు సుగ్రీవుని భవనద్వారము సమీపించె. అప్పటికి ఉమాకాంత చెంతనుండి లేచి రాకున్న( గోపించి లక్ష్మణుండు —

తో: చాలఁగ నినజుఁడు స్వామిద్రోహుఁడు, సంపన్నమదాంధుండు, వాలిని గూల్చిన పరశర మెక్కడ బోలే దున్నది జందు ॥ రా ॥

వ. అను లక్ష్మణుని ఘర్షణవాక్యంబులు విని కంపంబునొందుచు నర్ఘ్యపాద్యంబులు గొని సుగ్రీవుండు సౌమిత్రి కెదురేగి పూజించి నమస్కరించి తోడ్కొని పోయి సింహాసనాసీనుంజేసి కరంబులు ముకుళించి —

క. వనచర సేనల నెల్లను
నొనఁగూర్చుచు నున్నవాఁడ; నొగి రా నున్నా
రనఘా! రాము నిదర్శన
మునకేగుద మింక మనము మోదముతోడ౯.

వ. అని లక్ష్మణున కనురాగంబుగాఁబలికి యంగద హనుమంత సుషేణ నల నీల జాంబవంతాదులు వెంటరా సుగ్రీవుఁడు లక్ష్మణ సహితంబుగా రామదర్శనార్థమై మాల్యవంతంబున కరిగి రాముని పదంబులను మ్రొక్కి.

కల్యాణి - ఆదితాళము.

దండము రవికులచంద్రమా నీకు ॥ దండ ॥ కొండల వనముల నుండిన కోతుల పిండును గూర్చుచు నుంటి ॥ దండము ॥ వానలు వెలసిన వత్తుననుచును నే నుంటిని గరుణించు ॥ దండము ॥ తడసితి నని కోప పడకు మోక్షపురియొడయుడదాసుఁడ నౌదు ॥ దండము ॥

వ. అను వినయోక్తులకు నలరి లేవ నెత్తి గాఢాలింగనంబుఁ జేసి కొని రాఘవుం

ఆ. నాను దాసుఁడవును నాకార్యపరుఁడవు
ననుచు గాదె నిన్ను నెనసినాఁడ!
నిప్పటికిఁ బ్రయత్న మేమిచేసితివయ్య!
తెలియఁ జెప్పు మనగఁ బలికె నతఁడు:

మధురగతిరగడ.

పల్లవి ॥ వచ్చిరి మీసేవకొఱకై । వనచరు లోదేవ! పవన కుమారుఁడు
డంగదుఁడుగవయుఁడు నీలుఁడు, గంధమాదనుఁడు । సుముఖుఁడు గేసరి జ్యోతిర్ముఖుఁ
విముఖుఁడును దారుఁడు వినతుఁడు గజుఁడును నలఘుఁడు ద్వివిదుఁడు నాగవాక్షుఁడును
నలుఁడును బావక నయనుఁడు హరుఁడును । నంబురాశిసుతుఁ
జాంబవతుఁడును శతబలి శరభుఁడు! మైందుడు, మొదలగు మర్కట
వంతులుశూరులు యోధులు । తమతమ హితులును దమ్ములుఁదనయులుఁ!
దమతమ మనుములుఁ! దగ వెంబడిరా ధరణి నిండఁగను । ననుగొని
నార్భటించుచును! ॥ వచ్చిరి ॥

తో: వీర క్షేమ గాపింపఁగవలెనో వివరింపుము రఘువర్యా । సాటిను
యాజ్ఞానుసారముగ నలిపెద మందరిధైర్యా! ॥ రామ ॥

వ. అనిన, రాఘవుండు.

క. సీతను వెదకఁగ వీరిని
బ్రీతిగఁ బంపించు మోకపిప్రవర యనన్
జేతంబున ముద మొందుచు
ఖ్యాతిగ నాతండు పంపెఁ గపిసైన్యములన్.

క. ప్రాచిఁ బ్రతీచి నుదీచిన
జూచుటకై వినతు నద్రిసుతుని సుషేణున్
ధీచతురుని శతబలి నటు
వేచనుఁ డని లక్షలక్ష వీరులతోడన్.

త్రో. గజుని గవాక్షుని గంధమాదనుని గవయు నంగదుని దారు । వినయుని ధీ
విభుని మైందు నలు ద్వివిదునిబవనకుమారు ॥ రా ॥ కని పూరలు దక్షిణమునకేగు
జనకజపోఁబడిజూడ, బనివడినెలలోపలను జూచి రావలయును తప్పిన నీడ ॥ రా ॥

వ. మిమ్ము ప్రశ్నించుటలేదు. రాముని సమక్షంబున శిక్షింతును పొండని సెల విచ్చిన, సుగ్రీవుని శాసనంబుల వినిచినటులు ప్రయాణోన్ముఖులయి రామునకు నమస్కరించి.

బ్యాండు : ఆదితాళము.

పోదుమా మేము! పోదుమా మేము। మీ దేవిని జూడనో రామ! ద్వీపములెల్లను దిరిగి చూచెదము! దేశములన్ని ద్రిమ్మరికాంతుము శ్రీ మోక్షగుండపురీశ, భూపుత్రి జూడ నెప్పుడు నూరకరాము ॥ పో ॥

వ. అని ప్రయాణోన్ముఖు లగుచుండ నందఱలో హనుమంతుని స్వకార్యనిర్వాహక ప్రసిద్ధునిగా బుద్ధినెంచి యొద్దకు బిలిచి ముద్దుటుంగర మిచ్చి రాముం డిట్లనుచున్నాడు :

క. ఈయుంగరమును గొని చని
వాయుజ; జనకజను నిచ్చి, వచ్చును రాముం
డీయెడను; యుద్ధప్రయత్నము
జేయుచు నున్నాఁ డటంచుఁ జెప్పుము శుభముల్.

వ. నీకు మేలు గలుగుగాక; శీఘ్రంబున నడవుమని నాంజనేయుం డంజలిచేసి గంతులు వైచుచు నంగుళీయంబు శిరసావహించి యంగదాదులతోఁ గలసి దక్షిణదిశకుఁ బోవ నుద్యోగించి.

తో. భానుజునాజ్ఞను బటుతరవింధ్య ప్రాంతంబుల వెతకుచును వానరులుండగ వారి యెదుట నొకదానవు డగపడి యునెను ॥ రామ ॥

వ. మారీచుని కుమారుండ బౌటుపశాలిని. మీరెవ్వరో కాని నావనంబున కేల దూఱివచ్చెదరు? మిమ్ము మ్రింగుడు నన సంగదుండాగ్రహించి పిడికిట నడిచిన నొక్క గ్రుద్దునకే పెద్దనిద్దురజెందె. అంతవారు వనంబునఁ దిరిగితిరిగి దప్పి దాహంబుఁగొని యొక్కెడ నీరుగానక ——

పీలురాగ - ఆదితాళము.

దాహమాయె! నయ్యో! తాళగలమే యిఁక! దేహములుడస్సె! వైదేహి నెట్లుగాంచ నగు ॥ దాహ ॥ నీరు జూపు పుణ్యులెవరు లేరుగానిట! దారిదోపదాయెను! నోరు లెండిపోయె గటా! ॥ దాహ ॥ భూమి మోక్షగుండస్వామి కార్యమునకుఁ బ్రేమ వచ్చినారము; విఘ్నములు గలుగ నేల ॥ దాహ ।

వ. అని నీరుపట్టుచేత మేనులు సుడివడ వచ్చుచు జని వింధ్యపర్వత తీరమందొక బిలముం గని జలపక్షులు తిరుగుచున్నందున నుదక ముండునని యెంచి యంధకారమ్మగ నుండు నా గుహలోనికి ధైర్యంబునఁ బోయిరి. అందు నాచీఁకటి విరిసి ప్రకాశమైన యొక పురంబు గనఁబడిన, నందుఁ జొచ్చి చిత్రంబుగాఁ గనుచు.

క. ఈగుహాయం దీనగరం
బేగతి రచియింపబడెనొ! యిదియెవ్వరిదో!
భోగవతీనగరంబో।
బాగుగ నున్నయది దీని పనితన మహహా!

వ. అని వర్ణించుచు నాపురంబులోఁ దిరుగుచుండ నొక్కచో మిగుల రమణీయం బయిన సౌధంబు గనబడిన నచ్చెరువంది—

కమాచ్ : రూపకము.

అందమైన యీమేడ నిందుఁగట్టినట్టి ఘను లెవరో! యెందుఁజూడ మిట్టిపనితనమును! ముందెవరుఁ బొందుగ నన వినము బళే! ॥ యంద ॥ ఇందు కాంతవేదులు, గుందనంపు గోడలకు నిలిపిన సుందరంపు నిల్వుటద్దముల వనంబు గనఁ విం దగు జూపులకు బళే! ॥ యం ॥ దీక్షతోఁ దిక్పాలుర దివ్యమైనమాడువుల కీ డగు మోక్షగుంత పక్షనున కెఱుకగు నీక్షితి నిం కెవ్వరి కెఱుగనగును బళే! ॥ యంద ॥

వ. ఇట్లాశ్చర్యపడుచు నా మేడలోఁ బ్రవేశించి యందు దపంబు జేయుచున్న యొక్కకన్నియం గని మ్రొక్కి వారిలో హనుమంతుం డిట్లనియె.

తో. ఎవరమ్మా! నీ విచ్చట నొంటిగ నేల దపముఁ జేసెదవు? ప్రమదలాంగి! యీ భవనమెవ్వరిది? వివరింపుము సొంపొదవ ॥ రామ ॥

వ. అనిన, నాతపస్విని యిట్లనియె.

తో. మయుఁడను వా డీమందిరమును నిర్మాణము జేసియు నిందు। ప్రియ హేమ సమాభిఖ్యతరుణితో వెలయజేసికొన నిందు ॥ రా ॥

వ. ఇట్లుండ దేవేంద్రుండు వచ్చి వానిం జంపి హేమనుగొనిపోయి యీరామె తండ్రి యగు విశ్వకర్మకు నిచ్చి; వినుము —

క. హేమునకుఁ జెలికత్తెను; నే
నేమంబున దపమొనర్తు నిరతం బిచటన్;
భూమండలిని స్వయంప్రభ
నామముగలదాన నిదియె నాతెఱఁగరయన్.

వ. మీ రెవ్వ రిం దేల వచ్చితిరి? నావల్లగాఁ దగిన ప్రయోజనంబే మనిన హనుమంతుం డామె కిట్లనియె.

క. దశరథతనయులుఁ బాండుర
యశులును నగు రామలక్ష్మణాఖ్యు లడవికిన్
విశదంబుగ వచ్చినచో
దశకంఠుఁడు రాముతరుణిఁ దాఁ గొనిపోవన్.

వ. సుగ్రీవుం డను వానరరాజుతో సఖ్యంబుఁ జేసిన, నతండుఁ దనబంటుల మను మమ్ము సీతను వెదకుటకయి పంపె, దాహంబు గొని నీరు గానక యీబిలంబులో నయిన నుదకంబు దొరకునేమోయని వచ్చినాము, మాదాహంబు దీర్చి వెలుపలికిఁ బోవు త్రోవఁ జూపుము తల్లీ!

గీ. అనిన ఫలము లిచ్చి యాకలిదప్పులుఁ
బాయఁ జేసి, కనులు మూయఁ జేసి
బిలము బయటఁ జేర్చి ప్రియమున రాముని
జూడఁ బోయె నామె వేడ్క కలర.

వ. ఇట్లు చని రాముని సందర్శించి నమస్కరించి యిట్లని ప్రార్థించుచున్నది.

కీర్తన : ఆదితాళము.

రామ భూమిజామనఃకామా! సామజనుతనామ! ॥ రామ ॥ జగదభిరామా! దనుజవిరామ! సుతసుత్రామ! నిరతము! నామనోబ్జసీమ నీదు తారకనామ మేమారక తపము వేమరుఁజేసితి ॥ రామ ॥ హృన్నభంబున నిన్నుఁ జిన్మయు నెన్నఁగఁ గనుగొనకున్న సద్గతి నున్నయనుచు నెన్నుశ్రుతు లని బుధు లన్నవిన్నఁ, గన్నతండ్రి, నన్నికఁ బ్రోవవే ॥ రామ ॥ మోక్షగుండాధ్యక్ష సజ్జనపక్ష సురమునిరక్షణమునకు రాక్షసులను శిక్ష జేయు టకును నీ సత్కీర్తి మానవదేహ మెత్తితివో జయ ॥ రామ ॥

వ. అనిన.

క. మానిని, నీభక్తికి నే
మానసమున మెచ్చినాఁడ; మఱియే వరముల్
మానుగఁ గోరెదవో యను
మానము లేకుండ నడుగుమా! యనియెత్తుఁ.

వ. అనిన, నామె యిట్లనుచున్నది.

తోహర: దాసురాలిపై దయఁగలిగి కృతార్థత జేయఁగ మదినెంచి, నీ సుదర్శనము నేఁటి కిచ్చితివి నిశ్చల తపము ఫలించి ॥ రామ ॥

కమాచ్ రాగము: ఆదితాళము.

ఏవరంబులేలనో దేవ రాఘవ యీవరంబు జాలు! మోక్షమీవె రాఘవా! దేవ లాత్మమయుఁడ వైన నీవు సీతమ్మనితో దేవితో నశ్రాంతమును భావమందుఁ దోపవే ॥ ఏ వరంబు ॥ ఈక్షితి నీమీఁద జన్మమెత్తఁజాలవు గావునస్ మోక్షగుండవుంచు నీసమక్షమునఁ జేర్పవే! ॥ ఏ ॥

గీ. అనుచుఁ బ్రార్థింప సంతోషమంది రాముఁ
డనియె: 'యోగిని' బదరికావనమునందుఁ
జేరి నానామజపమును జేయుచుండు;
మంత్య మందైక్య మగుదు నాయందు నిజము.

వ. అని కటాక్షించి నంతఁ దత్క్షణంబున నామె బదరికావనంబునకరిగి యచట రామనామస్మరణంబు జేయుచుఁ గొంతకాలంబుండి ప్రారబ్ధమోచనసమయంబున శరీరంబు దొలఁగి స్వయంప్రభ స్వయంప్రభయం దైక్యం బయ్యె. ఇక్కడ నంగదుఁడు దక్కిన మర్కటులతో ననుచున్నాఁడు.

వసంతరాగము: అటతాళము.

ఎందుఁ బోఁపుదము సీతను గన ॥ నెందు ॥ ఎందుఁ బోయిన గార్యమేమిలేదు; మన మందఱ మిచట మృతిబొందిన మేలగు ॥ నెందు ॥ అటుఁగాక నూరిక నటుఁబోవ గాను మర్కటరాజుదండించుఁ గటగటా! యిఁకమీఁద ॥ నెందు ॥ గురుతరముగ మోక్ష గుండనివాసుని కరుణలేక గడ్డు కాలము వచ్చెను ॥ ఎందు ॥

వ. అనినఁ గొందఱు వానరు లిట్లనిరి.

క. సీత కనుపించలే దని
పోతిమయే నతఁడు చంపుఁ, బోవఁగ నేలా!
యాతరుణి యున్న బిలమున
ఖ్యాతిగ నివసింత మదియు నతిగోప్య మగున్.

వ. స్వయంప్రభ యుంచిన యాబిలంబుఁ బ్రవేశింప హరిహరాదులకైన నగోచరంబు గాన, నందు దాఁగియుందము. రండని యత్నించుచున్న వనచరుల కాంజనేయుం డిట్లనియె.

తో. రాముం డనఁగా సామాన్యుండని మీ మనముల నెంచితి రో! కామజనకుఁ డగు; గమలజ జానకి; భూమినయోధ్యాపురిలో ॥ రా ॥ అవతరించినా రమరులఁ బ్రోవను, నసురుల ద్రుంపను మనము భువి దదాజ్ఞచేఁ బుట్టితి మమరుల బూర్ణాంశంబుల నిజము ॥ రామ ॥

వ. ఆయనకుఁ దోడుపడఁ బుట్టిన మన మిట్లు దాఁగవచ్చునా! అమ్మహనీయుని ప్రభావం బెఱుంగరా! మనకు వాలి మరణంబేసాక్షి.

కీర్తన : ఆదితాళము.

రామునిపేరపరాక్రమ మెఱుక యీమాడ్కిని బలుకుటమేలా! యామేటికి భూమండలి నేమాత్ర మాటంక మేమున్నది ॥ రాముని ॥ కొండబిలములోన నుండుటకాదు; బ్రహ్మాండములో నెం దుండినను దండిగ నాతండు గన కుండునా! శ్రీమోక్షగుండేశుఁడా ॥ రాముని ॥

వ. ఆమహనీయుని కార్యంబు నెఱవేర్పకున్న మనకు నరకంబు దప్పదు; స్వామి కార్యంబునందు మెలంగుచు దుర్ఘటమైనచో మరణించిన వైకుంఠ పదవి కలదు. ప్రాణములేల దాపవలె! రండని ధైర్యవచనంబు లాడిన, నందఱు లేచి క్రమముగా సీతపోబడి విచారించుకొనుచుఁ గొన్ని దినంబులకు దక్షిణసముద్రతీరంబున నున్న మహేంద్రాద్రికిఁ జేరి సముద్రంబును దిలకించి,

హిందుస్తానిభైరవి-అటతాళము.

ఇది దాటుటకు నిం కెవరితర మగు నేమి దోచకయున్నది యంతులేదు ॥ ముదమున

సులభముగ నెంచి భానుజుఁడంప నేతెంచితి మిచటికి! శ్రీమోక్షగుండేశభామిని సాధి
లేము! సాగర మరసిన సంగతేదు ॥ యిది ॥

వ. ఇట్లాలోచించి యథైర్యంబు నొంది నిర్విణ్ణులయియున్న వనచరులకు హనుమ
తుం డిట్లనియె.

క. నెలదాఁటిన సుగ్రీవుఁడు
నెలకొని దండించు; మనము నెలలోపలనే
జలజాక్షి దొరకలే దని
తెలియుచుఁ జని చెప్ప నతఁడు మన్నించుఁజుఁడీ!

వ. అనిన, నంగదుం డిట్లనియె:

గీ. తగినవారల నెల్లను దక్షిణమున
కంపియున్నాఁడు చేతగాదనుచు మనము
పలికి నంత నతఁడుగొట్టఁబంపు మనల
గాని మన్నింపఁ బోడు నిక్కంబు వినుఁడు.

వ. రాముని కార్యంబు నెఱవేర్తు నని పలికియున్నాఁడు. కాన మనమీదఁ
కరము కలుగదు. వానిమనోధర్మంబుఁ జెప్పెద వినుఁడు,

తో: తనయన్నను జంపిన రామునకును దా సహాయపడునటుల। నని చని రా
మదాంధత్వంబున నవియు మఱవడే యవల ॥ రా ॥

వ. లక్ష్మణుండు యుద్ధంబునకు వచ్చినప్పుడుగదా లేచి వచ్చినాడు!
కృతఘ్నుఁడో చూడుము మారుతీ.

తో: వాలిని జంపియు వాని రాజ్యమును వనితను గూడను కొనియు। నెల
మున్నాడిట్టి దురాత్మున నేమికరుణనుదివెలయు ॥ రా ॥

వ. కాబట్టి వానిశ్చయము మీా రండయు వినుఁడు.

బేహాగ్ - ఆదితాళము

నేరాను నేరాను పొం డిఁక మీారు ॥ నేరాను ॥ నారీమణి జాడగననేరక యు
నటకు ॥ నేరాను ॥ పోయి వానిచేత శిక్షఁబొంటు దానికంటె నిచటఁ బ్రాయోపవేశము
బ్రాణము బాసనమేలు! శ్రీయుతముగ మోక్షగుండనాయకుని పాద మాన ॥ నేరాను ॥

వ. అప్పుడు యువరాజు మనోనిశ్చయంబున కందఱు మంచిదని యొక్కచో దర్భ శయనంబు లేర్పఱుచుకొని వాని యందుఁ జేరి ప్రాయోపవిష్టులు గాఁదలంచి యున్నంత మహేంద్రగిరిగుహనుండి ఱెక్కలు లేని యొక్కగ్రద్ధ వికృతాకారంబుగా వెడలి వచ్చి వారినిఁ జూచి.

సంపా : తో : నా కెర దొరకె యీనాఁటికి నిక నొన్నాళ్ళకు భీతియె లేదు। చేకొని నే భక్షించెద నని యదిపైకిరాఁగనామీద ॥ రా ॥

వ. వానరులు భీతచిత్తులగుచు.

వా: ద్వి. అక్కటా ! దీనికి నాహారముగను
జిక్కఁడటంచువ్రాసెనో బ్రహ్మమనకు !
లేకున్న నిట్టిబలిష్టపుగ్రద్ధ
నేకాలమందైన నెఱిగియున్నామె !
మరణంబు గోరెడు మనకోర్కెఁ దీర్ప
పరభగంబైమిత్తి వచ్చెఁగానోపు !
అద్దిరే ! బలవంతులను పేరుఁగాంచి
గ్రద్ధకులోఁబడఁ గా నాయెడఁ దుదకుఁ
గాకుత్స్థకులమును గడపట మనలఁ
గైకపరం బిట్లు కాల్చుచున్న యది ;
యని యిట్లు వగచెడు నావానరులకు
వనియె ధైర్యము, నొంది యంగదుం డపుడు.

శంకరాభరణము : ఆదితాళము.

ఇక వగపుజెందవలదు కపులార ! యిఁక ॥ వగ ॥ తగజావఁగఁ బ్రయత్నము వల దని యాభగవంతుఁడె దీనిఁ బంపె మేలాయెనిక ॥ వగ ॥ రామకార్యార్థమై రావణుతోఁ బోరి; భూమి జటాయువు బొలియలేదే ! యిక । వగ ॥ వినుఁడు మోక్షగుండ విభుని కార్యములో మనమును జచ్చిన మంచిదికాదే ! యిక ॥ వగ ॥

వ. ఇట్లు ప్రస్తాపముగా జటాయువును బ్రశంసించిన నాలించి యాగృధ్రపతి వనచరుల దగ్గరి యిట్లనియె,

సీ. అజటాయువు తమ్ముఁ డగునాకు; నాతని
నెట్లెఱుంగుదురు? మీ రెవ్వరయ్య?
బహుకాలమునకు మద్భ్రాతృవార్తను వింటి;
ఘనసుదినంబు నిక్కంబు నేఁడు;
హితులార, తన్మృతి హేతువుఁ జెప్పుఁడ
నంగ, జెప్పఁ దొడంగె నంగదుండు
విహగేంద్ర దశరథవిభునిసూనులు రామ
లక్ష్మణు లనువారు లలనతోడ

గీ. దండకాటవులకు రాఁగ దశముఖుండు
వారి వంచించి కొనిపోయె వనిత నంత
దారిలోన జటాయువు దాకి పోరి
దన్నిరావణుచేత వతంగె నతఁడు.

వ. తర్వాత నవ్వార్తయెఱింగి రాముండు వచ్చి యతనిదహనంబు జేసిన, నతండు కృతార్థుండయ్యె. పిమ్మట రాముండు సుగ్రీవునితో సఖ్యంబుఁజేసి వాలిని ఁంపి కపిరాజ్యంబు సుగ్రీవున కిచ్చిన నతండు రామునిభార్యయగు సీతాదేవిజాడఁ దీయుటకు వానరులమయిన మమ్ముఁ బంపిన వచ్చితిమి.

తో. ఎక్కడఁజూచిన నింతిజాడ మాకెరుకపడదు గావునను, జక్కఁగఁ లంకకుఁ జనవలె ననిమే మిక్కడఁ జేరి యుండగను ॥ రా ॥

వ. లంకయెక్కడ నున్నదియు నెఱుంగక, సముద్రంబుదాఁటు నదుపాయంబు దొరకక, మరలిపోయి యధిపతిచే దండింపఁబడుటకంటె నిక్కడనే ప్రాయోపవిష్టులము కాఁబోవుచున్నాము. దయానిధీ! మీరెఱిగియుండిన సీత పొలకువ సెలవియ్యవలయునన, జటాయువు మరణవార్తవిని సంపాతి నెమ్మనంబున—

హిం-కాఫి: ఆదితాళం.

సోదర! నిన్నికమీదఁ జూడరా యకటా ॥ సోదరా ॥ పోయుగా బ్రహ్మవ్రాత! పూర్వమందు మన మేకోదరులము కూడియుండి బాసితిమి హా! ॥ సోదర ॥ అక్కట స్వయంకృతమైన కర్మముచేత ఱెక్కలు గమలి నే నిక్కడఁ జిక్కితి హా! ॥ సోద ॥ అహ

రహమును విన్ననుకొనుచుంటి నీ మహనీయులచే మరణవార్తవింటి ॥ సోద ॥ రాక్షస
విభునిచే రణమునఁ దెగితివి మోక్షగుండపతి పుణ్యపదము గలిగె ॥ సోదర ॥

వ. ఇట్లు కొంతవడిను దుఃఖించి పిమ్మట ధైర్యంబుదెచ్చుకొని వానరులతో నిట్లనియె:

తో. అన్నదమ్ములము అరుణనందనుల మాజటాయుపును నేను ; నన్ను నీటిచెంతను
గొనిపోయిన స్నానము గావించెదను ॥ రామ ॥

వ. అనంతరము మీకోరిన సంగతులనుఁ బ్రత్యుత్తరముఁ జెప్పెద ననఘుఁడు మంచి
దని వారంద అతని మోసికొనిపోయి సముద్రములోనికి జేర్చిరి. సంపాతిస్నానంబుఁజేసి
జటాయుపునకు జలంబు విడిచి తీరంబుఁజేరి ——

ఆ. నూఱుయోజనములదూరంబు వార్థిలోఁ
బోవ లంక గలదు ; రావణుండు
జనకసుత నశోక వనమందు నుంచి యు
న్నాఁడు ; దూరదృష్టి నాకుఁ గలదు.

తో. కాన! నంతయును గనఁబడుచున్నది నేను బోవఁగాగలను! మానుగ రావణు
మర్దించియు నే మానిని గొనిరాగలను ॥ రా ॥

వ. నాకు రెక్కలు లేనందునఁ గొంచెము చిక్కినాఁడ, మీరీయుదధి దాఁటి సీతను
వీక్షించి వచ్చుటకు సమర్థులరే కాని వ్యర్థులుగారు, పోయి రండు. రామునిచే రావణుండు
దునియఁగలడు. అనిన, నంగదుం డిట్లనియె.

క. చక్కఁగఁ బక్షులకెల్లను
రెక్కలె యుండంగవలయు, రెక్కలు లేమిన్
జిక్కుపడినట్టి కారణ
మక్కజముగఁ దెలుపవలయు నని యడుగుటయున్.

సంపాతి-కళ్యాణి-అటతాళము.

నాపూర్వ వృత్తాంత మీపట్లఁ దెలిపెద : నాపేరు సంపాతి నగచరవర్యా! యేనును
నాతమ్ముఁడును నేను బౌరుషముచే, పైకెగసి, వినువీథిని వారఁగను పోనుపోను రవిదాపు
గలుగుటచేత రెక్కలు దగ్ధమై వింధ్యాద్రిఁబడితి ॥ నాపూర్వ ॥ మోక్షగుండేనని సాక్షిగను

మూర్ఛమునిఁగ తెలివొందితి మూఁడునాళ్ళకును; బక్షములు లేనందువలనను నెగురంగఁ జాలక సీక్షితిని దొర్లాడుకొనుచును బోయి పోయి కడు దీక్షతోఁ జంద్రముఁడునా ముని దివ్య మగు నాశ్రమముఁజేరితి ॥ నాపూర్వ ॥

వ. అప్పు డమ్ముని పల్లభుండు నన్నుఁజూచి యిట్లనియె.

తో. ఎందుకు నీ కీ వికృతాకారం బేర్పడెనో! సంపాతి! క్రిందట ని న్నెఱిఁగిన కతమున నడిగితిఁ దెలుప నరుణసూతి ॥ రామ ॥

వ. అని యడిగిన నమ్మునికి నాస్వయంకృతాపరాధం బంతయుఁ దెలిపి దుఃఖించుచు నిట్లంటి.

తో. అనఘా! యీవికృతాకారముతో మనియుండఁగనోఁజాల, మునివర, యిక నీతనువును గాలిచి నను గడతేర్పు మీవేళా ॥ రామ ॥

వ. అని శోకింప దయామయుండైన యమ్మునివరుం డిట్లనియె,

బేహాగ్ ; రూపకము.

ఏల జాలి నొందెదవు కాలగతికి! మానుము: చాల దుఃఖమునను మేను మూల మగును దూఱుము ॥ యేల ॥ కర్మము దేహంబునకుఁ గారణమని యెఱుగుము! కర్మ కహంకార మగును గారణము దెలియుము ॥ ఏల ॥ ఆ యహంకారం బవిద్య; యందు వేగ నలిగెను బాయ కంటుమోక్షగుండ ప్రభువు చాయ నిలిచెను ॥ యేల ॥

గీ. ఇట్లు తోఁచినట్టి యీశ్వరచ్ఛాయను
జీవుఁ డనుచు బుధులు చెప్పుచుంద్రు;
దినదినం బతండు దేహాత్మబుద్ధిచే
సకలకర్మములను సలుపుచుండు

వ. తనమూలంబు గుర్తెఱుంగక విషయాసక్తుండై పుణ్యపాపకర్మంబు లనంతంబుగా నాచరించి, యూర్ధ్వాధోలోకంబులకు నెడతెగక దిరుగుచు, నందుఁ బ్రాప్తించు సుఖదుఃఖంబులకు బద్ధుండయి యనుభవించుచుండు; నెట్లనిన—

క. క్రతువులు మొదలగు సత్క్రియ
లతిభక్తిని నాచరించి యంతంబున స

ద్గతి కరిగి యుచట సౌఖ్యము
లతులితముగఁ బొంది పుణ్యమడఁగిన మీఁదన్.

తో. ఇందుమండలమునందు జేరి హిమబిందువుతో జతగలసి । క్రిందనుబడి యీ క్షితి వ్రీహ్యాదులయందుఁ జొచ్చికడు వెలసి ॥ రామ ॥

కీర్తన: ఆదితాళము

అరుణసుతా తరువాతన్ అది యన్నముగా మాఱున్; బురుషుని గర్భము జేరున్; పరరేతంబై యలరున్ సతులున్ బతులున్ సురతంబునందుఁ గూడగా జారున్ ॥ అరు ॥ ఋతురక్తములో గలియన్ హితవుగ నొక దినమునకున్ క్షితి గలలముపలెఁ బొలుచున్, ధృతి బంచాహ్నంబులకున్ దిరుగన్ సరగన్ మితమయిన బుద్బుదాకృతిని నిలుచున్ ॥ అరుణ ॥ పదునైదవ దినమునకున్ మృదుమాంసపుఁబిండముగన్ ముదమునఁ బొదలుచు నిది యల రారున్; మోక్షపురీశుని కరుణన్ దలఁపన్ విదపన్ బదినాళ్ళ కంకురంబు ప్రభవించున్ ॥ అరుణ ॥

సీ. మెదడయును దలయును మెడపంపులును వెన్ను
నుదరంబుఁ గలుగును నొక్కనెలకు:
బాణిపాదంబులు పార్శ్వముల్ కటి జాను
వులు మాసయుగమున నెలమిఁబొడము;
మూఁడవనెలయందు మొలచును దనుసంధు;
దలరు నాల్గవనెలయందు వ్రేళ్ళు;
ముక్కు వీనులు నేత్రములు గల్గు నైదవ
నెలను; జీవుం డందు నిలిచియుండు;

గీ. దంతపఙ్క్తి నఖంబులుఁ దగ జనించు;
నాభి గుదగుహ్యములకు రంధ్రంబు లాఱు
నెలల కేర్పడుఁ; దలవెంట్రుకలును రోమ
ములును నేడవనెలయందు మొలచు నవల.

వ. ఎనిమిదవమాసంబునకు సర్వావయవంబులు సంపూర్ణమగును. పిమ్మట మాతృ భుక్తాన్నసారంబునాభి సూత్రాల్ప రంధ్రంబునఁ బరి గ్రహించి యభివృద్ధి నొందుచు గర్భస్థ జీవుండు జఠరానలతప్తుండయి స్వకృత కర్మంబును గుఱించి యిటని చింతించుచుండు:

కమాచ్ : ఆదితాళము.

కడతేరే దెన్నఁడో! దరిఁజేరే దెప్పుడో! ॥ కడ ॥ ఘోరమయిన యీకూపములోపలఁ జేరితి! వెడలఁగ దారి దొరకక ॥ కడతేరే ॥ స్వకృత కర్మమున సకలయోనులం దకటా! పుట్టుచు నడఁగుచుంటి; ॥ గడతేరే ॥ న్యాయముదప్పి ధనంబు గూర్చి నిజజాయాసుతుల కొసంగుచుంటి ॥ గడతేరే ॥ అస్థిరమగు దేహాది ప్రపంచము సుస్థిరముగ గని చొక్కుచుంటి ॥ గడతేరే ॥ మోక్షగుండపతి ముఖ్యచింతనాపేక్ష వదలి నేఁ ప్రేలుచుంటి ॥ గడతేరే ॥

తో: కావున, నే నీగర్భనరకమున గడువడిఁ బడియున్నాను, త్రోవ దొరకక యిందుండి వెడలి తే నా వెనుక మఱవకయె ॥ రామ ॥

సర్వేశుని సంస్మరణఁజేయుచును సంసారాంబుధిఁ బడక, నిర్వాణంబున కుర్వడి జని నే నిలిచియుండు నికఁ జెడక, ॥ రామ ॥

వ. అని చింతించుచుండు నంతలో నవమాసంబులు నిండి ప్రసవసమయంబు ప్రాప్తించిన—

గీ. భూరిదుర్గంధయుతమైన పుంటినుండి
క్రింద నరగునఁ బడునట్టి క్రిమి విధమున
యోనియంత్రప్రపీడితుఁడైన దేహి
మాపితోఁ గూడి గ్రక్కున మహిని బడును.

వ. ఇట్లుదయించిన మాయ గప్పుటచేఁ బూర్వజ్ఞానంబు మఱచి బాల్యాదిదుఃఖంబులు సర్వంబు గుడుచుచు, దేహమే నే నను భ్రమచేజిక్కి వ్యర్థంబుగా గాలంబుఁ బుచ్చుచు బలుమాఱుఁ బుట్టిచచ్చుచు గర్భనర కాద్యవస్థలు సారెసారెకు ననుభవించుచునుండు. ఇట్టి దుఃఖభాజనం బగు దేహంబు రాకుండ, జేసికొనవలయునది. ఎట్లులనిన :—

శహన : ఆదితాళము. (పురమునలం) వలె.

'పుట్టుక లేనట్టివిధం బిట్టిది యెఱుఁగదగదు' నే నీ పట్టునఁ దెలిపెద ॥ పు ॥ ఇట్టి దట్టిదిం తిం తని యన రానట్టిదాని బూర్ణముగను గాంచుటె! ॥ పు ॥ శ్రీగురుని వేగ గని సాగిలి మ్రొక్కులిడి, యాగమతత్త్వరహస్యార్థమువిని, యాగయోగభోగాదులయందువిరాగచిత్తుఁడై యాత్మను దెలిసినఁ ॥ బు ॥ క్షీరంబుఙ క్షీరమునన్, నీరము నీరమునఙ, జేరువ, నొకటిగ జెలఁగిన విధమున వేడుగాక శ్రీమోక్షగుండ రఘువీరునితో బావెలయఁ గలయుటే। ॥ పుట్టుక ॥

ఈ విషయం బిటుండనిమ్ము. జరుగబోవు కార్యంబు వివరించెద.

క. వగవ బనిలేదు త్రేతా
యుగమున హరి రాముఁడై యయోధ్యను బుట్టున్
దగ నతఁ డడవులకును రాఁ
బగఁ గొని రావణుఁడు జానిపత్నిని గొనిపోన్.

గీ. అంత సుగ్రీవుతోఁ జేరి యతనిభటులఁ
గపులఁ బంపించు వెదుక నో ఖగవరేణ్య!
తెరుపువారికి జూపించి తేని నీకుఁ
బక్షములు వచ్చు; నిజ మని పల్కుటయును.

వ. అమ్మహానుభావునికి మ్రొక్కి మెల్లగా నిమ్మహేంద్రగిరి గహ్వరంబుఁ జేరి బహుకాలమునుండి వాసముఁ జేయుచు సంప్రాప్త భోజనుండనై మీరాక గోరుచున్నాడ. ఇందులకు దృష్టాంతముగ ——

తో. ఇదిగో నాకును రెక్కలు వచ్చెను నిక నే నెగిరెద ననుచు! దివికిని నెగిరియు దివ్యవాక్యములు దెలిపెనువారికి గనుచు ॥ రా ॥

కీర్తన : ఆదితాళము.

విను డిక వానరవిభులారా! వినిపించెద నోఘనులారా! ఘనముగ వారిధి గడిచి లంకకును జని రాలేమనిసంశయపడకుఁడు ॥ విను ॥ శ్రీమహిజాపతి నామము నిరతము పామరులైనను బఠియింప క్షేమంబుగ సంసృతిసాగరమును దాము దరించి కృతార్థులగుదురిల ॥ విను ॥ మోక్షగుండ పతిముఖ్యభక్తులై యీక్షితిలో జరియించెదు మీ కక్షయబలులకు సంబుధి దాటుట లక్ష్యమె యవలీలగ దాటెదరు ॥ విను ॥

వ. అని తెలిపి సంపాతి యథేచ్ఛం జనియె. అంతవానరులధైర్యంబు వదలి శతయోజన విస్తీర్ణమయిన సముద్రంబు దాఁటి లంకకుఁ బోవ నిశ్చయించి యున్నంత నంగదుండు వానరులతో నిట్లనియె :

తో: ఎంతదూరమెవరెట్లుపఱుతురో! యెఱిగింపుడు నాతోడ! వింతగ మీజవ విధమును విని సంతోషింతునుజూత ॥ రామ ॥

వ. అనవిని గజ గవాక్ష గవయ శరభ గంధమాదన మైంద ద్వివిద తారులు క్రమంబుగఁ బది యిరువది ముప్పది నలువది యేబది యరువది డెబ్బది యెనుబదియామడల దూరముఁబోగలమనితమగమన జవంబు కొలఁదులం బలికిరి, అంత జాంబవంతుండు.

హిం. కాఫీ : రూపకము

అంగద వినుమా! పొఁగుచు నాబలము గనుమ! ॥ యంగ ॥ చెంగున సప్తాంబుధు లెగురంగల బూర్వంబున నే ॥ నంగ ॥ తిరిగితి నిట్లు త్రివిక్రమ దేవునిచుట్టుదిరిగితి ॥ ఇరువదియొకమాఱు గిరులు పిరిగి నొచ్చె జరణంబులు ॥ అంగ ॥ అది మొదలుగను సలసితి ముదుసలిని నేను నదియయినను నిప్పటికిదొంబ! దామడల దాటంగ గలను ॥ నంగద ॥ ధారుణిలోన నారాయణ కవిమనమున ॥ ధారుణి ॥ గూరిమి విహరించు మోక్షగుండవిభుని పాదమాన ॥ యంగ ॥

వ. అంత నలుండు తొంబదియేడామడదాట నవంబు దనకుగలదని పలికె. అప్పు డంగదుండు—

క. శతయోజన మెగురుసమ
ర్థత నాకును గలదు; మరల రాలే నేమో
యతిసంశయంబు గలిగెడు
గతియే నని పలుక భల్లుకప్రభు పనియెఁ.

క. నీవు యువరాజ వగుదువు
కావున, సుగ్రీవసమముగాదే మాకుఁ
సేవకులము మే ముండఁగ
నీవేగఁగవలెనె! వలదు నిలువుమువత్సా!

వ. అని యిట్లువారు మనవిచేయ నేమియు జెప్పక యూరక గూరుచుండె ఆంజనేయుని డగ్గిరి జాంబవంతుం డిట్లనియె.

బేహగ్ : ఆదితాళము

పవమాననందనుఁడవు నీవు; అసమానబలుడ వనఁ దగినావు; అనుమాన మేటికి లేచి రావు? మౌనమూన నౌనా! లేలెమ్మ! చిన్ననాఁడే ఫల మని భ్రమఁజెంది కమలబాంధవు మ్రింగఁబోయి కంది నిలువ నోడి యిలపైని బడి కుంది చూడఁ జూడ వాడి జెడవు ॥ పవ ॥ నీవంతు శ్రీమోక్షగుండకాంతు కార్య మంత దీర్పగ నని వచింతు హనుమంత నీ చెంత మాకుప్పిగంతు లెంత! వింత! సంతతసమున ॥ బవమాన ॥

వ. అనిన నుప్పొంగి బలిధ్వంసనకాలంబున వామనమూర్తి వలెఁ బర్వతా
మహాట్టహాసంబున బ్రహ్మాండంబు భేదిల్ల సింహనాదంబుఁ జేసి హనుమంతుండు
కార్య ధురంధరుఁడయి యిట్లనియె.

హాహాహాళిఁ ధరాత్మజాత నట్టె చూచి; రావణుఁ
గళత్రపుత్రబాంధవాదిగా వధింతుఁ! గానిచో
గళంబులందుఁ ద్రాడుగట్టిగట్టిగాను నీడ్చుచుఁ
జెలంగి లంకతోడ వానిఁ జేర్తు రాము ముందటఁ.

తో: ఈలవణాంబుధి గాలువఁబోలియు- నే లంఘించెదఁజూడు! అ
నాద్యంతంబును గాలిఁచివేసెద నేఁడు ॥ రామ ॥

పంచ. సురాది దైత్యవీరు లొక్కచొప్పునన్ శరించినన్
హరాజముఖ్యులెల్ల వచ్చి యాజ్ఞచేయఁబూనినఁ
జరాచరప్రపంచ మొక్కసారి వచ్చి తాఁకినన్
ధరాత్మజాత జూడఁబట్టెదన్ శుభంబు విన్నెదన్

వ. అనిన, మహానందంబున జాంబవంతుం డనియె:

క. నీ వంతచేయువాఁడవు
గావా! నీ కడ్డమేది గలదు ధరిత్రిన్!
వేవేగమె భూపుత్రిని
భావించియుఁ గాంచిరమ్ము పవనతనూజా!

వ. అనంతరము శ్రీరామచంద్రమహాప్రభువే సమస్త కార్యంబులు దీ
నీకు శుభంబగుఁగాక! పోయి ర మ్మని జాంబవంతాదులు దీవింపఁ గైకొని
ప్రయాణోన్ముఖుడై.

క. అంతట హనుమంతుఁడు గడు
సంతోషముతో మహేంద్ర శైలాగ్రము పైఁ
బంతమున నెక్కి యిదియొక
గంతున దాఁటం గడంగెఁ గగనాంభోదిన్.

### ఆశ్వాసాంత - తోహర

అనితాళ్ళూరి నారాయణకవి రామాయణమును హరికథను, ఘనముగ జెప్పెను
ద । గిష్కింధాకాండము జిలుకును సుధను ॥ రా ॥ ఇది వినువారల కిహసౌఖ్యంబులు
ొదపలేక చేకూరును; ముదమున దుదకును ముక్తి లభించును మోక్షగుండ హరికృపను
రామ ॥

క. నాచేతనైన కొలఁదిని
జూచి రచించితిని దీని సుజనులు నెరసుల్
దోఁచినయెడ దిద్దుదు రని
నాచిత్తములోన నమ్మినా ననయంబున్.

శ్రీమోక్షగుండరామాయణమునందలి కిష్కింధాకాండము
సంపూర్ణము.

శ్రీరామచంద్ర గురు పరబ్రహ్మణే నమః

అ వి ఘ్న మ స్తు

# శ్రీమోక్షగుండ రామాయణము

## హ రి క థ.

## సుందర కాండము

* * *

క. శ్రీరాముని కార్యార్థము
మారుతి చనునపుడు తనకు మంగళ మగు న
ట్లారూఢిఁ దలఁచి మంగళ
హారతులను బాడె వేడ్క నారామునకున్.

కమాచ్ : రూపకము.

స్వామి! సీతారామ మంగళం! నిటలాక్షవినుతనామ! దివ్యధామ! మంగళం! నేమంబున నీనామము గామించితి సాహసమున ॥ స్వా ॥ భూతకోశాతీత! మంగళం! శ్రీమోక్షగుండ నేత! భక్తోపేత! మంగళం! ఖ్యాతిగ నారాయణకవి చేతోయుత! జ్యోతిర్మయ! ॥ స్వామి ॥

వ. ఇట్లు మంగళంబులుపాడి తనతండ్రికి నమస్కరించి, రాముని చరణారవిందంబులు హృదయారవిందంబున నిలిపికొని వానరులం గని యిట్లనియె :

ఉ. వానరులార, రాఘవుని బాణపరంపర నూటినేగు న
ట్లేను వియత్పథంబున యథేచ్ఛ సముద్రము దాఁటి పోయి, యా
జానకిఁ గాంచి మ్రొక్కి వడిస్వామిని జేరఁగవత్తుమీరలున్
బూనికతోడఁ జూడు డిఁకఁ బోయెద నేను గృతార్థుఁడఁ గాఁ జుడీ।

గీ. ఏమహాత్ముని స్మరణసంస్మృతి మహాబ్ధి
దాఁటి భక్తులు పరమపదమ్ముఁ గాంతు
రామహాత్ముని యాజ్ఞ నీయబ్ధిఁ బిల్ల
కాల్వవలెఁదాఁటి తత్కటాక్షమ్ముఁ గాంతు.

వ. అని పలికి తక్షణంబున హనుమంతుఁడు ——

చ. అడుగులు నద్రిపై నిలిపి యంగము గ్రుంగఁగఁజేసి కన్బొమల్
గడువడి నెత్తి నిక్కి నటు గర్ణయుగంబును లేపి వార్ధినె
ల్లెడఁ గలయంగఁ జూచి మెడ యెత్తియు దోకఁ గదల్చి నెమ్మదిన్
పడి చెడ నీక మారుతి జవంబున దాఁటెఁ సముద్రమత్తటిన్

వ. ఇట్లు వియన్మార్గంబున వాయువేగంబున సముద్రంబు మీఁదగఁ జనుచుండ
దేవత లందఱు ——

గీ. ఆంజనేయుని ధైర్యంబు నరయువేడ్క
సురగులం గన్నతల్లియౌ సురసఁ గాంచి
పవనజున కడ్డపడి వానిబలముఁ దెలిసి
రమ్మనీ వన్న, వికృత దేహమ్ముతోడ.

తో. అడ్డముగాఁ జని, యహాహా! నే నిపు డాకలిగొని యున్నాను! గ్రుడ్డురీతిగ
గుటుకున మ్రింగుదుఁ గోరి నిను నే ననుసు ॥ రా ॥

హనుమంతుండు ——

హిం. తోడి : రూపకము.

అమ్మ! నేను రామునికార్యమ్మునకును, బోవుచుంటి। గ్రమ్మర సీతమ్మ నరసి
నమ్మకముగను నేతెంతు ॥ నమ్మ ॥ ధారుణి శ్రీ మోక్షగుండధామున కీవార్తదెలిపి చేరవచ్చి
నీకు నే నాహార మగుదుఁ దరలాక్షి ॥ య ॥

వ. అని వేఁడికొనిన సురస వినక ——

కమాచ్ : ఆదితాళము.

నీ మాట వినను; మో మోట మేలను మాటికి నీపీ బూటకములు నాతోటి పలికెదవు! పాటిగాదు ॥ నీమాట ॥ సామాన్యులవలె జౌకగ జూచితి వేమో! చిక్కితి వికను విడువ ॥ నీమాట ॥ ఆకలిగొంటిని నారగించెదను గాక, వచ్చునందాక నిలువ ॥ నీమాట ॥ మోక్షగుండపతిసాక్షిగ విను నిన్నీక్షణమునసే భక్షించెద ॥ నీమాట ॥

వ. అని ఖండితంబుగఁ బలికిన,

సీ. వనితరో, నేను బోవలెవేగ నీనోరు
 దెఱువుము తెఱువుము పలతుఁదూఱి
 అని శరీరం బొక్కయామడ పెంచిన,
 నైదామడలు విప్పె నదియు నోరు;
 పదియామడలు పెంచెఁ బవనుజుఁ డంగంబు;
 నిరువదియామడల్ దెఱచెనదియు:
 ముప్పదిరెట్లుగా మొనయ నాతఁడు పెంచె;
 నేబదియామడ లింతి దెఱచె:

గీ. నంత నంగుష్ఠమాత్రుఁడై యందు దూఱి
 వెలుపలికి వచ్చి నిలిచిన వెలఁది మెచ్చి
 వినుఁ బరీక్షింపదేవత లనుప వచ్చి
 నాను నాపేరు సురస; మంగళమునీకు.

తో. రామునిదేవిని రయమున గనుఁగొని రాఁగల వికఁద్వరగాను! ఓమారుతి! నేఁ బోయెద నని యాభామిని వేగమెచనెను।! రామ ॥

వ. అంత హనుమంతుం డరుగుచున్నఁగని సముద్రుండుమైనాకునితో నిట్లనియె;

జంఝూటి – ఆదితాళము.

మారుతి లంకాపురమునకు జేరఁబోవుచు నుండెడుస్; సారెకునీవేగి కడుపిశ్రాంతిఁ జేయుము లెమ్మికఁ ॥ మారుతి ॥ సాగరముచే వృద్ధినొందిరి నగరులెల్లను గ్రిందటఁ: బాగుగ దత్కులజుఁ డగు రఘుపరుసికార్యముఁ జేయఁగన్ ॥ మారుతి ॥ మోక్షగుండపురీప

కరుణా వీక్షణంబున జేరుము; ఈ క్షణంబున నీవు జేయుము దీక్షతో సత్కారము ॥ మారుతి ॥

వ. అని యిట్లు సముద్రుండు చెప్పిన మైనాకుండు నరాకృతితో బయికిఁ బెరిగి యాంజనేయుని గని,

తో. వారిధివనుపున వచ్చినాఁడ నాపే రిదె మైనాకుండు । మారుతి, కొంచెము మార్గాయాసము దీర్చవంతునిటనుండు ॥ రామ ॥

వ. సమస్త వస్తువులు ఫలములును దెచ్చినాఁడ. ఇవి గ్రహించి కొంచెము విశ్రమించి పోవలయు నని కోరిన, నతండు—

క. వారిధి మధ్యను నిలువక
బారెద నని శపథమూని వచ్చితినట వా
వారలతో; నటుగావునఁ
గూరిమితో విశ్రమింపఁ గూడునె నాకున్?

వ. నీ యిష్టప్రకారము వచ్చి నా హస్తమును మాత్రము శిఖరంబున నుంచెద. హస్తస్పర్శముచేత సంతోషింపుము. అని యట్లుచేసి యవతలఁబోవ దశయోజనంబుల వెడల్పు సహస్రయోజనముల నిడుపుగల సింహిక యను ఛాయాగ్రహంబు వచ్చి యాంజనేయుని మ్రింగుచుండె.

క. జంతువులు పైనఁ బోవఁగఁ
బంతంబున ఛాయ పట్టి భక్షించియు దా
నంతట వారిని మ్రింగున
దంతయు దా నెఱిఁగి మారుతాత్మజుఁ డలుకన్.

తో: అకటా! యిదియొక టడ్డము వచ్చెను నాశ్చర్యంబుగ ననుచు, బ్రకటితముగఁ గ్రిందికి జని దానిని బదమున దన్నెను గనుచు,

చ. ఇటువలె దానిదన్ని మడియించి వియత్పథగామియై సము
త్కటబలుఁడౌచు దక్షిణపుదట్టుగ మళ్ళియు బోయి పోయి యం
తటను త్రికూటపర్వతము, దానిపయిన్ జెలువొందు లంకయున్
దటుకునఁ గాంచె మారుతి ముదంబున డెందము పొంగుచుండఁగన్.

వ. ఇట్లు గాంచి పగటిపూట లంకాపుర ప్రవేశము జేయ గూడదని సువేలాద్రిపై నివసించి, రాత్రికాలంబున నుత్తర ద్వారంబున సూక్ష్మరూపుండై ప్రవేశింపఁబోయిన లంకిణి యడ్డము వచ్చి——

పూరికల్యాణి : ఆదితాళము.

నీ వెవ్వడవురా! నీపే ర దేరా! వేవేగఁ జేర నీవేళ రాకుపోర! ॥ నీవె ॥ నను గెల్చి లంకఁగన బొమ్మ బింకము నడంతు నింకబొలియింతు గింక కుంక ॥ నీవె ॥ లంకిణి నేను; లంకగాచేను, బొంకముగా నిసుబోనీను మానుషూను ॥ నీవే ॥ ధరమోక్షగుండపుర హరియండ. జొరబోనీకుండ గొరుకుదు గండకండ ॥ నీవె ॥

వ. అనిపలికి కాలితోఁ దన్ని పోనీక యాపినఁ బొడగునఁ బెటిగి గ్రుద్దెత్తి జేసి యాంజనేయుఁడు——

తో: వెడదవక్షమున నెడమపిడికిటను బోటుచున రక్తము గ్రక్క. పుడమిమీదఁ బడి పొరలి లేచి యాపడతి పలికె మ్రొక్కి దా ॥ రా ॥

వ. ఓ మహానుభావా! జగదేకవీరా! నీకుజయ మగుగాక! నీవు లంకలోనికిఁ బోవల సినది. పూర్వ మొకపరి బ్రహ్మనాకు జెప్పినది యేమనగా; నింక నిరువది యొనిమిదవ పర్యాయము త్రేతాయుగము వచ్చినప్పుడు శ్రీమన్నారాయణుండు రాముఁ డన రఘుకులం బున బుట్టగలడు. అతని భార్యయగు సీతను రావణుండు దెచ్చి లంకలో నుంచునప్పుడు రాముని ప్రేరణమున వెదకుచు నొక్క వనచరుండు రాత్రికాలంబున వచ్చి నీచేత నాపఁబడి నిన్ను దండింపఁగలడు. నీ వెప్పుడు పరిభవము బొందు నాటితో లంకయు; నందున్న రక్క సులును జిక్కువడి నశింతు రనియె. అదినిజం బయ్యె, వినుము——

తో: రావణు డుండెడు రమ్యసౌధమున కావల గల దొక వనము; నావనమున ఘనమైన శింశుపం బనుచెట్టున్నది కనుము ॥ రా ॥ అందు ఘోరదనుజాంగన లలజడి నొందింపగ దైన్యమున గుందుచు నాతరుమూలంబున సీత యుండురు గనువేగమున ॥ రా ॥

చ. జనకజవార్త రాముసకుఁ జయ్యనఁ జెప్పి, దురం బొనర్ప నా
ఘను నిటుఁ దోడితెచ్చి దశకంఠుని గూలిచి లోకజాలముఁ
మనుపుమటంచుఁ దెల్పు జనమాన్యనకుఁ రఘురామమూర్తికిన్
దనుజులు గ్రుంగి రంచుఁ గ్రమతఁ దలపోయుము వాయునందనా!

వ. అని పలికి యతని పీడ్కొని రామధ్యానంబు సేయుచు లంకిణి యథేచ్ఛం జనియె. అంత హనుమంతుండు సూక్ష్మతనుండయి లంకఁ బ్రవేశించి.

## కేదార : రూపకము.

దీనిసొంపు గానగను త్రిలింపులైన భ్రమపడరే! మానసంబులోన ముదమొంద వెడు! శ్రీనిధియై వెలుగుచున్నది యుపురా ॥ దీని ॥ మూడు లోకములయందు జూడ దీనిజోడు పురి కలదే! నాడెమైన మాడుగులు జిత్రము! వేడుకతో వెలయుచు నున్నది యుపురా ॥ దీని ॥ మోక్షగుండాట్యక్షుని కోట రక్షసట్టి గాన, నగరము రాక్షసుండు దీక్షగను నేలుచు నీక్షితిపైనిక నునుపడగా జాలడు ॥ దీని ॥

వ. ఇటువలె బురం బభివర్ణించుచు గూఢచారుండయుచని,

## మధురగతిరగడ.

వెదకెఁ బవనసుతుఁడు! లంకను క్షితిసుమారి నపుడు । వర రథశాలలు వైద్యశాలలును, హరికరిశాలలు నస్త్రశాలలును । వీరభటులుగల విపులగేహములు । శూరులు నిలిచిన సుందరగృహములు । వీథులు దిన్నెలు విపణిమార్గములు । సౌధంబులు రచ్చలు గోపురములు । దేవాలయములు । తెలియనిగొందులు, సావడులును విస్తరమగు సందులు ॥ వె ॥ వందిమాగధుల వాసస్థలములు । సందము లగుగాయకుల గృహంబులు । వార కామినుల వరమందిరములు । పౌరాణికసంపన్మందిరములు । మంత్రివర్యుల నిర్మలతరవసతులు । తంత్రజ్ఞుల సుందర సద్మంబులు । గడిసి సుమాలాకారులయిండ్లును । పడలక చని దైవజ్ఞుల యిండ్లును ॥ వె ॥ కుంభశ్రవణునిగోప్యపు నెలవును । గుంభనికుంభుల సదువాసములును । అతికాయుని దివ్యంబగు సౌధమును । బ్రతిలేని యకంపనుని సౌధమును గంపనునగరును ఖరసుతుభవనము । దెవపునఁజని యాత్రిశిరునిభవనము నక్షయు నలువగు హర్మ్యతలమ్మును । నక్షయ మగు ధూమ్రాక్షుమందిరము । దూరి యింద్రజిత్తుని గేహంబును । దాటుచు దేవాంతకు గేహంబును । నా మహోదరుని యతులమందిరము । నామహాంగుసున్నత్తిమందిరము సొరిది మహాపార్శ్వనివాసంబునువరుసను పార్శ్వని వరనిలయంబును । గడచు పెక్కు రాక్షసులసదనములు । అడరులేక దివ్యాంతః పురములు ॥ వెదకె బవనసుతుఁడు ॥

వ. ఇట్లు వెదకి యెక్కడను గానక గ్రహంబున రావణుని దివ్యసౌధంబుజేరి, యందలి వనితనంబునను నచ్చెరు వొందుచుఁ గావలియున్న వారలఁ బరికించుచుఁ దిన్నని నడకలతో నంతఃపురంబుఁ జేరి యచ్చట.

తో. చెలగి రావణుడు - చెలి దెచ్చినయాస్త్రులు వానితోగలసి । పలువిధసుఖముల

వ. కోకముడులు బిగించుకొనకయు. గంచుకంబులు మరల ధరింపకయు, పిమా నంబుమీఁదనే యొరిగి నిద్రించు చుండు వారలఁ గని యాశ్చర్యకలిత చిత్తుండయి హను మంతుడు ——

క. ఇట్టి నెరజాణలుండియుఁ
గట్టా! దశకంధరుండు కాకుత్స్థసతిన్
నెట్టన జెఱపట్టెను దన
చెట్టతనంబునన తాన చెడిపోవుటకై.

వ. అని కొంత చింతించి,

తో. స్వామికార్యమును, సలుపవచ్చి ఋష్యనులవిలాసముగంటి। రావణునింత పీడు లలో వెదుకగ రాదు కలుషమును గొంటి ॥ రామ ॥

వ. ఇం దుండఁ దగదనియెంచి యవతలఁబోయి యొక్కరత్నవేదికపై బుష్పసాన పునఁ బవ్వళించి నిద్రపోవుచున్న రావణునిఁ గనుంగొని యతని యుభయ పార్శ్వంబుల –

తో. ఆడియు బాడియు నడపముఁ గట్టియు నాలపట్టములుపట్టి! వేడుకతోడుత వింజామరములు వీచుచు నిద్రలు ముట్టి ॥ రామ ॥

వ. దేవ గంధర్వదైత్య కాంతలు వాఁడు నిద్రించిన పిమ్మట దముచేతి సాధనంబులు గౌఁగిలించుకొని మయిమఱచి నిద్రించుచుంతఁ జూచి రావణుని విభవంబున కద్భుతపడి తలయూచి యింతలో ——

తో: ఆతని గౌఁగిటను సలరి రతులఁ బెల్లలసిసొలసి నిదురించు రతిఁ బోలిన మండోదరిఁ గనుఁగొని కుతుకమంది పరికించు ॥ రా ॥

వ. సీతను గంటి నని యానందించి గంతులువైచి వాలాగ్రంబుఁ జుంబించి కంబంబుల కెగబ్రాకి జాతివికారంబులం గొన్నింటి, నగపఱిచి యనంతరంబు,——

జంఝూటి : త్రిశ్రజాతి.

నే నెంతో మోసపోతి! నే నెంత వెఱ్ఱి నయితి! యీసీను తరుణినిఁ జూచి జానకి యని తోచి భ్రమసికొనక తలచితిని యా పతివ్రతాతిలక మన్యు గవయ గోరునే! మది తమదలచెను ॥ నే నెం ॥ [illegible]

యీరీతిని బుడమిజ మధు వాని చెదునా! తడబడి యెంచితిని పరమమూఢుఁడ! బాపకర్మ
మొడిఁగట్టితి । నేరమ్ము చేసితి ॥ నేనెంత ॥

వ. అనియిట్లు చింతించి యనంతరము మధుమాంసయుక్తంబగు పానీయశాల
లరయుచుండె నని చెప్పిన విని శాంకరీదేవి శంకరున కిట్లనియె ;

క. జానకి పతివ్రతసుఁ దన
మానసమున నెఱిఁగి యుండి మందోదరినా
వానరుఁడు గాంచినప్పుడు
దానేల భ్రమించె మదిని ధరణిజ యనుచున్.

వ. ఆ కారణంబేమో వివరంబుగనాకు సెలవిమ్మని ప్రార్థించిన శర్వాణి
కీశ్వరుండిట్లనియె :

తో. సిరిరూపమువలె హరిచే మందోదరి నిర్మింపఁగబడియెన్, సిరియంశంబున సీత
యవతరించినది, కాన సరిపడియెన్ ॥ రాను ॥

వ. అది యెటు లనిన రమాంశ సంభూత సీతగదా! మందోదరి జన్మకథ వినుము.

గి. ఘనగుణోపేత మాల్యవద్గర్భజాత,
ప్రణుతకాంతాసమేత రావణునిమాత
పీతపాతక దుఃఖంబు చేత జిత్త
మందుఁ బొగులుచుఁ దనయున కనియె నిట్లు.

కైకసి —

ధన్యాశి : ఆదితాళం.

ఓతనయా! విను మొకదుఃఖము నా కొనగూడెను నేడు । ఆ తెఱ గే మని యడిగెద
వేమో! యీతరి నేవచించెద నర్వము ॥ నో ॥ శేషోచ్ఛ్వాసముచే నాలింగముచే,
రసాతలము, శేషభూషణు భజించుచు నుందును నే సతతంబదె నిలిచిపోయె నిక ॥ నో ॥
ఇమ్మహి మోక్షగుండేశుని గూర్చి తపమ్ముజేసి నీవు గ్రమ్మఱ నొకలింగమ్ము నడిగికొని
రమ్ము దాని నా కిమ్ము ధరించెద ॥ నోతనయా ॥

వ. అనిన( బల్లివాక్యంబులకు వల్లె యని రావణుండు వెండికొండకు దక్షిణంబు వచ్చి,

ఉ. ఉల్లము మోదమంద పినయోన్నతి నాదరి(జేరి మ్రొక్కి మా
తల్లికి నాత్మలింగము హితమ్ముగనిమ్ము; గిరీశ, నాకు నీ
వల్లభ( బార్వతీరమణి( బత్నిగ నీ(గదెయంచు వాంఛితం
బల్లనదెల్పగా విని దశాననుతో నిటులంటి నంబికా.

కీర్తన : ఆదితాళము. (ఓన్ని మోనారాయణ) వలె.

రావణా ! నీమానసంబు రంజిలజేతు, నేవరంబులనేని ఇత్తు నీకదే ॥ రా ॥ ఆత్మలిం మిచ్చెద మీయమ్మకు నిడుము; ఆత్మపత్ని నిచ్చెద నీ పట్టపుకైకొనుము ॥ రావ ॥ ఈవ లింగము మఱి నేమఱి నీవు పోపుచో భూమిని నుంచబోకు కొనలేవు ॥ రావ ॥ ఎంచి స్థాపితమౌనో యంచు పనింతు, నంచముగ మోక్షగుండ మంచు భావింతు ॥ రావ ॥

వ. అని తెలిపిన మంచి దని దశవదనుండు నిన్నుస లింగంబుంగొని,

చ. చనునెడ నీవు విష్ణు మది సంస్మరియించుట(దా నెఱింగి చం
దనమున లక్ష్మిబోలువనితన్ రచియించి మయాఖ్యనొప్పనా
తనికి నొసంగ( బుత్రిగ నతండు దలంచి రసాతలంబు నా
వనమున( జేర్చి తాను( దనభార్యయు నర్మిలి( బెంచుచుండ(గన్.

వ. అచ్యుతు( డొక్కవిప్రరూపంబున రావణున కెదురుగ వచ్చి యిట్లనియె :

తో: ఎందుబోయి దనుజేంద్ర! వచ్చెదవో! యింతి యెవ్వరని యడుగ, నిందుమౌళిసతి యీమె విభు(డు నా కిచ్చె ననుచు దా నుడువ ॥ రావ ॥

వ. కపటవిప్రు(డు నవ్వుచు నిట్లు పలుకుచున్నా(డు :

కీర్తన : రూపకతాళము. (ఎందుబోతివయ్యా) వలె.

మంచిచెడ్డ లెందు నీవు గాంచవైతివి ! రావణ ॥ మంచి ॥ వంచన గావించె నీ కెంచవైతివి యేమాత్రము ॥ మంచిచెడ్డ ॥ శైలసుతను దాచెను : రసాతలమునను మయు యింట, బోలిన కపటంపు సతిని హేల నొస(గెను నిను గాను మని ॥ మంచి దేవపుర లోకములు నీ వెఱుంగుట గాంచెద వని తొల్లి పాతాళమందు దాచె [illegible]

సీ. రావణుఁ డంత యథావిధి మూ్త్రపి
సర్జనజేసి యచ్చటికి వచ్చి
విప్రుండు లేకున్న వెదకి లింగంబును
గదలింప నేమియు గదల కావు
చెవిబోలుగర్తంబు శిరమున నేర్పడ
గోకర్ణ మనుపేరు ప్రాకటముగ
గలిగెనా స్థలమున; కలఁతఖిన్నమనస్కుఁ
డయి దశాననుఁడు నెయ్యమున బయలు

గీ. దేఱి పాతాళలోకంబుఁ జేరి, యచట
మయగృహంబున నున్నట్టి మగువఁగాంచి
డెందమందున మెచ్చి యానంద మొంది
యతనితో నిట్లు పల్కె స్నేహంబు గదుర

ముఖారి - ఆది: (వల దచటికి) వలె.

మయ! తనయ నిడుమయా దయజూడుమయ! ॥ మయ ॥ నయ్యౖ
యజుఁడ రావణాహ్వయుఁడ లంకాధీశుఁడ, ప్రఖ్యాతియుతుఁడ ॥ మయ ॥
చెలినాక - మర్త్య - వరలోకములలో లేకయె నిటువచ్చినాను ॥ మయ ॥ లక్షణ
మునందే మోక్షగుండేశుకృపను ముదిత నీఁ దగును ॥ మయ ॥

వ. అని ప్రార్థించిన హరివలన సర్వము మందే యెఱింగియున్నవా
మయుండు మంచి దని కన్య నిచ్చి పెండ్లిచేసి,

తో. అరిభయంకరం బగు నొకశక్తి నరణంబుగనరిపించి! తరుణిని
వెంట దానరుగఁ బంపె మోదించి ॥ రా ॥

క. మందోదరమున నొప్పట
మందోదరి యనుచు జనసమాజమునఁగ నా
సుందరి యొప్పెను రావణు,
డందంబుగఁ జేరె లంక కతిపయ దానుఁ.

. ఇట్లు లంకఁ జేరి యింట బ్రవేశించి,
తల్లికడను బోయి, దండ మొనఁగి,
యెల్లసంగతులను దెల్లంబుగాఁ దెల్ప
నాలకించి యామె యాగ్రహించి.

వ. అంగజవిభంగునడిగి లింగంబు దెమ్మని యెఱుంగ జెప్పిపంప నాసంగతి పఱచి దొంగజాడలఁ జని యీ యంగనను దెచ్చి ప్రసంగంబుఁ జేయ వచ్చితివి! రువంటివంగడమున వెంగలివి పుట్టితివి. బేలా! నీకీ యధైర్యంబేలా! అని తృణీక వ రావణుండు లజ్జించి.

తో. గోకర్ణమ్మునకు నరిగి పద్మజు గూర్చి తపము జేయగను ఆ కమలజు డత్యంత ౹ఁ బ్రత్యక్షమైన మ్రొక్కుచును! ॥ రామ ॥

పూరికల్యాణి : ఆటతాళము.

కంజోద్భవా! కావవే! ॥ కం ॥ అంజలి జేసి భక్తి రంజిల్లగ మ్రొక్కెదను ౹జో ॥ నాకుఁ ద్రిలోకవశీకరణైక బలాకృతిఁ గైకొనక లోకేశ్వర చేకూర్చుము ॥ కంజో ॥ ౹గ నేఁ జిరకాలము లంకనునేలగ మోక్షపురపాలసుత! వర మీయుము ॥ కంజో ॥

వ. అని వేఁడి వరంబులు వడసి వచ్చి దిగ్విజయంబు సేసి సర్వసుఖంబు లనుభ ౹వించుండె; నదికారణంబున —

క. వైదేహి యనుచు నామం
దోదరిఁ గని బ్రమసె దైవ మొనరించె నిది;యా
మీఁద హనుమంతుఁ డొకపని
మోదంబున జేసి చనియె మోసముకతనన్.

వ. అది యేమి యనిన మయునకు బంధువుఁ డగు గయుఁడను రాక్షసుండు ౹మ్మను దపంబున మెప్పించి వరంబువడసి పరాక్రమవంతుఁ డయి వచ్చి.

క. రావణుననుమతమున లం
కావరనగరంబునందుఁ గాపుర ముండెన్;
గావున నాతనివస్త్రము
పావని రావణునిశయ్యపైఁ బడవైచెన్.

త్రోహర : దశవదనుని పుత్త్రుము విభీషణుని తల్పముపైఁబా సుంచెన్ । విశదంబుగ గడినీడుం డిది యొకవింతచేసి యరుదెంచెన్.

క. రావణునగళ్ళు మొదలుగ
దేవాళులయిండ్లు గలయఁ దిరిగిన సీతా
దేవి కనఁబడమి నెమకుచుఁ
బావని వని నయ్యశోకవనమున కపుడున్.

వ. లంకలో నంతటఁ దిరిగి యెందును గానక లంకిణి చెప్పిన గుర్తుప్రకార మశోక వనంబున కరిగి;

శా. నానావృక్షమృగాకులంబు నవరత్నస్థాపితారామాల్యసో
పానప్రాజితవాపియుక్త మమలప్రాసాదరమ్యంబు నా
నాయుప్రయమకోషితంబసుర దైత్యస్త్రీసమాకీర్ణము
ద్యానంబందున వాయుజుండు వెదకెన్ హర్షంబునన్ జానకిన్.

వ. ఇట్లు ప్రతివృక్షమూలంబును వెదకుచుం బోయి మణిమయశత స్తంభసంభరితం బయిన ధర్మహర్మ్యంబును గని యాశ్చర్యంబు నొంది యచ్చటను సీతను గానక నెమ్మదిని సద్దైర్యంబు వోవి.

హిం. తోడి : చాపు తాళము.

సీతజాడ నాకు నెందుఁ దక్కదాయెను । మాతవెంద్రు చెంతకెట్లు పోవువాడను ॥ సీత ॥ దానవేంద్రుమందిరములోన జూచితి : వాని పుత్త్రులున్నయిండ్లు పూని చూచితి ॥ సీత ॥ నంపు గొంపులంపు బోయి చాల జూచితి; బొందుగ వనంబునందుఁ బొంచిచూచితి ॥ సీత ॥ చక్కగ శ్రీ మోక్షగుండస్వామిదేవిని ఎక్కడ గన్పింప దన్నియెడ గంటెని ॥ సీత ॥

త్రో : వనచరావళిని వదలి నన్ను హాయనిగా రాముఁడు మెచ్చె! జనకజపోబడి గన జాలుదు నీవనుచు నాసవాలిచ్చె ॥ రామ ॥ కానవచ్చితిని కార్యము దీర్చెదు వానిరీతి నే డిచట మానినిపొబడి గానరాదు వేమఱు వెదకితి నేఁ డకటా! ॥ రామ ॥

వ. లంకిణి చెప్పినవిధంబున నీయశోకవనంబున నెంత వెదకినను సీత యుండుతావు దొరక దయ్యె దైవమా!

ఫీలు రాగము : ఆటతాళము.

ఇఁక నేమిచేయుదు నెక్కడ వెదు! ఇక నెందువెదుకుదు నింతికనరాదు ॥ యి ॥ విసివిప్రాణములు విడిచెనోకాక, యసురునిచే దప్పి యబ్ధినిబడెనొ ॥ యి ॥ తనమాట విన

కున్న, వానరవిభుడు ఏమిమనె! దనుజుఁడు ఏమనెనో కాక ॥ య ॥ పరులకుఁగానరాకుండ రావణుండు బరదేశములనుంచఁబంపెనో సీతు ॥ య ॥ భూమిజ జాడను శ్రీ మోక్షగుండ ధాముని కెట్లు దగఁ జేరువాఁడ ॥ య ॥

వ. నేను వృథాగంజని సీత దొరకలేదని భార్యావియోగ దుఃఖంబుచే వేగిరి తత్ క్షణంబున —

తో: వచ్చును రాముఁడు; వచ్చె లక్ష్మణుఁడు — వరుసన వెది విన్నంత వచ్చును భరతుఁడు; శత్రుఘ్నుండును; వచ్చిరి బంధువులంత ॥ రామ ॥ జానకుల మతగనను; నిటువలె వది గని యనుజుఁడు వచ్చును వెవద; వనచరులంపయు వరుసగ వత్తురు వనిత లేదనుచుఁ దెలుప ॥ రామ ॥

వ. ఉభయకులంబుల వ్యర్థంబుగ నీదు మేయుటకయి నేనటకేఁ బోవుట కన్నను,

క. వానప్రస్థుని విధమునఁ
గానలకుం జేరి తపముఁ గావింతును; గా
దేని జలధిని మునుఁగుదుఁ
గాని మిటన్ పిమ్మవచ్చి కడుపడ జత్తున్.

వ. అంతేకాని ప్రాణంబుల నుయ్య యానసని తిరిగి పోయి అంతమందిని తెలుపఁ దగ దని కొంతపడకుఁ జింతించి పిమ్మట దసంతికి బాసు ధైర్యంబు దెచ్చుకొని,

కమాచ్ : రూపకము.

నేమానుమనా కనక నేమాదునా ॥ రామునికిఁ యనాసారము నామాటను బ్రసరింపఁగ; నీముల్లోకంబులలో నెందుండినఁ బరికింపవే ॥ స్పష్టంబుగ భూజాతను దృష్టికి జూపింపుదనుచు సప్తదిశాపతులను నే నల్లాడించెదనుగాక ॥ నేమా ॥ సుమ్మరినానావిధంబున, నిమ్మహి కుల గిరియుతముగ దిమ్మదిరుగ గిరగిర మని త్రిప్పియు దిప్పలు పెట్టక ॥ నేమా ॥ నాలాపము మోక్షగుండనాథుఁడు విని చయ్యనగను నీ లంకా పురి నసురులతో లవణాంబుధి ముంపక ॥ నేమా ॥

వ. ఏదోయొకవిధంబున సీతనుగాంచి మరపోదునుగాని యిలతింపోలె నూరక పోదునా! యని నిశ్చయించి యతిలాఘవంబున నామేడపై కెగిరి యంతల నిదానంబుగా సుపలక్షించిన నచ్చట.

తో. ఎండజొచ్చుటకు నెడములేక గడుమెండున నాకులుబలిసి, దండిగ గుబురై యుండిన శింశుపతరుమూలంబున సొలసి ॥ రా ॥

క. దానవతరుణుల మధ్యను
దాసను మలినాంబరంబు ధరియించి మదిన్
దీనత్వంబున రాము
ధ్యానము నొనరించు భూసుతన్ గనుఁగొనియెన్.

వ. ఇట్లు కనుఁగొని యావృక్షంబుపైకి వెగిరి యాకులనడుమ స్వల్పరూపంబునఁ గూర్చుండి చూచుచు,

కీర్తన-ఆదితాళము

ఆనందం హృదయానందం పరమానందం నిత్యానందం। జానకి గంటిని జయము చేకొంటిని నేనుగృతార్థుఁడ నిశ్చయముగను ॥ ఆనం ॥ సీతకుశలమును శ్రీరామునితోఁ జేత మలరఁగను జెప్పుటకుబ్యాతిగనాభాగ్యంబున గలిగెను! నాతప మెల్ల నీ నాడే ఫలించెను ॥ ఆనం ॥ వృక్షచరులు వే వేలుండఁగ వారి వీక్షింపకయు కటాక్షమున మోక్షగుండ పతిముద్రికనాకును దక్షత నిచ్చెను ధన్యుఁడ నైతిని ॥ ఆనందం ॥

వ. ఇట్లానందంబు నొంది జనకతనయతో భాషించుటకుఁ దరుణంబు వేచియున్నంత; రాముని యాజ్ఞచేత నొక్కవనచరుండు వచ్చి సూక్ష్మరూపంబున వృక్షాగ్రంబున నుండఁ జూచినట్లు రావణుండుగలఁ గని తత్క్షణంబున లేచి,

తో. కొన్నికలలు నిక్కువ మగుచుండును; కొన్ని యబద్ధం బగును; నిన్నిటికిని నిది యెటు లగునో కనియెద నని తీవ్రంబునను ॥ రా ॥ రాక్షసాంగనలు రయమున గొలువఁగ రావణుఁడపసిజఁగెను దక్షుఁ డగుచు రా దశవదనంబులు దగ నిరువది భుజములును ॥ రా ॥

క, కాటుకకొండను బోలు ని
శాటుని గని వాయుతనయుఁ డాశ్చర్యమునన్
జా టగునటు లాకులనుమి
షాటుఁగనుచుండె నసుర మాయాచేష్టల్.

వ. అంత రావణుండు సీతను డగ్గరి భయంకరవాక్కులతో బెదరించుచు.

ఫరజు : ఆదితాళము.

నామాటను మీరకు నలినాక్షియింక ॥ నామా ॥ వేమఱుగాసిన సీమల దిరిగె! రాముఁడు లంకకు రాఁగలడా! యింక ॥ నామా ॥ మూఁడు లోకముల నోడక నాకెదు రాడువారు లే రని చూడు నీవు ॥ నా ॥ దానవకులనేతను బలవంతుడ నైన నన్నుబో నాడకుమ యింక ॥ నామా ॥ రమణి, మోక్షగుండరిమణునిపై సంతభ్రమనొందిన దానఫల మేమి? యింక ॥ నామా ॥

వ. నిరంతరము నితాంతానంతశ్రీమంతుఁడనై దిగంతంబుల వంత నొందించి సాధించిన బలవంతుని నన్నునావంతయైనమంతనంబునఁ జింతింపక; యెంతయు డస్సిన యెుక్కబక్కమానవుని పయి నింతిభ్రాంతి నొందెదవు పంతమా? ఇంతట నయిన నాయుదంతంబు విని కంతుకేళియందు నాయంతరంగంబును సంతసింపఁ జేయుము! నీ కేలయింతచింత!

తో: జాళిమీఱ దిక్పాలుర నెల్లను బంటులజేసెద నీకు: దాలిమితోఁ దత్కాంతలు బానినతన మొనర్చెదరు నీకు ॥ రామ ॥ ఈ రాక్షసరాజ్య మిచ్చి నిను నీయిష్ట ముచొప్పున నుంతు: ఏరుగ బట్టపుదేవిగ నిన్నిడి మేరపిడుచు నేలింతు ॥ రామ ॥

వ. అను యాసిర్భాగ్యుండు గర్భనిర్భేదనకరములగు దుర్భాషలాడిన దుర్భరంబనక నిర్భయంబునరత్నగర్భార్భక తృణంబుచేఁబూని వానిఁ దృణప్రాయంబుగ నెంచుచు నధోముఖియై ప్రత్యుత్తరం బిచ్చుచున్నది.

కళ్యాణి : అటతాళము.

ఓరిరావణా! యాడువారిముందర నిట్టిపోటుపములు ప్రేలుక ఫలమేమి చూడు। శూరుఁడవు నీవయిన రామునితో నెదిరించి నన్ను జేరితివా। నీవు ధీరతతో ఘనము వినుము రఘువీరుఁ డేమఱి యున్నదొంగిలి పాఱివచ్చుట బంటుతనమా ॥ యోరి ॥ సాగరశయనుని సాగిరాకుండ నీసాగర మేమాత్ర మాపును వినుమా! వేగశర వహ్నులను నింకించు: లేకున్న నడముగాఁగ సేతువుబెరయఁగట్టించు; వచ్చుఁజొచ్చు నీభోగములు నీపురము నిన్నును పుత్రమిత్రులతోడఁ గూలుచు ॥ నోరి ॥ ధారుణిఁ దాశర్థారినారాయణాత్మ నిహారుఁ డౌ మోక్షగుండాధీశ్వరుండు గోరితమ్మునితోడ నిను గడిసి దల లన్ని యిలపైఁ గూల జేయువాడుగా తెలిసి! మొగ్గు తగ్గు గనువారికే యెఱుకౌను నిటువుర తారతమ్యము చెప్పవలెనా! యోరి-

గీ. అనిన జానకి పరుషవాక్యముల కలిగి
కనుల నిప్పుకలొలుక రాకాసిఁ జేఁడు

ఉఱిమిచూచుచు నామెపైకురపడించె
వాలుజళిపించి తనసతి వలదనంగ.

వ. మఱియు మందోదరి యిట్లనియె

కీర్తన : ఆదితాళము.

ఇదేమీ పరాక్రమము! నిదానించి యోజింపుము ॥ ఇదే ॥ అధేమి యాడుదాని పైకి దూఱిపోయె దౌ బళా! ఇదేమంచిదా నెమ్మదిన్ దెల్పెదఁ ॥ ఇదేమి ॥ సురాంగనాది రామలఁ వరించి పొందరాద యీనరేందీపరాక్షిఁ జెరఁ బెట్టగా ॥ నిదేమీ ॥ కరంబు మోక్షగుండ సత్పు రేశ్వరుండు రాముఁడౌ పరాకాచిరాకా పరంబెంచవా ॥ ఇదేమీ ॥

తో: అల్పభోగమునకైచెడ నేటికి నతివలు నీ కిక లేరా! తెల్పుము మఱియొక తెతో నీకోరిక తీరదేమొ! యిదిమేరా! ॥ రామా ॥

వ. నీయందు బ్రియంబులేక విముఖురా లయియున్న యీపతివ్రతను బలాత్కారముచేయుట మర్యాదకాదు. పరాంగనాసంగమంబు పాపంబుగ నీ వెఱుంగవా! నిన్నుఁ గామించియున్న మాపల్ల సెల్లి సౌఖ్యంబులు డెల్లంబుగఁ బొందనాదా? చాలదా? ప్రాణనాయకా. మానుము. స్త్రీహత్య చేయక ఇంటికి రమ్ము; నామాటఁ ద్రోయక.

వ. అనిన మందోదరి వాక్యంబు విని సీతను చంపుటుడిగి యిరువది కన్నులనగ్నికణంబు రురుల నుఱిమి చూచి అయోముఖి హేమాస్యహరిజట త్రిజట మహోదర్యాది రాక్షసాంగనలఁ దక్షణంబునఁబిలిచి.

బేహాగ్: ఆదితాళము.

మీరు గంటిరా! వింటిరా! చెలులారా! కలకంఠిమాట యెంతకఠిన మౌరా! వెంటనంటి భయ నయములుమీఱ వాలుగంటిని దోడ్తెండు నన్నుఁజేర ॥ మీరు ॥ ఇక రెండు నెలలు జెప్పినముగాని వినకుండెనేని పిమ్మట దీనిఁ గోసి కండలు దినుడు పంచుకొని, మోక్షగుండహరి యడ్డుపడిన గాని ॥ మీ ॥

క. రావణుఁ డసురాంగనలకు
నీవిధమున నాజ్ఞ యిచ్చి యింటికి జనఁగా
నా వెలఁదులు భీకరముగ
భూవరసుత జేరి తెలుపఁ బూనిరి బుద్ధుల్,

పంచా :- అరణ్యమందు నిన్ను రావణాసురుండు దెచ్చుచో
దిరంబుగా నెఱుంగనున్న దీనమానవుండు నీ
పరుండు వానిమీఁద నింక కాంక్ష మాని, రాక్షసే
శ్వరుఁ వరింపు మెల్లభోగశాలి వౌదు వంగనా!

వ. తమ్ముండు రాజ్యం బపహరింప ననవవోలె నిమగండు వనంబులఁ గృశించుచున్నాఁడు. మారావణుని ప్రతాపంబు వినుము.

హిం. కాఫీ ఆదితాళము.

జగదేకవీరుఁడు పద్మజాతకులసంభవుఁడు నగజాపతి సేవకుఁడు ; నవమన్మథసుందరుఁడు ॥ జగదేక ॥ మించి దిగ్విజయము గాంచి యన్నిటిని సాధించి యీలంకను పాలించి కీర్తిఁ గాంచినట్టి ॥ జగదేక ॥ ఎంచ సాపులేకుండఁగ ముందు బ్రహ్మచేత వరమందినాఁడు, కినిసహాతుసుందరిదె వైభోగము ॥ జగదేక ॥ భూలోన మోక్షగుంతధాముడగు రాముపయిఁ బ్రేమమాని రావణునిఁ గామింపుము కాంతామణి ॥ జగ ॥

తో : మామాటలు వింటే మంచిది నీకు మేము సేవచేసెదము కోపలి వినకుంటే ముఱిసిలుప్పన గోయుచు భక్షించెదము ॥ రా ॥

వ. అని యిట్లుచుట్టుకొని శాధించుచున్న రాక్షసాంగనల నిర్లక్ష్యముగ వీక్షించి సీతాంగన దీనత్వమున,—

హిం. కాఫీ : ఆదితాళము.

ఇంతపంత మేలనమ్మ యింతులారా మానరమ్మ! చింతద్రోయ మేలటమ్మ! చెలగి కరుణజూడరమ్మ ॥ యింత ॥ బలములేని మనుజుఁడైన బధిరుఁడైన నంధుఁడైన; తెలివి మాలినట్టిఁడయిన జెలువుని విడనాడనౌన ॥ యింత ॥ భూమిలోన మోక్షగుండధాముఁడయిన శ్రీకోదండరాముఁడే విభుఁడనుచు నుంత; నామది వే రౌనె పొందు ॥ యింత ॥

వ. అని వేడుకొనిన దీనాలాపంబు లాలింపక భీకరంబుగ గేకలువేయుచు—

తో : చెప్పిన విన దీచేడెను నఱికయు నిప్పుడె రక్తము పీల్చి । చప్పరింతమా! సరగున నండలు చవిమాచెదమా! పీల్చి ॥ రా ॥

ఇక గొన్ని భ్యారక బోధించుచు నిటులనె పెపరింతామా! యొకటి రెంట గని ఱొమ్ము గిల్లి మన మెప్పునటుల జేయుదమా ॥ రామా ॥

వ. ఈ ప్రకారంబున మనఃక్షోభంబు జేయుచుండఁ ద్రిజటమాత్ర మది సహింపక వే తొక్కచో శయనించి నిదురించి కల గని లేచి రాక్షసస్త్రీలను బిలిచి యనుచున్నది :

నవరోజు : ఆదితాళము.

కల గంటి నే నొక్కకలఁ గంటిని; కలలో ననేకములు గనుఁగొంటిని ॥ కల ॥ రాముఁ డేనుగ నెక్కిరాఁ గంటిని; సౌమిత్రి వచ్చిన యట్టి జాడఁ గంటిని ॥ కల ॥ లంకఁ జొచ్చి రావణుఁ గూల్పఁగ గంటిని; లంకను విభీషణుఁ డేలంగఁ గంటిని ॥ కల ॥ రావణుని పుత్రు లెల్లఁ జావఁ గంటిని; వేవేగ దక్షిణదిశకు నేగఁ గంటిని ॥ కల ॥ భూమిజ నయోధ్యకు గొంపోవఁ గంటిని; శ్రీమోక్షగుండేశ్వరునిఁ దెలుసఁ గంటిని ॥ కల ॥

వ. అని తనస్వప్న వృత్తాంతంబుఁ జెప్పిన నాలించి భీతచిత్తలై సీతమ్మను వదలి యొక్కచో నందఱుఁ బడి నిదురించుచుండిరి. సీతాదేవి విలాపంబున—

వ. పీ రిట్లు క్రౌర్యంబు జూపుచున్నారు! దైవమా! దిక్కులేనిదాన నైతిని! ఈ కష్టం బెటుల భరింప నగును!

జంఝూటి : రూపకము.

అంతవాని భార్య నయ్యు నడలవలసెను! జింతతోడ వీరిచేతఁ జిక్కవలసెను నే ॥ నంత ॥ తెల్లవార నన్నుబట్టి తిందు రందఱుఁ బిల్లి చిలుక చందమాయె! భీతి నొందురు ॥ అంత ॥ మోక్షగుండరాఘవుఁడు పేక్ష జేసెను! రాక్షసుల బోనులోన రాటు పెట్టెను ॥ అంత ॥

క. అని శోకావేశంబున
గనుగవలను నీరుపరదగాఁ గొఱఁగ నా
వనజాక్షి శింశుపాతరు
ఘనశాఖను జేత నూతగాఁ గొని లేచెన్.

వ. ఇట్లు లేచి నిలువంబడి దిక్కులు పరికించి చూచుచు,

వసంత - ఆటతాళము.

వీరిచేతలకు బతజాలనే! వీరిబాధలను క్రూరరాక్షసులచేఁ గూలుటకన్నను, వీర వనితనై భువి పీడుట మేలగు ॥ వీరి ॥ వేవేగ మెడకు నావేణి యురిపెట్టి యీవేళ నిచ్చట జీవము విడిచెద ॥ వీరి ॥ భూమి మోక్షగుండధామునకుగాని యీ మేను నిలిచిన నేమి

వ. అని మరణంబునొంద నిశ్చయించి తనజడను గంఠంబునకు నురిపెట్టుకొన నిశ్చయించి యుండిన, జానకి విపత్తును దీర్చుట కిదియకదా తరుణం బని యెంచి మరున్నందనుండు సీత వినునట్లు సూక్ష్మస్వరంబుతో నిట్లనుచున్నాఁడు;

ద్వి: అపనీతిలక మయోధ్యాపురి నున్న! రసికులుం డగు దశరథరాజునకు! వరరామలక్ష్మణ-భరత శత్రుఘ్న । సురుచిరనాములు సుతు లుదయించి; । రెండు జ్యేష్ఠుండు రామాఖ్యుఁడు తమ్ముఁడుందరుణియునుదోడుగరాఁగఁ దండ్రి! పనుపున దండకావని కరుదేర! దనుజాధ! ముం డగు దశవదనుండు! చని, రాము డట లేని సమయమందు నండె । జనకజఁ గొనిపోవ, జాడదీయుచును । అలజటాయువు చెప్ప నపుడు । తెలిసింగి । కలఁతల ఋశ్యమూకమ్మున విడిసి । వాలి సుగ్రీవులు వడి గలహింప । వాలిని జంపి తీవ్రమున సుగ్రీవుఁ । గపిరాజ్యమున కధికారిగాఁ జేయఁ । గపిపతియాజ్ఞచేఁ గదలి మర్కటులు । దిక్కుదిక్కులకు వైదేహిని జూడ । గ్రక్కునఁ బోయి దక్కడికి నేనొకడ । శతయోజనమ్ములు సంద్రమ్ముదాటి । ప్రతిలేని లంకాపురముసు జొచ్చి । పురమెల్ల వెదకి గొబ్బున వనమందు । ధరుణిడి నొకశింశుపామూలమున నను । సుదుఃఖకలితయై యున్న సీతమ్మ । నరసితి ధన్యుఁడనైతి నే ననిన.

వ. ఆవాక్యంబులు శ్రవణానందంబులైనఁ దన యుద్యమంబు మాని చెట్టునకెగఁ జూచి, యెవరుఁ గనబడనందున నెమ్మనంబున—

జంఝూటి : అటతాళము.

డారార యిదియెంతో వింత! కారణ మెటుగను గానినుమంత! లేరెవ్వ రితరు లిచెంత; వారక నాకాశవాణిపలికెను! లేక ఘోరరాక్షసులె! యిట్లారక యనిరొ! నే ॥ ॥ డారార ॥ కలయేమో! చిత్తవికలమో కల యెక్కడిది! నిద్రగాన నిశ్చయమో! తెలివిలో భ్రమరాది దేమో! యిల నారాయణకపి నేలు మోక్షగుండు నిలయుని నెఱుకగు నిశ్చయ మెఱుగ నే ॥ డా ॥

వ. అని యిట్లు డోలాయమాన మానసయై యిట్లనియె.

క. శ్రవణానందముగా రా
ఘవుకథ వ్రాకుచ్చినట్టి ఘను లెవ్వారో!
ప్రవిమలముగ దర్శన మిడి
వివరింపఁగరాదె యెల్లవృత్తాంతంబుల్.

వ అని మనోభావంబు వెల్లడిచేసిన నాసందించి జిట్టెడు పొడుగుగల వానరాకృతితో హనుమంతుడు వెలువడి వచ్చి సీతాదేవియెదుట నంజలి బద్ధుండయి నిలిచిన జానకి భీతినొంది.

తో: వనచరరూపంబున దానిప్పుఁ డెవ్వాడో! రావణు డనుపఁ జనుదెంచె
సమాయ లెంచుచు దలచియు గనుగొనక ॥ రా ॥

వ. అధోముఖియై యూరకుండిన నాంజనేయుం డిట్లనియె.

కాఫీ : అటతాళము.

వాయుతనూజుఁడు: వానరజన్ముఁడ: మాయలుగా విని: మానుము శంక
బ్యాతిగ సుగ్రీవదూతను సచివుఁడ: మాతరో నే హనుమంతాభిఖ్యుఁడ ॥ వా ॥ ద
మోక్షగుండేపతై కోదండ రామునకును దాసుడ నమ్మము ॥ వా ॥

వ. అనిన సీతాదేవి యనుచున్నది.

తో: మీరు వానరులు; వారు మానవులు; మీకును వారికి నెట్లుల
నెనో! స్నేహము గలిగెనో! చెప్పుము తెలిసెడు నటుల ॥ రా ॥

వ. అనిన, హనుమంతుం డిట్లనియె;

సీ. నినుఁ బాసి వెదకుచు నీభర్త ఋష్యమూ
కాద్రిచెంతకు రాఁగ నర్కసుతుఁడు
సుగ్రీవుఁ డనువాఁడు చూచి యచ్చెరువంది
చేరువకరుదెంచి చెలిమిచేయ,
వానిభార్యను గొన్నవాలిని వధియించి
కిష్కింధ నిచ్చె సుగ్రీవునకును,
నతఁడు ప్రత్యుపకృతి నాచరింపఁగఁ బూని
నినుజాడ బంపించె వనచరులను;

గీ. వారిలో నన్నుఁ బిలిచి నీవల్లభుండు
గుఱుతుగా నిచ్చె ముద్దుటుంగరముఁ దీని
నీయునికి నారయుచు జలనిధిఁ దరించి,
వచ్చి నీ న్నిందుఁ గంటి మద్భాగ్యవశత.

కీర్తన - ఆదితాళము.

రాముముద్రిక గొనుము ! రామముద్రిక రామనామాక్షరములున్న రమ్యముద్రిక ॥ రాము ॥ నిన్నొసంగెడునాడు నీదుజనకుడుపెన్నుగ నల్లునకు నిచ్చిన భద్రముద్రిక ॥ రాము ॥ భానుతనయుఁడు మము బంపు నప్పుడు నానవాలు రాముఁ డిచ్చినట్టిముద్రిక ॥ రా ॥ అక్షయంబుగ గడు నపర్ణమైతగ మోక్షగుండదేవు వ్రేల మురియు ముద్రిక ॥ రాము ముద్రిక ॥

వ. అని యర్పించిన, నయ్యంగుళీయకమును గైకొని కన్నుల నద్దికొని యానంద బాష్పములు రాల ని ట్లనుచున్నది.

తో. ప్రాణదాన మొసరించితి వన్నాపవన నందనా ! నాకు దీననైన నేనేయుప కారము బూనిసేతు నీకు ॥ రా ॥

తో : బుద్ధిమంతుఁడవు, పుణ్యపురుషుఁడవు, శుద్ధమనస్కుఁడ వనఘా ! యిద్ద చరిత ! నాయిడుమలెల్ల నీ విపుడు గంటిగద నరగ ॥ రా ॥

హిం. తోడి : ఆదితాళము.

మారుతీ ! శ్రీరామునకు నామారుగా వచియింపుమా ! చేరిదనుజులు బాధచేయ గృశించె నని వచియింపుమా ॥ మా ॥ రెండునెలలను నంతకును మని యుండు నని యెఱి గింపుమా ! మొండిరక్కసి మూకచే దినగండ మని వచియింపుమా ! ॥ మా ॥ జాగువలదని పలుకుమా ! వేవేగ ర మ్మని తెలుపుమా ! బాగుగా నీరావణుని వైభోగమును వినిపింపుమా ॥ మా ॥ రాక్షసేంద్రుని తలలు ధరఁ బడ రాల్చుమని వాక్రుచ్చుమా ! మోక్షగుండపురీశ నీకును మ్రొక్కెనని ప్రకటింపుమా ॥ మారుతీ ॥

గీ. నేర్చినేరమి నెగ్గులునిన్ను బలికి
యనుభవించితి తత్ఫలం బదియు మఱచి
యన్నతోఁ గూడి వచ్చినన్నాదరింపు
మనుచు నాముద్దుమఱదితో ననుము వత్స !

వ. అని కడువినయంబున నుడివిన బుడమికుమారి నుడువులకలరి యాంజనేయుండు——

బేగడ : చాపు.

సంశయింపకుస్వాంతములో నీవు ॥ సంశ ॥ వింశతిబాహునివిక్రమ మదియెంత ॥ సంశ ॥ ని న్నెగ్గులాడుటఁ విన్నా నేనప్పుడే; తన్నుఁబూని వెనుతగ్గితి; సైచితి ॥ సంశ ॥ ముల్లోకములకుఁ దల్లి వౌ నిన్ దెచ్చుటెల్లప్పు డీలంక యేలంగనుట కేన ॥ సంశ ॥ శ్రీమోక్షగుండ శ్రీరాముని లక్ష్మణు వామాక్షి, దోడ్తెచ్చి వానిఁ జంపించెద ॥ సం ॥

తో: పుత్రపౌత్రహితముఖ్యులతో దెగుమొఱకుడు రావణుఁడు ధాత్రి నయోధ్యకు ధవుడును నీవును త్వరలో జేరుదురనుడు ॥ రా ॥

సీత - తో: మంచిది రాముఁడు మఱి లక్ష్మణుఁడును మర్కటసైన్యములెల్ల । నెంచక వారధి నెటులదాటగల రెఱిగింపుము విలసిల్ల ॥ రా ॥

వ. అనిన,

హ-క. రాము నిసైన్యయుతంబుగ
నామూపున మోసికొని ఘనంబుగ నుదధిన్
భామిని, యపలీలగ నే
ధీమతి దాటింపఁగలను దివిజులు మెచ్చన్.

వ. ఇంకను గార్యంబులెల్లను స్వల్పకాలంబున నెఱవేర్పఁబడును ముద్దుటుంగర మిచ్చితిఁగదా! మరల రాముని కొసంగుట కొక్కయానవా లిమ్ము తల్లి! భక్తజన కల్పవల్లీ!

క. అని పలికిన ముదమందుచుఁ
దనజడలో నిమిడియున్న తలమానికముఁ
హనుమంతుని యంజలినిడి
జనకజ వెండియును బలికె శంకాన్వితయై.

వ. అనంతబలసంపన్నులగు రాక్షసుల నింత స్వల్పశరీరంబుగల మీరెట్లు జయింతురు ? అదియొకగొప్ప సంశయం బనిన, జనకనందనతోఁ బవమాననందనుం డిట్లనియె,

తో. పూర్వరూపమున బొడగట్టెదనో! పొలతీ, కనుగొను మనుచు । బర్వతాకృతిగఁ బావనిపెరిగిన బరికించి భయంపడుచు ॥ రామ ॥

వ. జానకమ్మ కనులుమూసుకొనిన నతం డెప్పటివలె సూక్ష్మ రూపంబున నుండె
ప్పుడు కనులుదెరచి.

కళ్యాణి:రూపకము.

పవనతనయ, రాముఁజేర బయనమగుమికవివరంబుగనావార్తను వినిపింపుము దయ
ఁడను ॥ పవన ॥ నీజవంబు వింటి: నేడు నీబలంబుగంటి: ఆజికి జాలిన మేటివి యపు
సరి యతివేగమే ॥ పవన ॥ మోక్షగుండపతికి నీవు ముఖ్యభటుఁడవైతి వీక్షణమున
ాణిక్యము హృదయేశున కర్పింపుము ॥ పవన ॥

వ. ఇదిగాక యింకొక సమాచారంబు చెప్పెదవినుము,

సీ. శ్రీరాముఁడును నేను జిత్రకూటాద్రియం
దుండఁగ వంచించి యొక్క కాకి
స న్నంట, నలిగి తృణం బొండు వైచిన,
బ్రహ్మాస్త్రమై వెంటఁ, బడి జగత్త్రి
యంబు ద్రిప్పిన, శరణం బెందుఁ గానక
కావు కావు మటంచుఁ గాకిమరల
వచ్చియుఁ దనప్రాపుఁ జొచ్చిన, దయగల్గి
యొకకన్ను నస్త్రంబునకు నొసంగు.

గీ. మనుచు రక్షించె, నట్టి దయాంబురాశి
రావణుం డిట్టి క్రూరకార్యం బొనర్ప!
నూరకుండుట కిపుడు నానేర మేమొ!
చాలవినిపింపవయ్య వాతూలతనయ!

వ. అనిన హనుమంతుం డిట్లనియె;

క. అమ్మా యిఁక ద్వరలోఁ గా
ర్యమ్ములు సకలంబు దీర్తు నాకలిఁ గొంటిన్
నెమ్మది నీవనమందు ఫ
లమ్ములు దిని పోవఁగా సెలవు నా కిడుమా.

వ. అనిన మంచి దటులఁ జేసిత్వరగఁ బొమ్మన వల్లెయని జానకికి వందనం బొనర్చి కదలి తాను వచ్చి పోవుట రావణున కెఱుక పఱుచువాఁడై—

తో: ఆ యశోకవనమందు సీతయున్నట్టి చెట్టు దక్కఁగను । ఛాయక యన్నియు వాయుతనూజుఁడు. పడఁద్రోసెను చక్కఁగను ॥ రామ ॥

వ. ఇట్లు చుట్టుముట్టి వనం బంతయుఁ బెకలించి యార్చి పేర్చి యెదిరించిన వన పాలకుల నెనిమిదివేల మందిని యొక్కపెట్టునఁ గూల్చిన, రాక్షసస్త్రీలు ని వ్వెరగంది సీతను గనుంగొని,

కమాచ్: ఆదితాళము.

అతఁ డెవరో! జానకి! ॥ యత ॥ వివిధవృక్షముల, విఱచివేయున ॥ నత ॥ వనచరుని రూపము! గేసరిప్రతాపము! ఉరుబలవీరుల ద్రుక్కడంచె ॥ నత ॥ నినుఁ గాంచి పలికెను; యిటనుండిపోయెను ॥ యెంచ మోక్షగుండేశుని చెలి ॥ యతఁడెవరో ॥

వ. అనిన నామె యిట్లనియె.

తో. శోకముచేతను క్రుక్కుచుంటి నిట నాకెటు దెలియును నదియు! ప్రాకటముగ మీరాక్షసమాయలు మీకే తెలియగ వలయు ॥ రా ॥

వ. అనిపలికిన వారు భయంబును బొందుచు ద్వరగాఁజని రావణుఁ గని మ్రొక్కి యిట్లనుచున్నారు.

కీర్తన: ఆదితాళము.

మీరు గృహము జేరిన మీద నచట జరిగిన కారుబారులిప్పుడు గరుణఁ జిత్త గింపుడు ॥ మీరు ॥ కోతి-యొకటి వచ్చెను; సీతతో భాషించెను; భీతి మేను బెంచెను; బిట్టువనము దుంచెను ॥ మీరు ॥ రాక్షసులను గూల్చెను; రమ్యహర్మ్య మెక్కెను; మోక్ష గుండహరికిని ముఖ్యుండంచుఁ దోఁచెను ॥ మీరు ॥

వ. అని పలికిన రావణుండు మహాశ్చర్యకోపంబులు పెనఁగొన, నెనుబదివేల రాక్షసదళంబులబలవంతులఁ బంపె. వారు చనిరి. అంతలో సూర్యోదయం బగుటయు,

సీ. పంక్తికంఠుఁడు దనపర్యంకమున నున్న
కటిబంధనము గని, గయునిదిగను

గుర్తించి, తనపత్నిఁ గూడినాఁ డని యెంచి
ఖడ్గంబు గొని చంపఁ గవిసినంత
స్త్రీహత్యవల దనిచెలులు నివారింప
నుడిగి యా గయునింటి కురువడించి
వీనిచే మృతి విధి వానికి లిఖియించె
గాన నిద్రితుని ఖడ్గమునఁ దునిమె;

గీ. నంతఁ దన పాన్పుపై నున్న యంబరంబుఁ
గని విభీషణుఁ డన్నదిగాఁ నెఱింగి
నరమను వధింపఁ జంద్రహాసంబుబూసె;
వలదు స్త్రీహత్య యని స్త్రీలు దెలుప మానె.

వ. అది మొదలు రావణుని సాంగత్యంబువదలి యెట కేనియుఁబోవ సంకల్పించుచుండె. ఇక్కడ రావణప్రేరితరాక్షసదళంబులు జనుదెంచె.

తో: తోరణకంబము తుది గూర్చుండిన మారుతిపై బాణములు । సారెకు బఱపిన, సరకుగొనకదా నరగజేసె శకలములు ॥ రా ॥

వ. ఇట్లు శకలంబులుజేసి వారిపయికి గుప్పించి దుమికి క్షణ మాత్రములో నందఱను ముష్టిఘట్టనలచే మ్రందించిన హతశేషులచే నవ్వార్త తెలిసి యచ్చెరువొంది రావణుఁడు వక్రనాసుఁడు, బింగళాక్షుఁడు, దీర్ఘజిహ్వుఁడు, నశ్మవక్షుఁడు, శార్దూలముఖుఁడు నను పేరులుగలయైదుగురు సేనాధిపతులఁ బంపిన, వారు చని—

తో: కేకలువేయుచు మూకలుగట్టి శరాళిఁ దీవ్రగతి వ్రేయ। భీకరముగ గపివీరుఁడు బెదరక, తోకతోడఁ బొడిసేయ ॥ రామ ॥

వ. వారును బోక చుట్టుకొనిన దోరణస్తంభముచేత నొక్కొక్కని మోది చక్కాడిన, నది తెలిసి దశకంఠుడు రక్తరోమ శతజిహ్వ రుధిరలోచన స్తనితహస్త శూలదంష్ట్ర దుర్ముఖ వ్యాఘ్రముకబళులను నేడుగురు బలశాలురఁ బంపె వారుం జని—

కీర్తన : ఆదితాళము.

ఎక్కడికోతివి యెటిగింపు నీడొక్క చించెదము సైరింపు । మిక్కిలి నీమెఱ - మెచ్చులు సూపక ॥ యెక్కడి ॥ త్రొక్కిన త్రొక్కుకు - ముక్కున నోటఁగ్రక్కున నెత్తురు - గ్రక్కెదవు

॥ యె ॥ కండలుప్రేవులు గుండెలు చీలిచి వ-డి తిందుము వచ్చిడిగ ॥ యె ॥ మోక్షగుండ పతి రక్షించినను రాక్షసులను జేరఁగ దరమా । యెక్కడి ॥

వ. ఇట్లు ప్రగల్భంబు లాడుచు బాణపరంపరల ముంచిన హనుమంతుం డట్టిహానంబున.

తో: ఉరగంబులపై కురికెడుగరుడునికరణినిబైఁబడ దూకి । కరిరథహయముల మురుముచేసి యమపురి జేరఁగ వారి నూకి ॥ రామా ॥

వ. భుజాస్ఫాలనంబు జేసి నిలిచిన, నదివిని ప్రహస్తునినుతుఁడనంత ప్రతాపనిర్జి తాంశుమాలి యగు జంబుమాలి రావణానుజ్ఞ చేఁవెడలి వచ్చి "వేదండతుండనిభంబగునుద్దండ భుజాదండంబున బ్రహ్మాండంబునందుండిన కొండనైనఁ బిండిపిండిగఁ జేయఁజాలిన దండి మగండనగు నాడండకుఁ బుండరీకాక్షుండైన రా నోపఁడు, నీకంత లొకకుండ కయిన జాలవే! మంచి దుండుము! భండనంబున నీగుండెను ఖండించి దండధరుని యండకు బంపెద మొండీ! నామాట బహుఖరాఖండీ" యనిన, విని యాంజనేయుండు - "ఖండేందుమౌళి కోదండంబుఁ బిండిచేసిన కోదండపాణిభటుండ! చండాంశు సుతునినచివుండ । నాంజనే యుండ! భండనభీముండ! గుండెగల శూరుండ వయిన నిండుపేర్మితో రారారండా! ఇప్పుడే! మోయింతు నీముండ! చేసెద మరలమాట్లాడకుండ!" ననిన,

తో: జంబుమాలి రోషంబున బటుబాణంబుల పైబడవైవ । డంబుజెడక సాలంబు చేత ఖండంబు జేసికడుజేవ ॥ రామ ॥

వ. పయి బడఁదుమికి రథరథ్యంబులఁ జూర్ణంబుజేసిన,

తో: అడిదమ్ముఁ బలకయు నతఁడుఁ బూని పైనడరిన నంతటి లోన । బిడికిటఁ బొడిచిన బిరముచెడి వడిఁ బడియె నాతఁడిలపైన ॥ రా ॥

వ. ఇట్లు జంబుమాలి యూలిగిన, నావార్తవిని చింతించి రావణుండు విరూపాక్ష ఖానకర్ణ దీర్ఘజిహ్వ ప్రఘసనాదులను పంచసేనాగ్రనాయకుల ననికిఁ బంపినఁ వారు ప్రతాపం బిసు మడింపఁ జని,

బ్యాండు: ఏకతాళము.

మావనంబు బీకివైవ నీ వెవండవు? పోవా! లేవా! మావిధిగ జావగ దేవుఁడు నుదుటగ దిరముగవ్రాసెగ గావునఁదెగువన్ ॥ మా ॥ లేరారారా! చేరగ బోరఁగ శూరుఁడవైనగ! ఘోరశరములుగ సారెకు వెడలెగ ॥ మావనంబు ॥ చుటుముటు పటగ

గట్టిగన్ నెట్టిలాగఁగఁ, జుట్టము లెవరు తట్టున బాపఁ ॥ మావనంబు ॥ మోక్షగుండా ధ్యక్షుని పక్షమై రాక్షసులపయి దక్షుఁడ వగుచుఁ దండు వెడలితో ॥ మావనంబు ॥

వ. అనిన నాంజనేయుండు తగ్గుమొగ్గుతెలియక నెగ్గులాడుచు నాదగ్గరఁజేరిన రక్కసులు నుగ్గునూచమయిరి. మీరుసిగ్గులేక పెగ్గెలు దీయుచు సగ్గలంబుగఁ జుట్టుముట్టితిరి. ఇప్పట్టున మీపొట్టలు పగులగొట్టి తట్టునఁ బ్రొద్దుపట్టి పట్టణంబునకు నెట్టుకున్న నేజెట్టినా! వట్టిదిగా దట్టిట్టుఁబోక దిట్టంబుగ నిలువుడు రాక్షసాధములారా! అని పలికి,

తో: వారిపైన గడువడిఁ బత దుమికియు వారిబాణములు గొనక ॥ దోరణకంబముతో నొక్కొక్కనిఁ దునుమగడఁగె నటు వెనుక ॥ రామ ॥

వ. ఇంతయువిని రావణుం డక్ష కుమారునింజూచి.

తో: వనచర మొక్కటి వచ్చి చొచ్చిమన వనమెల్లను బెకలించి దనుజుల జంపెను! దగఁ జని గూల్పుము తడవుసేయ కెదిరించి ॥ రామ ॥

వ. అనిన మంచి దని యక్షకుమారుఁడు బహుసైన్యయుతంబుగ రథారూఢుండయి నడచితోరణస్తంభంబుపయి బ్రళయార్కుని పగిదినున్న హనుమంతునిఁ గని,

పంచచా ॥ దురంబునందు నెంతవానితోడనైన బోరి బల పరాక్రమంబుఁ జూపు నట్టి పంక్తికంఠపుత్రుఁడఁ! బరాకుమాని యిందు నిల్వు పారిపోకు! వచ్చెనా! శరంబు లక్ష్యయంబుగా! వశంబు గాదు చూడుమా!

వ. అని పెక్కమ్ము లొక్కుమ్మడివైచిన.

హ : పంచచామరము.

పరేశుఁడైన రాముదేవిఁ బట్టితెచ్చినట్టియా । దురాత్మునట్టి త్రుంచుతెంపు తోడవచ్చి నాడ నీ । శిరంబు ద్రుంచి నేడు విందుసేతు భూతపాళికిన్ । దరంబుగాదు నన్నువీఁక దాఁకి మళ్ళిపోవఁగన్.

వ. అని పలికి పైకి లంఘించి యతండు వైచిన బాణంబులు చూర్ణంబుజేసి.

తో. హుంకరించి వానియురమున రాముని కింకరుండు పొడువగను । బింకము చెడి విలవిల దన్నుకొనుచు విడిచెను దనప్రాణమును ॥ రా ॥

వ. పిమ్మటఁ గాలఁ జేత మట్టి యతనిసైన్యమును బిలుకు మార్చిన నక్షకుమారుని మరణవార్త హతశేషులవలన విని రావణుండు నిర్విణ్ణుండయి.

పున్నాగవరాళి : ఆదితాళము.

నను( బాసి పోయితే! నిను గోలుపోయితిన్! అక్షతనయ! ॥ నను ॥ వనచరు డెవ్వ(డో! చనుదెంచెమృత్యువై! యక్షతనయ! ॥ నను ॥ బలశాలి వనుచును బరికించి చూతును అక్షతనయ! ॥ నను ॥ శ్రీ మోక్షగుండ శ్రీరాము(డు పంపెనో యక్ష తనయ! ॥ నను ॥

వ. ఇట్లు విలపించు తండ్రికి నింద్రజిత్తు మ్రొక్కి యిట్లనియె;

క. నీతనయునిచావునకై
యాతీపున దుఃఖపడిన నిది మే లగునా!
నాతండ్రీ సెల విచ్చిన
నాతని నే(బట్టి తెత్తు నరనిమిషమునన్.

వ. అనిన ధైర్యంబునొంది,

తో: సురపతి( గెలిచిన - జోదువు నీ వతి శూరు(డ వసుదువు కాన । పరగున నావనచరుని బట్టి నానన్నిధి కి(క దెమ్మనిన ॥ రామ ॥

వ. ప్రళయకాలాభీలజాజ్వల్యమాన మహానలంబు చందంబున మండిపడుచు దండి భటు లనేకులు గొలువ రథారూఢుండై చని తోరణస్తంభాగ్రంబున నుండిన మారుతి( గని కోపాటోపంబున—

కీర్తన: ఆదితాళము.

ఉండుండు ముండుమురా! కోతివాడ! ॥ యుండు ॥ ఉండుండు బహురణ పాండిత్య మున్నట్లు మెండుగ దిరిగేవు! తుండెములుగ(జేతు ॥ నుం ॥ శ్రీమోక్షగుండేశుని సతతము సేవించువాడ వని నామదికిని దోచె! న న్నెదిరించుము! నే మేఘనాదు(డ! నీజిడ్డు వదలింతు ॥ నుండుండు ॥

వ. అని పలికిన హనుమంతుడు—

తో: రామునిదూతను రాక్షస వినరా-భూమిజ పొడగన వచ్చి। నేమము నిచ్చట విహరించితి నావిక్రమంబు గన(బఱచి ॥ రా ॥

వ. ఇదివఱకు వచ్చిన మీవారలలో నిను( గలిపెద రారమ్మనుడు, మేఘనాదుం డతని శరీరంబుపై బాణవర్షంబు గురిపించిన, లక్ష్యపెట్టక దక్షణంబున( గ్రిందికి వచ్చి తనలావు మెఱయ—

తో : అతనిరథంబును నవనిగూల్చి మఱి యశ్వములను మడియించి । ధృతితో భటుల వధించిన మఱియొక తేరు నెక్కి యెదిరించి । బ్రహ్మాస్త్రంబును బరువడివైచియు బవనతనయు బంధించి । బ్రహ్మాదులు విభ్రమపడ రావణబ్రహ్మచెంగటికి మించి ॥ రా ॥

వ. అనేక విధంబులఁ గొట్టుచుఁ దిట్టుచు బాధించుచు దోడ్కొనివచ్చి రావణుని యెదుట నిలిపిరి. బ్రహ్మచే మున్ను వరముఁ గొనియున్న హనుమంతుని బ్రహ్మాస్త్రమేమియు బాధింపదయ్యె. అప్పుడు రావణుని యాజ్ఞచేఁ బ్రహస్తుం డిట్లనియె;

దర్బారు : ఆటతాళము.

ఎవ్వరివాడవుర ! యెఱింగింపు రాజుతోడ ! నివ్వీటి కెందు కొఱకేతెంచినావుర ॥ యెవ్వరి ॥ వన మెల్ల బెరుకగ దనుజుల దునుమఁగ బనియేమి నిక్కముగ బలుకు నీపే రేమిర ॥ యెవ్వరి ॥ వెఱవక ఈలంక పురినిఁ జొచ్చుటకును హరిహరులకు నైన నలవిగా దంచెఱుఁగవ ॥ యెవ్వరి ॥ ధారుణి మోక్షగుండధాముడా ! శంకరుడా ! సారసగర్భుడేమొ! సరగున బంపినది ॥ యెవ్వరివాఁడవుర ॥

వ. అని యడిగిన నాంజనేయుండు రావణుని దిక్కునభిముఖుండయి యిట్లనియె.

క. ఓరీరావణ ! వినరా !
ఈరేడు జగంబులెల్ల నేలెడు శ్రీమ
న్నారాయణాంశభవుఁ డగు
శ్రీరఘురామునకు నేను భృత్యుఁడ సుమ్మీ.

గీ. జనకనందన నెమకుచు వనుల వెంట
నలజడుల రామలక్ష్మణు లరుగు దెంచి
ఋశ్యమూకాద్రిఁ జేరి సుగ్రీవు జెలిమి
గనిరి, నన్నంపిరిటకు జానకిని గాంచ.

తో. దశదిక్కులను దరణినందనుఁడు దఱిమెనుగపిసైన్యముల । విశదంబుగ నేవెదలి జానకిని వెదకుచు సత్త్వము మిగుల ॥ రామ ॥

వ. సముద్రంబునొక్క కాలువంబోలెదాఁటి నీనగరంబుఁ బ్రవేశించి వెదకుచు నశోకవనంబుఁజొచ్చి, శింశుపావృక్షంబుక్రిందఁ గూర్చుండిన——

తో : సీతను గని రాముక్షేమము జెప్పితిఁ బ్రీతిగ నుంగరమిచ్చి నాతెఱఁగంతయు వివరింపఁగలోఁదలచి ॥ రామ ॥

ఆ. వనము ద్రుంచి, వేగ వనపాలకులఁ జంపి
నీదు సేననెల్ల నీఱు చేసి
పరగనింద్రజిత్తు బ్రహ్మాస్త్రమునకును
జిక్కి నీదుకడకుఁ జేరినాఁడ.

తో : చావను బ్రహ్మాస్త్రంబుచేత నటుగావున జిక్కితినేను; బాధపెట్టఁగా రావణ, వాయునుతుండ ॥ రామ ॥

కాఫీరాగము ; ఆదితాళము

దానవ, రామప్రతాపము నీమదిగానవు నీ, వటుగావున ద్రుళ్ళెదు: నిన్నుజయించిన! వానిని వాలిని వధియించె జూడుము ॥ దానవ కోదండము విఱచెను; దండిగ భృగురాముదర్ప మడంచెను: ఖరముఖులనుమోక్షగుండ విభుని పయిఁ గ్రూరము మానవు ॥ దానవ ॥

ఉ. ఉత్తమభూసురుండవయి యుత్తరదిక్పతి సోదరుండవై
చిత్తజవైరిబంటవయి, చిత్తము నత్యము నత్వనద్గుణా
యత్తముఁ జేయలేక యనయంబునఁ దామసివై చరింత
ద్వృత్తిని మించి; యింతయవివేక పరత్వమె పంక్తికం

కీర్తన : ఏకతాళము.

మాయానిర్మిత మగును గాయము నపాయంబందు ధాతుమయవ వనితలున్ దనయులున్! దనువులున్, ధనములున్ దనవి యనుచు గన జలమందుఁ గలుగు బుగ్గలరీతిన్ బ్రీతిన్ దోచి యడగును ॥ నిజ ॥ ఎన్నెత్తి యుంటిమో! యిక నెన్నితనువు లిల నెవ్వగ దిన్నగ బన్నుగ న లేకుండు నుండు లేకుండు । బ్రాకటకౌముదిపగిదిగను ॥ నిజ ॥ కలలో గానుపించుచున్, ఆలోనఁ ఎటుబోనోయదృశ్యము లౌనటుగా నెంచుము గుండవరపు రాధ్యక్షుఁ డీతనువులన్ సాక్షియెదీక్షతోఁదగనుగొనున్ ॥ నిఁ

తో : ఆకాశమువలె నంతట నిండిన యచలుఁడుపరమాత్ముఁడు ప్రాకృతతనువుల బటుజీవుం డనఁ బరగి సూక్ష్మముగ నుండు ॥ రామ ॥

గీ. అట్టిజీవాత్ముఁడీ శరీరాభిమాన
మునను, దేహంబె! యాత్మగా బుద్ధి నెంచి
తనర సంసారవార్ధిలో మునిగియాత్మ
కర్మఫల భోక్తయై యైహికమునఁ గడపు.

వ. ఇట్లుండి కాలాంతరంబున—

తో : తను విం కొక్కటి దాను ధరించును దృణజలూకమును బోలి । కన్గొన నెన్నటికినినాద్యంతము గనఁబడకుండునుబాళి ॥ రా ॥

వ. కాఁబట్టి వివేకవంతుఁడు నిత్యానిత్యవస్తువుల విచారించి యనిత్యంబులయం దాసరోసి, నిత్యమయిన యాత్మ నెఱింగి యాత్మ యందుఁ గలిసినగదా జన్మరాహిత్యంబు! రావణా! యట్టి యాత్మ స్వరూపుఁ డీరాముఁడని కనరాదా!

కీర్తన: ఆదితాళము.

పురాణపురుషుఁడవ్యయుండు రాముఁడు, మౌనిమానసాబ్జసంస్థాన ధాముఁడు, తానే తానై తనిరునాతఁడు ॥ పురా ॥ అనంతనామరూపములు; నీయంతయై సంతతంబు జేసి తాను నంతరాత్మయై, శాంతిదాంతి వంతుం డయి తగు ॥ పురా ॥ అజాండకోట్లయందు దా నఖండుడై చండకిరణురీతి మోక్షగుండనిలయుఁడై, దండినిండి యుండునచలుఁడై ॥ పురాణపురు ॥

వ. అట్టి పురాణపురుషుఁడు దుష్టని గ్రహ శిష్టపరిపాలనకొఱకుఁ బ్రతియుగంబున నేదేనొక రూపంబున నవతరించుఁ గాన, నట్టి యవతారమూర్తి యీ రాముం డని తెలియుము!

గీ. ఇంతటను నయిన యమ్మాల్యవంతమందు
రామలక్ష్మణు లున్నారు; రాక్షసేంద్ర,
సీతఁ గొనిపోయి యిచ్చి తత్సేవజేసి
కులము నెల్లను రక్షించుకొని తరింపు.

వ. అటు లొనర్పక గర్వించి తేని వినుము—

హిం- కాఫీ : ఆటతాళము.

భండనభీముం డగుకోదండపాణి యే తెంచును! నిందుశౌర్యముతోడ నీదుపురి ముట్టడించు ॥ భండన ॥ ధాటిగ నా కన్నను మేటియగు కపిసేన కోటానకోటులు దను గొల్చుచు వెంటరాఁగ ॥ భండన ॥ ఖండితముగను మోక్షగుండపతి నీ తలలఁ జెండాడుగాదా నీకుఁ జెచ్చెఱను దెలిసెడిని ॥ భండన ॥

వ. అని ఖండితంబుగఁ బలికిన వానరేంద్రుని వ్యాకంబులు విని కోపోద్దీపిత మానసుండయి కన్నులయందు నిప్పు లుప్పతిల్ల బ్రహస్తాది మంత్రులఁ దిక్కు జూచి.

తో. వింటిరె మీరలు వీనిప్రతాపము వీనిప్రగల్భము లెల్ల ॥ నొంటిగ నుండియు నోడక నాకెదు రొడ్డి కూసెడిని చెల్ల! । దిక్కుల గెలిచితి; దిక్పాలురునను, దేఱిచూడ వెఱచెదరు; చక్కగ మనుజుని శరణుఁజొచ్చు మని నరిగా వీఁ డిటు వదరు ॥ రామ ॥

వ. కాబట్టి వీనిని గట్టిగాఁ బట్టి పొట్టకొవ్వుఁ గరగించి దిట్ట తనంబున మట్టి వ్రేయుఁడు మంత్రులారా! సమస్తకార్య స్వతంత్రులారా! అనిన వారందునకు నన్నుద్ధ లగు చుండ బుద్ధిశాలియగు విభీషణుం డన్నసన్నిధికి వచ్చి నమస్కరించి యిట్లనియె :

నవరోజు : ఆదితాళము.

సరిగా దీవని రావణా ॥ నీకు నరిగా దీవని ॥ సరగున దూతలఁ దరుణుల బాలుర ధరణీసురులను జంప ॥ సరి ॥ దూతలు దమ తమ వేతల యనుమతిఁదొడరి చేయుదురుగాదే ॥ సరి ॥ ఊరక విడుచుట, కొప్పకున్న నొక తీపుగ దండనఁ జేయు ॥ స ॥ గుండెగలుగు శూరుండవైన మోక్షగుఁడ విభునిపై కేగు ॥ సరి ॥

వ. ఇట్లు బోధించిన విభీషణుని వాక్యముల కామోదించి హనుమంతుని జంపుమని చెప్పిన తలంపును వదలి మంత్రులకు మరల నిట్లనియె :

తో : వానరులకు లాంగూలమె మూలము గాన వీనితోఁకకును, నూనెగుడ్డలను మానుగ జుట్టియుఁ బూని కాల్చి విడు డనెను ॥ రామ ॥

వ. ఇట్లుకఠినంబుగ నాజ్ఞ యిచ్చె. రావణుని శాసనంబున రాక్షసులు చెలరేగి యాంజనేయుని బాశబద్ధునిజేసి యింటింటఁగల గుడ్డలన్ని యుం దెచ్చి నూనెతోఁ దడిపి తోఁకకు జుట్టి నిప్పంటించి వాద్యంబులతో కూడ నపహాస్యంబుఁ జేయుచు.

తో : దనుజులనందఱిఁ దఱిమియు గఱచిన వనచరకీటకమిదిగో! మనచే దొఱకెను మర్దింపుం డని మఱుచుఁ గొట్టుచుఁబగతో ॥ రా ॥

వ. పురవీథులెల్ల గలయఁ ద్రిప్పి పశ్చిమ ద్వారఁబుకడకుఁ జేర్చిన నింతలోఁ గొందఱు రాక్షసాంగన లావార్త యెఱింగించిన సీతవగచుచు,

హిం- తోడి : అటతాళము.

ఎంతకష్టము వచ్చెను! నేమిచేయగ వచ్చును! ఎంత యని విలపింతును! చింత యెటువలె ద్రోతును ॥ ఎం ॥ మాయవాది దైవము; మాకు నీవు సహాయము జేయ నోరువ డాయెను । చిక్కులే కలిగించెను ॥ ఎంత ॥ సాక్షియైన నారాయణ శర్మను రక్షించిన మోక్షగుండ దేవుని ముఖ్యభక్తుఁడ వయిన నీ ॥ కెంతకష్టము ॥

వ. అనికొంత చింతించి యనంతరంబు ధైర్యంబున నగ్నిని గూర్చినమస్కరించి.

క. అనిశము నిజనాథుని పద
వనజమ్ముల నాత్మఁ బూజ బఱపుదునేనిన్
అనలుఁడు శీతలతం బా
పని నంటక కనికరించి భద్రమొసఁగుతన్.

వ. అని నియతమై యగ్నిని బ్రార్థింప, నమ్మహాపతివ్రత వాక్కుల కలరి జాత వేదనుండు శీతలభావమున నాంజనేయుని బాధింపకుండె, ఇక్కడ హనుమంతుండు—

తో : ఔరా న న్నీయగ్నిదహింపమి కారయఁ గారణమేమో! శ్రీరఘూద్వహుఁడు నాయెడ జిలికెడు కారుణ్యామృతరసమో! ॥ రా ॥

వ. పతివ్రతాశిరోమణి యగు సీతాదేవి యమోఘాశీస్సుగా నుండవచ్చు సీతారాము లకు నమస్కరించి బ్రహ్మమంత్రంబు పఠియించిన మాత్రంబున బ్రహ్మాస్త్రంబు వదలిపోయె. ఇంతలో నినుం డస్తమించుటయు;

గీ. పర్వతాకారముగవాయు పట్టి పెరిగి
చుట్టుముట్టిన దనుజుల ద్రుక్కఁజేసి
క్షణములోపల నాకాశమునకు నెగిరి
పక్షికంతునిమేడపైఁ బరగ దుమికె.

తో : అతని నగళ్ళను జతికిలద్రోయుచు, హనుమ అనలమంటించె; । హుత వహుండు పురినెల్ల కడలఁ దనయుగ్రాకృతిఁ బఱపించె ॥ రామ ॥

వ. ఇట్లంజనాపుత్రుండు విజృంభించి వాలఁబు పెంచి లంకానగరంబు విభీషణ గృహంబుదక్కఁ, నలుమూలలఁ గాల్చె. పలాయనమగుటకు శక్తి చాలని స్త్రీ బాల వృద్ధాదులు దేహంబులు గాలుచుండ నొకరి నొకరు గౌఁగిలించుకొని.

శంకరాభరణము : ఆదితాళము

అయ్యయో। చూడరే। యెంతయన్యాయము గూడెనో! చయ్యన రావణునకు జావే మైన మూడెనో!॥ అయ్య॥ పరకాంతను బతివ్రతను చెఱబట్టి తా దెచ్చెను। బురముగాలె! దత్ఫలముఁ బొందువేళవచ్చెను॥ అయ్య॥ సుతులన్నదమ్ములు హితులు బతులు సతులు ననుచును వెదకికొనంగ వ్యవధిలేదు। బ్రతుకు దూర మాయెను॥ అయ్య॥ మోక్షగుండ రాఘవునిపైఁ గక్షకట్టుకుండిన, రాక్షసవరుల కాపురములను జే టొదవునా!॥ అయ్య॥

వ. ఇట్లు పురజనులనెల్లఁ జీకాకుపడఁజేసి సముద్రంబునందు వాలంబుఁ జల్లార్చుకొని హేమవర్ణంబుగ నలరారు లంకానగరభూమిని గని హనుమంతుం డాశ్చర్యంబు నొందెనని చెప్పిన శివునకు భవాని యిట్లనియె,

తే. హేమవర్ణముగ నేటికి లంకాభూమి యలరె విన నెనయస్వామి, తెలుపుమన హైమవతికి శశిశేఖరుఁ డనె నిటు లౌలయ.

క. ఉరగుల కమృతముఁ దెచ్చుట
కరుగుచు గరుడుండుఁ గడు క్షుధాతురుఁడై శ్రీ
హరిని గని మ్రొక్కి యాఁకలి
దొరఁగు తెఱం గడుగ నాయధోక్షజుఁ డనియెన్.

శహన : ఆదితాళము - (వనమునుజూడంగ) వలె.

విను వినతాపుత్ర! నీకు విస్తరించి తెల్పెదన్; మునుకరి మకరము లెనసి పోరఁగరి నను వేడగ మకరినినేదునిమితి॥ విను॥ కరీంద్రుఁడవు నాశరీరమును వేదొరంగి శాపము దీరగన్ దిరంబుగాఁ జనె; ధరిత్రి నవి యొక సరోవరముకడ జాల నున్నయవి॥ విను॥ ఘనంబు గను దత్కళేబరంబులు దినంగ నాకలి దీఱును, చంపగ నగు మోక్షగుండపతి యాజ్ఞ నచ్చటికి నీక్షణంబులో నిక॥ విను॥

వ. ఇట్లు తెలిపిన హరి యనుమతి వడసి తార్క్ష్యుండు తత్క్షణంబున నాపుణ్య సరోవరంబుకడకుఁ జేరిన,

క. గజనక్రకళేబరముల
భుజియింపగ వచ్చియున్న భూ్రభంగుని ద
ద్గజనక్రంబుల(గైకొని
భుజగారి వియత్పథాన( బోయె యథేచ్ఛన్.

వ. భ్రూభంగనామగృధ్రపతి గరిమకరములను రెండు పాదముల( దగిలించుకొని భక్షించుటకు విశాలస్థలం బరయుచు( జనిక్షీరసముద్రతీరంబున నున్న సహస్రయోజన పరిమితిగల జంబూ వృక్షశాఖమీ(ద గూర్చుండిన

తో: గరుడునిభారము కడుదున్సహమై తరుశాఖ తునుంగగను ధర( బడకుండగ దానిముక్కునను దగ గొని నెమ్మనమునను ॥ రామ ॥

హిం. తోడి. ఆటతాళము.

ఏమితో(వ దెందుబోయెద! నిది యెచ్చో( బారవైచెద ॥ నేమి ॥ దీని భూమిపై నుంచిన భూతకోటులకు వేమరు( గీ డొదవు ॥ యేమి ॥ అందు మునీంద్రులు యెందఱో గలరు ॥ యేమి ॥ బొందుగ వారి తపోభంగమైన నేమందురో! శపియింతురో ॥ యేమి ॥ ఆకలినిల్వ లేక హరి దెల్వ పీని(జేకొనిపోయి భుజింపగ బోయిన నీ కొమ్మ విఱిగె నయ్యో! ॥ యేమి ॥ శ్రీమోక్షగుండస్వామి నాయందు లే దేమొకో! యాపదలేతెంచె! బాపగ నెవ్వరగపడరు ॥ యేమి ॥

వ. అని యిట్లు ఖేదపడుచు( బోయి యొక్కచో( దపంబు చేయుచున్న కశ్యప మహర్షిని( గని వినయంబున నిట్లనియె:

మ. జనకా! యీతరుశాఖ యెం దిడుదు? నీజంతుత్రయం బెచ్చటన్
దినినే(బోదు ననంగసర్వము( దపోదృష్టిన్విలోకించి యా
యన 'వత్సా! విను, నూ(ఱుయోజనము లీయంభోధి లంఘించినన్
గనుపట్టు న్విజన ప్రదేశ మగు లంకాద్వీప మం దొప్పగన్.

వ. పీనిని భక్షించి యీకొమ్మయం దుంచి పొ మ్మని, దీవించి పంపిన వేగంబున నచ్చటి కేతెంచి.

ద్విపద ॥ ఆజంతువుల దిని యస్థి చయంబు । రాజితముగ మూ(డు రాసులు చేసి । యామీ(ద( దరుశాఖ నమరంగ నిలిపి । ధీమతితో వైనతేయుండు చనియె, । నద్రిత్రికూటా

చల మన నలరారె; । బదవడి యందుఁ దపం బొనరించు, । వాలఖిల్యాదు లర్వది వేలఋషులు । పోలంగ దపములు పూర్ణమై ముక్తి । పొందిరి యంత జంబూఫలసార । మందు ఘనీభవమై పాచిపట్టి । యుండెనాపై బురంబొండు నిర్మించి । యుండిరి రాక్షసు లొగి గాపురముగ; । హనుమంతుఁ డది కాల్పనా రాట్పుకలగి । కనఁబడె నాభూమి కనకమయముగ.

వ. అంతట హనుమంతుండు మరల సీతమ్మ సన్నిధికేగి యిట్లనియె;

తో. తల్లి నేను వనమెల్లను బెఱికితి; దగులబెట్టితిని పురిని; । అల్లాడించితి నసురుల; సెల విమ్మరిగెద నే నిత్తఱిని ॥ రామ ॥

వ. నీభర్తను సుగ్రీవాది వనచరయుతంబుగాఁ దోడి తెచ్చి నీయిడుమలు నివారింపఁ జేయుదు. ధైర్యంబున నుండు మని చెప్పిన సీత యిట్లనియె :

తో. రాముకార్త కర్ణామృతముగ నీచే మారుతి! నే వింటి నీ మాఁదను । నేనిక్కడ వగపున నెటుల గడపుదును నొంటి ॥ రామ ॥

వ. అనిన హనుమంతుం డిట్లనియె :

తో : విను నాభుజమున నెక్కఁజేసికొని వనధి దాటి శీఘ్రమున । దినక రాన్వయుని రాముఁజేర్తు రమ్మనుడు పలికె నెయ్యమున ॥ రామ ॥

బ్యాండుస్వరము : ఆదితాళము.

మారుతి! యీరీతిధీరతఁ జేయగ శూరుఁడ వగుదువనుమ్మా నీవు! నీరావణు శ్రీరాముడు జేరివధించు నిక వెన్నడు ॥ మా ॥ శ్రీమోక్షగుండ పురీశుని కీర్తి యీభూమిని స్థిరముగ బొదలగవలదా ఆమాన్యుని సౌమిత్రిని క్రమిమాఱ దోడ్తెమ్ము శీఘ్రముగ ॥ మారు ॥

వ. రాముఁ డవతరించి రావణవధ చేసినాఁ డనుయశస్సుభూమి యందు స్థిరముగ నుండవలయును గాన, నీవు ద్వరగాఁజని వారిధి దాఁటి రామలక్ష్మణు లిటకువచ్చు సన్నాహంబులు జేయుము.

తో: ఈముద్రిక శ్రీరామచంద్రునకుఁ బ్రేమ మలరనిమ్మనుచు భూమిజ యిడి యిక బొమ్మనన మారుత పుత్రుఁ డామె పీడ్కొనుచు ॥ రామ ॥

వ వేగంబున వెడలి సువేలాద్రిపయి కెక్కియావలిదరికి నెగురంబోవు నంత :

క. హనుమంతుఁడు లంకాపుర
ముస జరిపినసటన సర్వమున్ప్రాసిముదం
బున రాముని కిమ్మని పా
వనిచేతికి నిచ్చె బ్రహ్మ బరమప్రీతిన్.

వ. ఆకమ్మగైకొని యానందించి బ్రహ్మసెలవుఁబొందిమారుతి కుప్పించి యెగసి యుదధి మీఁద వచ్చుచుండ ముప్పదియామడలదూరంబుననుండి వినంబడెడు ధ్వని విని యీగట్టున నున్న యంగదాదు లుప్పొంగుచు,

తో: కృతకార్యుండై కేసరిపుత్రుఁడు క్షేమంబుగ వచ్చెదిని॥ ధృతితో నటుగా దేని యింతధ్వని దేనివలన గలిగెడిని ॥ రామ ॥

వ. అని నిశ్చయించుచుండిరి. అంతలోనాంజనేయుండుస్వకృత కార్యనిర్వాహక ప్రభావంబున భావంబునఁ గించిద్గర్వసమావేశుండై వారిని లక్షింపక వేగంబునఁ గొంతదూర ముత్తరదిశకుఁ జని, యందుఁ దపంబొనర్చు మునివరేణ్యుని పురోభాగంబున ధరాతలం బదర దుమికి నమస్కరించి యనుచున్నాడు;

కేదార : రూపకతాళము.

మునివరేణ్య వినుమా, నను(గృపార్ద్ర)దృష్టిని గనుమా ॥ ముని ॥ జన కాత్మజ యుండెడుజాడను నే గని చనుదెంచితి ॥ ముని ॥ ఆహా దాహం బాపగ జాలను ॥ ముని ॥ నీరంబున్ గ్రోలంగన్ జారుజలాశయం మీ చేరువునుండిన జూపుము ॥ ము ॥ ఆలస్యము వలదు! చాలాశ్రమపడుదు! బాలింపగ దగుదు! సేలాగున జనుదు! యేలవే దయాలవాల ॥ ము ॥ శ్రీమీఁజన్ మోక్షపురస్వామిని గన నే జనవలె ॥ మునివరేణ్యా ॥

వ. అనివేడిన నమ్మౌని మౌన మూనినవానివలె నరోవరమున్న దిక్కుతర్జనితోఁ జూపిన నెటింగి; యుంగరమును గమ్మయుశిరో మణియు నచ్చటనుంచి దాహంబుదీర్చుకొని వచ్చులోపల —

గీ. ఒక్కకపివచ్చి రాముని యుంగరంబు
మునికమండులువందుంచి చనియె నంత
నాంజనేయుండు గ్రమ్మఱ నరుగుదెంచి
యంగుళీయక మెందున్న దనుచునడుగ.

వ. మునీంద్రుండు భ్యానంజ్ఞచేఁ గమండులువుఁ జూపె,

తో : అందు గన్నరామాంగుళీయకము అగణితముగ గనబడిన । నిందలి ముద్రిక లెవరివి నాయది యందున్నది యిమ్మనిన ॥ రా ॥

వ. మునీంద్రుడు చిఱునగవు గదుర నిట్లనియె :

బిలహరి : రూపకము. (ఘోరపా) వలె.

వినుము దెల్పెదను వనచరోత్తమా! సర్వంబును ॥ వినుము ॥ ఇంతకుమును పెంత మందియొ! వింతగ హనుమంతులు సీత నెంతయుఁ జూచి యేతెంచుచు నా చెంత జేరుదురు ॥ వినుము ॥ అచ్చట సీత యిచ్చిన ముద్ర యిచ్చట నుంప, నింకొకకపి మచ్చిక నీ కమండులువున హెచ్చితావైచెను ॥ వినుము ॥ దీక్షతో నీవు దెచ్చియుంచిన మోక్షగుండేశు ముద్రిక యోదోవీక్షించి దాని వేగగైకొను వృక్షచరాగ్రణి ॥ వినుము ॥

వ. అని తెలిపిన నాశ్చర్యంబుతో నాంజనేయుండు—

చ. 'మునివర సీతనాకిడిన ముద్రికయిక్కడఁ బారవైచి రా
మునికడ కెట్లు బోనగును మోదముతో? విపరింపు' మన్న నో
వనచర, యీకమండులు వవశ్యము శోధనజేసి నీవు దె
చ్చిన మొహరుంగరమ్ముఁ దగఁ జేకొని రాముని జేరఁబోవుమా!

వ. అనిన మంచిదని హనుమంతుం డంజలితోఁ గమండులువు నందున్న యుంగరంబు వెలుపలికితీయుట కారంభించిన నంతము లేకుండ వచ్చుచుండె నప్పుడు—

తో. అన్నిటి నరసిన నందు రామనామాక్షరసహితములగుచు । నున్న గనుంగొని యన్ని యందులోనుంచి యిట్లనుచు దలచు ॥ రామ ॥

కానడ : చాపుతాళము.

ఎందఱై రొకొ! ముందు నావంటివా ॥ రెంద ॥ సందియముదీరె డెందమునకు ॥ మున్నెందఱై ॥ ఎందఱోహనుమంతు లేతెంచి యుండగ నిందులో నాదేటిగణన యగు ॥ నెంద ॥ నేని దేదురభిమానముతో నుంటిఁగాని స్వతంత్రాధికారము లే దౌర ॥ యెం ॥ మోక్షగుండేపని ముద్రిక లెన్నగ నక్షయ మగుటయె సాక్షియో నీవర ॥ కెంద ॥

వ. అనియాలోచించి గర్వంబు సర్వంబు విడిచి మునికి సమస్కరించి సీడ్కొని శిరోరత్న లేఖనముల మాత్రము గొని.

గీ. తత్క్షణంబున నచటికి దక్షిణమునఁ
గలమహేంద్రగిరి ప్రాంతముల వసించి
ఆతురతఁదన రాకకు నరయుచున్న
యంగదాదుల కడకు నెయ్యమునఁ జనియె.

వ. అట్లరుదెంచిన యాంజనేయున కెదురుగఁ జని యంగదాదులు గాఢాలింగనంబుఁ జేసికొని సుఖాసీనుం జేసి.

జంఝూటి ; ఆదితాళము.

వాయుజా! పోయినకార్యము కాయో! పండో! కడువడి దెల్పుము ॥ వా ॥ చేయగ నీచేతగా దీ యవని నేదికలదు! పాయక బలవంతుఁడవు ॥ వా ॥ ధారుణీతనయను గనుగొని జేరి మిగుల భాషించితివా? నీవు ॥ వా ॥ శూరతను జూపితివా? కోరికతో మోక్షగుండ శ్రీరాముని జేరరమ్ము ॥ వాయు ॥

వ. అని యడుగుడు,

తో: కాంచితిసీతను; ద్రుంచితి వనము; భాషించితి రావణతోడ మించితి లంక దహించితి నిట కరు దెంచితి రామునిఁజూడ ॥ రా ॥

వ. అని యందఱుఁ గలసి రామదర్శనార్థముఁ జనువారయి యుత్సాహంబుతోఁ గదలిపోయి కొండొక దూరంబుననున్న సుగ్రీవుని మధువనంబునకుఁ జేరిన నప్పుడు,

తో: ఆఁకలిదప్పులు నడఁగ ఫలంబులు నారగించి తేనియలు, జేకొని పానము జేతుము సెల విచ్చిన నని యవ్వనచరులు! ॥ రా ॥

క. అంగద హనుమంతుల నడు
గంగావారియ్య కొనుచుఁ గానిమ్మనుడుౕ
బొంగుచు వనమున వానర
పుంగవ లటుచొచ్చి కొల్లపుచ్చిరి కడిమిౕ.

వ. ఇట్లు ఫలంబులు తిని తేనెలు ద్రావి కొమ్మలు విఱిచి కొలకులమునింగి యిచ్ఛా విహారంబుగ వానరులు వర్తింప వనపాలుఁడగు దధిముఖుండు కోపోద్దీపితుండయి,

తో: ఎవ్వరియాజ్ఞను నివ్వనవాటిక - నిపుడు జొచ్చితిరి మీరు? క్రొవ్వునెసగ నేఁగొట్టిన నడ్డంబెవ్వరనుచు పలుమారు ॥ రా ॥

వ. వారిని మర్దించిన, వారు పోయి మనవిచేయ హనుమదంగ దాదులు దధిముఖుని గుండె లవియునట్లు నిలిమిన, భయపడి వాఁడు వాపోవుచు సుగ్రీవునిఁ జేరి నమస్కరించి,

పీల్ రాగము : ఆదితాళము :

కపికులనాథా! కపికులనాథా! కృప జూడుము నను గపికులనాథా ॥ కపి ॥ అంగదుండును హనుమంతుడును పొంగుచు గొల్లపుచ్చిరివనము ॥ కపి ॥ వద్దని నేను వారి నినాగ. గ్రుద్దిరినన్ను గ్రుద్దెల్ల గాన ॥ కపి ॥ శ్రీమోక్షగుండ ధామునియాన నే మీకు దెలుప నేతెంచినాను ॥ కపి ॥

వ. అనిన నతండు మహానందభరితుండయి శ్రీరామునిదగ్గటి,

స్రగ్విణి; జానకిన్ గాంచియున్ సంతసం బందుచున్ । వానరుల్ గ్రమ్మఱన్ వచ్చు నట్లున్నదౌ! । కానిచో నేళికాకాననం బందునెంతేని వర్తింతులే ధీరులై దేవరా!

వ. సీతజాడ దొరకకుండిన దీనులై వత్తురు గాని ధీరులై వత్తురా! మధువనం బంతయు నిర్మూలంబు జేయుదురా! దాశరథీ! సత్కృపాశరధీ! యనిన రాముం డట్లైన వారినిఁ దృరగాఁ బిలిపింపుమనుడు, దధిముఖునిగాంచి సుగ్రీవుం డిట్లనియె;

తో: రామునికార్యధురంధరులై చని శ్రమపడి వచ్చిరి కాన ॥ నే మన గూడదు, ఇక జని వారల నిటకు దోడి తెమ్మనిన ॥ రామ ॥

వ. అతివేగంబునం దధిముఖుం డరిగి హనుమదాదులకు మ్రొక్కి సుగ్రీవునాజ్ఞ దెలుప నందఱుఁ గదిలి మహానందంబునం బోయి సుగ్రీవ లక్ష్మణయుతంబుగనున్న శ్రీరామ ప్రభువునకు సాష్టాంగ నమస్కారముచేసి వారియనుమతంబున నందఱు నాసీనులయిరి. అప్పుడు రాఘవుండు వారలం గని;

క. మీ రేగినకార్యము నెఱ
వేరినదా! యనుచురామవిభుఁ డడుగుటయున్
ఊరకయుండిరి యందఱు;
మారుతి యిట్లనుచుఁ బలికె మన ములరంగన్

కేదార : ఏకతాళము.

కాంచి వచ్చితిఁ గనులారా ॥ గాంచి ॥ మించి సంపాతి యెఱిగించు పథ
లంఘించి, లంకశోధించివివరించి భావించు సేవించి ॥ కాంచి ॥ భూరిమలినాంబరధా
మోక్షగుండవిహారుఁ బొగడెడికృశ శరీరఁ సువిచారఁ గతధీరఁ శ్రీమీరాఁ గాంచి ॥

వ అని విన్నవించిన శ్రీరామమూర్తి యాదరంబునఁ గాంచి యిట్లనియె :

తో : ఎటువలె బోయితి! వెటుల గంటివి! యెటువలె కృషించితివి! । కుటిల
నీ కెఱిఁగించిన ముచ్చటలు చెల్పుహితమతివి ॥ రామ ॥

వ. అని యడిగిన నాంజనేయమూర్తి యిట్లనియె!

గీ. స్వామి, మీయాజ్ఞ దలఁదాల్చి జనినమేము
ఘనుఁడు సంపాతితెలుప మార్గంబుదెలిసి
వరున నూ రామడలుగల వార్ధి నీదు
దయను వనచరు లరయఁగ దాఁటినాఁడ

వ. ఇటుల దాఁటి రాత్రికాలంబున లంకఁ బ్రవేశించి రావణ కుంభ కర్ణాదియో
గృహంబులెల్ల నరసి మీదేవిని గానక యశోకారామంబులోనికిఁ జని బరిశీలించిన నొకశిం
వృక్షంబుక్రింద—

తో : దీనాననయై దివ్యముగా రామ ధ్యానం బొనరించుచును । దానవకాం
దనజుట్టును జలమూని నిలువ నొప్పచును ॥ రామ ॥

వ. ఉండగాఁ గాంచి సీతగా నెఱంగి తదీయవృక్షంబుపై సూక్ష్మరూపంబున
తలిపేచి,

తో : తమకథ యాద్యంతము నుడివిన విని, ప్రమదంబున నసుజేరి । క్రమ
నంతయు గర్ణానందముగా వచింపు మనజేరి ॥ రామ ॥

వ. మీకును మాకును గలిగిన సాంగత్యవివరంబును మీవలనఁ బంపఁబడి
జనుటయు లోనుగా సర్వంబుఁ దెలిపి తమ ముద్దుటుంగర మిచ్చిన,

క. కనులను బలుమఱు నద్దుచు
దనతలమానికము నిచ్చి తగఁ బొమ్మనుచుఁ

నను బంపించెను మీతో
ననుమనె నొకకొన్నిమాట లాశ్రితవరదా !

జంఝూటి : ఆటతాళము.

పదినెల లాయెను బతిబాసి యనెను ; మదిలోన నిక దనను మఱవ వద్దనెను ॥ పది ॥ రెండునెలలకు రాకుండిన నికను ఖండించు నీదశగళుఁ డని యనెను ॥ పది ॥ క్రూరులపాల్ చేసి యూరకుండినను వీరధర్మముగాదు వినిపింపు మనెను ॥ పది ॥ రాక్షసులను జంపి రక్షింపు మనెను మోక్షగుండేశ్వర, మ్రొక్కితిననెను ॥ పది ॥

తో : కడువడితో నను గాకము జీరినఁ గర మలిగెనుగద మునుపు । ఎడబాపెను నను నీరక్కసుపై నేల గినియ వని తెలుపు ॥ రా ॥ ఆ లక్ష్మణుతో నను మనియెను బర్ణ శాలచెంతఁ దా ననిన । బాలవాక్యములు భావింపక దనుఁ బాలింపగ వేగమున ॥ రామ ॥

వ. అన్నతోఁ గలసి వచ్చి పుత్రమిత్రాదులతోఁ గూడ దశకంఠుని నులిమి తన చెఱబాపు మన్నది ; సుగ్రీవునితోఁ దన కష్టంబు దెలిపి చాల యడిగితి నని చెప్పుమన్నది. యంత నామెచే దీవన లంది సెలవుఁ బొంది.

క. నే వచ్చి పోవుసంగతి
రావణునకుఁ దెలువఁగోరి రయమున వనముల్
వేవేగమె పెకలించియు
దేవారుల గొందఱను వధించితి నలుకన్.

వ. అంత రావణుం డింద్రజిత్తుచేత నన్నుబట్టి తెప్పించి యడిగిన నాసంగతి యంతయు స్పష్టముగఁ జెప్పిన విని యలిగి నావాలంబునకు నూనెగుడ్డలు జుట్టించి కాలిపించిన వాలంబుఁబెంచి లంకాపురమంతయుఁ గాల్చివేసి సముద్రములో ముంచి తోక చల్లార్చుకొని,

తో : వారిధి దాఁటియు వానరులను గూడివచ్చితి మీసన్నిధికి । వారక యిదియే వార్తయనుచు నానవాలిచ్చిన గొని యులికి ॥ రామ ॥

వ. సుగ్రీవునిఁ గని రామచంద్రుం డిట్లనియె :

కాంభోజి : ఆటతాళము.

ఈమానికమ్మునే నెటులను వీక్షింతు ? నేమిచేయుదు భానుజా ! కామించి మాపెండ్లి కాలంబునందు మా మామకూతున కిచ్చె మంగళ ప్రదముగ ॥ నీమానికము । అప్పటినుండి

తనకొప్పులో ధరియించె; నిప్పటి కిటుబంపెను । యెప్పుడో మోక్షగుండేశుఁడ నా నీ
నాయొప్పుల కుప్పను దప్పకగాంతునో! ॥ ఈమానికమ్ము ॥

వ. అని పగచుచుండ,

క. వగవ బనిలేదు రాఘవ
మిగిలిన కార్యమున కింక మేకొనియనిలోఁ
బగతురను జంపి చెఱవా
పగ దగు మీదేవికదియ ప్రకృతంబగుటన్.

వ. అని సుగ్రీవుండు దెలిపిన దుఃఖంబు విడిచి ధైర్యంబుఁ బూని యాంజనేయుని
గాఢాలింగనంబు జేసికొని,

తో: శతయోజనవిస్తారం బగునాసాగర మెటు దాటితివి? అతి ధైర్యంబున
నాలంకాపుర మరసి యెటుల వచ్చితివి ॥ రా ॥

వ. అనిన హనుమంతుఁడు —

క. శాఖపైనుండి మఱియొక శాఖపయికి
నెగురుశాఖామృగంబుల కెంతశక్తి!
తలప నిరుమారు లాసముద్రంబుదాఁటి
వచ్చుటెల్లను నీప్రభావంబగాదె!

వ. అనిన రాముఁడు —

తో: అంతమంది యోధానుయోధు లా యసురులు గనుగొన హెచ్చు । చింతింపక
గాల్చితివి లంక యిది యెంతధైర్య మనవచ్చు ॥ రా ॥

వ. అనిన దానికి నాంజనేయుండు —

తో: జానకి నిశ్వాసంబున నీకోపానలమున నాలంక । కానకముందే కాలిపోయె;
నేఁ గాల్ప గలనె యకలంక ॥ రామ ॥

వ. అనువాక్యంబులకు శ్రీరాముండు పరమానంద భరితాంతః కరణుండై,

గీ. ఎంతకార్యంబుజేసితి విద్ధచరిత!
పరమబంధుఁడ వగుదువు పరఁగ మాకు!
నరయ మత్పద మిచ్చెద! నంతకంటె
నన్య మేమున్నదయ్య నీ కనుచుఁ బలికె.

వ. అంత హనుమంతుండు నయ వినయ భయంబులు దోపఁ శ్రీరామచంద్రునకు సాష్టాంగనమస్కారంబు లొనరించి యంజలి బద్ధుడై యనుచున్నాఁడు—

శహన : ఆదితాళము.

రామా భానువంశజలనిధిసోమ! శుభామలకామా ॥ రా ॥ హైమవతీజనతిదివ్య నామ! నుతామరక్షేమదా! ॥ రా ॥ నే మది దెలియగ నేరక దనుజవిరామ, యొక్కయపరాధ మొనర్చితి ॥ రామా ॥ జనకజ నీ కిమ్మని యిచ్చిన పావనముద్రిక యొక మునితాగైకొనె ॥ రా ॥ అమ్మని యెవ్వరో! క్రమ్మఱయియ్యక పొమ్మని బంపెను బొనగమోక్షపుర ॥ రా ॥

వ. అని పలికిన వాక్యంబులు విని రాఘవుండు నవ్వుచునిట్లనియె.

తో: నేనే ముని నై నిలిచితి నక్కడ నీగర్వం బుడుపఁగను వానరవర; యెవ్వరిపనిగా దది; మానుము సంశయ మికను ॥ రా ॥ ఇదిగో జానకి, యిచ్చిన యుంగర మిపుడు వ్రేల దాల్చితిని. ముదమున గనుమను ముద్రిక గనుగొని మదిలో గర్వము మాని ॥ రామ ॥

వ. శ్రీరాముండు సాక్షాన్నారాయణుం డని యాత్మనెంచి హనుమంతుం డిట్లను పొగడుచున్నాడు :

కీరవాణి : రూపకము.

తపనకులజ! దాశరథీ యపరాధిని గాపాడు ॥ తపన ॥ అపరిమి తానుపమవచో నిపుణ దీనపాలక ॥ తపన ॥ నిగమజాలమైనను నీ నిజము దెలియదనుచు విబుధు లగుణునిగా దలపోసి యనిలమునను గాంతురు నే నగచరుఁడ మూఢుఁడ దెలియగ నేర్తునె! మోక్షగుండనగరనిలయ నారాయణనామశర్మవినుత రామ ॥ తపన కులజ ॥

వ. అని యనేక విధంబుల బొగడిన శ్రీరామచంద్రమహాప్రభుఁ డానంద వార్థినోలలాడి హనుమంతునియందు పరిపూర్ణవాత్సల్యముంచె.

ఆశ్వాసాంతము : తోహర.

అనితాళ్వారు నారాయణకవి రామాయణమును హరికథను । ఘనముగఁ జెప్పెను గద యిది సుందరకాండము చిలుకును సుధను ॥ రా ॥ నది వినువారల శిహసౌఖ్యంబులు గొదవ లేక చేకురును । ముదమున దుదకును ముక్తి లభించును మోక్షగుండహరికృపను ॥ రామా ॥ రామా ॥

క. నాచేతనైనకాలఁదిని
జూచి రచించితిని దీని సుజనులు నెఱసుల్
దోఁచినయెడ దిద్దుదు రని
నాచిత్తములోన నమ్మినా ననయంబుఙా.

శ్రీ మోక్షగుండరామాయణము - హరికథ యందు సుందరకాండము
సంపూర్ణము.

శ్రీరామచంద్ర గురు పరబ్రహ్మణే నమః

అవిఘ్నమస్తు.

# శ్రీమోక్షగుండ రామాయణము

## హరికథ.

## యుద్ధకాండము

* * *

క. శ్రీరామమూర్తి యటుల న
పారకృపారసము చిలుకఁ బలికిన పలుకుల్
ధీరుండై వాయుకు
మారుఁడు పొగడంగఁ దొడఁగె మన మలరంగన్.

తోడి : రూపకము.

శౌరి కోరి భజియింతు సారసాక్ష! సేవింతు! మారకోటిమంగళ సుకుమార! అ
హార! మేరుధీర! ॥ శౌరికోరి ॥ మోక్షగుండఖేల! పృథువక్ష హేమచేల! ప్రతిప
మదవిఫాల! నిటలాక్షవినుతశీల। గుణజాలా! శ్రితపాలా! బుధరక్షక! నారాయణ
పక్ష! వరకటాక్ష। సమదరాక్షస నిచయాధ్యక్షశిక్షదీక్ష మోక్షదక్ష ॥ శౌరి ॥

క. అని కొనియాడిన రాముఁడు
మనమున నలరారి యపుడు మారుతి పిసఁగా
నినజుని గనుఁగొని పలికెను
అనఘా యిఁకఁ జేయవలయునది యెటు లొక్కో!

తో: వారిధి మన మెటువలెను దాటుదుము! క్రూరరాక్షసావళిని । పోరి యెట
జంపుదుమో! మన మెటు భూసుత గందుమొ లలిని ॥ రా ॥

వ. మహాద్భుతంబు కార్యంబు వచ్చెఁగదా యింక నేఁటితో యనిన నవ్వుచు నతం డిట్లనియె :

బేహాగ్ : ఆదితాళము.

రఘురామా । మీతోటులుచింత చేత బాధిరులరీతి బలుకుట వింత ॥ రఘురామా ॥ తలపుగలిగినమాత్రములోన సప్తజలధుల నింకింపఁ జాలుదు కాన ॥ రఘురామా ॥ మోక్ష గుండపురీశ । మీకెందు భూమండలమున నడ్డ ముండదందు ॥ రఘురామా ॥

వ. అని పొగడిన ధైర్యంబు బూని యాంజనేయునిం గాంచి,

క. వను మీఱిపోవునంతటి
వను లున్నవె జలధి నాదు బాణాగ్నులచేఁ
గను మిపుడె యింకఁ జేసెద
నని రావణుతలలు గూలు నట్టు లొనర్తున్.

వ. అయిన రావణుని బలాబలంబులను విశదంబుగా నీవు చూచినట్టుకు వివరింపు మన హనుమంతుం డిటనుచున్నాడు.

క. అలరును లంక త్రికూటా
చలశిఖరముమీఁద, లవణజలధికి నడుమన్;
బలువైనకోట లేదును
గల వంబరచుంబితములుగాఁజెలు వొప్పన్.

తో : తేటనీటిచే దేజరిల్లు నలకోటయగడ్తలుగలవు । కోట నాల్గుదిక్కుల వాకిండ్లును వానిచెంత సొంపొదవు ॥ రామా ॥

వ. పశ్చిమద్వారంబున గజారోహకులును, ఉత్తరద్వారంబున నశ్వారోహకులును, దూర్పుద్వారంబునఁ గాల్బలంబులును, దక్షిణద్వారంబున రథారోహకులును, గణనాతీతంబుగా గాచియుందురు, మధ్యకక్ష్యంబున జతురంగబలంబులవాడు లెక్కకు మిక్కుటంబుగాఁ గాచి యుందురు.

ఉ. బంగరుమంటపంబులును, బంగరుగోడలు, రత్ననిర్మితో
త్తుంగ కవాటముల్, విమలతోరణపఙ్క్తులుఁ జారువేదికల్

రంగు జెలంగు గేహములు, రమ్యపసంబులు మేటిబావులున్
బొంగుచు నొప్పలంకకును బోల్పఁగలేవు పురంబు లీయిలన్.

వ. ఇట్టియసాధ్యంబగు లంకానగరంబుఁ దమ కృపాబలంబుచే సుకరంబుగఁ బ్రవేశించి సీతాన్వేషణంబుఁజేసి వచ్చితి రావణుని జనంబులలోఁ జతుర్థాంశంబు నాచేత హతంబయ్యె, ప్రాకారమంటపాదులఁ గొన్నింటిని గూల్చి పురంబు దగ్ధంబుజేసి వచ్చితి. మహాప్రభో! యాలస్యంబు వలదు.

జాతిస్వరము : ఏకతాళము.

ఇఁక దండు వెడలు రాఘవా! కపిమండలితో రాఘవా! ॥ ఇఁక ॥ దండిరిపుల రాఘవా! నీవు చెండగలవు రాఘవా! ॥ ఇఁక ॥ ఇఁక జాగువలదు రాఘవా! సేన రాగ! బంపు రాఘవా! వారిసాగఁదోలు రాఘవా! కొనసాగుబనులు రాఘవా! ॥ ఇఁక ॥ ధర మోక్షగుండ రాఘవా! నీకుఁ మ్రొక్కు లిడుదు రాఘవా! తమరీక్షణంబు రాఘవా! నన్నెక్కి కదలు రాఘవా! ॥ ఇఁక ॥

వ. అని ఆంజనేయుం డుత్సాహంబునఁ బ్రోత్సాహంబు చేసిన సుప్వాంగి రాఘవుండు సుగ్రీవుని గని యిట్లనియె.

క. ఇది మంచిముహూర్తం బగు
నిదయా! యీలగ్నమందుఁ జని లంకకు జొ
చ్చెద సుతహితబలయుతముగ;
ఎదలించెద రావణాదివీరుల నెల్లన్

వ. కావునఁద్వరగా గజ గవయ గవాక్ష గంధమాదనమైంద ద్వివిదాదికపిసైన్యంబుల నెల్ల యుద్ధయాత్రకు వెలువరింపుము. సుగ్రీవా యని రాముం డనుజ్ఞయిచ్చిన హర్షించి సుగ్రీవుండు సెల వొసంగిన మాత్రంబున.

తో: తారకలను సికతంబులు వర్షపుధారలసైనగణింపఁ । దీరుగాని కపిసేనలసేనల దీరుమవా లెక్కింప ॥ రామ ॥

క. పదులును నూర్లును వేలును
బదివేలును లక్ష కోటి పదికోటులు న
ర్బుదములు న్యర్బుదములుగా
గౌదుపలు లేకుండ వెడలెఁ గోతుల గుంపుల్.

తో: చెట్లులనుండియు గుట్టలనుండియు గట్టులనుండియుఁ గపులి! పుట్టబగిలి నట్టట్ట హాసమునఁ బొదలుచుఁ జేరెను బ్రబలి ॥ రామ ॥

వ. ఇట్లు వానరసేనలు నేల నింగియు దిశలను బట్టకుండ నసంఖ్యాకంబుగాఁ గిచకిచధ్వనులచే దిగంతరాళంబు భేదిల్లఁజేయుచు వచ్చిన, సంతసించి యుద్ధయాత్రకు సాగఁ దోలు మని నీలున కాజ్ఞాపించి, రాముండుహనుమంతుని, లక్ష్మణుం డంగదుని, నెక్కి సుగ్రీవుండు దోడరాఁ, బ్రవాహం బుప్పొంగి పాఱినట్లు గతిపయ ప్రయాణంబుల నచ్చినముద్రతీరం బగు మహేంద్రాద్రికిఁ జేరి రాముం డనుచున్నాడు.

కళ్యాణి: రూపకతాళము.

వనధి దాటి లంకజేర వశమె మనకును! హనుమంతుం డెటుబోయెనో! మనమున కాశ్చర్యం బగు ॥ వనధి ॥ నింగి ముట్టి వెడలు తరంగంబులు నుడులు రంగుగ వెంబడి వెంబడిఁ బొంగుచునేతెంచెడు నీ ॥ వనధి ॥ భీకరమకరములు, బలు లేకగుమీనములు ప్రాకటముగ నపుడపుడు పైకిని బొడగట్టి మునుగు ॥ వనధి ॥ ఎంతదూర మరయ దీనికంతు లేదు తెలియ! సంతతమును మోక్షగుండకాంతుఁడు వేన్నెయుండిన ॥ వనధి ॥

వ. అని శ్రీరాముండు డోలాయమానమానసుం డగుచుండ లక్ష్మణుండు —

క. శ్రీరామ నీదు సేవా
పారీణులె దాఁటుచుంద్రు భవసాగరమున్
ఊరక బలికెదుగా కీ
వారిధి యన నెంత నీకు వశమను టరుదే!

వ. అని పలుకుచుండ నింతలో సూర్యాస్తమయమైన సైన్యంబులెల్ల నియామకస్థలంబుల విడిసిరి. రామ లక్ష్మణ సుగ్రీవులు గాలోచిత కృత్యంబులు దీర్చి యొక్కచో శయనించి జానకిని దలఁచుకొని రాముఁడు —

తోడిరాగము: ఆటతాళము.

ఎన్నడు గాంతునో ని న్నిక జానకి! కన్నులకు బొడగట్టుదు నక్కట! ॥ యె ॥ ఒంటిగ నుండఁగనోపని నీకిటువంటి విపద్దశ వచ్చెనె భామిని! ॥ యె ॥ బాపురె! మనలను బాపినక్రూరుని నాపగదీటగ రూపడగింపనె! ॥ నె ॥ మోక్షగుండపురాధ్యక్షుఁడనయ్యును రాక్షసమాయకు భ్రమపడిపోయితి ॥ నెన్నడు ॥

వ. ఇటుల విలపించుచున్న రామచంద్రుని కుపచరించుచు లక్ష్మణ సుగ్రీవు లిటు లనుచున్నారు.

శా. నిత్యానందమయుండ వై తనరు నీనేర్పుల్ విమర్శింపఁగా
సత్యాధీశున కైన దీఱ దనుచో, సర్వేశ, మే మెంత! నీ
వత్యంతంబును దుఃఖ మొందెదవు జాయాభ్రాంతి లీలార్థమై?
ప్రత్యక్షంబున వెల్గు నీచెయిదులుఁ జోద్యంబులౌ నీశ్వరా!

వ. లోకవిడంబనార్థము అవతరించినాఁడవు గాన లోకానుగుణముగ నటించుచున్నాఁడవు. నిదురింపు మన్నా అని పలికి యందఱు నిదురించిరి. అంత నుదయంబయిన నిక్కడ లంకలో రావణాసురుండు గొలువుకూటంబుజేరి మంత్రుల నందఱ రావించి యిట్లనుచున్నాఁడు

ఆ. మంత్రులారా, వినుఁడు మర్కటం బొక్కటి
లంకిణిని జయించి, లంకఁ జొచ్చి,
వనము బెఱికి వైచి, వైదేహి బొడగాంచి,
పురముఁ గాల్చి దనుజవరులఁ ద్రుంచె.

తో: మనచే జిక్కియు మఱి వంచకుడై వనధి దాటి వేగమున జనియె: రామ లక్ష్మణులఁ గపుల జయ్యనఁ దేఱగ మోదమున ॥ రా ॥

వ. చనుదెంచి సముద్రతీరంబునం విడిసినట్లు చారులవలన నే వింటి నెటులనైన రాముండు వారధి దాటి రాకమానడు. దీని కేదేని నదుపాయంబు యోజించి తెలుపుఁడని పలికిన మంత్రు లుద్దండంబున బొబ్బ లిడుచు నిటు లనుచున్నారు

కేదార : ఆదితాళము.

ఏల యిట్టులడీలువడియెదవు రాక్షసరాజ! ॥ యేల ॥ చాలగా దిక్పాలుర నవలీల గెలిచి నట్టిబలశాలివి శాత్రవగహనకీలివినీవు! బేలరీతిబలుక కింకఁజాలు మమ్ము బంపిన నీవేళబోయి వగతుర గీలాభీల మొనరింతుము ॥ యేల ॥! ఖండితముగను మోక్షగుండ శ్రీకోదండపాణి దండఁజేరి దండికోతిపిండుతో గూడఁ జెండి పంచుకొని మేసువండి కడుప నిండ దిని, నిండువేడ్కతోడ వత్తు ముందుము నీ డెందమున ॥ నేల ॥

వ. అని మంత్రులు పలుకు నంతలో నింద్రజిత్తు ప్రహస్త శతమాయ మహాకాయ అతికాయ మకరాక్ష యూపాక్ష విరూపాక్ష ధూమ్రాక్ష శోణితాక్ష ఖడ్గరోమ వృశ్చికరోమ సర్పరోమకంపన అకంపన కుంభ నికుంభ మహోదర అగ్నికోపన దుర్ముఖ దేవాంతక

విద్యుజ్జిహ్వాదిరాక్షసవీరు లక్షయబలశౌర్యధైర్యంబు లవార్యంబు లగుచుండ సింహనాదభుజాస్ఫాలనంబులు చేయుచు రావణబ్రహ్మాకనుచున్నారు.

బేహాగ్ : ఆదితాళము.

ఇక మానుము మానుము నీ వీచింత! ఆమానవులు వానరులన నెంత! మనము చూచి చూడకుండ విడువ నాఁడు వాడు లేచి తప్పించుక పోయినాడు! మే మేచి వెంబడిఁ బడి నేఁడు వారిపీచమడంచి వచ్చెదము చూడు ॥ మిక ॥ పటుశౌర్యవిక్రమధారు లనుచు, బహువార్య శస్త్రాస్త్రనిపుణు లనుచు, గనకాహార్యసమధైర్యవరు లనుచు, ననుర వర్య, మాప్రతాపములు గనుచు ॥ నింక ॥ పెద్దకొండలు చిండిచేయుదుము! అఖండలాదుల దోలెదము! కపితండముల నుగ్గుజేయుదుము! మోక్షగుంతహరిని బట్టి కూల్చెదము ॥ ఇకమా ॥

వ. ఇంతలోఁ గుంభకర్ణుం డాదినంబున నిద్ర లేచియుండియన్న దర్శనంబునకు విభీషణయుతఁబుగా వచ్చిన, గారవించి వారికి దగిన పీఠంబుల నివసింప ననుజ్ఞయిచ్చి, రావణుండు కుంభకర్ణున కిట్లనియె :

క. తమ్ముఁడ, నీ వెఱుగవు; చి
త్రమ్మగు నొకవార్త గలదు; రాముఁ డనంగా
నిమ్మహిఁ గల డొకభూపతి
నమ్ముదమున వానిభార్య జానకి యనఁగన్.

వ. దండకకాననంబున వారిద్దఱుండఁగా నతని నేమఱఁజేసి యా సీతను, దెచ్చి కూడయత్నించుచున్న నొప్పనందున రాక్షస స్త్రీలఁ గావలిపెట్టి,

తో : మనయశోకవనమున నుంచిన, రాముని ప్రేరణమున మొన్న వనచరుఁ డొక్కఁడు వచ్చి చూచి పురమును దహించి తాఁజన్న ॥ రా ॥

వ. వాఁడు జాడఁ జూపించగా ననేకవానరులఁ గూడి రామ లక్ష్మణులు వచ్చి సముద్రఁబున కవ్వల నిడసి యున్నారు. దీనికేది యోజన యన, నవ్వి కుంభకర్ణుండు—

ఝంఝూటి : ఆటతాళము.

రఘురాముని సామాన్యనరు డని రావణా యనకు ఓ రావణాయనకు! నిర్లక్ష్యముగ గనకు ॥ రఘురాముని ॥ గోవిందుఁడేయతఁడాయె; లక్ష్మినుందరియే సీతాశ్రీసుందరియేసీతా వరసుగుణవిఖ్యాతా ॥ రఘురాముని ॥ అఘునునిసతి జరబట్టుటే రాక్షసులు చెడిరనుకో!

రాక్షసులు చెడిరనుకో! ధరమనుటలే దనుకో ॥ రఘు ॥ శ్రీ మోక్షగుండ బురీశ్వరుసిల గక్షయేటికి! బ్రతికక్ష యేటికి! నరిగాదు మాటికి ॥ రఘురాముని ॥

వ. అని కుంభకర్ణుం డనునంతలో మహాపార్శ్వుం డను రాక్షసుండు రావణునితో నిట్లు లనుచున్నాడు.

క. సీతను గూడుట కై నీ
వీతీరున భీతినొంద నేలా! బలిమిన్
బ్రీతిగఁ బట్టి రమించిన
నాతెఱప మ ఱెమిచేయు నయ్యా! యనఁగన్.

వ. అమ్మాటను మనంబున నానందంబునొంది మహాపార్శ్వుని జూచి యిసుమంత దీనత్వంబుదోఁప రావణుఁ డిట్లనుచున్నాఁడు.

జంఝూటి : ఆదితాళము.

వినరా మహాపార్శ్వ. విశదముగాను! మును బ్రహ్మనభ కేనుబోపు చుండగను ॥ వి ॥ పుంజికస్థల యను పుష్పబోణిని రంజింప బలిమిమై రమియించితిని ॥ వినరా ॥ అది విని మోక్షగుండాధీశనుతుడు నెదలో గినిసి శపించె నాయజుడు ॥ విన ॥

వ ఇది మొదలగు మది నొప్పని మదవతుల గదిమి మదన కదనంబునఁ బొద లించితివేని నీపదితలలు పదివదులతునియలై పుడమిం బడుగాక యని వనజభవుండు శపించె గాన, మునుపటివలె విచ్చలవిడి మచ్చకంటుల జోలికి బోజాలరా! యనునంతలో సుగుణ భూషణుండగు విభీషణుండు మృదుభాషణంబుల నన్నను నభిముఖుండై యిట్లనుచున్నాఁడు.

హిందూస్థాని తోడి : అటతాళము.

అన్న! నే నొనరించు విన్నప మాదరింపుము రావణా। తిన్నగా నీ మంత్రివర్యులుఁ దెలుప నేరరు రావణా! ॥ అన్న ॥ సీతను దెచ్చుట నాశనహేతు వనుకో రావణా! నీతి మాలి జరించుటే కడుపాతకంబగు రావణా! ॥ అన్న ॥ రాక్షసులను నమ్మి మది గర్వంబు నొందకు రావణా! మోక్షగుండాధీశు నెదిరి మోహరింతురె! రావణా! ॥ యన్న ॥

వ. అని సుడువు విభీషణుని దూషణ వాక్యంబులకు రోదించి భీషణంబుగా నవ లోకించియశనిపాతసదృశంబు లగు పరుషవాక్కులతో నింద్రజిత్తు గద్దించి కొలువుకూటంబు పద్దరిల్లునట్లుగా నిట్లనియె :

అఠాణ : ఆదితాళము.

నన్నుఁ బేలగ గంటివా! నన్ను - గన్నతండ్రినియంటివా! నీవు ॥ నన్ను ॥ పిన్నబ్బ యని యూరకున్నను గాని లేకున్ననోరుతునే నీవన్న మాటలకు ॥ న ॥ గిరి జగడము జేయఁ గోరి యేతెంచి సభవారిముందర యేమో దూరి తెలిపేవు నీవు ॥ నన్ను ॥ భీమబలమున సుత్రామాదులను గెలిచి యీమహి నింద్రజిత్తు నామము దాల్చినట్టి ॥ నన్ను ॥ మోక్షగుండే శ్వరుని పక్షముగాను నిలిచి రాక్షసవీరుల నుపేక్షగా నాడెదవు ॥ నన్ను ॥

తో : వంచుదు నాదిక్పాలకులను! దొర్లించుదునా కులగిరుల! దంచుదునా దిగ్దంతుల బట్టి కలంచుదునా యంబుధుల ॥ రా ॥ కొట్టుదునా యుడుకోటులురాలఁగ! మట్టుదునా యురగులను! బట్టుదునా శశిభాను బింబముల! నెట్టుదునా ప్రమథులను ॥ రా ॥

వ. వీరందఱు వినఁగ నాముందర రఘునందనుని వందిబృందంబులచందంబున నభినందించెదవు తొందరపడకు కపి సందోహంబులఁ జిందరవందరఁ జేసి యమ్మనుజుల ద్రుంచి మాతండ్రిడెందంబునానందంబు నొందింపకున్న నే నింద్రజిత్తునా! విభీషణా! అపృచ్ఛసంభాషణా! యనిన పలుకులు ములుకులవలెఁ జెవిసోకిన నులికిపడి కనుకొలకులు గెంపులొలుక నలుకతో విభీషణుండు —

కళ్యాణి : ఆటతాళము.

రణభీషణుడైన రాముని విక్రమ మణుమాత్రమును నెఱుగ కాడెద విటుల; ఘనిమిషేంద్రు జయించునటుగాదు దహనాంతకాసురుఁ డనుప పవనుల గెల్చినటుగాదు! ధనదేశులను బైకొని సదా బెదరించినటుగాదు! నీ కెఱుక లేదు! దనుజులను బొలియింపఁగా నా వనజనాభుడు రఘుకులంబున జననమొందెను రాముఁ డనఁగా; మనుజ మాత్రునిగా దలంతువొ! ॥ రణ ॥ పుడమి నా రావణుకడుపు జెడ బుట్టితివి నాకొడుకవు గా వీవు! కులనాశకుడవు చెడుగుపనులకుఁ జెడ్డ వయినావు! సీకూతలకు లోబడినను దశకంధరుఁడు జెడిపోవు! శ్రీ మోక్షగుండ యొడయఁ డెక్కువ యనుకొనగలేవు మీకిక జాపుతడవుజరుగదు। గపులగూడియు వెడలి రాముఁడు లంక జొచ్చియు గడియలోపల మృత్యువాతను బడగ జేయక యూరకుండడు ॥ రణ ॥

వ. ఇట్లు పలుకుచున్నంత రావణుండు నితాంతకుపితస్వాంతుండయి దిగంతంబులు ఘూర్ణిల్ల నిట్లనియె :

క. మానవులను వానరులను
బూనికతోఁ బెద్దజేసి పొగడెద విచటన్
మానవభోజను లగునీ
దానవులను నరకుగొనవు తగునా నీకున్!

ఉ. రాముఁడు దైవ మంచును దిరంబుగఁ బల్కెదు! దైవమైన దా
భూమిజఁ గూడి కానలకుఁ బొక్కుచువచ్చునె! నేనువేగమే
ధీమతి నేగి సీతగొనితే నెదిరించి జయింప కుండునే!
నీమదిఁ గానలేక మము నిందయొనర్తువుగా విభీషణా!

తో: దాక్షిణ్యంబున దమ్ముడవని యీతప్పును గాటితిగాని, కక్షగట్టి పరపక్షము లాడిన శిక్షింతును దయ మాని ॥ రా ॥

వ. అనిన విభీషణుండు—

తో: ఈ రాక్షసకుల మెందుకు జెఱుతువు? ఏలనీవు జెడియెదవు? శ్రీరామునకును సీత నిచ్చి రక్షింపు మనుము బ్రతికెదవు ॥ రా ॥

ఫరజురాగము : ఆదితాళము.

రామామణి నిమ్మల రామునకు నిఁక ॥ రామా ॥ నా మాటలు వినినను బ్రతికెదవు! నీ మతమును మానిన మేలు సుమి ॥ రామా ॥ రాముఁడు నీదు శిరంబులు వడిగా భూమిని గూల్పక ముందుగను నీవు ॥ రామా ॥ తరుచరు లంబుధి దాటి వచ్చి యీపురమును జెఱపక ముందుగను నీవు ॥ రామా ॥ పుడమి మోక్షగుండ, యొడయుని తమ్ముని కడుకోపాగ్నులు వెడలక ముందే ॥ రామా ॥

వ. ఇట్లు నొక్కి చెప్పిన రాక్షసరాజు కోపోద్దీపితుండై దిక్తటంబు లటునిటుఁ జలింపఁ, బెటబెటఁ బండ్లుదీటుచుఁ గుంభినీ తలం బద్రువఁ, గుంభీంద్రుండు మ్రగ్గ నంభోనిధు లింకఁ, గుంభినీధరంబులు పెదర విజృంభించి యిది యొకవిలయకాలంబో! యని సభాసదులు భయభ్రాంతస్వాంతు లగుచుండ దిగ్గన గద్దియడిగ్గ నుఱికి వేగంబ కర వాలంబు జళిపించుచు భీషణంబుగా విభీషణువ్రేయఁ బోయి, మాని, వక్షస్స్థలంబు వయి నొక్కఁ తన్ను దన్నిన వజ్రనిహతం బగు గిరింబోలె నేలంబడిలేచిన తమ్మునిఁ జూచి,

ఫీల్ : ఆదితాళము

పోరా! పోరా! యిక లేచి పోరా! చాలును పోరా! ఛీ యిటు ॥ పోరా ॥ పోరా! యిక మాపురిలో నుండక, పోరుమాసి కాపురములేచి ॥ పో ॥ పట్టుగ రాముఁడు జుట్టమైన నీవట్టున జని మొఱవెట్టుకొనగ లేచి ॥ పో ॥ తమ్ముఁడ వని నిను నమ్మ దగదు చిత్తమ్మున దెలిసితి! దాయాదివి లేచి పోరా ॥ మోక్షగుండకమహాత్ముని నిన్నును శిక్షింపక నే నీక్షితి విడువను ॥ పోరా ॥

వ అని ఖండితముగాఁ బలికినవిభీషణుండు రోషించియనలుండు నలుఁడు, హరుఁడు, సంపాతి యనునలుగురు సచివులతోడఁ బ్రయాణంబయి కాకుత్స్థుని కొలువునకుఁ జనువాఁడయి,

తో : నీకు హితమ్మును నే నెఱిగించినఁ గైకొనవైతివి నేఁడు; । తాకి వచ్చినంతట నైనను జిత్తమున దలంతువునాడు ॥ రాము ॥ ఇదివఱకే నిను విడువ దలచి నే నేమో నిలిచితిగాని । యిదిగో పోయెద నినకులేశు సేవించుటకయి మది బూని ॥ రామ ॥

వ. అని తత్క్షణంబు లేచి తనతల్లి మందిరంబునకుఁ జని నమస్కరించి యిట్లను చున్నాఁడు.

క. అమ్మా రామునితో స
ఖ్యమ్మున మను మనుచుఁ బఙ్క్తికంఠునితోనే
నెమ్మది బోధించినఁగో
పమ్మున నాయెడఁదఁ దన్ని పరిభవపఱిచెన్.

వ. ఈ దురాత్మునిఁ గనుచు నే నిం దుండజాల కరుణాశరధి యగు దాశరథి మఱుగుఁ జేరెద, సెల విమ్ము మాతా! త్రైలోక్యవిఖ్యాత! యనిన గైకసి చింతాక్రాంతయయి కొంతవడికి వివేకంబు నొంది యిట్లనియె :

బ్యాండుస్వరము : ఆదితాళము.

పోయిరా విభీషణా! యిఁకఁ బొమ్ము సుగుణభూషణా! పాయక శ్రీరామభద్రుని కృపను దీర్ఘాయురారోగ్య మహైశ్వర్యములు గల్గు ॥ పో ॥ నిన్ను జేరదీయును; శర ణన్నవారి గాచును; మున్ను నీతండ్రిచే విన్నా : నయోధ్యలో వెన్నుడు రాముఁడై వెలయు నటంచును ॥ బోయిరా ॥ మోక్షగుండవాసుఁడై మునిముఖ్యహృదయ భానుఁడై రాక్షసులను గూల్చి, రావణు వధియించి, యీక్షితి లంక నిన్నేలించు నిజముగ ॥ బోయి ॥

వ. ఇట్లు దీవించి పంపిన నామె సెలవుగైకొని, మంత్రులు దాను ప్రయాణంబయి,

తో: రావణదనుజుని ప్రాణపంచకం బీవిధి జను నన్నటుల । వేవేగంబున నెగిరి వియత్తలవీథిని బోయిరి యిటుల ॥ రామ ॥

క. అంబుధిని దాటి వారలు
నంబరపదమునను రాఁగ, నది గనిగపి సై
న్యంబులు భానుజునకుదెలు
పం బరికించియును రామభద్రున కనియెన్.

కమాచ్ : ఆదితాళము.

వచ్చేవారెవ్వరో! పరికింపుము రామ! ॥ వచ్చే ॥ హెచ్చుగను జెచ్చెరను నిచ్చటికి విచ్చలవిడిగా ముచ్చటలాడుచు ॥ వచ్చే ॥ దనుజపతి యనుమతిచే మనపయికిఁ జనుదెంచు నరాశనవరులేమో! ॥ వచ్చే ॥ మోక్షగుండాధ్యక్ష, ముమునీక్షణమె దీక్షతో బంపిన శిక్ష యొనర్తుము ॥ వచ్చే ॥

వ. ఇట్లు వీ రాలోచించుచుండ దివినుండి విభీషణుండు—

తో: రావణు ననుజుఁడ దావకభక్తుఁడ నేవిభీషణాఖ్యుఁడను! దేవరవారికి దేవి నియ్యుమని తెలిపిన వినమని దాను ॥ రామ ॥

ఆ. నన్ను నుగ్రదృష్టి గ్రన్నననారసి
తన్నెఁ గొలువులోన దానవేశుఁ
డంత నతని విడిచి యాప్తమంత్రులఁ గూడి
వచ్చినాఁడ నీదు ప్రాపుఁగోరి.

కేదార : రూపకతాళము.

దేవ దేవ! సేవకుండఁ గాపు మింక నన్ను! గరుణాకర నీవు దప్పరక్షకులు లే రిక; భావములో భావింపకుమా వేఱుగ ॥ దేవ ॥ అక్షయ నారాయణదా సాఖ్యమనః కంజవరనదనా । మోక్షగుండవాస! శశివదనా! రాక్షసుఁడని శిక్షింపకు రక్షింపుము ॥ దేవా ॥

వ. అని పలికిన వాక్యంబులకు రాముం డాలోచించుచుండ సుగ్రీవుండు గ్రమ్మఱ నిట్లనియె.

తో. అసురులమాయల కంతులేదు మీదెసకు వచ్చుచున్నాఁడు! పసమీఱగఁగా పొడఁ దగున చంపగ దగునా! యననపుడు ॥ రా ॥

క. శరణన్న పగతునయినన్
ఖరకరకుల సంభవులకుఁ గాచుటయ వ్రతం
బరియగురావణు తమ్ముని
నరయుదు సౌమిత్రి బోలె ననుజప్రేమన్.

వ. అట్లయిన వీఁడు వంచించునని భయపడుదు వేమో! సుగ్రీవా!

తో: క్షణమాత్రంబున జగము సృజింపఁగ బెనుప నడప నోపి తనరు కర్తనగు నను జెనకఁగ నెటుదనుజుల కగు రేపి ॥ రా ॥

సం. వ. అనుచుండ నాంజనేయుం డిట్లనియె.

ముఖారి : ఆదితాళము-(వలదచ) వలె.

తగదు వీనిపై నలుగు శ్రీరామచంద్ర ॥ తగదు ॥ పగవానిగఁదలపగ వలఁదీతఁడు సుగుణాఢ్యుఁడు ఘనుఁడు దగునీతిపరుఁడు ॥ తగదు ॥ దూతను జంపిన దోషమనుచు జ్యేష్ఠ భ్రాతకుదెలిపె నాడు; విడిపించినాడు ॥ తగదు ॥ మనపక్షము నగుమాటలు బోధించు మను జాశనపతితో వెఱవక ధృతితో ॥ తగదు ॥ మోక్షగుండేశ్వర, మోసము రా దిక దీక్షగ నభయ మిడుము ॥ తగదు ॥

వ అని తెలిపిన హనుమంతుని పలుకుల కలరి జలజాప్త కులుండు జలజాప్తనంద నున కిట్లనియె :

తో : అభయం బిచ్చెద నావిభీషణుని సరసితోడి తెమ్మనఘా! సభయుల నెల్లను సమ్మానించుట ప్రభువులవని పొమ్మనగా ॥ రా ॥

వ. వల్లెయని సుగ్రీవుండు పయి కెగిరి విభీషణుని మంత్రి యుక్తంబుగా గొనివచ్చి రామునిం జేర్చి నంతఁదత్పాదారవిందంబుల శిరంబు మోపి సాగిలిపడి.

బిలహరి : ఆదితాళము.

శరణు దివాకరకులజా! చరణవినిర్జిత వనజలజ! ॥ శరణు ॥ ఇతరము నే నెఱుగ నయ! గతి నీ వనుచును గనినాను ॥ శరణు ॥ అక్షర, నాకభయమిడి మోక్షగుండాధిప, బ్రోవు వడి ॥ శరణు ॥ శ్రీయుత నారాయణదాసాయతహృదయ విహార సదా ॥ శరణు ॥

భుజంగ ప్రయాతము : నమోనంతరూపా! కనచ్చక్రదీపా! నమోవేదపాదాను నాదానుమోదా! నమోలోకనాథా! ఘనజ్ఞానబోధా ॥ నమోభూతరక్షా! సనందాదిపక్షా ॥

కీర్తన : ఆదితాళము.

నీమయ మంతయు రామా! రామా! యేమిలేదు గద రామా! రామా! ॥ నీ ॥ సోమసూర్యులును, సురలు దిక్పతులు, భూమిముఖాఖిల భూతచయములు ॥ నీ ॥ మును లును బుధులు, త్రిమూర్తులు గ్రహములు, దనుజ-మనుజ-మృగతరు విహగములు ॥ నీ ॥ నిగమాగమములు నిఖిల విద్యలును నగములు వార్ధులు నదులును, నిధులు ॥ నీ ॥ మోక్ష గుండమున సాక్షిగ వెలసిన యక్షర, నారాయణకవి వినుతా ॥ నీ ॥

వ. అని పొగడిన యానందించి శ్రీరామమూర్తి కృపారసం బొలుక యిట్లనియె:

తో: దానవ నీప్రార్థనను మెచ్చితి గాన, నీదుమదిలోన। దేనిగోరి నను దాని నిచ్చెదను దెలుపు మనఁగ నతఁ డనెను ॥ రా ॥

క. నీవరరూపము గంటిని
గావున నావంటి శుచియు ఘనుఁడును ధన్యుం
డీవిశ్వంబునఁ గలడే!
యీవే నీధ్యానమును వివేకము ముక్తిన్.

కాంభోజి : అటతాళము (నిన్ను నమ్మి) వలె.

కోర నేర వేఱు కోరికలు మది; జేరి నీదుసేవ జేయుభక్తిదప్ప ॥ గోర ॥ ఘోరదు, ర్వార నిస్సారసంసారాబ్ధిమాటి మునింగెడు వారి సాంగత్యము ॥ గోర ॥ నారాయణశర్మా ధారా, మోక్షగుండాగార, నీదుకొల్వుకన్న నన్య మేమి ॥ కోర ॥

వ. అని వేఁడిన రాముండు సంతసించి.

ఉ. నన్నుభజించుభక్తుల మనంబులనే విహరింతు సీతతో
నెన్నిక నీకు భక్తునకు నిచ్చితిఁ గొమ్మభయంబు నింక నీ
యన్నను బిల్కుమార్చి నిను నాదృతి లంకకురాజు జేయుదుః!
నన్నుతిఁగన్న భానుకుల జన్మల ఖ్యాతికి వన్నెవెట్టుదుః.

వ. అని తెలిపి హనుమంతునిచేత నిసుకతో లంకాపురిని నిర్మింపఁజేసి యందు విభీషణుని గూర్చుండఁబెట్టి లక్ష్మణుని వలన సముద్రోదకంబులు దెప్పించి యతని కభిషేకంబు జేసి,

కీర్తన : త్రిశ్రజాతి - (సంతతంబున) వలె.

ఓ విభీషణా! యోవరభూషణా ॥ యో ॥ నీవు మనుము చిరంజీవి వగుచు నిక నావచనమ్మున ॥ నో ॥ ఎందాక రవితార కేందులునుందురో యందాక లంకారాజ్యం బేలుచుండుదు ॥ వో ॥ ఎందాక నాకథ యీ యుర్వి నుండునో యందాక లంకారాజ్యం బేలుచుండుదు ॥ వో ॥ మోక్షగుండేశుని ముఖ్యభక్తుడవగు చక్షయలంకారాజ్యంబేలుచుండుదు ॥ వో ॥

వ. ఇట్లు విభీషణునకు బట్టంబుగట్టి దీవన లిచ్చిన పిమ్మట, సుగ్రీవుండు విభీషణునితో—

తో : రాముఁడు నీకును రాజ్యమొసగె గద । రావణవధకును నీవు! స్వామిపనికి బానట యయి నిలువగ వలె ననగను సుగ్రీవు ॥ రా ॥

వ. కనుంగొని విభీషణుం డిట్లనుచున్నాడు;

కీర్తన : రూపకము.

అందటికిని దోడగునానందమయునకు నింపొందగ దోడ్పడగ శక్తియున్నదె మనకు! ॥ నందటి ॥ మీ సమానముగను నేను మెలగ నేర్తును రామదాఁసుడనై, యెపుడు సేవ దవిలి సేతును ॥ అందటికి ॥ ప్రీతిగను మోక్షగుండవిభుని పనులలో నేను జేతనైన రీతి దిరిగి జేతునవనిలో ॥ నంద ॥

వ. అని యిట్లు చెప్పుకొనుచుండునంతలో రావణుని పనుపున శుకుండను చారుండు వచ్చి యాకాశవీథిని నిలిచి యందఱు వినుచుండ సుగ్రీవున కిట్లనియె :

తో : రావణు డెఱుకపఱువు మనువాక్యము నీవిధమగు విను మినజా! వేవేగము! కపివీరుడవై నరు సేవింపగ నేల యనుజా! ॥ రామ ॥ నన్నుజేరుమా, యన్నివిధంబుల మన్నన జేసెద నేను; గ్రన్నన నీలంకకుఁ జనుదేఱుము కపిసైన్యంబులతోను ॥ రామ ॥

వ. అని తనమాటుగాఁ బలుకుచున్నాఁ డను నంతలో వనచరులు జుట్టుకొని యొక్క తన్ను తన్నిన, దూతను పరాభవించుట నీతిగా దని రాముం డుడిపె. అంత వాఁడు మరల సుగ్రీవునితో రావణున కేమి చెప్పుమ నవవుడు,

కీర్తన : ఆదితాళము.

అన్న వాలి నాకు; నతడు మొన్న రామునిచేతఁ జచ్చె । నన్నును నేననెడుమాట యధమ । మానరా! ॥ యన్న ॥ లంకకు రమ్మని యక లంకముగఁ గోరినావు; లంక కేగు దెంచువిధము లలినివినుమురా ॥ య ॥ మోక్షగుండవిభుని మోనవుచ్చినావు కాన నిన్ను శిక్ష జేయ రాముగూడి చేర వత్తురా ॥ యన్న ॥

వ. అని చెప్పుము పోరా! రాక్షసాధమా! యని పలికిన, వాఁడు చావుతప్పించు కొని లంకకేగులోపల శార్దూలుం డను రక్కసు వలనఁ గపిసైన్యంబుల బలంబును రాముని ప్రతాపంబును వినికొలువు చాలించి రావణుం డంతిపురి కరిగె. ఇక్కడ రాముండు సము ద్రునిం గదిసి,—

పూరికళ్యాణి : రూపకము.

దారి యొసగరాదా! వారినాథ! నెసరులేద! ॥ దారి ॥ పోరిజగత్కంటకు డగు క్రూరుని దశకంఠుద్రుంచి ధారుణిభారంబు బాపగోరితి; లంకకు జేరగ ॥ దారి ॥ సకలపుణ్య వాహినులును బ్రకటంబుగ నీలోపల నొకటిగ జేరగ గైకొని యకలంకుడ వగుదు! నాకు ॥ దారి ॥ వెలయఁగ నారాయణకవి వినుతుండయిన మోక్షగుండ నిలయునకును గూఁతు నిచ్చి చెలగిన శాంతాత్మ నాకు ॥ దారి ॥

వ. ఇటువలె రాముండెంత ప్రార్థించినను సముద్రుండు మిన్నకుండిన నాగ్రహించి.—

తో: విను, లక్ష్మణ, వీఁ డెంతదురాత్ముడో! విశ్వసింప డెంతయును! ఘనముగ నిప్పుడె గ్రాగించెద గనుగొను నాదు ప్రతాపమును ॥ రా ॥

వ. అని పలికి తమ్మునిచేనున్న విల్లమ్ములు చేకొని బ్రహ్మాస్త్రంబు నంధించి.—

పంచచామరము :

అహో సముద్ర కొంచె మైన నాదరంబు లేక నీ
వహంకరించి యున్నవాఁడ ! వైననేమి! యుండునా !
మహోగ్రకాండవహ్నిచేత మారణంబు చేసెదన్!
సహింపు మంతె చాలుధైర్య శాలి వైన నిచ్చటన్.

వ. అని యస్త్రంబు విడువ నుద్యోగించిన , నతనికోపాగ్నికి జగంబులు గడగడ వడంకె, హద్దుదాఁటి సాగరోదకంబులు యోజన మాత్రంబింకె. తిమితిమింగిలములు జంకె. అయ్యవసరంబున;—

క. రత్నాకరుండు రవికుల
రత్నమునకు బహుమతులుగ రమణీయములౌ
రత్నంబులు గైకొనుచు బ్ర
యత్నంబున వచ్చె దివ్యమగు నాకృతితోన్.

వ. ఇట్లరుదెంచి యాశరధి దాశరథికి నమస్కరించి యుపాయనంబులు సమర్పించి,

హంసధ్వని : ఆదితాళము.

కల్యాణగుణగణమ్ నమామి ॥ కల్యా ॥ కమలదళాఞ్చితఘనమృదు చరణమ్ కల్మష హరణమ్ కరుణాభరణమ్ ॥ కల్యా ॥ కటితటరంజితకాంచన చేలమ్! కుటిలమదాసురకోటి విఫాలమ్ ॥ కల్యా ॥ మోక్షగుండనత్పురవిభు మఖిలాధ్యక్షమ్ నారాయణకవిరక్షమ్ ॥ కల్యా ॥

ఈపగిదిఁ బ్రార్థించిన శాతుండయి సీతాకాంతుండు సరిత్కాంతున కిట్లనియె :

తో : నే దొడిగిన యీనిశితసాయకం బేదిక్కుకు వై చెదను । పోదు వృథా పాథోధినాథ! తెల్పుమునా, నత డిట్లనెను ॥ రామ ॥ ఉత్తరదిక్కున నున్నకిరాతుల నుక్కడంచు రఘువీరా । పొత్తుగలిగి యెప్పుడు నను బాధింపుచు నుందురు రణశూరా! ॥ రామ ॥

వ. అన, మంచి దని; సముద్రునిబాధింపుచున్న యాభీరుమండలంబుపయి నమ్మ హనీయాస్త్రంబుఁ బ్రయోగించిన, నది వారిని దునిమి పొదిఁ జేరె, పిమ్మట సముద్రుండు—

జంఝూటి : ఆదితాళము.

వారధి గట్టగ నీకపివీరుల బంపవె యోరఘుకులవర ॥ వారధి ॥ ఓరుపుతో నేరుపుతో భూరుహభూధరములు జేరుతు రపారముగ ॥ వారధి ॥ దీనికి విశ్వకర్మవరసూనుఁడయిన నలు డౌను సమర్థుడు దీనికి భూనుతమై మానితమై కానవచ్చు, మోక్షగుండశ్రీనాథ, వానితో ॥ గలిసి ॥

వ. ఈ నలుండు చేతముట్టి వైచిన నెంతభారమగువస్తువైనను నీటిమీఁదఁ దేలును. పిన్ననాఁడు గణ్వమహామునివలన నితఁడట్లు వరంబు వడసియున్నాఁడు కాబట్టి యతనిని సేతువుగట్టు పనికి నియమింపుఁడు తక్కిన కపు లందఱుఁ బర్వతాదులు దెచ్చియిత్తురు.

క. ఈ తెఱఁగున వినిపించిన
సీతాపతి యలరి నలునిచే నీటిపయిన్
సేతువుఁ గట్టింపఁగఁదాఁ
జేతంబునఁ దలఁచి యిటులఁ జెప్పె నతనికిన్.

వ. ఇట్లు నియమించి నవపాషాణంబులన్ నవగ్రహముల పూజించి యచ్చటఁ దనపేర లింగస్థాపనంబుఁ జేయఁదలంచి హనుమంతున కిట్లనియె;

కానడ : ఆదితాళము-(నజరబిర) వలె.

పవనతనయ! యిక లెమ్మా జవమున గాశికి జని రమ్మా ॥ పవన ॥ లింగద్వయము దెమ్మా! శివలింగము మంగళకరముగ మా కిమ్మానీవు ॥ పవన ॥ తడవులేదు లగ్నమ్ము! ఇక వడి వడిగా రావలెను సుమ్ము నీవు ॥ పవన ॥ చాలభక్తితోడ నుండు నీవు జాల నిన్నేలుమోక్ష గుండేశుండు నీవు ॥ పవన ॥

వ. అనిదెలిపిన రామాజ్ఞ శిరసావహించి వాతూలసుతుండు ప్రయాణంబయి.

క. ఆకాశమార్గమునఁ దీ
వ్రాకారతఁబరువువాఱె వారాణసికిన్;
శ్రీకంఠుని విశ్వేశునిఁ
బ్రాకటముగ నభినుతించె బ్రవిమలభక్తిన్.

వ. ఇట్లు పొగడిన సంతసించి యాంజనేయునికిఁ బ్రత్యక్షంబయి యతని యభిమతం బెఱింగి రెండులింగంబు లిచ్చి నే నిట్లంటి;

క. మును కుంభసంభవున కి
చ్చిన నా వాక్యమును దీర్ప శ్రీరాముని ద
ర్శనమున కిదె దక్షిణదిశ
కనిలసుతా, వత్తుఁ బదప్రియంబున నింకన్.

వ. అనిన హనుమంతుం డిట్లనియె:

తో: మును పిచ్చితివే మని వాగ్దానము మునివర్యున కని యడుగన్, హనుమంతుని కిట్లని యాకథయాద్యంతము దెలిపితివడిగన్ ॥ రా ॥

కీర్తన: ఆదితాళము. (వగపేటికి?) వలె.

విను, కడచిన వృత్తాంతమును దెలిపెద హనుమంత! మును, వింధ్యనగము చెంతకును నారదు డత్యంతవీణా గానమునమగ్నుడౌచు జేరతానంత ॥ విను ॥ అమ్ముని చంద్రుని గాంచి, యద్రీశుఁడుమోదించి సమ్మతి సమ్మానించి, సాష్టాంగము లర్పించి! యెంచి మించి నెమ్మోమునందు బాణి జోడించి ॥ విను ॥ మోక్షపురీశునికరుణన్, మునివర, నీవరుదేలన్ ఈక్షితి బాపము లాటెన్; ఇదె శుభమును జేకూరెన్ మీ రీ దారి లక్షించి వచ్చు టేల నను జేరన్? ॥ విను ॥

వ. అని వింధ్యాద్రి ప్రశంసించిన.

క. నిట్టూర్పు విడిచె నారదుఁ
డట్టియెడన్ గారణం బహో యే మొక్కో
గట్టులయెకిమీ డసఁ జూ
పట్టితి నే నవనియందుఁ బరికింపంగన్.

వింధ్యుండు

శహన: ఏకతాళము. (కామినిసామినివలె).

ఏధరణీధర మీడగు నాకీధారుణి ॥ నేధర ॥ సాధువరా మీపద సాక్షిగ నే నాడెద ॥ నేధర ॥ అల్లశర్వాణి తన యాత్మజయగుట శివుఁ డల్లుడై రంజిల్లుటను శీతాద్రి కొంచెము బేర్కొనంబడె॥ నేధర ॥ మేరుగిరి స్వర్ణమయమై రంజిలు నని దేవాగార మని ప్రఖ్యాతి నొందెను; గాని నాతో సాటి యగునే॥ ఏధర ॥ కొండలెన్నియొ లెక్కకుండె; నవి యేల! మోక్షగుండపతి కృప నిండ, నే నొక్కండ దండిమగండఁ జూడవే॥ యేధర ॥

సీ. ఉదయధరాధర ముదయాశ్రితంబు; మెం
దేహాద్రి దేహసందోహ మరయ;
నిషధాద్రి నోషధీ నీచయంబులే వయ్యె;
నస్తమిత్రప్రభ లస్తగిరిని
నీలకాంతులఁ బొల్చు నీలమహీధ్రంబు;
మందాక్షసహితంబు మందరంబు;
మలయాచలంబున వెలయుఁ బాములగుంపు:
రైవతకాద్రి నిర్ధనముగాదె!

గీ. మాటమాత్రంబు లగును త్రికూట హేమ
కూటములు భారమును మోయ నోటువడును
సహ్య కిష్కింధ; క్రౌంచాది శైలపతుల
కన్న నేబొల్తు మేటినై యార్యవినుత.

వ ఇట్లు దుర్వారగర్వంబున నప్పర్వతంబు పలికిన సహింపమి
మనంబున—

తో: శిఖరదర్శనముచే మోక్షంబిడు శ్రీశైలాదులు వెలయ, ! నఖిల
డవమానించుట యాశ్చర్యం బగు దెలియ ॥ రా ॥

వ. అని యెంచి యతని గర్వంబు బాపువాఁడై—

కానడ : రూపకము.

ఏది నీసాటిశైల మీజగంబున ! నేఁగాన ॥ నేది ॥ ఆదిత్య ముఖగ్రహ
యింతు రను నటంచు మోదంబున మేరునగము ముఖ్యంబుగ నిక్కు గాని ॥ యే
నిదె ననుఁ బోలదు వింధ్యశైల మని యెప్పుడు ని న్నవమానించుచుండ ని
విడిచితి ॥ నేదీ ॥ మావంటివారికేల మదియందున నుండనిమ్ము ! పోవలె శ్రీ
దేవుని సేవింపగాను ॥ నేదినీ ॥

వ. అని యిట్లుపలికి కలహాశనుండు యథేచ్ఛం జనియె. అంత
ధరంబు—

శా. ఔరా! మేరుధరాధరంబు గడు గర్వాయత్తచిత్తంబుతో
నీరీతిఁ ననుఁ దూలనాడె నట! కాని మ్మెంతదో తత్ప్రతా
పారూఢింగని సంతసింతునెద! సూర్యాదిగ్రహాళుల్ తనుఁ
జేరఁ వచ్చుట దెట్టు లొక్కొ యనుచుఁ జిత్రంబుగా నత్తరిఁ.

వ. అని నిశ్చయించి తనశరీరంబు రెండువేల యిన్నూట రెండు యోజనంబుల పొడవుఁబెంచి సూర్యసంచార మార్గంబు నిరోధించిన నదియొక విలయకాలంబై.

తో: పూర్వోత్తరములఁ బొల్చువారి కెప్పుడు సంతాపముగలిగె। పర్విననిద్రలఁ బండగ దక్షిణ—పశ్చిమస్థులకు గలిగె ॥ రామ ॥

వ. ఇట్లొప్పిన సమస్తయజ్ఞాది క్రియలభావం బయిన దేవేంద్రాది దేవతలు బ్రహ్మ సహితంబుగా వారాణసికి వచ్చి సన్నిట్లు ప్రార్థించిరి.

ఫీల్ రాగము: ఆదితాళము (కాముకుని) వలె.

దేవదేవ రావె! నీవదిక్కుకావవె! కేవలాంధకారమై యీ విధంబు దోచె నిదే ॥ దేవ ॥ కాల మెఱుంగలేని కారణంబుతో జనపాళి సర్వకర్మలు నోలి మానియుండి రల ॥ దే ॥ హవ్యములు లేక మే మకట! యెట్లు నిల్తుమో యవ్యయ! శ్రీ మోక్షగుండాధినాథ మ మ్మేలవే! ॥ దేవదేవ ॥

వ. అని బహుభంగుల ప్రార్థించిన దయామయహృదయుండ నై వింధ్యాద్రికి గురు వగు నగస్త్య మహామునిని వీక్షించి యిట్లంటి.

క. లోకోపకారమున కై
యోకుంభజ! దక్షిణాశ కరుగవడి జని నీ
వాకుధరేంద్రుని గర్వముఁ
బోకార్పుము కాశి నుండఁ బోలదు నీకున్!

వ. అనిన వాక్యంబులు విని దుఃఖాక్రాంతు డగుచు నగస్త్యుం డిట్లనియె.

హిందు: కాఫీ: ఆదితాళము. (ఈ విపరీత) వలె.

కాశిని బాసి విశ్వేశా! పొ మ్మన నగునా! ॥ కాశిని ఓశివా! నీదుకడ నుండక నాదక్షిణాశకు బోవ గాళ్ళాడునె నా కిఁక ॥ గాశిని ॥ ఇమ్మహాస్థలమున నెమ్మేను బాసిన

గ్రమ్మఱ జన్మము గలుగ దందురు గదా! ॥ కాశిని ॥ ఖండితంబుగ
మేమీ! మోక్షగుండ నాయక చెంత నుండ దగనే శివా! ॥ కాశిని ॥ !

వ. అని వగచుచుండిన నగస్త్యునకు నే నిట్లంటి:

క. ఈవారాణసి, నీగం
గా వాహినితటము, డుంఠిగణపతిపదముల్
దేవివిశాలాక్షిన్ నను
బోవిడువం జాలకిటులఁ బొగులుదు వనఘా!

గీ. పొమ్ముపొమ్మల్ల వింధ్యాద్రిపాద పడంచి
దక్షిణధ్రువమున సేతుతటమునందు
నిలుము! శ్రీరాము పూజమన్నింప వత్తు;
దర్శనమ్మిత్తునీ కగస్త్యా । మునీంద్ర.

వ. అని యొడంబఱిచిన, మంచి దని యగస్త్యముని లోపా
గాశిం బాసి దక్షిణాభిముఖుండై వింధ్యగిరి సమీపించి వచ్చిన

క. ఇనమండలపర్యంతం
బును బెరిఁగిన వింధ్యశిఖరి మునివర్యుని రా
కనిరీక్షించి యెదుర్కొనె
మనమున భయభక్తులొదవ మఱిఖర్వుండై.

వ. ఇట్లు గ్రుంగిన రూపంబుతో నమస్కరించి వింధ్యుండిట్లనియె.

కల్యాణి: ఆదితాళము. (మనవినిచే) వలె.

శరణు కృపాజలధీ! గురువర! ॥ శరణు ॥ ధరణిని తమసందఁ
డనైనాను! గురువర ॥ శర ॥ మావంశము జన్మము గేహంబును బా
గురు ॥ శర ॥ ఏమికోరి మీ రేతెంచితిరో స్వామీ! వచియింపు! గ
మోక్షగుండరాముని పదాబ్జముల సాక్షిగ నవరింతు । గురువర! ॥ శర

వ. అనిన వింధ్యగిరికి మునివర్యుం డిట్లనియె.

క. ఈనానతితో దక్షిణ
కోణమునకుఁ బయన మయితి; గురుతరభక్తిన్
మానితుఁడ వగుట, నుండుము
ఆనతి మామరలివచ్చునంతకు వింధ్యా!

వ. అదిమొదలు గర్వంబులేకవింధ్యుండు గుజ్జురూపంబుననుండి పండ్రెం డేండ్లకొకపర్యాయము మునిరాకఁ గోరి నిక్కి చూచుచు. రాకుండిన యథాస్థితినుండుచుఁ గాలంబు జరుపుచుండె.

తో: అప్పటినుఁడి నిరాటంకంబుగ నర్కుండు విహరింపగను। ఎప్పటివలె నైమిత్తికముల జనులెలమి కెలిలి వర్తింపగను ॥ రామ ॥

వ అట్లు లోకోపద్రవంబుఁ బాపి కుంభసంభవుండు దండకావనంబున నిలిచి నారాక నిరీక్షించుచుఁ దపంబుఁ జేయుచుండె గావున.

హుసేని : ఆదితాళము ( ఈరాజా ) వలె.

నే నేతేరెదను, నీ వరిగిన వెనువెంబడిగను ॥ నేనే ॥ మౌనివర్యుని మాటదీర్పగ జానకీశ మానక జూడగ ॥ నేనే ॥ లింగములు రఘుపుంగవుకునుజెలంగ మంగళంబుగ నొసఁగుము ॥ నేనే ॥ మోక్షగుఁడాధ్యక్షునకు బ్రత్యక్షమై నిరీక్షింపగ నిక ॥ నేనే ॥

వ. అని చెప్పి వీడ్కొలిపిన, నాంజనేయుండులింగంబులు గొని వాయువేగంబునఁ గించిద్గర్వ, సమావృతుండయి వచ్చుచుండె. అది యెఱిఁగి రాఘవుండు సుగ్రీవునిఁ జూచి,

తో : వాయుసుతుడు రాడాయె ముహూర్తము వోయె నటులుగావునను। యీయెడ దడయక నినుకలింగమును నెలమిబ్రతిష్ఠించెదను.

వ. అని సర్వవానరులుఁ గనుచుండ మునులసమక్షంబునసైకత మయలింగంబును బ్రతిష్ఠంజేసి,

తో : తన కౌస్తుభమును దలచ వచ్చెను దపనకోటిభావమున, మనుకులుండు గని మన మలరగ నమ్మణిని దాల్చె గ్రీవమున ॥ రామ ॥

వ. ఇట్లు మణిని ధరించి తన్మహిమచేఁ గల్పింపఁబడిన ధేనుధన వస్త్రాభరణాన్న దానంబులచే సభ్యులఁ దృప్తులం జేసి పంపిన, వారు స్వాశ్రమంబులకుఁ బోవునెడ మార్గ మధ్యంబున —

తో: మారుతి యెదురై వారిస గని యెవ్వారివలనబూజితులై వారలు మీరన నపుడ తెలిపిరా పాఱులు ముదమున మేదినీసురులు నతులై! ॥ రామ ॥

క. రామేశ్వరమ్మువిన౽ రఘు
రాముఁడు లింగప్రతిష్ఠ రహిఁ జేయుచు మ
మ్మోమాడ్కి సత్కృతులచే
ధీమతి పీడ్కొలుప వచ్చితిమి కపివర్యా!

వ. అనిన విని కోపావిష్టుండయి రాముని యెదుట భూమిపయి బదద్వయచిహ్నంబు లేర్పడ దుమికి యాఁజనేయుం డిట్లనుచున్నాఁడు.

కమాచ్ : రూపకము. ( వేటాడకువలె )

నన్నేలుగ వహెూ! రామ! ॥ నన్నె ॥ మొన్న లంకకేగి దనుజముఖ్యుల నే నరకుగొనక యెన్నగ సీతావార్త సమున్నతమతి నెఱిగించిన ॥ న ॥ వ్యర్థంబుగఁ గాశి కేగి వచ్చితి లింగము గైకొని సార్థకమేమయ్య వృథా శ్రమపడితినిరఘునందన ॥ న ॥ ఒక్కటి నీకై తెచ్చితి, నొక్కటి నాకొఱకు దెచ్చి; తెక్కడఁబడవైతు జెప్పుమివి మోక్షపురాధీశ్వర ॥ నన్నేలుగ ॥

గీ. ఇంత త్వరపడువాఁడవి ట్లేల నన్ను
ద్రిప్పితివి కష్టతమదూరదేశమునకు!
జెలగి యీరీతిహాస్యంబుఁ జేయుటకునా!
దొరల మాటల కెదురు లేదో తలంప।

వ. అని నిష్ఠురంబుగా మాట్లాడిన పవనతనయునకు రవికులభవుం డిట్లనియె:

మత్తకోకిల.

నీవు పల్కినపల్కు లెల్లను నిశ్చయంబగుఁ గావునన్
బావనీ! యిదిమత్ప్రతిష్ఠితభవ్యలింగము; దీని నీ
లాభమై దొలఁగించి నీవు చెలంగి తెచ్చిన లింగమున్
ధీవరుల్ మదిలోనమెచ్చఁ బ్రతిష్ఠచేయుము క్రమ్మఱన్.

వ. అని నయంబున వాక్రుచ్చిన సమ్మతించి యమ్మేటి లేచిపోయి.

తో : లింగంబును గదలింపగ బోయిన లేశము గదలకయున్నన్ ॥ లాంగూలము మెల్లగను జుట్టి తనలావున లాగుచునున్నన్ ॥ రా ॥ వాలము మూలమువఱకు దునిగి సరి వారుగనగ నాలోన ॥ నేలబోరగిలఁదూల మూర్ఛితుండై లేవక పడియున్న ॥ రామ ॥

వ. వానరులు హాహాకారంబులు చేయుచు మూఁగి సేదదీర్చి లేపిన, గొంతపడికి లేచి దురభిమానంబు వదలి శ్రీరామభద్రుని బరబ్రహ్మంబుగా భావించి, సాష్టాంగనమస్కారంబు లనేకంబు లర్పించి కొనియాడు చున్నాడు ;

పూరికల్యాణి, ఏకతాళము : (జానకీపతి) వలె.

మైథిలీవరా ! మన్నింపుదేవర ! ॥ మై ॥ సాధుజనాధార ! సత్యవాక్యసార ! మైథిలి ॥ మంచిప్రోడ వంచు వేడలేక బ్రమించినాఁడ ! నెంచిచూడకను నను కొంచెకా డటంచు వీఁడ కికక గరుణించిజూడ మించఁజూడఁ దగు ॥ మైథిలీ ॥ పిన్నగొప్ప లన్న చొ ప్పడచి సఁయు న్నతప్పదెన్న జెప్పఁ బోలదు !-విన్నుదప్ప నన్యు నెప్పటికి నేనన్న సెప్ప నన్ను నొప్పఁదగు ॥ మైథిలీ ॥ మోక్షగుండరక్షకుండ ; వఖిలాధ్యక్షకుండ ; వక్షరుండ వనుచును దీక్షమెండ పేక్షయుండ, నిడితి బరీక్షనిండ ! లక్షదండములు ॥మైథిలీవరా ॥

వ. అని యనేకవిధంబులఁ బ్రార్థించిన, నానందించి దయాకలిత హృదయుండై రాముండు——

గీ. 'వినుము నీ వేగి తెచ్చిన విశ్వనాథ
లింగమును నిల్పు రామేశ లింగమునకు
నుత్తరంబున, నన్ను, నట్లొప్ప నిలుపఁ
గాంచినంతనమంది రాఘవుడు వలికె.

హిందూ కాఫీ : ఆదితాళము : (వందనం చతు) వలె.

చెప్పెదన్ పవనాత్మజా ! యిప్పటినుండియు జరుగు నిచ్చటి యేర్పాటులు ॥ చె ॥ ముందు నీలింగమునకు పూజింపక, నాలింగము నిందుబూజించినపూజలెల్ల నిష్ఫలంబులు ॥ చెప్పెదన్ ॥ నాకు దెచ్చినట్టిలింగ మీకోవెల యందుండును గాక ! కాలాంతరమున గావింతు దత్ప్రతిష్ఠ ॥ చెప్పెదన్ ॥ చిన్నపుచ్ఛగుప్తపాదచిహ్నమున నీవిగ్రహ మెన్నటికి జెడకయుండ నిమ్ము జనులు నూడగ ॥ జెప్పెదన్ ॥

వ. అని యానతిచ్చిన సటులనే తెగినదోఁక యు గుప్తపాదంబులు గలిగిన హను మద్విగ్రహమును నిజాంశచేనిర్మించి హనుమంతుం డందు నిలిపినఁ గాంచి.

తో : శ్రీరాముడు ప్రేరేపగ నచ్చట మారుతితీర్థంబనగ । మారుతి తగ నిర్మాణము జేసెను మహనీయులు మే లనగ ॥ రా ॥ రామతీర్థమును లక్ష్మణతీర్థము లామీదను గావించి । రామూ(డును ధర నతిపావనములు నగు నని రాము(డు గాంచి ॥ రా ॥

గీ. అచట శ్రీరాఘవుండు నిజాంశవలన
సేతుమాధవు( డన వెలసియు( బ్రసన్న
మూర్తియై పవనజుతో(క ముట్టినంత
పూర్వరీతినె దృఢముగా( బొల్పెసంగె.

వ. రామేశ్వరుని మస్తకంబున హనుమంతుని తో(క జుట్టిన రీతి చిహ్నంబుగా నిలిచి యుండె, కాశివిశ్వేశ్వరుండు శ్రీరామప్రతిష్ఠిత సైకతలింగంబున నావేశించి యిట్లను చున్నా(డు :

శహన : ఏకతాళము. (పురమున లం) వలె.

తరణికులాభరణ! బుధాదరణ! శుభాచరణా! శ్రీకరముగ వినుమిది నరిగ విప్ర వేషమున బూర్వ మొకపరి భిక్షార్థము దిరుగుచు నుంటిని ॥ తరణి ॥ మునికాంతల్ నను వింతల్ గనుపడ మోహించి । వెను వెంబడిగను విడివడి వెడలిరి ॥ మునికాం ॥ కనలిత త్పతులు గని నీలింగము దునిగి పడును ధర ' నని శపియించిరి ॥ తరణి ॥ రంగుగ రత్యంగము మల్లింగము దెగివడియెః : అంగన లెల్లను నది గని తొల(గిరి ॥ రంగుగ ॥ ముంగల విను మది మోక్షగుండ రఘుపుంగవ, పెరిగెను భువి దివి బట్టక ॥ తరణి ॥

వ. ఇట్లు మల్లింగము మహాలింగంబై వెలసె ; అది యకాలప్రళయంబై యుండ( గని చతుర్ముఖుండు దానియాద్యంతంబు గనగోరి,

తో. కోటి వర్షములు గోరి వెదకి కను(గొన జాలక బ్రమ్మయను । హాటకగర్భుం డరుగుదెంచి న న్నరసి యెటిగి యిట్లనెను ॥ రా ॥

క. లోకభయంకరముగ నివు
డేకాకృతి లింగ మొకటి యేర్పడె దీనిన్
బోకార్చి శుభము జేయుము
శ్రీకంఠా యన(గ( గరుణచే నేనంతన్.

వ. త్రిశూలంబులచే నామహాలింగమును వం[డెండుభాగములుగా ఖండించిన నవి జ్యోతిర్మయంబులై ఓంకారేశ సోమనాథ త్ర్యంబక మల్లికార్జున నాగేశ వైద్యనాథ విశ్వనాథ కేదారేశ మహాకాళేశ భీమేశ ఘుసృణేశ గంధమాదన-నామంబుల లింగంబులై యొప్పెనంత-

కమాచ్ : ఆదితాళము- (ఇటురమ్మా) వలె.

రఘువర్యా! వినుము తెల్పెద ఆర్యా[ప్రియుఁ డని యంతట నమ్మునివర్యులు నాని జవార్తఁ దెలిసి ॥ రఘువర్యా ॥ క్రమ్మఱలింగము గలుగు ననుచు శాపమ్మును ద్రిప్పిరి భక్తిచేత ॥ రఘువర్యా ॥ అప్పుడు మోక్షపురాధిపలింగము నెప్పటివలెనే యేర్పడెనో ॥ రఘువర్యా ॥

సీ. గంధమాదన మను కడపటిలింగంబు
కనకాద్రికీశాన్యమున రహించి
ప్రళయానిలముచేతఁబడి ప్రవాహము వెంట
దక్షిణాంబుధిఁజేరి దరిని నిలిచె;
రామ, నీగూర్చిన రామేశ్వరస్వామి
నీశాన్యమున గల దిదిగొ చూడు
మింతపర్యంతంబు నెవ్వ రెఱుంగరు:
దీనియం దలరు; మత్తేజ మింక

గీ. రామలింగేశు నందుగరంబుజేర్చి
యిందువసియించు జనులు రామేశ్వరమునె
పూజసేయుదు రిదిమొదల్ పూజ్యమనుచుఁ;
బదియు రెండవ లింగమై పరఁగు నిదియె.

తో : కలశజునకు వాగ్దత్తముజేసితిఁ గావున, గాశిని విడిచి। యెలమిని వచ్చితి నిందువసించెద నీలింగంబున వెలసి ॥ రామ ॥

వ. ఈ స్థలమునకు వచ్చి మన్మయం బగు నీ తేజో లింగంబు నర్చించు వాఁడు బ్రహ్మహత్యాది మహాపాపవిముక్తుండు కాఁగలడు. రామా, నీవును నిమ్మహాస్థలమునకు వరంబు లియ్యవలసిన దని శివుండు దెలిపిన శ్రీరాముం డిట్లనుచున్నాఁడు.

కీర్తన : రూపకము- (మంగళ మగు) వలె.

విను శంకర, విను శంకర, వివరించెద నెంచి! మనుజులు చయ్యన నిచ్చట మజ్జన మొనరించి ॥ విను ॥ సంకల్పము సలిపి యిచటి సైకతమును గొనియు బొంకంబుగ బుద్ధినిండఁ బూరించక జనియు ॥ వి ॥ శ్రీయుత కాశీస్థలమును సేవించియు ముందు నా యనుకఁ బ్రయాగనుంచి యక్కుండమందు ॥ విను ॥ గంగాంబువు గైకొని యీలింగము కడజేరి, యుంగంబున నభిషేకము నటుజేసియు వారి ॥ విను ॥ భారంబును వారిధిలోఁ బడవిడిచిన సంతవారుందురు మోక్షగుండవర వానునిచెంత ॥ విను ॥

వ. ఇట్లుండగా.

క. ఆయనువున సంకల్పము
చేయక రామేశ్వరంబుఁ జేరదు గంగా
తోయం బది యొకకతమునఁ
బాయక చేరినను బూర్వభవకృతమ యగుఁ॥.

వ. ఇది నిశ్చయం బనుచు రామచంద్రుండు పలికె. అచటి కగస్త్యముని యేతెంచి శివరాములకుఁ బ్రణామంబులాచరించి.

తో : నీకటాక్షమున నీకాశీపుని నేడు గంటి రఘురామా! ॥ నా ॥ కొలంత లీనాటికిఁ దీఱెను. నాకేశ్వరనుతనామా! ॥ రామ

వ. అని పొగడి శ్రీరామ శంకరులచే ననుజ్ఞాతుండై యగస్త్యే శ్వరమను పేర నొకలింగంబును రామేశ్వరలింగంబున కాగ్నేయదిక్కున స్థాపించి యందుఁ బురాతనముగ నున్న గంధమాదనలింగంబునుదర్శించి సేవించి వారినిపీడ్కొని యగస్త్యుండు నిజాశ్రమంబున కరిగె; అంత —

క. నలుఁడును రామాజ్ఞను దన
దలమోచియు వార్ధిగట్టఁ దలపడి కపు లి;
చ్చల దెచ్చెడు కొండలు వి
చ్చలవిడి చే నంది గర్వసక్తుండగుచుఁ॥.

వ. కట్టుచున్న వైఖరిజూచి శ్రీరామచంద్రుండు దనమనంబున.

తో. తన కొక్కని కీపని నియమించితి పసి గర్వంబున వీడు । వనచరాపళుల నిర్లక్ష్యముగాఁగని మెలంగుచున్నాఁడు ॥ రామ ॥

వ. కావున దానినడుపఁ దగు నని యెంచి,

చ. ఒకశిల నీట నిల్పి మఱియొక్కటిదెచ్చెడు నంతలోన వీ
చక లటుఁద్రోవఁగాఁ దొలగు జేతికి జిక్కఁగ; యయ్యవస్థచేఁ
గకవికలొంది యానలుఁడు గర్వము సర్వము దక్కి, రాముచెం
తకుఁ జని తత్పదంబులకు దండమువెట్టి వినీతి నిట్లనుఁ.

బిలహరి : రూపకము. (ఏమి సేయు) వలె.

ఏమికారణమో! కామించి కట్టఁ బ్రేమతోఁ గట్ట, స్వామి, నియమించితి ॥ రేమి ॥ శిల లిందు వేయ నలల త్రాకు నటునిటు బోవ నలవియె కట్టుట ॥ కేమి ॥ వార్ధి మోసమున వ్యర్థపుచ్చగ నర్థి నెంచెనో! నిర్ధారణ దోపద ॥ దేమి ॥ తామసింపకయ శ్రీమోక్షగుండ రామ! యుపాయ మేమైన సెల పొసగు మి ॥ దేమికారణమో ॥

వ. అని ప్రార్థించిన సంతసించి జానకీపతి యిట్లనియె :

తో. రామనామమును రాతి రాతికిని వ్రాయుచు నతికించినను ॥ క్షేమంబుగ నవి చెదరకుండునటు చేయు మనుచు చెప్పగను ॥ రా ॥

వ. నలుండు రామధ్యాననిష్ఠాగరిష్ఠుండయి తదాజ్ఞాప్రకారముండె. అంగద హనుమంత నీల సుషేణ మైంద ద్వివిధ శరభ శతబలితార గజ గవయ గవాక్ష గంధ మాదన దధిముఖ జాంబవంతాదులు లగ్గల కెక్కినట్లు చెలఁరేగి,

రగడ

వారధి గట్టగనె బూనిరి వానరు లందఱును
వింధ్యపర్వతము వేదాచలమును
గంధమాదనము గరుడాచలమును,
గాంచనశైలము గైలాసంబును
క్రౌంచాచలమును, రైవతకంబును,
శ్రీగిరివరమును సింహాచలమును,

నాగోవర్ధన మస్తాచలమును,
నరుణపర్వతము నాహిమవంతము,
నరుగశైలమును నుదయపర్వతము,
మలయపర్వతము మాల్యవంతమును,
నలరుచున్న ద్రోణాద్రి యంజనము;
హేమకూటము మహేంద్రశైలమును,
సామజశైలము సహ్యాభూదరము,
మందరశైలము మాల్యశైలమును,
సుందరమగునా శోభన నగమును,
చిత్రకూటమును క్షీరశైలమును,
చిత్రపునీలక్షితిధరవరమును,
మొదలగు పర్వతముల కేతెంచియు,
వెదకిశిఖరములు వేఁబెకలించియు,
గొని వచ్చిరి కపికోటులు కొందఱుఁ;
గొని వచ్చిరిమ్రాకులు మఱి కొందఱు;
గొందఱు మూపులఁ గొందఱు శిరములఁ
గొందఱు భుజములఁ గొందఱు కరముల
నెత్తుక నెగురుచు నెలమిని దెచ్చిరి
మొత్తము లగుచును మ్రోయుచు వచ్చిరి
చేరువ దిరిగియు, జెచ్చెర దెచ్చిరి,
దూరమునకు జని తొలగక దెచ్చిరి
వంతులు లేకయు వడిగా దెచ్చిరి,
గంతులు వైచుచు గ్రక్కున దెచ్చిరి;
యిటువలె తెచ్చిన యిన్నికొండలును,
నిటువలె దెచ్చిన యిన్నిమ్రాకులును,
జేరి నలుండును జేతులనందుక,
శ్రీరామునినుతిఁ జేయుచు దడయక,

బౌరావారముపైని పసందుగఁ,
గూరిచి కట్టగఁ గూర్మిని బొందుగ,
నాపనితనమ్ము నారసి మెల్లగఁ :
జూపరు లిదె మెచ్చుచు రంజిల్లఁగ
వారిధిగట్టగను బూనిరి వానరు లందఱును.

సీ. మొదటిదినంబున ; బదునాలుగామడ,
లిరువదియామడ మఱుదినంబు,
నిరువదియొక్కటి యెసఁగమూఁడవనాఁడు,
పిదపదినంబిరువదియురెండు,
పంచాహ్నమున నిరువదిమూడు, నిటువలె
శతయోజనంబులు చాపునందు,
దశమాంశము వెడల్పుఁ దగియుండ సేతువు
గట్టె నలుండు లాఘవము మెఱయ,

గీ. నంత రాఘవుఁ డూర్మిళాకాంత రావ
ణాను జార్కజ వాయుసుతాంగదాదు
లనుసరింపుచు రాగహర్షాబ్ధిఁదేలి
గట్టుపై సంచరించెడు కాలమందు.

తో : ఉడుతయొకటి చిప్పన నేతెంచి మహోదధిలోపల మునిగి తడియా
బొడియిసుకను దాఁబడిపొర్లాడియు జెలగి ॥ రా ॥ కట్ట పయికి జనిగ్రక్కున రా
గ్రమ్మఱ నటులనె నలుప । నట్టికాంచి సీతాపతి యారవిపట్టితోడ నది దెలుప ॥ ర

క. ఇంత బలవంతులకు నిది
యెంతయు దుస్తరముకార్య మిట్లుండగనీ
జంతువు స్వల్పం బయ్యును
జింతింపఁగ భక్తిచేతఁ జేయుచు నుండెన్.

వ. అంతియేకాని యీమహాకార్యంబున నిది చేయుసహాయం బెంత! దేవరవారియం దింతభక్తి దీనికిఁ గలుగుట జన్మాంతర సుకృతంబుగాదా! శ్రీరామభద్రా! అనంతదయా సముద్రా! యని కొని యాడిన రాముఁ డలరి, సుగ్రీవా! దాని నిందుఁ గొని రమ్మనుఁడు,

గీ. భానునందనుఁ డరుదెంచి దానిఁదెచ్చి
రాముసన్నిధినుంప హర్షమున నతఁడు
మూఁడువ్రేళుల దానివీఁపునను నిమిరె,
రమ్యముగను ద్రిలేఖ లేర్పడియె నంత.

వ. చందన మందార పనసామ్రాదిదివ్యతరుశోభితం బగునొక్క వనమధ్యంబున విడిపించు నట్లాజ్ఞయిచ్చి పిమ్మట శ్రీరాముండు —

క. మునివేషమ్ముల నమర
మ్మనకరుగుట యొప్పదని సముద్రుఁడు, మణిహా
రనికర మంబరములు నిడ
ఘనముగ నవి దాల్చివెడలెఁ గదనంబునకున్.

కాంభోజి : రూపకము-(భూమిపాలనము) వలె.

దండు వెడలెలంకపయి కోదండరాముడు సానుజుడయి ॥ దండు ॥ నిండిడెబ్బది రెండువేలల దండికపులు దండములై తనుగొల్వగ ॥ దండు ॥ భటులచటులార్భటులకు దిక్తటము లదరగ దశవదనుని పుటభేదనమున ననేక కుటిలభయోత్కటవివరీతమును గలుగ ॥ దండు ॥ శరణు మోక్షగుండనిలయ శరణురాఘవా! జయజయయని సురకిన్నర వరు లంబర చరులై సుమభరితంబుగ వర్షింప ॥ దండు ॥

వ. ఇట్లు సేతువుమీఁదుగా నడిచి మనుకులుండు సువేలాద్రికిఁ జేరి సైన్యంబుల నక్కడ విడియించె.

తో : అంతట గపుల మహారావములు దిగంతంబులు భేదించెన్; బంతితలలదొర బాగుగ విని తన మంత్రులతో యోజించెఁ ॥ రామ ॥ కట్టా! రాముఁడు గపికోటులతో ముట్టడించె మనపురము! । నెటుల జేయుద మిక ననుచుండగ నింతలోన వేగిరము ॥రామ॥

వ. రావణునితల్లి కైకసి తనతండ్రియగు మాల్యవంతునితోఁ గూడి రావణుని కొలువుకూటంబునకు వచ్చి వానిచే సత్కరింపబడి యుచితాసనంబునఁ గూర్చుండి యిటు లనుచున్నది.

జంఝూటి : త్రిశ్రజాతి.

నామాట మీఱవద్దు । నాపట్టియనుచు బుద్ధు లీమాడ్కి దెలుపగాను నిదె వచ్చియున్నాను మాను! నీమేలు గోరెదను ॥ నామాట ॥ రాముని దేవిఁ దెచ్చి కామించి చెఱలోనుంచి, సామాన్యులనుగానెంచి, సాధింపగను దలచినావు నెమ్మదియోజించి ॥ నామాట ॥ రాముడు మోక్షగుండ శ్రీమాధవుడు గాడా! భూమిజ కమలగాదా! యేమియు నెఱుకలేదా! వాదా! భామను విడరాదా ॥ నామాట ॥

క. నీదాడికోర్వఁ జాలక
యాదేవత లాశ్రయింప, నభయకరం బా
శ్రీదయితుఁ డొసఁగి, నరుఁడై
మేదిని జన్మించె నిన్ను మృతినొందింపన్.



వ. జగదీశుని యానతిచే దేవతాంశములఁ గపిసైన్యంబులు గలిగెగాక ఇంత బలపరాక్రమంబులు గల కోఁతుల నెన్నఁడయినఁ గంటివా ! కుమారా !

తో. మనుజు డనుచు నీమది నిర్లక్ష్యముగను భావింపకు వినుము । నినుగెల్చిన వాలినిజంపిన శూరునిగా నెదఁగనుఁగొనుము ॥ రామ ॥

వ. ఆమేటి సామర్థ్యంబునకన్న నీమగంటిమే యెక్కుడయిన నామనుజుని భామినినిఁ దెచ్చుటకు నెదిరించి పోగూడదా! యేమఱించి తెచ్చుటకు భయపడికాదా! పుత్రా! దేవతాజైత్రా! రాక్షసకుల పవిత్రా!

తో: ఏటికి జెడియెద విక నయినను నామాటను ద్రోయకు నేడు ॥ తాటకహారునకుఁ దరుణి నొసంగుము దయనిను బ్రోచునుజాడు ॥

వ. ఆదయానిధి శరణాగతులఁ గాపాడు బిరుదుగలవాడు కాన నీయం దసూయ నొందక జేరఁదీయు. అతనిసేవకన్న శుభావహములొండు లేవు: పా మ్మనుడు: నవ్వియతం డిట్లనియె :

కమాచ్ : రూపకము

మాటాడకుమూ నాతో ॥ మాటా ॥ హాటకచేలుడు రాముం డయ్యెను సేవింపుమనుచు మాటికి బోధించెదు నీమాత్రమునే నెఱుఁగ నేమొ! ॥ మాటా ॥ హేయం బగు నీతనువున నాయన నర్చింపజాల; బాయకయని జేసి యొడలువాసి పరమునందు గొలుతు

॥ మాట ॥ ధారుణిలో మోక్షగుండ శ్రీరాముని నీపిన్నకుమారునితోఁజేరి కొలిచి మని యుండుము. చిరకాలము ॥ మాటాడ ॥

వ. దిగ్విజయుండవయి బహుకాలం బిహలోకసౌఖ్యంబు లనుభవించితి ఒకరికి వెఱచిశరణుఁజొచ్చియెఱుఁగ, దురంబున నతనిబొదిగొన లేకున్న నాశరీరంబు దొఱఁగి పరంబు గాంచెద. స్థిరంబుగ ధరాతలంబు విభీషణునిచేత సేవింపుము. తల్లి! మఱల నాతో దెలుపకుము.

తో: అనవుడు; విధికృత మనుభవింపు మని చనెగైకసితన యిచ్చకా, మనుమని గని యమ్మాల్యవంతు డిట్లని బోధింపగఁజొచ్చెకా. రా॥ సామాన్యునిగా రాముని గని తద్భామిని జేరబట్టితివి! నేమముగల రజనీచరకులమును నీఱుచేయ బూనితివి ॥ రామ ॥

క. నారాయణుఁడే రాముఁడు
శ్రీరమణియె సీతయగు; ధరిత్రినివారల్
కారణజన్ములు; నిర్జర
వైరులఁదునుముటయ వారి వ్రతముకుమారా !

కీర్తన : ఏకతాళము.

నిర్నిమిత్తవైర మేల నీకురావణా! దుర్నిమిత్తములుజాలదోచెరావణా! ॥ నిర్ని ॥
సామజాళిసత్వములు నమసె రావణా! హెూమధూమములుగ్రుంగె వేమొ రావణా! ॥ నిర్ని ॥
గుంపులైవఱక్కగపిసి కూసె రావణా! సొంపు పెంపు లడగె రాక్షసులకురావణా! ॥ నిర్నిమి ॥
వేడిమి నెత్తురులు గురిసె వేగరావణా! జూడ నుల్క లెల్లరాలఁజొచ్చెరావణా ॥ నిర్ని ॥
మోక్షగుండశౌరిమీద ముట్టిరావణా! రాక్షసులు జెడుమరు దిరంబురావణా ॥ నిర్ని ॥

గీ. సీత నర్పించి రాముని సేవజేసి
లంకబాలింపు మెల్లకాలంబుఁ జెలఁగి
యనిన నమ్మాల్యవంతున కాగ్రహించి
పటుభయంకర మూర్తియై పలికెనిట్లు.

కీర్తన : ఆదితాళము.

మాతామహు డని నిన్ను మర్యాదగ జూచుచుండ నీతిమాలి మాటాలాడేవు ॥ ఓమాల్య వంత ॥ భీతిదెల్పి బెదరించేవు । హీనమానవుని సేవకేను పోవుదునె కులసానపౌరుషముల

నెంచవు ॥ ఓమాల్యవంత ॥ కానిపోని వెల్ల నెంచేవు ॥ నన్ను జంప మోక్షగుండనాథుఁ డవతరించి శరణన్ననెటులఁ జంపకుండును ॥ ఓమాల్యవంత ॥ ఉన్న కర్మ మెటులమానును ॥

వ. కాఁ బోవునది కాకమానదు. క్షణభంగురదేహమును శాశ్వతముగా నమ్మి కానిపోనిపనులకు నే నేల చొత్తు! పలు పలుకులుడుగు తాతా! దానవకుల ప్రదాతా! అనుచుండ.

క. దానవపతి యానతిచే
భానుజుకడ కేగి శుకుఁడు పరువడి మగుడుక్
దానరుగుదెంచి మ్రొక్కిఁద
శానుతో నిటుల; బలికె నతిమోదమునక్.

తో: విను రావణ నేఁ జనిన విభీషణుఁ డనువుగ దెలుపుటచేత! నను జంపగ వానరు జతనపడ మనుకులుండు దయచేత! ॥ రామ ॥ దూతను జంపినదోషమంచు నన్నా తటి విడిపింపగను భీతిలేక నే నేతెంచి గడునీతితోడ నిను గనను ॥ రామ ॥

వ. అనంతసత్వసంపన్నులగు కపిసైన్యంబుచే వారధి గట్టించి దాని మీఁదుగా వచ్చి సువేలాద్రిమీద రాముండు సేనాపరివృతుండై యున్నవాఁడనిన నాశ్చర్యపడి రావణుండు——

క, శుకుఁడును సచివులు గొలువఁగ
నొకప్రాసాదాగ్ర మెక్కియురువడిఁ గని యో
శుక! నీవెఱుఁగుదువుగదా!
ప్రకటంబుగఁ దెలుపుశత్రుబలములవరుసక్.

రావణ - శుకసంవాదము కీర్తన.

॥ రా ॥ మేలైనచూపుల మిఱుమిట్లుగొలుపు నానీలాంగు డెవరుశుకా!
॥ శు ॥ ఆలలితాంగుడే యసురేంద్ర! రామభూపాలు డగును దేవరా!
॥ రా ॥ పొందుగా నాతని ముందర నిలిచిన ముగు రెవ్వరోయిశుకా!
॥ శు ॥ విందుగ విను రవినందన లక్ష్మణ విభీషణులు దేవరా!
॥ రా ॥ మోక్షగుండేశుని మొనలను పేర్కొని ముదమున జూపుశుకా!
॥ శు ॥ అక్షయమైనట్టి యవి యెన్నెదరమె బ్రహ్మాదులకును దేవరా!

వ. అయిన నే నెఱింగినమట్టుకుఁ బ్రధానకపుల వివరించెద రావణా!

గీ. లక్షమర్కటు లెపుడు జెలంగి గొలువ
ఘనపుళిందానదీతీరమున వసించి
యుండుమేటిబలుండు నీలుం డతండె
సవితృసుతుదళవాయి నిర్జరవిరోధి.

తో: వేయికోట్లకపివీరులు గొలువగ వేగవంతు డనువాడు పాయకయుద్ధము చేయ యత్నపరుఁడై యున్నాఁడదే చూడు ॥ రా ॥

క. గురుతరవింధ్య సుదర్శన
గిరులకు నాథుండు ఘనుఁడు గీశేశసఖుం
డురురణకౌతుకవిపులో
గ్రరణసమారంభుడతఁడు రంభుఁడు గనుమా !

హిం. కాఫి : ఆదితాళము. (రామునంపిన) వలె.

వాఁడే కను మంగదుడు ! వాలినందను డల్లవాడే ! వీడు వాలికన్న మొనగాడు ! పసివాడు గద ॥ వాఁడే ॥ ఏకాదశశతపద్మప్రాకట మర్కటు లతిభీకరముగను గొల్వఁ దోక గదలించుచున్న ॥ వాడే ॥ తానొక్కడే మోక్షగుండధాము కార్యముదీర్చువాని వాలెనుత్సాహము బూనియుప్పొంగుచున్న ॥ వాడే ॥

చ. ఘనముగఁ జందనాద్రికిని గాంతుఁ డనం దగి వేయికోట్లపై
నెనుబదిలక్షసంఖ్యగల యెల్లకపుల్ దను నాశ్రయింపఁగాఁ
దనరి, ఖరారియానతిని దాఁ దగఁ గట్టెను నిన్న సేతువున్ ;
కనుగొను మాతడే నలు ! డ ఖండబలుండు ! సురారిశేఖరా !

తో. నలుబదిలక్షల నాల్గువేల వానరులు గొల్వగాఁ దెలుపు ! బలమును జూపుచు బరగెను శరభుం డలవాఁడే పరికింపు ॥ రామ ॥

క. కుముదుని శాత్రవమానస
కుముదుని దశకోటి ప్లవగ గురుసరససరః
కుముదుని రామవకార్య
ప్రమదుని సంకోచనాద్రి హతినిం గనుమా !

తో. కోరి యెపుడు బదికోట్లమర్కటులు గొలుచుచుండగా నెగడు ! । పారియాత్ర గిరిభర్త యగును నాపననుని గను మల్లతఁడు ॥ రా ॥

గీ. కోటిభల్లుకవర్యులుఁ గొలుచుచుండ
దమ్ముఁ డగుధూమ్రు డత్యంత ధైర్యశాలి
తనకుఁ దోడ్పడ మనదిక్కు గనుచునుండు
జాంబవంతుని జూడు రాక్షసవరేణ్య !

క. డెబ్బది డెబ్బది లక్షల
నిబ్బరపుంగవులుగొలుప నేర్పరులై తా
ముబ్బెడు క్రోధనగవయుల
నబ్బా కనుఁగొంటె ! రాక్షసాధిప వారిన్ !

వ. మఱియు నింద్రజాల గజ గంధమాదన గవాక్ష శతబలి మైంద ద్వివిద సుషేషణ దధిముఖ సుముఖ విముఖులు లోనుగాఁగపిందు లనంతబలసమన్వితులగు మర్కట బలంబు లసంఖ్యాకంబుగాఁ గొలువ యుద్ధసన్నద్ధులయి కాలు ద్రవ్వుచున్నారు. చూడుము నిశాచరేంద్ర !

కేదార : ఆదితాళము. (కోరియుం) వలె.

చూడు! మాతనిఁ । దనుజేశా ! చూడుమాతనిఁ । నాడు లంక జొచ్చినాడు నగరము గాల్చినాడు! యోడక దిరిగినాడు! చనినాడు మొనగాడుగద నేడు ॥ చూడు ॥ మేరుభూధరసమధీరుఁ మారుతవర కుమారుఁ సారపిశంగాకారుఁ రణహరుఁ మణిహారుఁ గపివీరుఁ ॥ జూడు ॥ మోక్షుగుండ పురాధ్యక్షుఁ దీక్షతో గొలుమధక్షుఁ యక్షగజ హర్యక్షుఁ బృథువక్షుఁ రిపుశిక్షుఁ ఫలభక్షుఁ ॥ జూడు

సీ. వేయుకోట్లొకసంఖ్య వెలయఁగనవిలక్ష
కోట్లు మహాసంఖ్య కొమరుమిగుల
నవిలక్షయగుబృంద; మవిలక్షయగు పద్మ
మవిమహాపద్మాఖ్య యగును లక్ష

యవి లక్షయగు ఖర్వ; మవిలక్షయగు మహా
ఖర్వ: మవియు లక్ష కడుసముద్ర
మవిలక్షయయిన మహాసముద్రం బగు
నవిలక్షయగు మహదాఖ్యయవియు

గీ. నూఱులక్షలు గలవు భానుజునిముఖ్య
సేనకడమవి చెప్పఁగా జేతగాదు;
ఇట్టిసేనలఁ గూడుచు నినకులుండు
లంకపయి దండు వెడలె నిశ్శంకతోడ.

వ. ఇంకొక విధంబు వినుము.

సీ. పదివేలకోట్ల ప్లవంగము లొకగంతు,
గంతులు సాహస్రగణనము గమి;
యాగమికోటి కోట్లగు నొకమొత్తంబు:
శతకోట్ల మొత్తంబు జగతి వీడు
వెలయ లక్షక్షోణివీడులైనను సాదు;
సాదు ద్వి సప్తకసంఖ్య మూక;
శతకోటిమూకలు నంగడినాఁజెల్లు;
నవియును నూరుకోట్లగును దట్టు;

గీ. దట్టు లొకయాఱు గూడినఁ దగును వెల్వ
నిండివెల్వలు డెబ్బదిరెండు గొల్వ
రామచంద్రుండు నీతోడ రణ మొనర్ప
నరుగుదెంచి సువేలాద్రి యందు విడిసె.

తో: కావున నాతనిఁ గదిసి పోర శక్యముగా దో యసురేంద్రా! నావచన
సమ్మితివేని ఘనంబుగ మనెదు జితేంద్రా! ॥ రా ॥

క. జగములకుఁ దల్లిదండ్రు ల
నఁగఁ దగువారివయి నలుగ న్యాయం బగునా!

జగతీతనూజ నొసఁగియుఁ
దగ రాముని శరణుఁ జొరుము దయ మన్నించున్.

జంఝూటి : ఆటతాళము.

క్షణభంగుర దేహమును నమ్మబోకు ! మనమున నింకనేమటి యుండబోకు ॥ క్షణ ॥ మలమూత్రములకొంప, మలినయుతంబు, మజ్జాస్థి శోణితమాంసపూరంబు ॥ క్షణ ॥ మటి యిట్టిదేహాభిమాన మేమిటికి ! మఱచి మం దెఱుఁగక మురిసే విప్పటికి ॥ క్షణ ॥ ధర మోక్షగుండేప దరిచేరితే నీకుఁ బరమపదం బిచ్చి భయము దీర్చును ॥ క్షణ ॥

వ. అని శుకచారుఁడు బోధించినఁ గుపితస్వాంతుండయి చుఱ జుఱఁ జూచుచు,

తో : ఓరిదురాత్మక, చారుఁడ వని నినుఁగోరి నేను పంపగను । వారక శాత్రవ పక్షమూని యాకాఱులు బలికెద వగును ॥ రామ । నిన్నివ్వాడు మన్నింపక జంపక నేడు మదిని దలచియును । గ్రన్నన నీ పూర్వస్థితి దెలియదుఁ గాన విడిచితిని నేను ॥ రామ ॥

వ. ఇఁక బ్రొమ్మనుడు నతండు చవియె పూర్వంబున శుకుండను సుర్వీసురుండు గీర్వాణులు వృద్ధియగుటకుఁ బూర్వగీర్వాణుల గర్వంబు నశించుటకు నంకల్పించి పెక్కు క్రతువులు చేయుచున్నంత-

తో : వచ్చెరాక్షసుఁడు వజ్రదంష్ట్రు డనువాడు మోసగింపగను । విచ్చలవిడిగా విహరించుచు దటి వేచియుండు ముదమునను ॥ రామ ॥

వ. కుంభసంభవుండు ననుదెంచి యన్నం బడిగి స్నానంబున కరిగిన రాక్షసుం డగస్త్యుని రూపంబున వచ్చి,

మత్తకోకిల-' మేఁకమాంసము బెట్టు నాకును మేదినీసుర ' యన్న, నేఁ
గాక నా శుకభార్యరూపము గ్రక్కునన్ ధరియించియున్
బాక మొప్పగఁ జేసి యమ్మువి వచ్చినంతనె పెట్టె దా
జోఁకతో నరమాంస మన్నమునూపశాక పదార్థముల్.

వ. భుజించి శుకునిపైఁ గనలి యయోగ్యం బగునరమాంసంబు నాకుఁ బెట్టించితివి ! నీవు రాక్షసుండవు కమ్మని శపించిన, నతండు నేను నిరపరాధి నని వేఁడె. దివ్యదృష్టి చేత నది రాక్షసకృత్యం బని తెలిసి.

సురట : ఆదితాళము.

సరే సరే నిను శపించితిని నిరపరాధి వనుకోక: మదిలోఁ బరం బెఱుగ లేక। మదీయ వాక్యము వృథాపోదు; నెమ్మదిఁ దెలిసికొమ్మ? ఇదితప్పు దంచు ననుకొమ్మ ॥

సురారిరూపము ధరించి దశకంధరుఁ గొలుచుచుండు, మిఁక ముందరఁ మేలు గూడు। ధరఁ మోక్షగుండరాఘవుని సోదరాన్వితంబుగను గాంచిన హరించు శాపమును ॥

ఉ. వానరసేనఁ గూడి రఘువర్యుఁడు తమ్మునితోడ లంకపై
దా నరుదెంచినప్డు సముదారత వారినిఁ జూచి వచ్చి యా
దానవ భర్తకుఁ దెలిపి తత్త్వవిచారము బోధచేసినఁ
మానెడు శాపమంచుఁ గరుణఁ గలశోద్భవుఁడానతిచ్చినఁ.

వ. ఆప్రకార మాచరించి శుకుండు శాపవిముక్తుండై చనియెఁ బార్వతి! యంత రావణుం డెప్పటిచోటఁ గొలువు దీరయుండె అక్కడ రాముండు లంక చతుర్ద్వారంబులఁ గపులు ముట్టడించునట్లు చేసి యుద్ధమునకు ముందొక్క బుద్ధిమంతుని సంధికిం బంపిన బాగని యెంచినీతి కుశలుండగు నంగదునిగని యందఱు విన నిట్లనియె:

క. అంగద, రయమున రావణు
చెంగటికిం బోయి భీతిచెందక నీ వు
ప్పొంగుచును గొన్ని ప్ర
సంగంబులు జేసి రమ్ము సత్వరయుక్తిఁ.

హిం. కాఫీ : అటతాళము.

ఇనకులుం డగు రాము డిదె దం డెత్తినా డను మంగదా! నిను సుతామాత్యాళి తోడను దునుమ గల డను మంగదా! ॥ ఇనకు ॥

ధాతచేఁ గొన్నట్టివరములు దప్పె నను మోయంగదా! సీత నిచ్చియు శరణు జొచ్చిన జెఱుపురాదను మంగదా! ॥ ఇనకు ॥

పోరి తఱుమగ దేవమౌనులు గా రటం చను మఁగదా! గారవించి విభీషణునకుఁ- గట్టె లంకను మంగదా! ॥ ఇనకు ॥

మోక్షగుండపురీశుతోఁ బ్రతికక్ష పద్దనుమంగదా! దీక్షతోఁ గార్యాంతమున జింతింప వద్దను మంగదా! ॥ ఇనకు ॥

అంగదుని రాయబారము.

వ. ఇట్లుతెల్పిన నంగదుఁ డత్యానందభరితుండయి శ్రీరామునకు నమస్కరించి సుగ్రీవాదుల యనుమతంబు వడసి పవ్ఫుతాకారుండై లంకఁ బ్రవేశించి పురశృంగారంబు దిలకించుచుఁ బోయిపోయి రావణుని గొలువుకూటంబుఁ జేరి యిట్లనియె.

క. ఎవ్వరివాడవు వానర ?
యెవ్వరు పంపంగ వచ్చి తిప్పుడుసీ ? విం
కెవ్వరితోఁ బనియున్నది ?
యెవ్వరు నీ తల్లిదండ్రు లెఱిఁగింపు తగన్.

వ. అనిన, నతం డిట్లనియె:

కళ్యాణి : రూపకము.

వినర రావణా! రఘువీరుఁ డంపినట్టి భటుడను నే ॥ వినర ॥ నిను జలంబుమీఱి వాలమున నిను గట్టి వార్ధులందు ముంచినట్టివాలికిని సుతుండ నౌదు; నంగదు డను ॥ వినర ॥ గట్టిగా నిన్నుఁ జయించినట్టి కార్తవీర్యుజంపినట్టి పరశురాము గెల్చినట్టి మేటిహూరు డగు రఘుపతి ॥ వినర ॥ మోక్షగుండ దేవునాజ్ఞ దీక్షనీతో మాటలాడ రాక్ష సుండ వచ్చినాడ రాజసంబుతోడ దెలుపుదు నిక ॥ వినర ॥

వ. అని పలికిన విని రావణుఁడు దురాగ్రహుండై యిట్లనియె;

చ. మును పొక కోఁతి వచ్చి తనముచ్చట లెల్లను జూపి తాను న
మ్మనుకులదూత నంచు హనుమంతుఁడ నంచు వచించి మేము దం
డన మొనరింప సిగ్గుపడి నాటికి బోయెను; నేఁడు నీవు రా
మునకును దూతనంచు ఘనముఁ దలపోయుచు వచ్చితో బళీ!

క. ఆ కోఁతికి శుభమే! గద!
నీకథ లేవియొ వచింపు నేర్పుగ నిచటన్
మేకొని దూతలఁ బంపఁగ
రాకునికిన్ బ్రేలెదవు పరాకున మీఱన్.

వ. అనిన నవ్వి యంగదుం డిట్లనియె :

తో : రావణునకు నోడి రయమున వచ్చితి వీ వని కపులందఱును। నావనచు నవహాస్యము జేయఁగ నతఁడు చనియెఁదందరను ॥ రా ॥ వానిని నన్నును భానువంశజుని సేనలలో నినజుండు। హీనబలుల మని యెంచి యిట్టిపను లైనఁ జేయుడనుచుండు ॥

వ. కాఁబట్టి వచ్చుచున్నాము, తక్కిన విషయము నీ కేల: వచ్చిన ముచ్చట యుచ్చరించెదఁ జెచ్చెర వినరా! రావణా!

తోడి : ఆదితాళము.

ఓరి రావణ! చూడుమురా! ప్రియమున నాలింపర ॥ ఓరి ॥ లోకంబులకును దల్లి జనకసుత నీకు దల్లిగా దటర దురాత్మక! ప్రాకటముగ నీకులము జెఱచుటకు చేకొని వచ్చియు జెఱఁబెట్టితివట ॥ ఓరి ॥ నీదు పుత్రమిత్రాది బలంబులు నీల్గకముందే యెఱుకగలిగి యమ్మేది నినుతసిడి మోక్షగుండపతి పాదపద్మముల ప్రాపున జేరుము ॥ ఓరి ॥

తో. బలవద్వైరము బాగుగాదు చలపాదితనంబును మాను। అలవిభీషణునివలెనే రాముని నాశ్రయింపు మేలౌను ॥ రామ ॥ విను నాబుద్ధిని; వినకుండిన నీవు మనుట యబద్ధము ధరను। అనుఁగు జెలులఁ జుట్టాలఁ జూచికొను ఋణము బాయుముందరను ॥ రామ ॥

వ. శ్రీరాముని కోపాగ్నికి నెదురులేదు, నిర్భయంబున నుండకు రా దౌర్భాగ్యా! కార్యాంతమున, చింతించు ప్రయోజనము లేదు. అని నుడివిన, నంగదునిపయి నలిగి రావణుం డిట్లనియె :

కీర్తన ఆటతాళము. (కలియుగ) వలె

త్రిజగద్భయంకరు డని, తెలియ వేమిర నన్ను ॥ త్రిజగ ॥
నిజముగ నిర్భయముగ నిలిచి మాట్లాడెదవు ॥ త్రిజగ ॥
కైలాస మగలించితి! దిక్పాలకుల జయించితి!
పాలించితి బహుకాల మెదు రేమి లేక ॥ త్రిజగ ॥
వేధోదత్తవరమున సాధించితి లోకములు!
బాధించితి మునుల, నరాధము లెంతటివారు ॥ త్రిజగ ॥
ఔను నీతండ్రివగ యైన దలంపక నీవు
వానిఁ గూడినావు! నిను నే నటుల జేయుదునె ॥ త్రిజగ ॥

అంగదా, నాముందర బొంగి మోక్షగుండరఘు
పుంగవుని భట్టువలెఁ బొగడెదవు సిగ్గుమాలి ॥ త్రిజగ ॥

క. పగవాఁడు దండు వెడలిన
జగడమునకు దీటుకొనుటఁ చదురగు; నిటులన్
జగతీశులెల్ల నవ్వఁగ
మగఁటిమిచెడ సంధిచేత మగతనమగునే.

తో. నగుబాటునియెన్నక నాతమ్ముఁడు నాసుపలిగి యటు జని బెగడున రాము
శరణుజొచ్చె నీ జగపుచాలుఁబోవోయి! ॥ రా ॥

అంగద - రావణసంవాదము

సురటి : ఆటతాళము

అం- రామప్రతాపము రాక్షస యిసుమంత నీమది దెలియ వే ॥ మది ॥
రా- రాముసామర్థ్యము నాముందు వర్ణింపరాకుము పలుక బోకుము ॥
అం- వేడుకతో చిన్ననాఁడె తాటక, జంపినాడురా! విడువ బోడురా
రా- ఆడుదానిని జంపినట్టిశూరత్వము లాడకు- యిచట వేడకు ॥
అం- నీ వెత్తలేనట్టి నిటలాక్షువిలుద్రుంచె నేర్పుగ కడునోర్పుగ ॥
రా- ఆవిల్లు మోపెట్టు టదియెంత! ప్రాతది యౌనుగా విరిగిపోవుగా ॥
అం- పరశురాముని బాహుబల మడగించిన బంటురా యేలకంటురా ॥
రా- ధరణీసురుని ద్రుంచుదర్పము, జెప్పకు! తాళురా యికజాలురా
అం- మోక్షగుండేశుఁడే ముదమున నిను జంపఁ బుట్టెను పడగొట్టును!
రా- ఈక్షితిని నెటులైన మోక్షము దప్పదిం కేటికి దెలుప మాటికి ॥

క. బలవంతుడైనవాలికిఁ
గలిగిన నీయంతవాఁడు కడునీచముగా
బలహీను లయిన నరులను
గొలువఁగ ఫల మేదిరోరి కులనాశకుఁడా!

తో. వైరిదప్ప నెవ్వారు దొరలు భువి లేరా! కొలువొనరింప నేరపు రాముని నేడు విడిచి యిఁక రారా నను సేవింప ॥ రామ ॥ వచ్చిన నీకును వానరరాజ్యం బిచ్చెద వారిని గెలిచి ఇచ్చగ సుఖమ్ముగ నిరుపుర ముందము ఎఁకిగించితి దయఁదలఁచి ॥ రామ ॥

వ. అనిన, నంగదుండు——

కీర్తన ఆటతాళము, (రామకృప) వలె

చాలుర చాలుర చాలుర రావణ! మేలుగ నీ యనుకూలము నాకక ॥ చా ॥ కాలము దీఱెను గావున నీ పిటు ప్రేలెదు పిల్లలు పెద్దనుకొనక ॥ జాలుర ॥ తల్లియుఁ దండ్రి యు దాతయు దైవమునెల్లరు శ్రీరఘువల్లభుఁడే యగు ॥ జా ॥ మోక్షగుండేశునిచె క్షణమున రాక్షస చెడెదవురా ముమ్మాటికి ॥ జాలుర ॥

వ. అనిన రావణుండు కోపోద్దీపితమానసుండయు రాక్షసులంగని యీపరపక్షపాతి నీక్షణంబున బట్టి కట్టుండని యానతిచ్చినవారు జెలరేగి మూఁగిన దనలావు గనఁబఱుచుట కయి యంగదుండు జిక్కి పిమ్మట——

తో: ఆకాశంబున కప్పుడె యెగసియు నటు నిటు విదలింపగను, నేలఁగూలిరి పదివేలరాక్షసులు విగతాసువులైధరను ॥ రా ॥

గీ. రావణుని కొల్వుచవిక వేరమునఁగూలఁ
దన్ను నది శిథిలంబయి ధరణిఁగూలె;
నలిగి దశకంఠుఁ డంపగా నసురవరులు
నరి మురిఁ వాని ముట్టి మట్టాడఁ దొడఁగ.

వ. వారి నందఱిని గ్రమంబుగ జముమందిరమునకుఁ జేర్చి వేగంబున రామచంద్రునిం జేరి నమస్కరించి యిట్లనియె.

బేహాగ్ రాగము : ఆదితాళము

రఘువంశశేఖరా! రణరంగభీకరా! యఘదూర! శ్రీకరా! యమిత కృపాకరా! ॥ ర ॥ మీయాజ్ఞ నెఱవేర్పఁ బోయితి; నాతడు వేయేల సంధికీయకొనననెను ॥ ర ॥ చావఁగఁదెంపుగావించి సొంపుజేవయుజెడడు; చెప్పినవినడు ॥ ర ॥ శ్రీమోక్షగుండధామ కోదండరామాయితండు రాజికి రాడు ॥ రామ ॥

వ. అంత సువేలవిడుదలలందు యుద్ధసన్నాహంబు చుఱుకుగ సాగుచుండె. అక్కడ రాక్షసభటులు రావణుని జూచి.

ఉ. దేవ ! వరాక్షు ! వానరుఁడు తేఁకువ దానవసేనఁ దూఁటి తాఁ
బోనఁగ మిన్నకుండితివి; పొమ్మని మాకు ననుజ్ఞ యిచ్చినన్
లావు జవంబు మీఱఁ గపులన్ మనుపంక్తులఁ గూల్చి వత్తుమో
రావణ! పంపు మంచు వివరంబుగఁ బల్కిన నాతఁ డంతటన్——

వ. ఇట్లు తన వైభవంబు రామునకు, గనఁబఱుపఁదలఁచి దివ్యవస్త్రాభరణంబులు ధరించి సమస్తపరిచారకు లుపచరింప రాక్షసగణ పరివేష్టితుఁడై చని యుత్తరగోపురంబందుఁ గొలువుదీరినఁ గాంచి విభీషణుని వలన రావణుఁగా నెఱింగి రాముండు వాని గర్వం బడంచువాఁడై.

తో. అనుజునిచే విల్లంది దానియం దర్ధచంద్రబాణమ్ము! ఘనముగ దొడిగియు నెఱిఁగి విడువ నది చని కిరీటదశకమ్ము ॥ రా ॥ క్షితిఁగూల్చియు బొది; జేర, రావణుఁడు, సిగ్గు బొంది కడునోలి! యతివేగంబున నాత్మభవనమున కప్పుడె చనె ధృతిదూలి ॥ రామ ॥

వ. ఇట్లింటికిఁ బోయి రావణుండు మరలఁ గొలువుఁదీరి రాక్షసులంగని రాముని బలంబులు నాల్గుద్వారంబులఁ గవిసి పురంబుఁ బ్రవేశించుచున్నవి కాఁబట్టి, యీక్షణంబున—

హరికళ్యాణి : ఏకతాళము - (అమితోగ) వలె.

అసురేంద్రులారా ! యాజికి మీర లతి శౌర్యమొప్ప నరుగుడింపారఁ జేర ॥ నసు ॥ అరులను ముట్టి, యురికినబట్టి, ధరఁ బడగొట్టి, నుఱుముదు మట్టి మట్టి ॥ యను ॥ పగవారి మూఁక భయమేమిలేక దగవచ్చెఁగాక తఱమనొ గాక వీక ॥ యసు ॥ ధరమోక్షగుండవరుని కోదండహరుని రాకుండ నాగుడు లెండ పొండ ॥ యను ॥

వ. అని పురిగొలిపిన నప్రకపరాక్రమంబులు మీఱ వీరావేశంబునఁ గ్రూరరాక్షసులు లెక్కకు మిక్కుటంబుగా సమరసన్నాహ కుతూహలుల భేరీభాంకారరవంబులుఁ, గరులఘీంకారంబులు, ధనుష్టంకారంబులు దిగంతంబులు ప్రతిధ్వనులీయఁ గదలి భుజాస్ఫాలనంబులు చేయుచు,

—— యుద్ధారంభము ——

తో. నాలుగువాకిండ్లను మూఁగిన యా నగచరసేనల దగిలి, చాలుగ యుద్ధము, నలుపగ బూనిరి నమరశూరులై మిగిలి ॥ రా ॥

వ. మేఘనాదుఁ డంగదుని, ప్రజంఘుఁడు సంపాతిని సతికాయుండు వినత రంభులను, మహోదరుఁడు సుషేణుని, మహాకాయుండు జాంబవంతుని, విద్యుజ్జిహ్వుండు శతబలిని, విక్రమధనుండు బలిని, గుంభుండు ధూమ్రుని, దేవాంతకుండు గవాక్షుని, సారణుండు వజ్రనాభుని, త్రిశిరుండు శరభుని, నరాంతకుండు పనసుని, అకంపనుండు గుముదుని, ధూమ్రాక్షుండుగేసరిని, మహాపార్శ్వుండు గంధమాదనుని, కంపనుండు నలుని, జంబుమాలి హనుమంతుని, మిత్రఘ్నుఁడు విభీషణుని, ప్రహస్తుండు సుగ్రీవుని, వజ్రముష్టి మైందుని, అశనిప్రభుండు ద్వివిదుని, నికుంభుండు నీలుని, విరూపాక్షుండు లక్ష్మణుని; సుప్తఘ్న – రశ్మికేతువులు, యజ్ఞ – కోపాగ్నికేతువులునలుగురుశ్రీరాముని, మఱియు ననేక వానరయోధులతో ననేక దానవదళంబులు దలపడి ప్రథమ యుద్ధంబున శరవర్షంబులు గురిపించుచుఁ దరుశైలపాషాణాదులు వైచికొనుచు ముష్టియుద్ధంబులకుఁ జొచ్చుచు ముసల ముద్గర ప్రాస పరశు భిండివాల తోమరంబులచే నడిచికొనుచు సంకులయుద్ధంబునకుఁ దగుల్పడిరి పోరు ఘోరం బయ్యె! నప్పుడు —

తో: రాముని భటుల పరాక్రమమున కల రావణసైన్యము లాఁగి। యేమాత్రము సహింపగజాలక భూమిని గూలిరిలోఁగి ॥ రా ॥ కొందఱు దగ్గిరి; కొందఱు జచ్చిరి; కొందఱు భయపడి చనిరి; కొందఱు సందుల గొందుల దూఱిరి; కొంద ఱెమరలే మనిరి ॥ రా ॥

వ. తన బలంబులు నశించి పరబలంబులకు జయము గలుగుటఁగాంచి యింద్రజిత్తు యుద్ధంబు మాని నవనశాల కరిగి హోమంబుజేసి యజ్ఞేశ్వరునివలన దివ్యరథ – రథ్యంబు లును దివ్యాస్త్రకవచ – కిరీటాదులును గ్రహించి యుద్ధమునకు వెడలె, ఇక్కడ రాక్షస కాంతలు—

జంఝూటి : త్రిశ్ర జాతి.

ఇఁక నేమిచేయుదమమ్మ! యిదేమికాలమమ్మ! యీపోరు మానరైరి! యిలమీఁద మనవారి బ్రతుకు లేమో నిజములేదు! ఎవరు దెలిపిన నెంతమాత్ర మెఱుఁగ నొల్లడే! యెంతమూర్ఖుఁడే! ॥ ఇ ॥ చలపాదిదశకంఠుడు గెలువగ దలచినాడు! అలమోక్షగుండ విభుని బలవిక్రమముగానఁడు! అకటా! కులనాశకుడు వీడు నిలుపరైరిగా! జలజమిత్రు డస్తమించిన గాని మానరు ॥ ఇ ॥

వ. ఇట్లు చింతించునంతలో నస్తమించి చీఁకట్లు గ్రమ్మిన నింద్రనీల మేఘంబుల చాటున నిలిచి మాయాయుద్ధంబుఁ జేయుచునారులు కగపడకుండనున్న నతనిఁ గనుఁగొని యుద్ధంబుజేయ వానరులు సమర్థులుగారైరి.

గీ. వానరుల నెల్లఁ బటుబాణవర్షమునను
ముంచి నాగపాశముల బంధించె నపుడు
రామలక్ష్మణులను బరాక్రమము మెఱయ
నింద్రజిత్తు మహోగ్రహం బినుమడింప!

వ. శరీరంబు ధరించినపుడు హరిహరాదులకయినఁబురాకృతం బనుభవింపకపోవునా! ముందు బలిని బంధించిన కారణంబున రాముండు నాగపాశబద్ధుండయ్యె అంత నింద్రజిత్తు తన విజయంబుఁ దండ్రి కెఱింగించిన నంతసించి రావణుండు త్రిజటను బిలిపించి,

కీర్తన : త్రిశ్ర జాతి (వనమున) వలె.

సమరము జూపు రమణీ! కమలాక్షి! సీతకు నేఁడు ॥ సమర ॥ క్రమముగఁ గపులు రాక్షసానీకము జేయు ॥ సమరము ॥ ఒడబడదాయె దరుణి గడువేడ్క నాతోడఁ గూడ! నొడబడ! వడినాగపాశబద్ధుడై శ్రీరాముఁడున్న ॥ సమ ॥ ధర మోక్షగుండవిభుడు దనుజులగెల్వలేడు! ధరనో విరిబోణీ యానవిడు మంచు బోధింపుము ॥ సమరము ॥

వ అంతట.

గీ. త్రిజట లోనగు రాక్షసస్త్రీలు సీత
నొక్క పుష్పక మెక్కించి యుక్కు మెఱసి
సంగరస్థలిఁ జేర్చి ప్లవంగవిభుల
రామలక్ష్మణులను జూప రమణి గాంచె.

వ. కాంచి జానకీదేవి ఇట్లు వగచుచున్నది.

ముఖారి: ఆదితాళము.

నీకు బ్రహ్మ యిటుల వ్రాసెనేమో! శోకము నిలువఁజాలను రాఘవ! ॥ నీ ॥ ప్రాకటతల్పము - పాప మని యందురు । నీకుబంధకమాయెను! రాఘవ! ॥ నీకు బ్ర ॥ వెలయగ గార్మికవిద్య యేమాయె! దైత్యులకు లోబడవలసెను! రాఘవ! ॥ నీకు ॥ దనుజులఁ బొడిచియు నను జెఱబాపెద వనియుంటి నది తప్పెను । రాఘవ! ॥ నీకు ॥ నాకిక యెవరు మోక్షగుండనాయక । నే నకటా దురదృష్టరాలను! రాఘవ ॥ నీకు బ్రహ్మ ॥

వ. అని బహుభంగుల విలపించు సీతను గాంచి త్రిజట యిట్లనియె :

చ. భయపడనేల నీపతికిఁ బ్రాణభయం బినుమంతలేదు; ని
శ్చయముగ రాక్షసాధములఁ జంపఁగఁ బుట్టినమేటి యెవ్వ రెం
తయు, జెనకంగఁ బొల్వడరు! దానవమాయలుమాపి నిన్నునీ
ప్రియుఁ డసురక్తిఁ గౌఁగిట భరించెడి; సెప్పుము తల్లి! మేలగున్.

వ. ప్రాణంబులు వాసిన వనచరు లింత చింతదక్కియుందురా. కర్మసంచిత మిట్లుండ కొంచెము చిక్కువడిరి! కాని వెఱవవలదు. అని సీత నశోకవనమందుఁ జేర్చె నిక్కడ రాముండు గొంతవలకు గన్నులు దెఱచి పాశబద్ధుఁ డయియున్న తమ్ముని విగత జీవునిఁగా నెంచి.

ఆసావేరి : ఆటతాళము.

కొమ్మను సాధించుకొన వచ్చె సుగ్రీవ! తమ్ముని గోల్పోవలసెఁగా! నేసిచట సమ్మతి నాసేవ నలుపుచు జనుదెంచె! సౌమిత్రిగుణ మెన్నఁజాల యీవేళ ॥ కొమ్మను ॥ తల్లి సుమిత్ర నాతనయుడేడని యడుగ సల్లన నామె కేమందు । నెటఁగందు । నల్లమోక్షగుండ వల్లభు నాజ్ఞను నొల్లమనుచుఁ ద్రోయువారు ధర లేరు ॥ కొమ్మను ॥

తో. లక్షణయుతుడగు లక్ష్మణుబాసి యరక్షణ ముంచఁగ జాల! । నీక్షణమ్మునం దమ్మునివెంటనే ఇహము దొఱంగమిమేల ॥ రా ॥

వ. అనంతరము రావణుండు మిమ్ముబాధించుఁ గాన, సంగద యుతంబుగా నీవు కిష్కింధకుఁ జనుము సుగ్రీవా! యనునంతలో —

తో. వనచరయూథము వగవ విభీషణుఁ డనుతాపమ్మునఁగాంచి అని మొన మార్కొని వెనుకకుఁ దగ్గుట యను వధైర్యమటుడించి ॥ రా ॥

వ. ఇది యుద్ధకాలంబుగాని శోక కాలంబుగాదు. జయాపజయంబులు దైవాధీనం బులు లెండు లెండు! మేఘనాదుండు వెండి యుద్ధంబునకు వచ్చియున్నాఁడు. అనవుఁడు, వాలిపుత్రుండు —

తో: ఔను మిత్ర! నీవన్నమాట సత్యమ్మ రామలక్ష్మణుల బూని యేమఱక బ్రోవుఁడు; నే జని పొలియింతును రాక్షసుల ॥ రా ॥

వ. రాక్షసక్షయంబుసేసియా క్షమాపుత్రిని ఈక్షణంబునఁ దెచ్చి రామునకు ఇచ్చెద. అటుగాదేని ప్రాణంబులు దానవుల కెఱఁజేసిలక్ష్మణుని వెంటఁ బోయెద ననుచుండ, సుషేణుండు —

క. వెఱపకుమడు నాగపాశము
సురలఁగ ద్రోణాద్రియందు సున్నవి మందుల్!
గరువలిసుతు నంపుడు వే
గిరమున నవి దెచ్చు పసనుఁ గీడు దొలంగున్.

వ. అనుచుండ నింతలో విపంచిని ధరించి నారాయణధ్యానంబు జేయుచు నారద మౌని వచ్చె ఎటులనిన —

హంసధ్వని : ఆదితాళము

కోదండధృతకరమ్ భజేహమ్ ॥ కో ॥ వేదవేద్యమ్ విరాధహమ్ ॥ శ్రీకో ॥ వాగీశహృత్పంకజసదనమ్ వరశశాంక సన్నిభమృదువదనమ్ యోగిపాలనమ్ భోగిశాయినమ్ నాగభూషణమ్ నతజనావనమ్ ॥ కో ॥ ధారాధరశ్యామలగాత్రమ్ నారాయణకవివినుత చరిత్రమ్ సారస నేత్రమ్ సజ్జనమిత్రమ్ ధరాస్తోత్రమ్ దితిసుతజైత్రమ్ ॥ కోదండ ॥ పక్షీంద్ర గమనమ్ సురపాలమ్ । మోక్షగుండనత్పురవర శీలమ్ అక్షరశీలమ్ ఆశ్రితజాలమ్ అనుపమ ఫాలమ్ అబ్జాలోలమ్ ॥ కోదండ ॥

ద్విపద: అని యిట్లు చనుదెంచి యానారదుండు
మనుకులపతికి నమస్కృతిఁ జేసి,
దేవరవారికి దెలియనిదేది!
రావణు జంపు కారణమున ధరణి
నరుఁడవై పుట్టిన నారాయణుఁడవు
కర మర్థి నజ్ఞానికరణి బల్కెదవు!
మానులచిక్కులలోఁ జిక్కుఁబాపు
నీకు జిక్కులు గలునే యేటిమాట!
అదె చూడ నీయవయవములయందు
పదునాల్గు భువనముల్ ప్రబలియున్నయవి!
సర్వంబునీవె నిశ్చయ మగునమ్మ!
పూర్వపువాహనంబును స్మరియింపు

వైనతేయుఁడు దాను వచ్చినంతటనె
యీనాగపాశంబు లెల్లను వదలు
నటుచేయు మనిచతురాస్య నందనుఁడు
పటుమతి దీవించి పాఱెను దివికిఁ
బిమ్మట రాముండు వెనుకటిరూపు
నెమ్మదిఁదలపోసి నిక్క మూహించి,—

తో : గరుడుని దలచిన క్షణమాత్రములో నరుదెంచియు వారలను । స్థిరముగ బంధించిన యురగంబులఁ దఱిమి దాఁటె మేరలను ॥ రా ॥

క. అంతట వానరు లెల్లను
సంతసమున మేను మఱచి చారులపలనన్
వింతగవిని దశకంఠుఁడు
పంతంబున ధూమ్రనయనుఁ బంపెఁ గలనికిన్.

వ. రాక్షసభటులు లక్షోపలక్షలు గొలువ ధూమ్రాక్షుండు తత్క్షణంబున రావణానుజ్ఞచే యుద్ధంబునకు వెడలి.

## ధూమ్రాక్షయుద్ధము :

తో : పటుపటార్భటుల దిక్తటములు బెటలి పడగ నరదంబు । దటుకునఁ బఱపుచు బటుహాభేరితమ్మటమృద గరావంబు ॥ రా ॥

వ. చెవులు బీటలువాఱ మ్రోయుచుండ రణభూమికిఁ జేరి వానరులఁబొదివి,

## కీర్తన : ఆదితాళము. (మాతామ) పల్లవి.

మానవుల గూడి మీరు మమ్ము గెలువ వచ్చినారు! కానిలే చూతము రం డిక ॥ ఓకోతులారా ॥ మానుగ నాపైకి లెం డిఁక గొండలు నడవులు దిరిగి పండ్లు కాయలను దినియుండినట్టి పనులుగావివి ఓకోతులారా ॥ గుండెపగులు యుద్ధభూమిది ॥ మోక్షగుండ దేవుడైన మన్నింపఁగలడె మమ్ము! రాక్షసు లనుచు దెలియరో! । ఓకోతులారా యీక్షితి గూలుట గానరో.

వ. అని పలికి శరపరంపరలు పఱపిన, దరుచరులు నరకుగొనక దరుగిరులచే వాసిసి విరిగింపుచు వీరు వారుఁ బోరుచుండిరి. అంత హనుమంతుండు ధూమ్రాక్షుని గదిసి శంఖధనుష్టంకార మొనర్చినఁ, బంకజాప్తకులుని కింకరులమగు మావంకకు నిశ్శంకుఁడ వయి వచ్చి పెంకెతనంపు ఱంకెలేల! బింకంబు మాని లంకకుఁ జేరుము. వంకరటింకర మాటలాడిన నీతల పెంకులుపెంకులు చేయుదునురా కుంక! యోరోర! నీ కింతమంకా! అనియొక్క మొత్తుమొత్తినఁ దత్తరంబు నొందక—

తో: గదచే మోదిన జెదరక మారుతీ కరమున నొకగిరి బూని । గదిసి వైవ రాక్షసునిమస్తకము ప్రిదిలి కూలె ధరపైని ॥ రా ॥

వ. అంతకుముందే వానిభటులు వానరులచేతఁ జచ్చిరి. హతశేషులవల్లన నీ వార్త విని రావణుం డకంపనుని బంపిన,

## అకంపనయుద్ధము.

తో: విలయకాలుఁడో! యిత డని వానర వీరులు గనుచుండగను । బలముల గూడుక పరతెంచె నకంపనుడు రణముచేయగను ॥ రా ॥ వచ్చిననాతని భటవర్గంబులు చచ్చిపడఁగ వానరులు । చెచ్చెర మోచుక వచ్చియు వైచిరి హెచ్చుగ దరువులు గిరులు ॥ రా ॥

క. ఉప్పరవీదిక నెగయుచు
నప్పు డకంపనునివయికి హనుమంతుఁడు దాఁ
గుప్పించి దుమికి పొడిగా
గుప్పన రథరథ్యములను గూలిచి పలికెన్.

వ. సిలింపులగుంపులు గుంపులుగాఁ దఱిమినట్టితెంపుఁ జూపింప ఱంపులు చేయుచు వచ్చితివి. నీసొంపు వదలించి నిన్నుఁ జంపిదక్షిణంపు సామి కొంపఁ జేరఁ బంపనా, నీ దుంప దెంపనా! యోరి యకంపనా । యని యొక్క కొండతో మోదిన, గుండెపగిలి యతండు గూలె. ఆ సంగతి యెఱింగి దశముఖుఁడు—

## మహాకాయుని యుద్ధము.

క. తనతనయు మహాకాయుని
నని కేగు మటంచుఁ బంపఁ నాతఁడురోషా

సనుఁ డగుచు భటులు మంత్రులుఁ
దపవెంబడిఁ గొలిచి రా నుదగ్రత వెడలెన్.

వ. ఇట్లు వెడలి మహాకాయుని మంత్రులగు రుధిరాశన వజ్రనాభ కాలదంష్ట్ర కాలకల్ప పాపక శతమాయి ధూమ్ర దుర్ధరులనువారు క్రమంబున బృథు పనస మేఘపుష్ప గవాక్ష ఋషభ గజ క్రోధన శతబలి తారులఁ బొదవి,

తో: శరవర్షంబులు గురిపించుచు భీకరముగ సమరము జేయ। నరిమురి నపి లక్ష్యము జేయక తరుచరులు గిరులు గొని వ్రేయ ॥ రా ॥

వ. రాక్షస మంత్రులు వీరంబులు సెడి యిలఁ గూలిరి. తక్కిన భటులు వానర సేసల నెదిరించి హతులయిరి. అది గని మహాకాయుని తమ్ముఁడు మహానాథుఁడట్టహాసంబుఁ జేసిన, వాని దెబ్బలకు వానరులు భీతిల్లిరి, అప్పుడు నంగదుం డెదిరించి,

కమాచ్ : రూపకము. (చెటాడడు.) వలె.

పడి జూపకుమా నీదు పడి ॥ వడిజూపకు మల్లదెమీవారలగతి జూచుచుండి మిడుతలు బావకునిమీద నడచినగతి నరుదెంచితి ॥ వడి ॥ శిక్షింపగనూ మిాచేగా దికను; మోక్షగుండదేవు కృపావీక్షణమున సంతత రణదక్షుల మగుదుము; బోరగ రాక్షస నీ వెంతర! నీ ॥ వడి ॥

వ. అని పలికి భీకరమగు నొకవ్రూను చేకొని యొక్క దెబ్బ దీసినం గేకవేసి యతండుకూలె. అంత మహాకాయుండు దమ్ముని చావుఁ గని రోషానల జాజ్వల్యమాన మానసుండయి కపిసేనపయి రథమును బఱపె.

పంచచామరము.

అరణ్య భూములందుఁ గాయ లాకు లారగించుచుక్
జరించువానరుల్ నరుల్ ప్రశస్తవీరు లట్లదీ
పరంబుగా రణంబుఁ జేయ వచ్చినారు మేలునా
శరాళికోర్చి యుండు డంతె చాలు మెత్తు మిమ్ములక్.

వ. అనిన వానరలు—

ఉత్సాహ.

మిట్టిపడ్డ సోదరుండు మృత్యువాతఁ జిక్కఁడే ।
పట్టిపొట్టఁ గ్రొవ్వుమాట వాఁగ వీరధర్మమా ।
గట్టివాఁడ వయిన నిలుపు కదన రంగమందు నిన్
మట్టిసేతు మొక్కసారి మర్మముల్ గలంచుచున్.

వ. అనిన వాఁడు మహోగ్రహ సమగ్ర విగ్రహుండయి పెక్కమ్ములు ప్రయోగించె. కొంచెముసే పోర్చియు సైరింపలేని వానరుల నిలువరించి యంగదుం డొక్క గ్రుద్దు గ్రుద్ది—

కీర్తన : ఆదితాళము. (నీ వను) వలె

నిను మడియించెద నిలువుము! ఘనముగ నావడిఁ గనుము కనుము ॥ నిను ॥ దనుజుడ మీతండ్రిని మాజనకుడు మును వాధులలో ముంచెను గదరా ॥ నిను ॥ అటువలె నావాలాగ్రంబున ని న్నిటు బంధించెద నిలువయి మోది ॥ నిను ॥ మోక్షగుండవతి ముఖ్య భటుల మని । లక్షింపక యేలర చెడిపోవ ॥ నిను ॥

వ. అనిన దానవుం డాగ్రహించి గదతో బొడిచిన గదాయుద్ధంబునఁ గొంతవడిఁ దమలాఘవంబులు సూపి యంతటఁ బోక మల్లయుద్ధంబునకుఁ జొచ్చి పెనంగుచు దానవుం డెన్నిమాయలు సేసినను లోఁబడక వాలినందనుండు——

తో : కడుపెట్టిడముగఁ బిడికిటఁ బెడతల నడచినమాత్రమె యపుడు । పడయక దల బద్దలుగా బగిలినఁ బడియెను నా రక్కసుఁడు ॥ రా ॥

వ. అనంతరము వానరులు జయజయశబ్దంబుల సంగదు నగ్గించి రామునిఁ జేరి సమస్కరించిరి. రాముండు గౌగిలించుకొని దీవించె అంత హతశేషులవల్ల విని కొడుకుల మరణమునకు రావణుండు మిగుల చింతించి ధైర్యంబుబూని యేగిన పిదపఁ బ్రహస్తుని బిలిపించి యిట్లనియె

కీర్తన: ఆటతాళము.

రాముని సేనల రణమున నెదిరించిరారైరి మనవారలు! యేమి యోజించెద! నిక మీద యుద్ధమున కేతెంచె దేశూరులు ॥ కలన నీవును నేనుమటకట్టుడును దక్క నిలిచేవా రెవరూ సఖా! నెలకొని తమ్ముడు నిద్ర లేవడాయె! నీవు నే నున్నామిక ॥ దీక్షతో నీ

వేగుదెంచెదవో! నే నేతెంతునో! తెలుపు మిక మోక్షగుండేపని మొనలతో బోనీక శిక్షించి పత్తామిదె.।

— ప్రహస్తునియుద్ధము. —

వ. అనిన నతం డిట్లనియె:

శా. నే నేతెంచి విరోధియూథముల భంజింతుఁ విచారింపఁగా
దైవన్ నే నొకనీతిఁ దెల్పెదను నీ వాలింపు మే లౌత! మి
చ్చో నాజానకి నిచ్చితేని గడుణించుఁ రాముఁ డ! ట్లొప్పదే
నా, నాతండది కాదుపొమ్మనఁ; బ్రయాణంబై బ్రహస్తుండొగిన్.

వ. ప్రచండవేగఁబున వేదండ తురంగ తండఁబులతో గదలి కోదండఁబునఁ గాఁడింబు లఖండంబుగాఁ దాల్చి సమద్దండచండఘరుండుసుంబోలె భండనమండలంబుఁ జొచ్చి కపిదండల బెండుపడఁజేయుచుంత నీదండిమగఁ డెవ్వం డని కోదండరాముం డడుగ విభీషణుం డిట్లనియె;

తో: రావణుమాతులుఁ డీవచ్చెడివాడు. రామ! ప్రహస్తుండితడే!। వావిరి దద్భటవర్గమునకు దళవాయి యగును నీఘనుఁడే ॥ రా ॥

వ. అని తెలుపుచుండ నతండు వానరసేనలను మార్కొని తన మంత్రులు భటులు మృతినొందుటఁ గాంచి యలిగి యందఱపైనిగ్రమంబున బాణంబులు పఱపి పేర్చియార్చుచు,

వ. అనిన నత్యాగ్రహంబుననీలుం డెదిరించి యిట్లనియె.

పంచచామరము.

ఆహా! రణంబులందు శాత్రవాళి దాకి పోరుచో
సహింపలేని పిన్నవారిఁ జంపి పెంపుఁ జూపుచుఁ
అహంకరించియున్న వార లట్లుగాదు శూరుఁడౌ
ప్రహస్తుఁ డీతఁ డడ్డగించి పాఱిపోక నిల్వుడీ.

పంచచామరము.

అరే ప్రహస్త! నిన్ను నీవె యాత్మ మెచ్చుకొంచు భీ
కరంబుగాఁ గరంబు నీప్రగల్భ జాల మాపు! నీ
తరంబుగాదు రమ్ము నీప్రతాపమెల్ల నొంచి సు
స్థిరంబుగా యమాంతికంబుఁ జేర్తు నోర్తు నేఁ డిటన్.

వ. అనవుడు వాఁడు వాఁడిగలబాణంబులు బ్రయోగించె వానిఁ దప్పించుకొని.

తో: నీలుడు రక్కసునెత్తిన బడ నొక శైల మెత్తివేయగను। గూలెను ధరపయి గూతలు సేయుచు మేలని సురలెన్నగను ॥ రామ ॥ అదివిని రావణుఁడద్భుతపడి తనమనంబులో పగలియు పెలిసి। కదనమునకు నేఁ గవలి మానవుల మద మడగించెదఁ గడిసి ॥ రా ॥

వ. అని సర్వాభరణభూషితుఁడయి ప్రయాణం బగుచుండ మండోదరి కొలువు కూటంబునకు వచ్చి భర్తకు నమస్కరించియిట్లనియె.

జంఝూటి : త్రిశ్రజాతి. (ఎవ్వాడుకాని) వలె.

నీ కింతపంత మేల నోకాంత! రఘువరుఁ జాల శ్రీకాంతుడనుకోవేల; యేకాంతమున మేల జానకీకాంత జెరబట్టుట! ఇటుల నా కొడుకులు ద్రెళ్ళి రక్కటా! భూమిపై నీకు సల్వ జాలగా ॥ నీకింత ॥ ప్రకటించి చనినవారు నొకరైన దిరిగి రారు! ఇక బోయి బ్రతుకువారు లందెవ్వరును, లేరు! చెప్పుటకు భయపడుచుందుము. మనసు వికలత నొందింపబోకుము; తిన్నగా యోజించి చూడుము ॥ నీకింత ॥ ధర మోక్షగుండవిభుడు నరు డెన్నటికిగాఁడు; పరమాత్ముడనుచుజూడు? ధరణిజ నిడి వేడు నీవు శర ణన్న రక్షించును, జెడినతరువాత బాగౌనెచాలును! ఇప్పుడే శోక మార్పుము ॥ నీకింత ॥

వ. అని బహుభంగులఁ బ్రార్థించిన వినక కోపించి రావణుండు.

గీ. కోఁతులను గూడి వచ్చిన రోతనరుని
గొలువఁగాఁ బొమ్ము పొమ్మని పలుకుటెంత
పలుచదన మగు! నానేర్పు దెలిసియు నిటు
వరుల నాముందు గణియించి పలికె దహహ!

చ. సురలను గెల్చినట్టి రణశూరుని నన్ బెదిరింపనేల! నా
నరుల విభీషణున్ దరణినందను మర్కటులన్ జయించెదన్
వెఱవకు! గెల్వలేనియెడ వీరరణంబునఁ బోరి చచ్చి యా
పరమపదంబుఁ జూఱఁగొని భవ్యయశంబు గడింతు భామినీ!

వ. అనిన, సతని నిశ్చయం బెఱింగి విధికృతం బనియెంచి; అంతఃపురమున కేఁగుచుఁ దోడిసఖులతో నిట్లనుచున్నది.

హిం.తోడి : ఆటతాళము.

ఏ మని పలుకుదు! నెవ్వరి వేడుదు! కామిని! చెడిపోవుకాలము వచ్చెను ॥ సే ॥ సామజగామిని, సైపఁజాల తొలిబాముల నోచిన నోము ఫలంబున ॥ కే మని ॥ తగ మోక్ష గుండధామునితోడఁ బగ బూనినాడు బ్రతుకగ నౌనటే!

వ. అంత రావణుండు యుద్ధసన్నద్ధుండయి—

రావణు నిష్క్రమయుద్ధము :-

క. పదితలలఁ గిరీటంబులు
పొదలగ శస్త్రాస్త్రసమితి పొందుగఁ దసయి
ర్వదికరములందుఁ దాలిచి
యుదయార్క ప్రభల వెలుగు నొకరథ మెక్కెన్.

వ. ఐకుల నెక్కి చతురంగబలసమన్వితుండయి చనునప్పుడు,

తో: కరిబృంహితములు దురగఘోషములు నరదంబుల రావములు । మురజపటహభేరీకర కాహళరవములు సద్భటరావములు ॥ రా ॥ కలిసి దిగంతంబులు భేదించియుఁ గమలభవాండము పగిలి । చెలగ రణస్థలిఁ జేరి రావణుఁడు నిలిచెను ధైర్యము మిగిలి ॥ రా ॥

వ. అతని విభవంబుఁ గని యాశ్చర్యంబున నితఁడెవ్వం డనియడిగిన విభీషణుండు రాముస కిట్లనియె;

హిం- కాఫీ : రూపకతాళము. (ఇంతిరో విన) వలె.

రావణుఁ డితఁడే! రాఘవ! మాయన్నయయిన ॥ రావ ॥ దేవతలను బాధించుచు దిగ్విజయము గావించిన ॥ రావ ॥ పాతకుఁ డితఁడు; నీతి యింతయెఱుఁగలేఁడు; ఖ్యాతిగ మి మ్మేమరించి సీతనుచెఱబెట్టి నట్టి ॥ రావ ॥ ఈక్షితి వీని శిక్షించిన వెనుకను గాని మోక్షగుండవాన లోకములకు మేలుగలగదయ్య ॥ రావ ॥

వ. అనితెలుపుచుండునంతలో రావణుండు వానరసైన్యంబుల పయిఁ దీక్ష్ణబాణంబులు నెడపక వ్రేసి చిందరవందర చేయుచుండ, సుగ్రీవుండు రోషించి

క. ఒకకొండ యెత్తివైచినఁ
బ్రకటితముగ దాని నడుమ బాణంబులచేఁ

శకలములుచేసి మఱి వే
ఱొకశరమున నినజు మూర్ఛ నొందఁగఁజేసెన్.

వ. అది గని హనుమంతుండు రోషతామ్రాక్షుండయి రథంబు పయికి లంఘిం

పంచచామరము.

ధరాకుమారిఁ జూచి క్రూరదానవాళిఁ ద్రుంచి నీ
పురంబుగాల్చి నిన్నుఁ జంపఁ బూని నాఁడు మానితిన్
శిరంబులెల్ల డుల్ల నేఁడు చేతు బ్రహ్మదత్తమౌ
వరంబులెల్ల నీదినంబె వాఁగుపాలు గావలెన్.

వ. అని బెదరించి పటుతరముష్టిచే వక్షంబున నొక్క పెట్టునఁ బొడిచిన
పయి మూర్ఛిల్లి వెంటనే తెప్పరిల్లి మఱిమఱిఁ జూచుచు,

తో: కడుపడి మెచ్చితి గదరా బలవంతుఁడ వని దశముఖుం డనుచుఁ
బగు తన పిడికిటిపోటునఁ గడియెనుమూర్ఛిలి దిగువ ॥ రా ॥

వ. హనుమంతుండు మూర్ఛ బోయిన రావణుఁడు నీలునిమీఁదికి రథంబుఁ

పంచచామరము.

తటాన నన్ను దాకిపోర దర్పకారికైన మ
ర్కటాధమా! తరంబుగాదు రమ్ము పాఱిపోకనీ
పటుత్వమెల్ల గాంచి రామభద్రుఁజేరఁ బోయిది
కష్టంబు లార్వ నేఁడు మత్ప్రతాపఁ మెల్లఁ జూపెదన్

వ. అనిన,

తో: నీలుఁడు కోపాన్వితుఁడయి యొకఘనశైలశృంగమును వేయఁ! బోల
దశముఖుఁడు నడుమనే పొలియఁజేసివయిఁడాయ.

వ. వెల్లార్చి నీలుండు రావణురథంబుపయి కెగిరిముకుటంబులు ఊడదు
ఛత్రచామరంబులు చూర్ణంబుఁజేసిహారంబులు దెగనేసి రథంబువిఱుగునట్లు గ
యనేకవిధంబుల భంగపఱిచినఁ గోపించి,

తో : అనలబాణమున నాతనివైచిన నదితగిలిన మాత్రమున ! మునుకొని నీలుఁడు మూర్ఛిల్లుటఁ గని కనలి లక్ష్మణుఁడు కలన ॥ రా ॥

లక్ష్మణ-రావణ సంవాదము : పాట : రూపకము.

ల : నన్ను గెలిచి పోవరా ! దానవకులాధమా ! పన్నగనాబాహుబలము బరగఁ జూడుమా ॥ నన్ను ॥

రావ : పిన్నవాఁడ వెదురులేవు టిర మేలరా ! అన్న మఱుఁగు జేరుము నీ కంతె చాలుర ॥ పిన్నవాఁడ ॥

ల : వాడిగలుగు బాణములు వచ్చె నిలువుమా ! యోడిపోక నిచ్చరముగ నుండ శక్యమా ॥ నన్ను గెలిచి ॥

రావ : నేఁడు మోక్షగుండవిభుఁడు చూడ డాసెదగ మోడిచేసి బాణవహ్ని ముంచి వేసెదగ ॥ పిన్నవాఁడ ॥

వ. అనినఁ, గోపోద్దీపితుండయి లక్ష్మణుండు నిలువరింప నశక్యంబులగు బాణంబులు రావణుపయివైచిన, నతండు వెఱఁగంది బ్రహ్మదత్తం బయిన యొక్కబాణం బెక్కువెట్టి.

తో : ఉరము దాకునటు గురిగా వైచిన నరిగి తగుల లక్ష్మణుఁడు ! సొరిగి లేచి బిరబిర రావణు విలు నడికి భయదమై నెగడు ॥ రా ॥ మూఁడమ్ములు దశముఖుని వక్షమున గాడ నేయ మూర్ఛిల్లి ! వాఁడు దెలిసి తీవ్రంబగు శక్తిని వైచె లక్ష్మణుని మళ్ళి ॥ రా ॥

ఆ. శక్తిదాఁకి మూర్ఛ సౌమిత్రి మునిఁగిన
నెత్తబూని దనుజుఁ డెత్తలేక
యద్భుతంబు నొంది యట నున్నహనుమంతుఁ
డంతమూర్ఛ దెలిసి యాగ్రహించి.

తో : వచ్చి రావణుని వక్షము పగులగ వడిగాఁ గ్రుద్దుటవల్ల ! జెచ్చెఱ నటు మూర్ఛిల్లి పడియె సుర లచ్చెరు వందిరి మెల్ల ॥ రా ॥

వ. ఆంజనేయుండు రామభక్తుండు గాన జులకనగా లక్ష్మణు నెత్తుకొని పోయి రామునిముందటఁ బెట్టె రాముని తేజః ప్రభావమునకుఁ బరాజితమై శక్తిదొలగె. లక్ష్మణుఁడు మూర్ఛ దేఱె మఱియు;

క. రావణుఁడు మూర్ఛ దెలిసియు
వేవేగమె కపులపైకి వెడలఁగ, వారల్
చేవచెడి యురకఁ గని సీ
తావిభుఁ డదలించి పలికె దశముఖుతోడన్.

రామ-రావణుల ప్రథమయుద్ధము.

రారా-కీర్తన : ఆదితాళము. (భీకరగతి.) పల్లె.

ఓరోరి రారా కోరికదీర దీరుగ నినుబోర నేరుపుమీఱగ నేటికి సమకూరె । బోరున ముట్టిధీరతబట్టి సారెకు గొట్టి చంపుదు జలపట్టి ॥ యో ॥ భండననిపుణ కోదండాదిదీక్ష పండితుం డను, మోక్షగుండ విభుండను, దండిగ నీతలల్ ఖండింతు; నసురుల దండింతు; గండలు చెండింతు; రణభూమి నిండింతు రక్తము ॥ ఓరోరి ॥

వ అనుచున్న సమయంబున హనుంతుండు శిరంబులు ముకుళించి.

తో : రాఘవ! దనుజుఁడు రథము నెక్కియు రణ మొనరింపనురాగ । లాఘవమున గాల్నడ సుంతుట పోలదు నన్నెక్కుమువేగ ॥ రా ॥

వ. అనిన హనుమంతునిపై నెక్కి రామ—రావణులు గోపాటోపంబునఁ బరస్పర బాణప్రయోగంబులఁదమ నేర్పులు గనఁబఱుచుచున్నంత,

తో: ఒక్కబాణమున రక్కసువిల్లు బుటుక్కున విరువగ నతడు । దక్కక మఱియొక ధనువున శరసంధానము జేసియునపుడు ॥ రా ॥ తటుకున ననిలజు నిటలము దాకగ దద్దయు వైచిన గాంచి । చటులాగ్రహమున జానకీశుఁడొకశరమును వడి సంధించి ॥ రా ॥

వ. రావణు కోదండంబు ఖండించి రథంబు నుగ్గుసేసి రథ్యంబులఁ జంపి సారథిని గూల్చి.

తో: అనువుజూచి శర మనుసంధింపగ నతని మకుటములు విఱిగి । తునిఁగి కిరీట స్థగితమణులు ధరఁదొరగిన నాతడు గలఁగి ॥ రా ॥

వ. అప్పుడు రామచంద్రుం డను చున్నాఁడు.

క. రావణ, నీ విక నింటికిఁ
బోవుము! వానరులతోడఁ బోరి బడలియు

న్నావటు గావునఁ, జంపక
వే విడిచితి నన్ను, నతఁడు విన్నఁదనమునన్.

వ. పాదచారియై వానరులు నవ్వుచుండఁ దలలు వంచుకొని గరుడునిచే విరుపఁ బడిన యురగేంద్రుని పగిది లంకలోనికిఁజని కొలువుకూటంబుఁజేరి ఖేదమందుచు రాక్షసుల కిట్లనుచున్నాడు;

హిం-తోడి : రూపకము.

ఏమిచేయుదు నకటా ! యెటులనోర్తును రాముని వశముగాదు ! తలఁపగ ॥ యేమి ॥
వన్నెగాంచితి బ్రాభవమున మించితి ! నన్నునెదురలేరు త్రిభువనములు వెదకిన ॥ నేమి ॥
నాదుశౌర్యము నేఁడు నాదుధైర్యము మేదిని బడిపోయె దెలుపరాదు సిక్కము ॥ ఏమి ॥
ఒక్క నరునిచేనయ్యో ! చిక్కగవలసె । నెక్కుడినరుఁడు మోక్షగుండాధీశుఁడు ! దెలిసె ! ॥ నేమి ॥

వ. బలవంతులయిన ప్రహస్తాదులు మడిసిరి ! ఇంక నామానవుల నెదిరించు వారెవ్వరు ? కుంభకర్ణుండు తొమ్మిది దినంబులనాఁడు లేచి నాతోఁగొంత ప్రసంగించి మరల నిదురించినాఁడు. మీరతని లేపుకొని రండు ! నాతమ్ముండుగాని వారల జయింపడు పొండు అనవుడు,

తో : కుంభపుగూళ్ళను గుసుమగంధములు గొనిరాక్షసు లరుదెంచి । కుంభశ్రవణుఁడు గూరికియుండిన గుహలోన బ్రవేశించి ॥ రా ॥

వ. గంధపుష్పాక్షతలచే నతనిఁ బూజించి ధూపదీపంబు లిచ్చి, తాము గొనిపోయిన వరాహమహిషాది మాంసంబులును షడ్రసోపేతాన్నంబును రాసులుగాఁ బోసి, యింద్రాదులనెల్ల బొలియించుచున్నట్టు గలకని కలవరించుచు మహత్తరమైన యుచ్ఛ్వాస నిశ్వాసంబులతో భయంకరాకారుఁడై పడియున్న నతనిగాంచి, యక్కటా ! యింతబలవంతుని కిట్టి నిద్రావస్థచే మునుంగవలసినట్టు విధాత లిఖించెగదా ! ఎంతయన్యాయ మని దూఱుచు జయజయశబ్దంబుల నగ్గించుచు నందఱొక్కపెట్టున జగంబులు దల్లడిల్లునంత ధ్వనులు గలుగ నఱచుచు, —

కీర్తన : ఆదితాళము (ఓరామ రామ) వలె.

లే లెమ్మకుంభకర్ణ లెమ్మదేవరా ! నిద్ర ॥ లేలె ॥ ఆలమ్మలో సమరాళి దిక్కులఁ ద్రోలి కలఁచియు । సోలించునంతటి మేటిశూరవరుఁడవు ॥ లే ॥ అన్న రావణుఁడు బిలుపు

మన్ను వచ్చినాము; లేచి పన్నుగ నాస్థానమునకు బదుముదేవరా! ॥ లే ॥ మోక్షగుండ స్వామి పురము ముట్టడించియున్నవాడు! దక్షుఁడవై పోయి వానిఁ దఱుముదేవరా! ॥ లేలెమ్ము ॥

వ. అని వేఁడిన మిన్నకుండి,

తో: సారమైన నిస్సాణపటహములు భేరులు గడు వాయించి । చారుతరం బగు శంఖంబులును దుతూర తెలమి బూరించి ॥ రా ॥

వ. నిద్దుర లేవకుండినఁ బట్టిన భిండివాల గదా ముసల ముద్గ రాదులు గొని యందఱు మూఁగి యొక్కపరివిసరి వ్రేయుచుఁ, బదివేల కుంతములచేతఁ బరులను బట్టించి పొడుచుచు, గొప్పకొండ లనేకములుఁ దెచ్చి వైచుచు, మీఁదికెక్కి సత్వంబు మెఱయఁ గాళ్ళతోఁ ద్రొక్కుచు, వేధించియు మేలుకొలుపలేక, పిమ్మట—

తో: సింహనాదములు సేసిబిట్టుగాఁ జెవులు పగులగా నఱచి । సింహగజాదులచేఁ ద్రొక్కించియు జిందఱవందఱ బఱచి ॥ రా ॥

వ. కోలాహలంబు గావించిన నాధ్వనికి లంకగగ్గోలు పడియె. వానరు లంద ఱదివిని భయభ్రాంతచిత్తులై యుండిరి. అప్పటికిని లేవకుండిన—

తో: కొండలు గర్ణములందు దూఱి చెవి గూబలఁ బండ్లను గఱచి ॥ కొండఱు గరములఁ గురులు పట్టి లాగుచు గాల్ సేతులు విఱచి ॥ రా ॥

వ. అమితముగా బాధించిన నెట్టకేలకు గొంచెము కదలి యాపులించిన మహాగ్ని కణంబు లపరిమితంబుగా వాగ్ద్వారంబున వెడలె. నది గని రక్కసు లొక్కరితో నొక్క రిక్కరణి ననుకొనిరి.

కమాచ్ : ఆదితాళము.

చాలింపఁబోకుడు సారించి లేపుడు ॥

మించి మనము బోర్లించి లేపి కదలించుటచే నాపులించినాడు ॥ చాలింప ॥ క్రమ్మఱ నిద్దుర గ్రమ్మిన లేపఁ దరముగాదు కార్యమ్ము చెడును ॥ చాలింప ॥ ఈతని లేపక యేగితేని మనయాతుధానపతిచేత మాట ॥ చాలింప ॥ కదనంబున నీఘనుఁడు మోక్షపురసదను నెదురఁ గలఁ డిది నిక్కము ॥ చాలింప ॥

వ. అని చెప్పుకొనుచు సలసటలేక యినుపమోకులు దెచ్చి కీలుకీలు విఱిచికట్టి,

క. వేయిఘటంబుల తైలముఁ
బాయక దెరలంగఁ గాచి పటుకారులచే
నాయతబలులై పట్టుక
పోయియుఁ జెవిగూబలందుఁ బోసిరి సరగన్.

వ. ఇనుపగడ్డపారలు బెగఁ గాలిచి ముక్కురంధ్రంబులఁజొప్పించిరి. ధణధణ ధ్వనులతో ననేక భేరులువాయించిరి. కల్లోలంబు గావించిరి. అతండు శేషాహిసమానోగ్ర కరంబులు సాచి నీలిగి వికృతంబుగా నోరుదెఱచి యావులించి,

క. ఈ నిద్రయేల రాముని
నే నెదిరించినను దీర్ఘనిద్రాసుఖమున్
దాననుభవింపఁ దలఁపే
మో నా, నవ్వాఁడు నిదుర ముదమున లేచెన్.

వ. ఇట్లు లేచికూర్చొని ప్రళయకాలాగ్నితో సమముగానేత్రంబులయందుఁ గెంపు గదుర నిట్టూర్పులు విడుచుచు దానవులఁ గాంచి,

కీర్తన : ఆదితాళము-(ఏదిరాయోరి) వలె.

ఎవరు లేపిరి! నన్నెవరు లేపిరి। దివిభువిపగుల దిక్కులువొగల, జెవిగూబల గిల రపములు మిగుల॥ నెవరు॥ మొన్ననే లేచి మాయన్ననుజూచి, మన్నన వడసి మఱినిద్ర మురిసి పన్నిగ వచ్చి పండితి సొలసి॥ యెవరు॥ ఏమికార్యము మీకెంతధైర్యము! శ్రీమోక్షపురస్వామితో వైరమేమాయెఁ జీర నేటికి? నౌర॥ ఎవరు॥

వ. అనిన రాక్షసు లకుంఠితరణోత్కంఠ రిపుగజ లుంఠనాద్భుత కంఠీరవుండగు దశకంఠుండు దోడుకొని రమ్మన లేపితిమి. కుంభకర్ణా! అనంత ధైర్యసంపూర్ణా! యనిన, మంచి దని యాహార కాంక్షతోఁ బాఱఁ జూచిన నాక్షణంబున—

క. ఎనమన్నూరజములమఱి
యెనుబది మహిషములఁ నింక నిరువది యొకరన్
మనుజులను వేవరాహము
లను నాలుగువేల శశములను వేర్వేఱన్.

వ. ఖండించి పాకముఁజేసితెచ్చి రాసులుగాఁ బోసిరి. అమ్మాంసంబుఁ గడుపాఱం దిని రెండువేలకుండల మద్యంబుఁ బానంబుజేసి,

తో: పటపట దిక్కులు బగులునట్లుగా పండ్లుగీటి తీవ్రమున। దిటవుగ జుఱ్ఱున దీర్ఘశ్మశ్రులు, దిద్దివికృతరూపమున ॥ రా ॥

వ. వెడలివచ్చి రావణుని కొలువుకూటంబుఁ జేరె, రావణుఁడును సంతోషించి హేమపీఠంబునఁ గూర్చుండ నియమించి యిట్లనియె:

హిం-కాఫీ-రూపకము: (శివశివ వినుమా) వలె.

సోదర, వినుమా మేదిని శ్రీరాముఁ డను రాజు గలఁడు ॥ సోదర ॥ సోదర మర్కటయుతముగ మోదంబున మన నగరము ముట్టడివేసె సతండును॥ సోదర॥ వారల నెదిరి వారక మనవారలు బహుమంది చెడిరి? వారల, లేరు పోర నీవు దక్క! శూరు లెవరు మోక్షగుండ శ్రీరాముని నెదిరింపగ॥ సోదర॥

వ. కాఁబట్టి నిన్ను లేవఁ గొట్టించితి యుద్ధయాత్రకువెడలుము, అనుడు నవ్వి యతం డిట్లనియె.

ఉ. నారదమౌని తెల్ప వినినాఁడ రమాపతి రాముఁడై ధరా
భారముఁ బాప సూర్యకులపావనుఁడై యుదయించు నంచు నా
తీరునఁ బట్టియుండ నగు దేహమయుం దతనిన్ భరించువా
రేరి! జగత్త్రయంబున జయింపఁగ నాతరమౌనె యగ్రజా.

తో: మనచేఁ గాఁగ పనిగా దిది; నీవు మనవలె నని తలఁచి నను । జనకజ నిచ్చియు శరణుజొచ్చురాముని కన గనలుచునెను ॥ రా ॥

కానడ : రూపకము.

పోరా యిరోతకూత లేల చాలురా! విన నొల్లర॥ పో॥ ఆరాముఁ డబ్జనాభుఁడై నేమి! మర్కటులు సురారులైన నేమి! వారు శూరులే! సెబాసు మనకన్నను॥ బోరా॥ యుద్ధం బొసరింపఁగ నన్నుద్ధుడవైపోక నాకు బుద్ధులు గఱపెద వెంతటి బుద్ధిశాలి వంచు ననవచ్చును ॥ బో ॥ ఈలాగునఁ బగరబొగడి బేలరీతి లోబడెదవు! నీలావుగణింపలేవు; నిద్రపోతుకేటి రణరంగము! ॥ పో ॥ రాముఁ డిల మోక్షగుండ ధాముఁ డనుచు నే నెఱుగనె నీమాత్రము! వానిచే హతుండనైన ముక్తియలవడదే! ॥ పోరా యి॥

వ. అనిన వినియస్మన్మనోనిశ్చయంబు నెఱింగి యిదిగో చను చున్నానని ప్రళయకాలాభీలవిజృంభిత మహాంభోధరంబుచందంబున గుంభకర్ణుండు గర్జించుచు యుద్ధసన్నద్ధుండై.

## కుంభకర్ణుని యుద్ధము.

క. కాలి త్రిశూలముకన్నను
మే లగుశూలంబుఁ గేల మెఱయఁగఁ గలా
భీలముగా నార్చుచు రణ
కేళికిఁదా వెడలె నపుడు క్షితి యదరంగన్.

తో: లెక్కకు మీరిన రక్కసు లెల్లను నుక్కున నెక్కొని రాగా। జక్కగ బటు నిస్సాణ పటహనిస్తారరవంబులు మ్రోగ ॥ రా ॥ వెడలగ బిడుగులు బడె నుడుగణములు బుడమిని జలజల రాలెన్। కడువడి నిప్పులజడి గురిసెను దిక్కరులు భయంపడి సోలెన్ ॥ రాము ॥

వ. ఇటువలెఁ ద్రిజగద్భయంకరాకారుండై యుద్ధభూమిఁ జొచ్చి వానర సైన్యంబు పైకి నడచు కుంభకర్ణుని వికృతాకృతికి నివ్వెఱఁగంది రాముండు విభీషణునితో——

క. దేవారి కేమిగావలె
నావచ్చెడి వీరుఁడెవ్వఁ? డాశ్చర్యకరం
బౌ వాని రూపుగాంచిన
నే వేగమె తెలుపు మన విభీషణుఁ డనియెన్.

### జంఝూటి : అటతాళము.

రణరంగశూరుఁడు కుంభకర్ణుఁడు, రామ, యూహునుడు, రఘురామ, యూహునుఁడు; అలరావణానుజుఁడు ॥ రణ ॥ జనియించినప్పుడె దేవతలను జయించితోలెను జయించి మర్దింపబూనెను ॥ రణరంగ ॥ అది గాంచి నిద్రమునుంగునటు శపియించె పద్మజుఁడు; నిద్రించు నీతండు ॥ రణ ॥ శ్రీ మోక్షగుండపురీశ, యేమర కీక్షితిని పీని, బొలియించు దయమూని ॥ రణ ॥

వ. రావణునికిఁగల బలంబులలో ముఖ్యుండితం డొక్కండే! ఇతఁడు నశించిన వానిబలంబర్ధాంశంబు తెగి నట్లగు. నిద్రావ్యాజంబు లేనిచో వీనిదాడికి లోకంబులు భరించునా! జాగ్రత్స్వామీ! మౌని హృదంతర్యామీ!

వ. అనుచుండ,

క. రాక్షసమూకలు పడిగా
ఋక్షచరుల ముట్టడించి భీకరవృత్తిన్
లక్షింపుచు శిక్షింపుచుఁ
భక్షింపుచు బెక్కుగతుల బాధించి రొగిన్.

వ. అప్పుడు వనచరులు తమ ప్రతాపంబులు వెల్లివిరియ భుజాస్ఫాలనంబులు చేయుచు.

తో : కొండలు పరువులు గొనితెచ్చియు నాక్రూర రాక్షసుల నొడిచి। వెండియుఁ బినుకలు బెంకులుగాఁ దమబిడికిటిపోటుల బొడిచి ॥ రామ ॥

వ. మహాద్భుతంబుగాఁ బెనంగుచుండ నప్పటినమరంబు దేవతలకు గూడఁ దేరి చూడరాని దయ్యె. అప్పుడు—

తో : కూలెడు నేతలు, సోలెడు రౌతులు, వ్రాలెడు గజయూథములు। దూలెడు హరులు, దొరలెడు శూరులు, దునిసెడు రథ రథ్యములు ॥ రా ॥

వ. ఈరీతి రభసంబయినఁ దదీయశోణిత మేదో మాంస మజ్జంబులు దృప్తిగా నారగించి భూత ప్రేత బిశాచ కాక ఘూక చయంబులు విఱ్ఱవీగుచుండె అంత గుంభకర్ణుండు వానరులపయికిఁ గదిసి.

కీర్తన: ఆదితాళము

న న్నోర్చి నన్నోర్చి నిలుపుడి ! మీరు॥ నన్నోర్చి॥ నిల్లు మొన్న రక్కసుల నిక్కి తొక్కసట్లుగాదు॥ నన్నోర్చి॥ అంభోజసంభవదత్త శుంభద్వరబలముచే విజృంభించి జంభారి ముఖులదంభము సంరంభ ముడిపికుంభిని బేర్కొన్నయట్టి కుంభకర్ణుఁడను నేను॥ నన్నోర్చి॥ అక్షీణ బలదర్పితరణదక్షులౌ రాక్షసవర్యు లక్షయముగఁ గొల్వమిమ్ము శిక్షింపగ వచ్చినాడ! మోక్షగుండస్వామికి మీరీక్షితిసేవకులైన॥ నన్నోర్చి॥

వ. అనిన, నప్పుడు వానరులు రోషానలనయనులయి.

తో : పటుసత్వంబునఁ బాటివృక్షములు పర్వతములుగొనితెచ్చి। కుటిలుం డగు నలకుంభకర్ణుపయి దటుకున వైచిరి హెచ్చి ॥రా॥ శూలముచేతను సొలయక యాతండు జూర్ణముగా నొనరించి, । కేలను గదగొని కీశవర్యులను గీటడంప లంఘించి ॥రా॥

క. కోటానకోటి వానర
కోటుల గదచేత మోది కూలిచి పిదపన్
నోట గబళించి కొండఱ
వాటంబుగ మ్రింగె దనుజవల్లభుఁ డలుకన్

వ. ఇట్లు విజృంభించి మ్రింగుచుఁ బెల్లార్చుచుండె. వాని నాసాకర్ణరంధ్రముల నుండియు నోటినుండియు మ్రింగఁబడిన వానరులు వెడలిచచ్చిరి. కూలినవానరులును మూర్ఛదేరి కనిసిరి. అప్పుడు హనుమంతుడు

తో. ఒక మహాద్రిగొని యురవడి వచ్చి మహోగ్రంబుగ వేయగను। ప్రకటితముగ నది పై దాకిన నిలబడి తెప్పిరిలి సొంపుగను ॥ రా॥

వ. కోలాహలంబుగా గాలానలానేక కీలాభీలంబుచేసి, తాలిమిని దానవపాళిని సవలీల దూలించి, వాలంబు వ్రేలాడించుచుఁ బ్రేలెదవు చాలుచాలు! నీలావును నీలాఘవంబును గాలదండాభమగు నాశూలంబుచే నేల పాలు చేసెద రారా వానరవీరా! యని శూలంబున మోదిన నాతాఁకునకు హనుమంతుడు మూర్ఛిల్లె. పిమ్మట నీలద్వివిద శరభ గజ గవాక్షాదిప్లవంగపుంగవుల శూలంబువ్రేసి కనిమనంగుచున్న, సుగ్రీవుండు బైకొని,

బ్యాండుస్వరము: ఏకతాళము.

నిన్ను వధింతు దానవా! యిక నిలువు నిలువు దానవా! యినసుతుండ దానవా! నన్నెదురలేవు దానవా! మునువాలి మాయన్ననొంచెగదా! నిను బట్టి నేనిపుడు విదలించెదన్ ॥ నిను ॥ శిక్షచేతుదానవా! నీసిగ్గుదీతుదానవా! ఈక్షణమున దానవా! నీవింటి కేగు దానవా! మోక్షగుండేశని దయచేతను నీక్షితి భూతాళి కెర జేతును॥ నిను వధింతు దానవా!॥

వ. అనినఁ, గుంభకర్ణుండు,—

పంచచామరము.

పరాక్రమంబుఁ జూపునట్టి బల్లిదుల్ ప్రగల్భముల్
దురాత్మ. నీబలెన్వచింత్రె! దుష్టచిత్త, వాగకే
వరారిగమ్ము! జీవనమ్ముపైఁ బ్రియమ్ము గల్గినన్!
పురారినో! మురారినో మొగాన నిల్వఁ గెల్చెదన్.

వ. అనిన నాగ్రహించి సుగ్రీవుండు—

ఆ. పెద్దకొండ యొకఁటి పెకలించుకొని వచ్చి
యెత్తి వైచె దనుజు నెత్తిమీఁద
నదియు వానివక్ష మటు దాకి చూర్ణమై
రాలె; నంత నలిగి రాక్షసుండు—

తో: శూలము గొని చుఱచుఱఁజూచుచు సుగ్రీవుని వ్రేయగను। జాల మంట లుజ్జ్వలముగఁగ్రుక్కుచుజనుదేఱగఁ గనితగను ॥ రా ॥

తో: హనుమంతుఁడు నడుమనె దానిని వ్రయ్యలుగా ద్రుంచినగనలి। దనుజుఁడు మలయాద్రిని గొని సుగ్రీవునిపై వ్రేసిన దవిలి ॥ రా ॥

వ. ఆదెబ్బకు సొమ్మసిల్లి సుగ్రీవుండు మూర్ఛ మునింగినఁ గని కుంభకర్ణుండు రావణునకు గనబఱచుటకు లంకలోనికిం గొనిపోవుచుండ విడిపించుటకు నోపక వానరులు హాహారవంబులు చేయుచుండిరి. అంత సుగ్రీవుండు మూర్ఛ దెలిసి వాని యకృత్యమునకుఁ గోపించి,

గీ. పైకి నెగఁ బ్రాకి ఱీకాకు పఱచి ముక్కుఁ
జెవులు దెగఁ బీఁకి రక్తంబుఁ జిల్క నొడ్చి
వికృతరూపుని గావింప, వీఁక నాతఁ
డరక్కజునిబట్టి నేలపై నట్టవైచె.

వ. అప్పుడు సుగ్రీవుండు క్రిందఁ బడక లాఘవంబున రామ చంద్రుని కడకు నుఱికె. పిమ్మట గుంభకర్ణుండు—

ఫీల్ రాగము - ఆటతాళము :

అకటా। నేటికి నింత యాపద లొదవె। వికృతాకారముతోడ వెలయగ వలసె॥ న॥ చెలియలిగతి నాకు సిద్ధించె నౌరా। తలఁపఁబురా కృతము తప్పిపో దౌరా ॥ య ॥ ఈ రూపమున నన్నుఁ జేరగఁ జాల! బోరికి గ్రమ్మఱఁ బోదునీవేళ ॥ నక ॥ వెలయ మోక్ష గుండవిభునితోఁబోరి తలఁగ దాఁ జెడఁ దలఁచెనా కోరి ॥ నక ॥

వ. ఇట్లు పరిభవపడి కుంభకర్ణుండు లంకలోనికి బోనొల్లక విలయ కాలమహాగ్ని చందంబున మండిపడుచు రణరంగంబునకు వచ్చిపిని దెబ్బకుఁ దబ్బిబ్బు నొందుచున్న వన చరులఁజుట్టుకొని,

తో : కొందఱ బట్టుక గుంభిసి మోదెను! గొందఱ నదులను ద్రోసెన్! గొందఱ నూకెనుగుధరంబులపైఁ!–గొందఱ బైకెగవైచెన్ ॥

గొందఱ దిక్కులకును బడ మీటెను గొందఱ లంకను విసరెన్!! తుందుడు కొప్పగఁగొందఱ మ్రింగెను విందుపొందుగాఁగొనరెన్

వ. ఇట్లు భయంకరంబుగా శంకలేక పోరుచున్నంత.

క. ఘాతలు గూసెడుకపులును,
భీతిని బరతెంచు కపులు, భిన్నాంగులునై
పోతపడు కపులు దనుజుని
వాతను బడుకపులు నైపిపద్దశఁగలఁగెన్.

తో : తగ్గెను నినజుఁడు దగ్గె నంగదుఁడు, దగ్గె గవాక్షుఁడు. గజుఁడు దగ్గెను, నీలుఁడు దగ్గెను, శరభుడుదగ్గెను ధూమ్రుడు, నలుడు ॥ రా ॥

తక్కిన జాంబవదాదులు భయపడి యురుకుచుండ లక్ష్మణుం డెదిరి,—

తో : కుంభకర్ణుపైఁగొన్ని బాణములు గోపముతోడను బఱప, సంభృతధీరుఁడు సరకుగొన దాఁ జనుచుండగఁ బురికొలుప ॥ రా ॥

వ. వానరులు వాని పయికి నగణితంబుగా నెగఁబ్రాకి

తో : తోకల జుట్టియుఁ గేకల వెట్టియు, దోలువట్టి నఖములను। బీకుచు సందులు బిగియబట్టుచును పీడింపగ జులకగను ॥ రా ॥

వ. వారినందఱను విదళించిన మేఘమండలమునుండి చుక్కలు రాలినట్లు గ్రింద రాలిరి ఇట్లు నలుపు కుంభకర్ణు పరాక్రమమునకు నద్భుతం బంది,

క. రాముఁడు నిర్జితభార్గవ
రాముఁడు సద్గుణగుణాభిరాముఁడు నుత
సుత్రాముఁడుఁ దాటకగర్వవి
రాముఁడు దా నెదిరె నపుడు రాక్షసునిపయిన్.

వ. ఇటువలెఁ గదిసి రాముండు ధనుష్టంకారంబు జేసిన, నా ధ్వనికి జతుర్దశ భువనంబులు గడగడ వడంకె. అప్పుడు విభీషణుండు రామునకు ముందుగా నడచి కుంభకర్ణుని ముందర గదాధరుండయి నిలిచినఁ గాంచి నవ్వుచు—

కాఫీ : ఆదితాళము : (నాయనయా) వలె.

ఓరి విభీషణ, యుక్తమె యోగదా! పోరానరింపగ జేరినవాడవు ॥ ఓ ॥ అన్న దమ్ముల మని యెన్నగ బోలదు; నిన్నేలు వానికి న్మెప్పగ నుండుము ॥ ఓ ॥ చాలగ నిన్నిటు జంపిన లంకను నేలువా రెవరాదురికనీకుగాక ॥ యో ॥ రాక్షసరాజ్యము రయమున నిచ్చును ॥ ఓ ॥

వ. అనిన; విభీషణుండు గుంభకర్ణునకు మ్రొక్కి :

తో : రామునితో వైరము వల దని నే రావణునకు జెప్పినను నామాటలను మనంబున నొప్పక నను దన్నియు బొమ్మనెను ॥ రా ॥ కావున, రాముని కరుణకు బాత్రుడనై వచ్చితి నే ననుచు, గేవలముగ దుఃఖించుచు దలగియు నాసల బోయెను గనుచు ॥ రా ॥

వ. అప్పుడు రాముండు లక్ష్మణ సహితంబుగా గుంభకర్ణుని సమీపించు చుండెను.

సురట : ఆదితాళము.

దురంబునను నను భరింపగను నీతరంబుగా దోరా! ఇక గుర్తెఱింగి యిటు బోరా! సరోజసంభవు వరంబులెల్లను దొలంగు గనుగొనరా! ఇదె నా శరాగ్నిగాల్చునురా॥ దురం ॥ త్రిమూర్తులును నీకు మేలుగా నడ్డమైన విడిచెదనా! నీవిక్రమంబు గనుగొననా ॥ దురం ॥ జగంబునను మోక్షగుండపతి నెదురగ నెవరికైన బ్రాణములగూడి పోనగునా!

ఉ. అంతట వాడు రౌద్రరస మావహిలన్ బ్రళయాపపానకా
లాంతకుబోలె మండిపడి యార్చుచు బేర్చుచు బండ్లుగీటుచున్
గంతులువైచి మర్కటులు గంపమునొందుచు బాఱజేసితా
బంతముమీఱ రామనరపాలునితో ననియెన్ జలంబునన్.

కీర్తన : అటతాళము. - (మేలైన) వలె.

మాయలు వన్నిన మాయించి చంపగ । మారీచు గాను సుమా! పాయక బాహులు భంజించి కూల్పగ గబంధుడగాను సుమా॥ పోలగ విల్లిచ్చి భువి భంగపడ భృగుపుత్రుడ గాను సుమా॥ వాలాయముగ నొకకోలను గూల్పగ వాలిని గాను సుమా॥ రాక్షసేశ్వరుడ! రావణానుజుడ! రణవిక్రముడను సుమా! మోక్షగుండేశ్వర, ముల్లోకముల యందు మొన గాడ నౌదు సుమా!

సీ. ఘనమైన కఱకు రక్కసుల పల్కులు గాని
సనకాదియోగి సంస్తవము గాదు,
పటహతమ్మట భేరి భాంకారములు గాని,
నారదమౌని గానంబు గాదు;
ఆర్చుచుఁ జనుదెంచు నసుర యోధులు గాని;
యర్చింప వచ్చు భక్తాళి గాదు;
కఠినతరం బగు కదనరంగము గాని,
కర మొప్పక్షీరసాగరము గాదు,

గీ. అచట సుఖమును మేలు నీ కిచటఁ గలదె!
యెందుకు జనించితివి భూమియందునీవు?
వెఱ్ఱి బ్రహ్మయు నింద్రుండు వేడగానె?
యయిన నునుఁ దాకి బ్రతికి పొమ్మంతెచాలు.

వ. అని పలికినఁ గోదండరాముండు గోపాన్వితుండయి యనేక సహస్రకాండంబు లఖండంబులుగాఁ గోదండంబున నెక్కువెట్టి వ్రేసిన నవి తప్పించుకొని,

తో: గదఁ ద్రిప్పుచు భీకరముగ రా గను గని వాయవ్యాస్త్రమున ।
గదతోఁ గూడఁ గరమునదునిమెను గాకుత్స్థుఁడు బీరమున ॥ రా ॥
కడపుచేత రాక్షసుఁడు వృక్షమును గైకొని మీఁదికి రాఁగా ।
దడయక నింద్రాస్త్రమ్మున రాముఁడు దానినిఁద్రుంచెను వేగ ॥ రా ॥

వ. రెండుహస్తంబులు వెగి క్రిందఁ బడిన, వానిక్రిందఁబడి కొందఱు వానరులు మడిసిరి. అనంతరంబ కుంభకర్ణుండు వికృతంబుగా నోరుఁ దెఱచుకొని,

కీర్తన : రూపకము - ( మంగళమగు ) వలె.

నిను మ్రింగెద నిను మ్రింగెద నిను మ్రింగెదఁ గనుమా! యినవంశ యిఁక నిల్వక యెందైనను జనుమ ॥ నిను ॥ నాబాహులనఱుకంగనె నే బోదునె కనుమా నీబంటుల దాకియు నిను నేనోర్తును నిలుమా ॥ నిను॥ నరభోజనులకు వానర నరు లద్దమె కనుమా! ధరణిని శ్రీ మోక్షగుండ పురరాఘవ! నిలుమా ॥ నిను ॥

వ. ముక్కు సెవులును జేతులును దెగినను సిగ్గులేక వికారంబుగా నోరుఁ దెఱచు కొని పయికిఁ గదిసిన రాముం డలుక రెట్టింప,

తో: అగణితబలుఁడై యర్ధచంద్రశరయుగము వింట సంధించి । తగ బిగించి తత్పదయుగ్మంబును దెగ ఖండించెను మించి ॥ రా ॥

క. కరచరణంబులు దెగినను
ధరపై దొర్లాడుకొనుచు దైత్యుఁడు కవియన్
శరజాలంబులు నోటను
జొర వైచెను రామవిభుండు సురలు నుతింపన్.

వ. సింహనాదంబుఁ జేయుటకు వీలులేక వికారముగాఁ గేకలు వేయుచు వేడి చూపులఁ జూచుచున్న దానవుని వక్త్రంబున గుఱిఁగాంచి,

తో: ఇంద్రాస్త్రము సంధించి వేయ నది యేగి యురము భేదించి । సాంద్రంబున భూస్థలిలో దూరెను సరగ రాముఁ డదలించి ॥ రా ॥ అంతకశర మత్యంతవేగమున నపుడు వ్రేయ నెల్లదరి । పంతముతోఁ గుంభశ్రవణునిశిర మెంతయు ద్రుంచెను దొడరి ॥ రా ॥

వ. ఇట్లు శ్రీరామ కర నిర్ముక్తదివ్యాస్త్రంబుచేఁ గుంభకర్ణుని తలదెగి లంకలో సగం బును సముద్రములో సగంబును బడియె గోపుర ప్రాకారాదులు చూర్ణంబులయ్యె. దానిక్రిందఁ బడి పదికోట్లు వనచరులు మృతినొందిరి; జలచరంబులుగ్రుమ్మగ్గె, కులగిరులు గ్రుమ్మగ్గె. దేవత లానందించి రాముని నభినందించుచు బుష్పవృష్టిఁ గురియించిరి. అనంతరంబు హత శేషులు కుంభకర్ణుని మరణ వృత్తాంతంబుఁ జెప్పిన, రావణాసురుండు మూర్ఛవోయి కొంత వడికి లేచి విలపింపఁ దొడంగె.

### పీలురాగము : ఆటతాళము.

అకటా! కుంభకర్ణ యని ద్రెళ్ళినావా! యిక గెలుపేది! నా కేదిర త్రోవ ॥ యక ॥ కులిశధారకునైనఁ గూలనిమేను యిల నరునేటున నిటుగూలెనౌనె! ॥ య ॥ మన విభీషణునిమాట గైకొనక నినుగోలు పోయితి నీబుద్ధి వినక ॥ యక ॥ నీబలమును నమ్మి నేఁడింతపనికి నేఁబూనితి నిక నేర్పేది యనికి ॥ సక ॥ మోక్షగుండేశుని ముదమున నెదుర నీక్షితి నాపని యింతే యాఁగదర ॥ యక ॥

వ. కుంభకర్ణునిగూర్చి రావణుం డీలీల విలపించుచుండ, నతని కుమారులను నతి కాయ దేవాంతక నరాంతక త్రిశిరులును దమ్ములగు మహోదర మహాపార్శ్వులును, రావణునితో ననుచున్నారు.

క. మీ రేల చింత నొందఁగ!
నోరావణ, మమ్ముఁబంపు! మురువడిఁ గపులన్
శ్రీరామ-లక్ష్మణులఁగని
దీటుఁగ వధియించి జయముఁ దెత్తుము వీఁకన్.

వ. కాలము దీఱినప్పు డెంతవా రయినఁ జావ కుందురా! యుద్ధకాలంబున దుఃఖించుచుండిన జయము కలుగునా! లెమ్ములెమ్ము. మమ్ముఁ బ్రయాణమ్ము జేసి పంపు మనఁగ రావణుండు ధైర్యంబునొంది,

అతికాయాదులయుద్ధము.

రావణుని వచనము :—

తోహ : మీకడ్డంబే లోకత్రయమున! భీకరశస్త్రాస్త్రములు । చేకొని యుద్ధముఁ జేయఁగఁబొమ్మనఁ, జెలఁగిరోదు మొత్తములు ॥ రామ ॥

వ. అనంతంబులుగా నేల యీనినట్లు కదలిరాఁగాంచన రథంబు లెక్కి ధనుర్బాణ ధరులయి భేరీభాంకారములు భూనభోంతరాళంబులు నిండ వెడలి యుద్ధభూమిఁ జేరి ముట్ట డించిరి.

తో : కపులును డీకొని కరములఁ బొడుచుచుఁ గాళ్ళఁగట్టులన్ దన్నుచును! విపుల శైలములు వృక్షచయమ్ములు విఱిచి తెచ్చివ్రేయుచును ॥ తురగంబులచేఁ దురగంబుల రథ కములచేత రథకరుల, స్థిరముగనసురులచే ననుపుల మోదిరి పొడిపై ధర నుపల ॥ రా ॥

వ. మర్కటులు మాఱులేక పైదులహతంబు సేయుచుండ, రాక్షసదళంబులు వెండు పడి యుఱుకుచుండ నిలువరించి నరాంతకుండు వనచరులపయి ననేక బాణంబులు వైచి తన లావుఁ జూపుచుఁ జని । యంగదుని దాఁకి యిట్లనుచున్నాఁడు;

కమాచ్ : రూపకము.

ఇంత గర్వ మేల నిల్వరా ప్లవగాధమ! నీ ॥ కింతగర్వ ॥ అంతక నిభుఁడగు నేను; నరాంతకుఁడను : మంతనమున ॥ నింత ॥ దిక్కులు నేఁ దిరిగినానురా । మానవులఁ

బట్టి చక్కడంచి మట్టినానురా । డొక్కదరఁగ ద్రొక్కెద! నే, మెక్కెద నిఁక దిక్కెవ్వరు ॥ ఇంత ॥ శిక్ష, జేతునొక్క వ్రేటునఁ బరుగెత్తుమిపుడు మోక్షగుండవిభుని చాటుకు! అక్షయ రణదక్షుల మగు రాక్షసులకు రా కెదురుగ ॥ నింత ॥

వ. అనిన, నంగదుండు జానకీజానియానతిచే నేను వచ్చి మీనాయనతో భాషించి నానిపుణత్వంబు మెఱయ ఖరనామఁడు లోనగు దానవుల వేన వేలం జంపి మేనువాదల మానవేశుకడకుఁ బూనికతో వచ్చితి. ఆనాఁడు నీయానన మయినఁగానరాదయ్యె! నక్కడనే యుంటివిరా! యీవేళ వచ్చితివా! నిన్నుజంపక విడుతునా!

వ అనిన వాఁ డలిగి,

తో. గదఁ జేకొని యంగదుని వ్రేయగాఁ గదిసి యురమ్మును దాచి, । యది విరిగిన గని యసురుఁడు బిడికిట నడిచిన మూర్ఛిలి లేచిన ॥ రా ॥ ఒక్క గ్రుద్దుతా గ్రుద్దిన గ్రక్కున నొరిగెను నాతనివాజి జక్కగ నింకొకసారి గ్రుద్దగను రక్కసుఁ డీల్గెను వాజి ॥ రామ ॥

వ. అంత నరాంతకుని చావుగని కినిసి, మహోదర–దేవాంతక త్రిశిరు లొక్కసారి యంగదునిపయికి నడచి యనేక శిలీముఖంబుల నొప్పించుచుండిరి. అతండును వెను దీయక పర్వతవృక్షాదులచే మోదుచుండె. ఇంతలో నీలుండును హనుమంతుఁడును నంగదునకు దోడుపడిరి. అప్పు డయ్యిరు దెగలవారును గదిసి,

పంచచామరము.

అరే దురాత్ములార । మీర లాహవంబుఁ జేయఁగా
బిరాన వచ్చినారె! మీదుబింకముల్ గలంచి న
త్వరంబుగా శిరంబు లూడఁ దన్ని శ్రాద్ధదేవతా
పురంబుఁ జేర్తు మింకఁ బాఱిపోక యిందు నిల్వుఁడీ!

వ. అనినఁ గోపించి దేవాంతకుండు హనుమంతుని దూఱుచు,

తో: పరిఘ ద్రిప్పుచును బైకిదుముకఁ గని పవనజుఁ డలిగియు హెచ్చి । శిరమును బిడికిట జితుక బొడువఁగా క్షితిపైఁగూలెను జచ్చి ॥ రా ॥

వ. అది గని మహోదరుఁ డొక్కమదగజము నెక్కి నీలునిజేరి యుద్ధములలో సమర్థుల మని యిద్ధరిత్రిని సిద్ధంబుగఁ బ్రసిద్ధినిగన్న మాపయికి నాటోపంబుఁ జూప వచ్చె

దరు. సెబాను కోపాగ్ని దీపింపగ నీపూట నీరూపుమాపి మా పెద్దఋణంబుఁ బాపెద పోపోరా నీలా! నీముఖంబుఁ జూడఁ జాల! దుర్గుణజాల! యని యనేక బాణంబులు వైచిన సరకుగొనక నీలుండు—

తో: గిరి జేకొని యంబరమున కెగిరియు గుటిగా వైచినఁదగిలి। కరియును రాక్షసవరుఁడు నొక్కపరి ధరఁ గూలిరి తల పగిలి ॥ రా ॥

వ. పిమ్మటఁ ద్రిశిరుండు హనుమంతుని పయికి దుమికి,

త్రిశిర - హనుమత్సంవాదము.

కమాచ్: ఆదితాళము. (అతడెవరే) వలె.

త్రి ॥ తలగకురా వానరా ॥ త ॥ ప్రకటితముగనాబాణాగ్నికి ॥ దల ॥ హ ప్రేలకురా దానవా! ప్రే ॥ ఒకత్రొక్కుకు నీ యుక్కడంతు బ్రేల ॥ త్రి ॥ మంచిదిరా వానరా! మం ॥ మెదడు సెదర మోదెద గదతో ॥ దలఁగ హ ॥ గెల్చెదవా దానవా ॥ గె ॥ ఇదిగో మోక్షపురీశునాన ॥ ప్రేలకురా ॥

క. అడిదముఁ గొని త్రిశిరుఁడు పై
కడరిన, హనుమంతుఁ డతని యడిదంబునె తా
నొడిసి కొని దానిచేతనె
యడిచిన నసురుండు చచ్చి యవనిం బడియెన్.

వ. అంతట మహాపార్శ్వుండుగ్రుండయి హనుమంతుని బైకొని

భుజంగ ప్రయాతము.

మహాపార్శ్వుఁడన్ నన్నుమార్కొన్న వారల్
మహిన్ లేరు; నీవెంత! మర్దింతు రారా!
ప్రహస్తాదులన్ బట్టి భంజించినట్లా!
దహింతున్ భవద్గర్వ దర్పంబు లెల్లన్.

వ. అని పలుకుచుండ, ఋషభుండొక్కవృక్షంబు రాక్షసునిమీఁద వైచె. వాఁడు దాని నరకు గొనక,

తో: తనగదచేతను దనుజుడు ప్రేసిన, దప్పించుక ఋషభుండు। గినిసి తన దుపిడికిట బొడిచిన గిజగిజ దన్నుక దనుజుండు ॥ రామ ॥ చచ్చిన నాతనిచావు జూచి రోషంబున నతికాయుండు! వచ్చెనువానర వర్యులఁ జంపెద వడిగా నని ధీరుండు ॥ రామ ॥

### అతికాయయుద్ధము

వ. సహస్రసూర్యప్రభాభాసమానమగురథ మెక్కి మహాటోపంబున వచ్చు నతికాయునిం గని కుంభకర్ణుండు పునర్జీవితుఁడయి వచ్చుచున్నాఁడేమో! యని వనచరులు భయభ్రాంతులయి యుండఁగని రాముండు వీఁడెవ్వ డని యడుగ విభీషణుండు—

ఆ. ధాన్యమాలియందు దశకంధరుఁడు గన్న
సుతుఁడు వీఁడు; యుద్ధశూరుఁడరయ;
నతిబలాఢ్యుఁ డయ్య! యతికాయు డనువాఁడు!
వీనిఁ జంపఁ దగును వేగముగను.

క. హనుమంతుఁడు లోనగున
వ్వనచరు లవనీరుహములు వసుధాధరముల్
గొని యెదిరించిననవ్వుచు
దనుజుండిటు బల్కె మిగుల దర్పోద్ధతుఁడై.

### పీల్‌రాగము ఆదితాళము (తల్లిభ) వలె

యేడీ! యేడీ! రఘువరు డేడీ! కపులార యేడీ! కనబడ డేడీ! ఏడీయేడీ! వాడిశరంబున వారిరాశి గర్వంబును బాపియు బంధించిన వాడేడీ॥ సురరిపుతనయుఁడు జులకఁగఁగట్టిన యురగపాశముల నూడ్చుకొన్నవాఁ డేడీ! ఘటకర్ణుని నొకగడియలోన దిక్తటములు చెదరగఁ ఖండించినవా ॥ డేడీ ॥ రావణు నిక జూర్ణంబుజేతు నని లావునలంకకుఁ య వచ్చినవా ॥ డేడీ ॥ మానుగ నాతని పైనగాని నామానితశరములు మరి ప్రేయగ రాముఁ ॥ డేడీ ॥ దక్షుఁడనై యాతని తమ్మునితోశిక్షజేతు నలమోక్షగుండవిభుఁ ॥ డేడీ ॥

వ. అని గర్వంబునఁ బలికిన యతికాయునిపై గోపించి,

తో: కపులుగిరులు వృక్షంబులుగొని యతికాయునిపైఁ ప్రేయగను। నపుడు వాడు దివ్యాంబకములచే నవియుం ద్రుంచి నేర్పుగను ॥ రా ॥ గురుతరాస్త్రముల, గుముదుఁడు లోనగు కోతుల బిట్టుగవైచి। స్థిరముగమూర్ఛిలఁ జేసి రాఘవునిఁజేరి నవ్వుచును జూచి ॥ రా ॥

వ. ఇట్లనుచున్నాఁడు ;

సీ. నీవెంతవాఁడవో! నే నెన్నఁడెఱుఁగను
నింతవాఁడవని నిన్నెఱుగ, రెవరు!
దిక్పాలకులలోనఁ దెలియ గానఁగ రావు
మానాభిమానముల్ మహి నిలేవు!
జాతివర్ణాశ్రమాచారనీతులు లేవు ;
గుణహీనుఁడవు నిల్వఁగొంపలేదు ;
భువిలోన నొంటిగాఁ బొదలుచుండెడు నీకు
గపికోటిసైన్యంబు గలిగె నిపుడు ;

గీ. దిక్కులేనట్టి నీకును దిక్కుగాఁగ
నినజుఁ డేర్పడె నాతోడ నెదురలేవు ;
వనములందును గొండల మునులయాశ్ర
మముల వర్తింపు కాదేని మఱియు వినుము

మధ్యమావతి : ఆదితాళము.

విడిచేనా రఘురామ! నిన్ను ॥ విడి ॥ వెడదమీనమై జడనిధి జొచ్చిన, గమఠంబైఁ గట్టుమోచినను, వడి సూకరమై పుడమి దూఱినను, వడిగ వెదకెద ॥ విడిచేనా ॥ పందిరికంబమునందుబుట్టినను విందుగ వటువై భిక్షమెత్తినను బొందుగ ... ్రమందజేసినను నంబె కనుగొందు గాని ॥ విడిచే ॥ రాక్షసవరులతోఁ గక్షకట్టుకొని ఈ ... బోరఁగ నేతెంచితి విటు మోక్షగుండసత్పురవల్లభ నినుదీక్షసాధింతుఁ గాని ॥ విడిచేనా

తో : అని జేయఁగ రమ్మని యతికాయుం డగ్రజు జీరఁగఁగాంచి । విని లక్ష... డతివేగ గనలి యిట్లని పలికెను నదలించి ॥ రా ॥

క. ఓరీరాక్షస! రాముని
తో రణ మొనరించునంత దోర్బలుఁడవె నీ
శూరత్వంబును గాంచెద
రా రా నేనుండ రాము రమ్మనవలెనా!

వ. అని యుద్దండంబుగా నిలిచి గుణధ్వని చేసిన, వాఁడు దురాగ్రహవిగ్రహుం డయి యొక్క క్రూరాస్త్రంబు వింట నంధించి లక్ష్మణుని దిక్కు నభిముఖుండయి,

కీర్తన : ఆదితాళము-(తంగంమెట్టు) వలె.

నీవు బాలుఁడవు నిలువఁగ జాలవు పోవోయి పోరుడుగి లక్ష్మణా నావాక్యములువిని మీయన్న రాముఁడు, మేదిని హిమగిరి, యాయమరాద్రి దక్క, యితరులు నాయంబులకు నోర్తురా! ॥ నీవు ॥ మోక్షగుండేఖని సీక్షణమున బట్టి శిక్షింతు నీ కేలను లక్ష్మణా! వీక్షించుచును నిల్వుము ॥ నీ ॥

వ. అని తూలనాడిన సౌమిత్రి యిట్లనియె.

తో: దురహంకారముతో బలికినలేదురం క్రియ! శూరుఁడవయినఁ! సురి లరయఁగ నీశరలాఘవమును జూపింపర నాపైనన్ ॥ రా ॥

వ. అని పలికిన నతికాయుం డంతకాకారుం డయి యత్యంత వేగంబునఁ బ్రయో గించియున్న పటుసాయకంబు వైచిన లక్ష్మణుం డర్ధచంద్రబాణంబునఁ ద్రుంచి,

తో. ఆగ్నేయాస్త్రము నసురుని వేసిన, నాతఁడు సౌరాస్త్రమున । భగ్నం బయి యిలఁ బడఁగా నేసియుఁ బదపడి లక్ష్మణుతోన ॥ రా ॥ ఐషికబాణం బదిగో వచ్చెను! నాగెదవా సౌమిత్రి! భాషింపకనిఁకఁ బాఱిపొమ్ము నిన్నుఁ బడగూల్చును నీధాత్రి ॥ రా ॥

వ. దోషాచరులపయి ద్వేషించి మానుషవేషంబున దూషించుచు వచ్చితివి. నీ రోషంబునకు నీషన్మాత్రంబు వెఱవ! ఐషికబాణంబున నీభీషణంబు బాపెద! సౌమిత్రీ ఇది నిన్నుఁ గూల్చును! ధాత్రిసని వైచిన గోపించి,

తో: ఐంద్రబాణమున నది పొడిజేసెద! నార్భాటముఁ జాలింపు! సాంద్రబలుఁ డవై శౌర్యంబున నీశరవిద్యను జూపించు ॥ రా ॥

వ. ముమ్మరమ్మగు నైంద్రాస్త్రమ్మున నీయమ్ము వమ్ముజేసెద! మమ్ము బెదరించు సామర్థ్యమ్ము నీకుఁ గలదా? రమ్ము నీతలదిమ్ము నీదిసమ్మునఁ బాపెద నతికాయా! అని వాని బాణంబుద్రుంచిన నతండు మరల ;—

తో: యామ్యాస్త్రంబును నదరక వైచితి నార్చుచు నిదుగో వచ్చె! సౌమ్యం బను చునునరగునఁ జూడకు! చంపును నీయెదఁజొచ్చి ॥ రా ॥

వ. పాత్రతాపాత్రతనెఱుఁగక శాత్రవుల పయి క్షాత్రంబుఁ జూపెడు నీగాత్రంబు దరిత్రి గూల్చఁజాలు యామ్యాస్త్రంబు వైచితి. సైరింపుము క్షత్రియాధమా! యసుర యోధులతో వాదమా!

వ. అనిన, లక్ష్మణుండు,—

తో; వచ్చెను జూడర వాయవ్యాస్త్రము; వడిగల యామ్యాస్త్రమును! జొచ్చెర నీక్షితి జీలిచివేయును జేయుము మఱి యుద్ధమును ॥ రా ॥

వ. వాయవ్యాస్త్రమున నీయామ్యసాయకముఁ బాయజేసెద! నీకడనున్న యస్త్రంబుల నన్నిటిని వైవుమురా. మాయకాఁడా! నీయుత్తమాంగంబు పీడఁ జేసెదఁ జూడరా! అని యాబాణమ్మును నఱికి మఱికొన్ని దివ్యాస్త్రంబులు లక్ష్మణుండు ప్రయోగించిన, నవి వాని కవచంబును భేదింపఁజాలకఁ జూర్ణంబులయిన, సౌమిత్రి యద్భుతంబు నొందుచున్న నా మర్మంబు దెలుప గోరి వాయుదేవుండు వచ్చి—

గీ. వజ్రకవచంబుఁ గొన్వాఁడు బ్రహ్మవలన
శరములెవ్వియు భేదింపఁ జాలవయ్య!
కడఁగి, బ్రహ్మాస్త్ర మేసినఁ గాని తెగడు!
చేయు మట్లన మోదించి శీఘ్రముగను.

కీర్తన : రూపకము - (ప్రథమోగ్ర) వలె.

విపులాగ్రహోగ్రోదగ్రుఁడై బ్రహ్మాస్త్రము దొడిగి సమరాగ్ర నిగ్రహమున వైచి నగ్ర జునడిగి ॥ విపు ॥ దశదిక్కు లుక్కు దక్క ద్రుక్కి మిక్కిలి సోలెన్! సుర లక్కజంబు నొందఁ జుక్క లొక్కటరాలెఁ! ॥ విపు ॥ కులపర్వతంబు లెల్లడుల్లె, వార్ధులు నింకెఁ! రిపులార్వ నుర్వి పెల్లగిల్లె! నక్కఁడు గ్రుంకెఁ ॥ విపు ॥ బ్రహ్మాండ మెల్ల బెండువడియె నద్భుతము గను! మోక్షగుండ శ్రీకోదండపాణి కూర్మి జెలగను ॥ విపు ॥

వ. ఇట్లు ప్రయోగించిన బ్రహ్మాస్త్రంబును దప్పించుకొనుటకయి,

తో: పరిఘయు శూలముఁ బటుశక్తియు గద సరగ బ్రయోగించినను, సరకుగొనక యది చని కిరీటయుతశిరమును ద్రెంచియు జనెను ॥ రా ॥

వ. ఈలీల బ్రహ్మాస్త్రం బతికాయుని వధించి పోది జేరె దేవతలు లక్ష్మణుని గొనియాడిరి. లక్ష్మణుండన్నను జేరి నమస్కరించిన దీవించి కౌఁగిలించుకొనియె. అనంతరంబ.—

క. హతశేషులు దశముఖునకు
నతికాయుఁడు లోనుగాఁగ నార్వురచావుల్
వెతనొందుచుఁ జని తెలిపిన,
ధృతిదూలియు మూర్ఛనొంది తెప్పిరి పగచెన్.

కీర్తన : ఏకతాళము-(నలరాజ) వలె.

అతికాయ యేమిరా! గతియేది చూపరా! బ్రతుక జాల ॥ నతి ॥ నరులను ద్రుంతువు, చిరకాలముందువు, నీ వనుకొంటి ॥ నతి ॥ భయమెట్టుదొలగును! జయమెట్లు గల్గును! దిక్కులేదు॥ అతికా ॥ కడు కష్టదైవము బెడబాపె మనలను! బలుక వేమి॥ అతికా॥ అలమోక్ష గుండపురాధ్యక్షునితో వైర మింత చెసె ॥ నతి ॥

క. నాముద్దుతనయుఁ ద్రుంచిన
రామునితమ్ముని వధించు రణశూరుఁడు లేఁ
డే మందు విధికృతంబున
కీమహిఁ బగవారుగెల్చుటిఁక సంశయమే!

తో : శ్రీరాముని పటుశూరత్వమునకు మేరలేదు తలపోయఁ! జేరి లంక నిఁక జెఱుతురు వోయెదు వాఁగాన నని జేయ ॥ రా ॥

వ. అని బహువిధచింతాక్రాంతుడయియున్న తండ్రిని జేరి నమస్కరించి యింద్ర జిత్తు పలుకుచున్నాఁడు :

జంఝూటి : త్రిశ్రజాతి.-(నామాట) వలె.

నే నుండ శంకింపగ నీ కేల శోకింపగ ! మానుగ నని నల్పగ! నే వేగెదను వేగ జనక, పూనుము ధృతి బాగా॥ నే నుండ ॥ వానరులనగ నెంత। మానవు లనగ నెంత! నే నరుదెంచినంత నిలుతురె యిసుమంత! చింత బూనెదు బహువింత॥ నే నుండ॥ నను దేరిచూడలేడు! నాముందు నిలువలేడు! ఘనమోక్షగుండవిభుడు గావున జని నేడు చూడు! తునుముదు నీతోడు॥ నేను॥

వ. అని ధైర్యంబు దెలిపి యతనియనుమతి వడసి వేగంబున నింద్రజిత్తు ప్రయాణంబై,——

### ఇంద్రజిత్తు రెండవ యుద్ధము.

క. చతురంగబలము లత్య
ద్భుతవిక్రమ మొప్పఁ గొలిచి తో నరుదేరన్
బ్రతిపక్ష భయావహమగు
నతులితరణభేరి మొఱయ నని మొనఁ జొచ్చెన్.

వ. ఇట్లు చొచ్చి,

గీ. అగ్నిహోత్రుని బ్రార్థించి యతనివలనఁ
గాంచి బ్రహ్మాస్త్ర-రథ-ధనుః కవచములను,
నభమునం డాఁగి యతఁడు వానరులనెల్ల
నడపగాని వారిముంచెఁ బెల్లంపవాన.

గీ. అలబలము సేసి చెట్టుగట్టులు బెకల్చి
ఇంద్రజిత్తును మొత్తఁ బైకెగచి యెగచి,
వాఁ డదృశ్యుండుగాఁ జూచి వానరపతి
విసివి పుడమికిఁ దిగి వాని వెదక గడఁగె.

క. అన్నా? బ్రహ్మాస్త్రంబున
ని న్నీచుని ద్రుంచివైతు నిమ్మానతి నా
కన్నను : నొక్కనికొఱకయి
వన్నుగ లోకములఁ జెఱుపఁ బాడియె యనుజా!

వ. బ్రహ్మాస్త్రంబుచే వాడుకనబడకుండిన లోకంబుల భస్మంబుజేయు
కొఱకయి లోకమునేల బాధింతువు? మాను మని యతని యుద్యోగంబు నివారించె;

గీ. ఇంద్రజిత్తు కపుల నినకులజాతుల
బ్రహ్మశరముచేతఁ బరఁగ మూర్ఛ
నొందఁజేసి లంక కొయ్యనఁ జేరెను;
నర్కుఁ డస్తమించె నంతమీఁద.

వ. వనచరులకు రామలక్ష్మణులకుఁ గలిగిన విపత్తును గుఱించి విభీషణుండుఁ గొంతయోజించి యిట్లనుచున్నాఁడు :

తో. బ్రహ్మవరముచేఁ బ్రబలి దనుజు డిటు వాడిజూప రాఘవుఁడు। బ్రహ్మాస్త్రంబును బహుమానించుట భవ్యమంచునాఘనుడు ॥ రామ ॥

వ. ఊఱ కున్నాఁడు. కానిచో నీనీచునికి లోఁబడునా! యనిన హనుమంతుండు బ్రహ్మాస్త్రమునఁ జెడకుండ వరము గొనియున్నాడు గాన మూర్ఛవోకుండుటచే లేచి విభీషణునితోఁ గలసి కొఱవులు చేకొని రణమందుఁ గూలిన వాఁరినిఁ గని వగచుచు,

వసంత - అటతాళము.

ఇంతవారికిని నీవెతగలిగె ॥ నింత ॥ పంతముతో జని పటుసత్త్వవంతులై యెంతెంత పనులైన జింతింపకను జేయు ॥ నింత ॥ శూరులైన నవతారిములైనను బ్రారబ్ధకర్మానుభవము దప్పి చనునె ॥ ఇంత ॥ మోక్షగుండమందు ముదమున వెలసిన సాక్షాన్నారాయణస్వామి యీరాముఁడు ॥ ఇంతవారి ॥

వ. వీరికి గలుగు నాపదదీర్చునుపాయంబు మనకు దోపలేదు. జాంబవంతు డున్న దెలుపఁగలఁడు: చూతము రమ్మని యొక్కచో నంపశయ్యమీఁద జీవచ్ఛవముగాఁ బడియున్న యతనిఁగాంచి,

తో. బ్రతికియుందువా భల్లుకోత్తమ, పలుకగలవె మాతోడ॥ ధృతిమీఱఁగ గుర్తించినావె మముఁ దెలుపుమనగ వగతోడ ॥రా॥ ఎలుగుబట్టి నిన్నిప్పు డెఱింగితి నింతెకాని నాకనుల । నలుగులు నాటుట నవశంబైయిటు నవనిఁ బడితినని మొనల!॥

వ. రామలక్ష్మణులు వానరులు నేటికిట్టులైరి. అయిన హనుమంతుఁడు జీవములతో నున్నాఁడే! యనవుఁడు; హనుమంతుఁడు, లేచి నమస్కరించి.

తో : నే హనుమంతుఁడ నీదయచేతను నెమ్మది మనియున్నాడ। సాహసమున నే సలుపఁ దగినపని నూహదెల్పు ధృతి తోడ ॥ రా ॥

వ. జాంబవంతుండు కౌఁగిలించుకొని యిట్లనుచున్నాఁడు:

శంకరాభరణము: ఆదితాళము (ఔనౌనుమీ) వలె.

హనుమంత, నీవుదక్క వనచరులకు దిక్కు గనుగొన నెవ్వారు గల రింక బ్రతికింప ॥ హను ॥ పాలసముద్రముకూలముదాటిన మేలుగ నటు ద్రోణశైల మున్నది యందు

॥హను॥ సంజీవ విశల్య సంధానసౌవర్ణ మంజులకరణులు మనకుఁ బ్రాపించెడి ॥ హను ॥ అవిదెచ్చి యీవానరావళి కిచ్చిన భువి మోక్షగుండరాఘువుఁబ్రోలఁబడుననుదురు ॥హను॥

వ. ఇట్లు చెప్పిద్రోణాద్రికి మార్గంబు సెప్పిన నుపొంగి కుప్పించి సముద్రంబుఁ దాటిశీఘ్రయానంబునక్షీరాద్రి కవల నున్న ద్రోణాద్రిజేరి అందు విమర్శించినఁ, గామరూపు లయిన యాయోషధులు గానరావయ్యె. అంత నాపర్వతంబు పెటికి పెఱికి పట్టుకొని వాయు వేగంబున వచ్చుచుండిన,—

ఆ. ఆమహౌషధీ సమాగత పరిమళ
కలన వానరాళి తెలివినొంది
చచ్చియున్న రాక్షసవ్రాతములఁ బట్టి
యబ్ధి బడఁగ వైచె నతిముదమున.

వ. అంతలో హనుమంతుఁడు మందులకొండఁ దెచ్చి వానరుల నడుమ నుంచె అప్పుడు సంధానకరణివల్ల విఱిగిన యవయవములతుకుకొనియె. విశల్యకరణివల్ల శరీరమున నాఁటిన యస్త్రంబు లూడిపోయెను. సౌవర్ణకరణిచే శరీరములు సువర్ణకాంతి వంతములయ్యె. సంజీవకరణిచే శోషించిన ప్రాణములకు స్ఫుటంబు గలిగె ఇట్లు వానరుల బ్రదికించి యాంజనేయుఁడు,

తో: వరుగ రామలక్ష్మణులకు మ్రొక్కిన సంతసించి దీవించు । యురువిడి గిరి మున్నున్నచోటనెయుంచి ర మ్మనఁగ మించి ॥ రా ॥

వ. ద్రోణాద్రి యెప్పటిచోట నుంచి వచ్చె. అంత సూర్యోదయమాయె. అప్పుడు సుగ్రీవుండు రాఘవునసుమతంబునఁ గపులను గని,

కాఫీరాగము: ఏకతాళము. (ఈశ రానసంబ సా)వలె.

రావణుండు గడఁగిరాఁడు రణము సేయఁగా లావుమీఁద లగ్గలెక్కిలంక గాల్పుడు ॥ రావ ॥ అడ్డమైన దానవుల నవుడె ద్రుంపుఁడు; చెడ్డకార్యమంచు మది చింత మానుడు ॥ రావ ॥ అటులచేయకూరకున్న నాజ్ఞగొందును; నిటుల మోక్షగుండవిభుడె యిపుడు దెల్పెను ॥ రా ॥

వ. అని ఖండితంబుగా సుగ్రీవుండు పలికిన వానరులుమంచిదని సాయంకాలము వఱకు వేచియుండి, రాత్రి కాఁగానే కొఱవులు సేకొని లంక కరిగి ప్రతిగృహంబును గాల్చి మసిచేసి,

తో: బాలుర వృద్ధుల బట్టి మంటలోపల బడగా వైచుచును! జాలగ నడ్డము జనుదెంచిన రాక్షసుల బట్టి త్రుంచుచును ॥ రామ ॥

వ. బహు ఘోరకృత్యంబుల జేసివచ్చి రణభూమి బ్రవేశించిరి. అంత రావణుండు కోపించి,

## కుంభ - నికుంభాదుల యుద్ధము.

తో: కుంభ - నికుంభుల ఘోరవిక్రములఁ గుంభకర్ణుకొడుకులను గంభీరముగాఁ గదనమునకు దశకంఠుఁడు బొమ్మని యనెను ॥ రామ ॥

వ. మఱియు శోణితాక్ష యూపాక్ష కంపన ప్రజంఘులను గూడఁ బంపిన నీయార్గురుఁ గదలి రణస్థలిఁ జేరి.

## దానవ - వానర సంవాదము.

కీర్తన - ఆదితాళము : (మాతమ) వలె.

దా - ముదమున మాబలము మీదుమదికి దెలియకయమమ్మ! నెదురు వచ్చినారె! మంచిది! వానరులారా! గుదిమి పట్టెదమునిల్వుడి!

వా - వదరుచు మీవలె ముందు వచ్చిన వారొక్కరయిన! సదనములకు మరలఁ చేరిరే! దానవులారా! కదనమునఁజావకుండిరే!

దా - వారివలెగాదు; మేము బేరుగొన్నశూరులము! లేరుమము గెలుచుధీరులు। వానరులారా! దూరముగఁ బొందు మీరలు।

వా - ధారుణి మోక్షగుండ శ్రీరాముఁడు చూచుచుండమీరూపులు నీఱుజేతుము! దానవులారా! మృత్యువాత బడఁగ జేతుము!

వ. అని సింహనాదంబుఁజేసి యార్చిపేర్చి రాక్షసుల లక్ష్యపెట్టక విజృంభించి క్షణమాత్రంబున నంగదుండుకంపనుని, మైందుండు ప్రజంఘ - యూపాక్షులను, - ద్వివిదుఁడు శోణితాక్షుని, సుగ్రీవుండు కుంభుని, హనుమంతుండు నికుంభుని మడియించిరి అవ్వార్తవిని రావణుండు మకరాక్షుని బొమ్మన వాఁడుగ్రుండయి,

## మకరాక్షయుద్ధము.

తో: ఒక్కరథమ్మును నెక్కియుక్కుగలరక్కసు లుద్ధతిజూప, నక్కజముగ మకరాక్షుఁడు వెడలెను నాజికి నిది ప్రేరేప ॥ రా ॥

వ. ఖరాసురుని కొడుకగు మకరాక్షుండు యుద్ధభూమి జేరిమిన్ను మన్నుదగుల సింహనాదభుజాస్ఫాలనంబులు జేసి యెదిరించిన వానరుల నొప్పించుచు రామమూర్తి సమీపంబునకు నరిగి.

కీర్తన : త్రిశ్ర జాతి - (వనమూను) వలె.

రణమును జేయుమిపుడు రఘురామ । నాతోడగదిసి ॥ రణ ॥ క్షణములో నిన్ను సమయించి లంకకు బోదు ॥ రణ ॥ ఖరసూనుడను గనుము వరమకరాక్షుడ వినుము ॥ ఖర ॥ పరగ మాతండ్రి పగదీర్ప నేటికి గలిగె ॥ రణ ॥ కరవాలమున నయిన, గదనైన, విలుబూనియైన ॥ గర ॥ వరమోక్షగుండవాసుడ, యేలీల నయిన ॥ రణమును ॥

వ. అనిన, రాముండు గోపంబుదీపింప, —

తో : దబ్బరగాదుర దైత్యాధమ నాదెబ్బ తగిలినంతటను । నిబ్బర మెడలియు దబ్బబ్బన మీయబ్బకడకు జనవలెను ॥ రా ॥

వ. అనిన,

క. మకరాక్షు డరిగిపటు సా
యకములు మైగాడ నేయ, నవి నడుమనె త
ప్పక దునిమి వాని రథ - ర
థ్య కేతు చాపములఁ ద్రుంచె దాశరథి తగన్.

వ. అప్పుడు,

క. విరథుండయి శూలము గొని
వెఱవక దనుజుండు వ్రేయ, వేగమె దానిన్
విఱుగంగఁజేయ, నాతఁడు
కలకగు పిడికిటను బొడువఁగా నేతేఱన్.

తో : అనలాస్త్రంబున నతసియురమ్మున నారాముఁడు వ్రేయగను, । ననిమొన నమ్మకరాక్షుఁడు ద్రెళ్ళెను నమరులెల్లఁజెలగగను ॥ రా ॥

వ. అంత, సూర్యోదయంబాయె. మకరాక్షుని మరణవార్త రావణుఁడు విని దుఃఖరోషంబులు పెనఁగొని తన్నలయింప, నింద్రజిత్తుని బిలిచి యిట్లనియె.

కేదారగౌళ : ఆదితాళము.

కుమారకా! వినరా! అయ్యో! విమర్శగను నే వివరించెదనో ॥ కు ॥ అతికాయుఁడు మొదలైనవీరు లుద్ధతి గూలిరి యుద్ధములోన! గతి నీవేయిఁక । గదనము జేయఁగ ॥ గుమా ॥ సురలను దటిమిన జోదువు నీ కీనరుల గెలుమ టెంతటిపనియౌ, దురమునందు నీతో సరిగలరా ॥ కుమా ॥ మోక్షగుండరాముని లక్ష్మణుని లక్షింపుచు గెల్వగనీవు ఈక్షణమున రథ, మెక్కికదలుము ॥ కుమారకా ॥

ఇంద్రజిత్తు మూఁడవసారి యుద్ధము.

వ. అని పీడ్కొలిపిన నత్యుగ్రమూర్తియై లేచి కాంచనరథా రూఢుండయి,

క. అరదము లరువదికోట్లును,
గరులును బదుమూఁడుకోట్లు, కడువడిగల మేల్
దురగములు నూఱుకోట్లును
వరభటు లగణితముగాఁగ వచ్చుచు నుండఁ౯.

వ. ఒక్కకోటి చతుర్దంతదంతావళములు, నాలుగుకోట్లచిలుక వన్నెగల గుఱ్ఱములును గూడ బలిసి యేతేఱ, నిస్సాణాది బహువిధ వాద్యంబులు - మ్రోయ నుత్తరద్వారంబున వెడలి యుద్ధభూమి బ్రవేశించి,

గీ. రథము డిగ్గి చుట్టు రాక్షసదళములఁ
గాపువెట్టి కాటికాఁ బుచిచ్చు
దెచ్చి వేదియొకటి దీర్పించి యందుంచి
జ్వలను నింధనముల వెలుఁగఁజేసె

వ. సమంత్రణ పూర్వకంబుగా హెూమంబుఁజేసి ఆ యగ్నినుండి.

అఠాణా : ఆదితాళము.

కృత్తి యవతరించెను; బెద్దనత్తి యవతరించెను । కృత్తియనెడు పెద్దనత్తి లోకములకు మిత్తి యనగ మోర యెత్తి యార్భటించుచు ॥ గృ ॥ చాలభయదమౌ కపాలపాత్రయు, నస్థిమాలలు భీకరకరాలకేశము లలర ॥ కృ ॥ మోక్షగుండేశుని పైఁ గక్ష గట్టినయట్టి రాక్షసవరునకు ప్రత్యక్షమై పనులు సేయ ॥ గృ ॥

వ. ఇట్లు ప్రసన్నయయి కృత్తి యింద్రజిత్తుంగాంచి,

తో: పంపుము నన్నేపనికైనను నాతెంపుబెంపుజూపెదను । సొంపుగ ననుచును రంపులు చేయగఁ జూచి సంతసింపుచును.

వ. ఆకృత్తినడిగి దివ్యశస్త్రాస్త్రరథరథ్యంబులుగయికొని కృత్తి సహితంబుగా నంబరంబున కెగిరి, కృత్తిమహత్తుచే నెవరికిఁగానరాకుండ నదృశ్యుండయి,

తో: ఉగ్రబాణముల నురువడి వానరయోధుల పయిఁ బఱపుచును । నాగ్రహమునఁ బెల్లార్చుచు మెలఁగెనునంబరమండలమునను ॥ రా ॥

వ. పిమ్మట వాని సైన్యంబులు దిరిగి లంకలోనికి జనియె అక్కడ,

తో: గజుఁడు గవాక్షుఁడు గంధమాదనుఁడు విజయుఁడు లోనగు కపులు । గజిబిజి నొందుచు గదియుచు వైచిరి కడగి గిరులు వృక్షములు ॥ రా ॥

సురట : ఆదితాళము.

శిలీముఖంబులు వలీముఖులపయి చలంబు మెయివేసెన్ । వారలఁ బలాయనుల జేసెన్ ॥ శిలీ ॥ పటుత్వ మొప్పగఁ బదికోటుల మర్కటోత్తముల గూల్చెన్ । బలముత్కటంబుగాఁ బొల్చెన్ ॥ శిలీ ॥ అనంతరము నెమ్మనంబులను భయమునన్ వడంకుచునణంగి చూచుచునుండన్ । మొత్తో యంటంచును మోక్షగుండపతి మఱుంగునను జనిరి, మ మ్మొద్ధరింపు మని యనఁగా ॥ శిలీ ॥

వ. అప్పుడు లక్ష్మణుం డన్నకు నమస్కరించి,

ఉ. రామ, యిదేమి చూచెదవు! రావణి మర్కటసేన ద్రుంపఁగా;
నే మన నూరకున్న మన నిచ్చునె! కార్యము తప్పివచ్చెడున్;
భీమబలంబుతో నతని బిట్టుగఁ దాఁకి శరాగ్నిఁ గాల్చెదన్
వేమరు నాజ్ఞ యిమ్మనుచు వేడినఁ దమ్ముని గాంచి యిట్లనెన్.

తో: వినుమిదె లక్ష్మణ! వీఁడసాధ్యుఁడగు వనజభవుని వరమునను । ఘనముగఁ బ్రబలియు గనబడకయ మగతనముఁ జూపు దురమునను ॥

వ. కాబట్టి వీనిమీఁద బాణంబులు వైచిన నాయమ్ములు చెడిపోవునుగాని నిలువవు. సైరింపుము. అనుచుండ నగ్నిహోత్రుండువచ్చి.

తో: కనదాగ్నేయం బనుమంత్రంబును మనుకుల జపియించుచును । ఘనబాణంబొక్కటి వేసిన దనుజుని బాయును కృతియును ॥ రా ॥

వ. అప్పుడువాఁడగుపడు సనిచెప్పి యగ్నిభట్టారకుం దదృశ్యం డయిన, రాముండు శీఘ్రంబున;—

గీ. అగ్నిమంత్రంబు జపియించి యమ్ము వైపఁ
గృత్తి యెడవాసిపోయె పెందత్తఱమునఁ
దిన్నఁగా మేఘనాదుండు దిగి పుడమికి
దశదిశలు వ్రయ్య సింహనాదమ్ము సేసె.

తో: వానరులప్పుడు వడిగా దిరువులు వసుధాధరములు గొనుచు । వానిపైన బడ వైచి రొక్కపరి బంధురవైరము కొఱలి ॥ రా ॥ రాముఁడు నూఱుశరంబులు మఱి యారాముని తమ్ముఁడు మూఁడు భీమశరంబులు వ్రేయఁగ నన్నిటిఁ బిండిఁజేసి యనె వాఁడు ॥ రా ॥

పూరికళ్యాణి : ఏకతాళము.

ఎదిరింపలేరు! ఇఁకజాలు పోరు! అదలింపరారు! అంతటివారు గారు ॥ యెది ॥ అనిమిషులను అని గెల్చినాను నను గెల్వఁబూను నరుడెంతమాత్రుఁ డౌను ॥ ఎ ॥ బలవద్విరోధ మిల జేటుగాదా తెలియఁగలేదా! తలగఁగ రాదా వాద ॥ యె ॥ మురిసేరు కాండముల మోక్షగుండవరు దూరుచుఁడ బఱపెద నుండు కుండ ॥ నె ॥

వ. అని పలికి చండకాండంబు లెక్కు పెట్టి స్వాతీగత శుక్రుండు వర్షించిన చందంబునఁ గపిప్రవరులపై నెడములేక ప్రయోగించు నొప్పించి లక్ష్మణుని విల్లు నఱచి రామున కభిముఖుండయి యనుచున్నాఁడు

క. నీకున్ సాయము వచ్చిన
యీకపులను గెల్చినాఁడ! నిఁక న న్నెటులన్
దాఁకి జయింతువు తొలగుము
నా కడ్డము గలదె త్రిభువనంబులలోనన్.

వ. అని పలికి మఱియు ననేక సాయకంబు లందఱిపై వైచుచు దాను గెలిచినట్లూహించి వేగంబున లంక కరిగి యావార్త దండ్రికి దెల్పిన. సంతోషించి, రావణుండు—

కీర్తన: త్రిశ్రజాతి. (ఇంతైన) వలె.

నీవంటి కొడుకుండగ నీవారెపగ దిర్పగ నీవేళ కొనగూడె గా! ఇక వెండియు జను వడిగ ససిలో నీవిక్రమము నరగ తీవిగుల్కగఁ దేవపాళి బెదరి చూడఁగఁజూపి ర

మ్మిక ॥ నీవంటి ॥ శ్రీ మోక్షగుండవిభుని రాముని లక్ష్మణుని నామర్కటులను దాఁకి యం దున్న సోదరుని మొనసి మోమోటమిని జూసి తామసంబునఁ దలలు ద్రుంచివేసి ర మ్మిక సీత యబ్బును ॥ నీ ॥

వ. అనిన, దంద్రిని వీడ్కొని మహోత్సాహంబునఁ బురోహితయుతంబుగా రణ భూమిఁ జేరి యొక్క హోమంబుఁజేసి నగ్ని దేవుని సహాయంబువలన నాలుగు గుఱ్ఱములతో రథమును నమోఘాస్త్రంబులఁ గైకొని.

ఇంద్రజిత్తు నాల్గవయుద్ధము.

క. రథ మెక్కి యాతఁ డంబర
పథమునకు నెగిరికానఁబడకయె కపులన్
వధియించుచు సాయకముల
వ్యథ నొందఁగఁ జేయుచున్ భయంకరుఁడగుచున్.

వ. దక్షిణ దిక్కునకు వచ్చియిట్లను చున్నాడు:

కీర్తన : ఆదితాళము (నీ వనువా) వలె.

రణ మొనరింపుము రామా రామా! రయమున గూల్చెదరమ్మా! ॥ రామా ॥ అణు మాత్రంబుగ నసురుల ద్రుంచిన రణశూరుఁడవుగా రామా రామా! ॥ రణమొ ॥ కోఁతుల బలగముఁ గూడివచ్చితివి యాతుధాన కుల మలరెనురామా! ॥ రణ ॥ మోక్షగుండవరా! ముఖ్యంబుగనీ వీక్షితి నన్ను జయింపుము, రామా! ॥ రణ ॥

వ. అని మఱియు,

తో: పడమటిదిక్కునఁ బలికెను; మీ రెక్కడ బోదురు దిక్కెవ్వరు! కడివలెఁ జిక్కితి రెడపక మిము జక్కడఁతు! లేదు నా కెదురు ॥ రామ ॥

వ అని కొన్ని బాణంబులువైచి యింతలో—

తో: ఉత్తరదిక్కున కురికి పలికె; మిమ్ముక్కడంచి మీదటను, ఉత్తది యనకుఁ డయోధ్యకుఁ జని మీ కున్నవారిఁ జంపెదను ॥ రా ॥

వ. అని కొన్ని శరంబులు పఱపి వారి నేమఱించి తూర్పుదిక్కున కరిగి,

తో: మదిని విభీషణుమాటలు నమ్మియు మఱియేటికిఁ జెడియెదరు? పొదలుచు మీ రిప్పుడె యొటకయినను బోయిన మని యుండెదరు ॥ రా ॥

వ. ఈ ప్రకారంబుగఁ జతుర్దిక్కులయందుఁ దిరిగి ప్రగల్భంబులాడుచు నదృశ్యం బుగా బహుబాణంబులు ప్రయోగించి వానరుల నశింపఁ జేయుచుండినఁ గాంచి; కోపించి లక్ష్మణుండు రామునకిట్లనియె.

కేదార : రూపకము. (సాటి) వలె.

వీనిపైనిఁ గోపమురాని హేతువేమొ! రఘుకులవర ॥ వీని ॥ వానరాళి నెల్లఁ బొలి యింపఁగ దీనతతో నీనామమునే దలతురు ॥ వీని ॥ మేనులు దాఁపక వీరు నీనిమిత్త మింత పనిచేయఁగ, దానవుని వాతదగ్గ ద్రోయఁగ నౌనెయిది మానవపతులకు ధర్మమె ॥ వీని ॥ దండిగ మధ్యందినచండకిరణురీతి వడిఁ జూపుచునుండు ॥ వీని ॥ మోక్షగుండాధిప. కండలుగాఁ జెండఁగ నాకు సెలవౌనఁగుము ॥ వీని ॥

వ, అనిన శ్రీరాముం డిట్లనియె.

చ. కనఁ బడకుండయుద్ధమును గ్రక్కున వీఁ డొనరింప, వీనికై
కినిసిన లోకముల్ చెడవె! గీష్పతిరుద్రబిడౌజులైన నీ
తనిఁ జెనకంగఁ జాల! రటు రాఁగొనినాఁడు వరంబు బ్రహ్మచేఁ
గనుక సహించినాఁడ; నిఁక గాతునె కాలము మూఁడి వచ్చెడిన్.

తో: నే నల్గినయెడ వీని ప్రతాపము నీఱుగఁ జేయనె వినుమా । మానుగ హర బ్రహ్మాదులు గాచిన నైన విడుతునేకనుమా ॥ రా ॥

వ. అని పలికిన రామునకు గలిగినయాగ్రహంబు వాఁ డెఱిఁగి యుద్ధంబుఁ జేయఁ జాలక లంకలోనికిఁ జని తండ్రి కిట్లనియె:

క. కట్టల్కతోడ నేఁ జని
మట్టితిఁ గపికోటినెల్ల మనుకులవరులన్
ధట్టించి మానములు గొని
నెట్టనఁ జనుదెంచినాఁడ నీ కెఱిఁగింపన్.

వ. అని యధికప్రసంగముఁ జేసిన నింద్రజిత్తుపై రావణుండు గోపించి,—

జంఝూటి : ఆటతాళము.

ఇది యేమిటిపోక! యిది యేమిరాక! యదరి యేతెంచి యిట్లాడెదుగాక ॥ యి ॥ పగవారి నెదిరి చంపఁగఁ జేతగాక, మగఁటిమిని జెప్పెదవు! మఱిసిగ్గులేక ॥ యి ॥ దిక్కుల

జయించి తిరిగియీదినము దక్కక నరులకు డాఁగుటే ఘనము ॥ యిది ॥ మోక్షగుండేప దమ్ముని తోడ బట్టి శిక్షింప కిక నన్నుఁ జేరకు వట్టి ॥ యి ॥

వ. అనిన మంచి దని వాఁడు సీతవంటి యాకృతిగల నాతినొకతెను దన మాయ చేత నిర్మించి రథంబుపయిన నుంచుకొని పడమటిదెసకు వచ్చుచుండె ; అప్పుడు——

ఇంద్రజిత్తు పంచమయుద్ధము-

క. ఏతట్టు వచ్చునో యని
నాతని దశదిక్కులందు నరయుచుఁ గపుల్
భీతాత్ములగుచు నుండగ
నాతటి వాతూలతనయుఁ డద్రిశిఖరముల్——

వ. నెత్తిన మోచుకొని పడమటిదిక్కుగాఁ బోవుచు,

తో. అరదముపై మాయాసీతను గని యకటా పాపాత్ముండు । ధరణిజ దెచ్చెను దా నెటు చేయునో! తగవిధికృత మగుచుండు ॥ రా ॥

వ. 'దైవమా! యిట్టిదీనదశఁ జూడఁ గలిగె! అయ్యో! వీని నేమిచేయుదు! నెటుల నోర్తు'నని కపికోటులఁ గూర్చుకొని యట్టహాసంబునఁబయికడరె హనుమంతునితో నింద్రజిత్తు పలుకుచున్నాఁడు :

తో. ఏటికి వచ్చెద వీసేనలతో! నిదిగో! సీతను గనరా! ధాటిగ నీనతి తల దరి గెద ముమ్మాటికి నిజ మిక జనరా! ॥ రా ॥

వ. ఈ సీతకొఱకేకదా మీరింతశ్రమించుట. మీశ్రమ నివారించితి బోరా! వాయుకుమారా! అనిన, నాంజనేయుం డిట్లనియె :

తో : దనుజుఁడ వయినను ధరణి విశ్రవసు మనుమఁడవగునీకు దగునా! మునుకొని సీతను ముందలబట్టుక కొనకొనిఈడువ నగునా! ॥ రామ ॥

వ. అనిపలుకుచుండ వాఁడత్యుగ్రకర్మమునకు లోఁబడి,

క. మాయాసీతను బట్టుక
కో యని యార్చినను విడక, కోపము గదురన్
ఆయెడఁ గరవాలంబునఁ
బాయకఁ దలదఱిగి యతఁడు పలికెన్ గడిమిన్.

కీర్తన ; రూపకము. ( వేటాడు ) వలె.

ఇంకేటికిరా రణము ॥ ఇం ॥ పంకజగంధిని సీతనుబట్టుక గరవాలంబున శంకింప దలఁదుంచితి! బింకంబులు బొంకంబులు ॥ నింకే ॥ ఈ జానకికొఱకే కద యాజికి మీరే తెంచుట! మీజాడలు నాముందఱగాఁ జాలవు రాఁజాలవు ॥ ఇంకే ॥ ఈసంగతి మోక్షగుండవానునితో నెఱిగించియు, నానలుడిగి పొం డుండిన రోషంబు మోనం బగు ॥ నింకేటికి ॥

ద్విపద : వాఁ డిట్లు పలికిన వాయుసుతుండు
పోడిమిచెడి దుఃఖపూరితుం డగుచు
'వనచరులార, దైవముదప్పదీసె!
మనయుద్యమం బేది మఱిసాగదయ్యె!
నేమఱియుండకుఁ డీతని మీరు!
రామున కీవార్త రయమునఁ జెప్పి
యమ్మహనీయుని యాజ్ఞానుసరణి
నెమ్మదితో వత్తునేఁ' డంచుఁ గదిలి
పోయె ; నాపిదప నుప్పొంగుచు దనుజ
నాయకసుతుఁడు మనంబునఁ దలఁచె

క. 'ఇక్కడ హనుమంతుఁడులేఁ ;
డొక్కండును జెఱుపలేరు హోమ మొనర్తుఁ
గ్రక్కున' ననుచు నికుంభిళ
దిక్కున కరుదెంచి యతఁడు దృఢనిశ్చయుఁడై.

తో : కలు పాలు రక్తంబు దేనెటెంకాయలు గంధసుమములు బల్లులు పిల్లులు పాములు మొదలగు బహుమృగాళిమాంసములు ॥ రా ॥

వ. అమితంబుగా దెప్పించి కాత్యాయనీదేవిని నిలిపిపైవస్తువులచే మంత్రపూర్వకంబుగా నగ్నియందు హోమంబుఁ జేసి తనుపుచుండె. ఇక్కడ హనుమంతుండు శోకాతురుం డగుచు వచ్చిరాఘవునకు నమస్కరించి యిట్లనుచున్నాఁడు.

ఫీల్ రాగము : ఆదితాళము (గురుమహో) వలె.

మనుకులవర్యామనుకులవర్యా! మన కార్యము జెడె ॥ మనుకు ॥ రామ! మీరామను రావణి దెచ్చియుఁ గోమలిశిరమును గోసినాడకట! ॥ మనుకు ॥ ఒప్పుగ నందఱ ముండియు సీతను దప్పింపఁగ శక్తతలే దాయెను ॥ మ ॥ తక్కక నీనినదాఁకఁగాపాడియు నక్కకిచ్చినచందంబుగ నాయెను ॥ మ ॥ మోక్షగుండాధిప, ముందుగ మీకును నీక్షణమున దెల్ప నేతెంచితిని ॥ మనుకుల ॥

వ. అనిన హనుమంతుని పలుకులు ములుకులై చెవిసోఁకిన నిశ్చేష్టితుండై రాముఁడు.—

క. జనకజను మదిని దలఁచుచుఁ
బెనుగాలిని నేలఁ గూలు వృక్షము రీతిన్
ఇనకులుఁడు మూర్ఛ నొందినఁ
గని వగచిరి చుట్టునున్న కపిపుంగవులున్.

వ. అప్పుడు—

తో: కన్నీరేఱుగఁ గారఁగ లక్ష్మణుఁ డన్నకడకుఁదా నరిగి। పన్నుగ నూరుల పయికిఁజేర్చుకొని మన్నుదుడిచి మది గరగి ॥ రా ॥

ముఖారి : ఆదితాళము.

అకటా! రఘువీరా! జానకి కింత యడలవలసె నౌరా। ప్రకటముగ దశకంఠుఁ గూల్పఁగ రాజ్యమును విడనాడి వచ్చితి! మొకటిమన మెంచినను దైవం బొకటి నెంచెను! విధికృతంబగు ॥ నకటా ॥ రణశూరుడగు నీవు గలిగియు ధరాకుమారికి జావు క్షణములో పలఁ వచ్చెనీశోకమున కెయ్యదిమేర! సుర రక్షణమునకు జనియించితిమి మోక్షపురనాథ యదెట్లు జేసెద ॥ మకటా ॥

తో: జానకిమరణము సైపజాల! నేశరవహ్నుల ముంచెదను। దానవులను! లంకా నగరంబును దగ్ధము గావించెదను ॥ రా ॥

వ. అని లక్ష్మణుండు శోకించుచుఁ బలుకు పలుకులువిని విభీషణుం డిట్లనియె!

తో: ఎక్కడిమాటలు ఇంద్రజిత్తు దానిక్కడ గపటముచేత। గ్రక్కున సీతను గల్పించియు మటి చక్కాడెను గసిచేత ॥ రా ॥

వ. ఇందులకు వగవపలదు నేను రామునకు సీత నిమ్మని చెప్పిన! వినని రావణుండు కొడుకు సీతను జంపఁ బోయినఁ జంప నిచ్చునా! అమ్మహాపతివ్రత చచ్చిన లోకంబులు నిలిచి యుండునా! నేను నిజముం గాంచి వచ్చెద నని యింతలో రాముండు మూర్ఛఁదేఱియున్న,—

గీ. రామునాజ్ఞను గైకొని భ్రమర మగుచు
రావణోద్యానవనము, జేరంగఁబోయి
శింశుపము క్రింద నున్నట్టి సీతఁగాంచి
మరలి యేతెంచి తెలిపె దాశరథులకును.

వ. ఇట్లు సీతాదేవి క్షేమవార్త రామలక్ష్మణులకుఁ దెలిపి విభీషణుం డిట్లనుచున్నాఁడు:

తో: రామ నికుంభిళ హోమము జేసి శరంబులు రథమును బడయ। దా మది యెంచియు దరుచరు లది యెంతయు జెజితురొయని తెలియ ॥ రా ॥

వ. ఇంద్రజిత్తు కపటంబున నిదియొక సందడిచేసి యందరునిర్విణ్ణులయి యుండ: నెమ్మదిగా నికుంభిళకుఁ బోయి హోమంబుఁజేయు చున్నాఁడు.

క. హోమము సాంగంబయినను
నామేటిని గెలువలేరుహరిహరు లయినన్:
ధీమతితోఁ గపియుతముగ
సౌమిత్రిని బంపు మతనిఁ జంపుటకొఱకై.

వ. పదునాలుగు సంవత్సరములు నిద్రాహారములు వర్జించిన వానిచేఁజచ్చున ట్లతనికి వరమున్నది. అట్టివ్రతము మన లక్ష్మణుండాచరించియున్న వాఁడు గాపున, వానిం జంపును. వాఁడు మడిసిన రావణుండును జచ్చినట్లుగాఁ దలఁపుడనిన, రాముం డాశ్చర్య చిత్తుఁడై లక్ష్మణునిఁజూచి.

జంఝూటి: త్రిశ్రజాతి (ఎవ్వాఁడు) వలె

సౌమిత్రి, యింకను లెమ్మా! సమరము జేయబొమ్మా! ఆ మేఘనాదుగమ్మా! అమ్ముల బడ గ్రుమ్మా! గెలిచి క్షేమముగను జేరుము! వానిహోమము విఘ్నము జేయుము! ఆజిలో మోమోట ముడుగుము ॥ సౌ ॥ మదిమోక్షగుండవిభుని మఱవక తలంచుకొని వద జయమయ్యెడిని! భల్లూకపల్లభుని వేగఁ బవమానవరుపుత్త్రుని వెంటఁ బదిలముగా గొల్చి ర మ్మని ప్రీతితో ధనురస్త్రములఁ బూని ॥ సౌమిత్రి ॥

వ. అని యిట్లుతెలిపి, సముద్రుం డిచ్చిన వజ్రకవచంబును ఖడ్గంబును ధనుర్బాణంబులును ఇచ్చి దీవించి పంపిన, సౌమిత్రి రామునకు నమస్కరించి జాంబవంతుండు కోట్లకొలఁది భల్లూకంబులతోడ వెడలి విభీషణయుతంబుగా హనుమంతుని నారోహించి యిరువంకల గపిసేనలు బలిసి యే తేరఁ గదిలి,

తో: ముప్పదియోజనములదూరంబున నొప్ప నికుంభిళ కేగి, । గొప్పబలంబులు గో ట్లర్బుదములు గూడిచుట్టినను మూగి ॥ రామ ॥

వ. సందడి లేక నిస్తరంగసముద్రంబుఁబోలె నలరుచున్న మేఘనాదుని సేనలం గాంచి లక్ష్మణుఁ డాశ్చర్యంబు నొందె. అప్పుడు విభీషణుండు, —

గౌళబంగాళ : ఆటతాళము.

చూడుమా సేనల రామానుజ! చూడు ॥ ఏడఁజూచినను గాని యెడము సందు లేదు । చూడు ॥ సేనల ద్రుంచినఁ గానిలేవఁడు వాఁడు । చూడు ॥ హోమవిఘ్నముజేయ నురుబలముల బంపు ॥ చూడు ॥ బాణపరంపరఁ బఱపి చంపుము వాని ॥ చూడు ॥ మోక్షగుండేశుని ముద్దుల తమ్ముడ ॥ చూడు ॥

వ. అనిన లక్ష్మణుండు రాక్షసదళంబుల రూక్షేక్షణంబుల వీక్షించి బ్రహ్మాండ మదరునట్లు జ్యానినదంబుఁజేసి శరవర్షంబులు గురిపించుచుండెను.

తో: రాక్షససేనలు నాక్షణమున నారామసోదరుని గదిసి యక్షీణంబుగ నలజడి బెట్టిరి యంబులు బెక్కులువేసి ॥ రామ ॥

వ. అది గని మహోగ్రహసమగ్రులై,

క. భల్లూకవరులు మర్కట
వల్లభులును గిరులు దరులు పడి వైచుచు రం
జిల్లఁగ రాక్షససేనల
నెల్లనుభంజింపుచుండి రెంతయు దెగువన్.

వ. లక్ష్మణుండును బాణప్రయోగంబుల ననేకుల మడియింపుచుండ దదీయాటోపంబునకు సైరింపనోపక రక్కసు లుక్కుచెడి హోమంబుచేయు నింద్రజిత్తు మఱుఁగునకు జని బహువిధంబుల మొఱపెట్టుకొనిరి అప్పుడు —

యిన్నూటపదియాహుతులు వేల్ప్వవలసియుండె, అందు నూటతొమ్మిది మాత్రమే వేల్వఁబడియె ఇంతలో ——

క. దనుజులు హాహారవముల
దనమఱుగునఁ జేరుటయును దరుచరులెల్లన్
వెనుకొని తఱుముటయుంగని
పనివడి సవనంబుమాని పటురోషమునన్.

గీ. కేలనుండిన యాహుతుల్ నేలవైచి
రథముపై నెక్కి చాపశరంబు లూని
దండధరుఁడునబోలె నుద్దండు డగుచు
శరసహస్రమునించెవానరులమేన.

వ. ఇట్లతండు వానరుల నొప్పించుచుండ, విభీషణుండు లక్ష్మణునిఁ జూచి యిట్లనియె :

కాంభోజి. అటతాళము - ( నిన్ను నమ్మి ) వలె.

దానవుని చేత గాన వచ్చెగదా! వానరుల గెల్చి వచ్చును గ్రమ్మఱ ॥ దాన ॥
మానుగ నామఱ్ఱిమానుక్రింద హోమ మానందముగ జేయ బూనును సత్యము ॥ దా ॥
హోమసాంగమైన, నామేటి గెల్వనుత్రామాదు లయినను దామోవఁ జాలరు ॥ దా ॥
దండిగ శ్రీమోక్షగుండేశు సోదర చెండుము వా డిందుఁ జేరకమునుపే! ॥ దాన ॥

వ. అనియిట్లు ప్రేరేప లక్ష్మణుం డతి వేగంబున వానరులఁగనిమనంగు నింద్రజిత్తునకు నభిముఖుండయి చని యంభోధరసమానగంభీర వాక్యంబుల నిట్లనియె.

తో: మాయలు చేసిన మఱి క్రియలేదుర మగవాఁడవు నీవయిన । నాయెదుటికి దిన్నంగ జేరియుఁ గదనము చేయుమురబిరాన ॥ రా ॥ ఆలములో వీరందఱు జూడఁగ నసురాధమ, నినుగూల్చి కాలుని ప్రోలికిఁదోలి గొందు జయశీలతనేఁ బోల్చి ॥ రా ॥

వ. అనిన వాఁ డదరిపడి యిట్లనుచున్నాడు;

కళ్యాణి : రూపకము.

అంతవాఁడవా! నాయంతవాని తోడ నని సలిపెడు! ॥ నంత ॥ అంతకాభుఁడంచు నన్నుఁ గాంతు రాశాకాంతులుఁ వింతగా! నినుంత లేవు పంతగించి వచ్చే బెదరించెడు

॥ నంత ॥ మున్నునాగపాశముల నిన్ను గట్టి వచ్చితిన్! నన్నునింతలోనే మఱచినావె మానవుండ ననుమార్కొను ॥ నంత ॥ మోక్షగుండవానుని తమ్ముండ వయిన నేమి నిన్నీ క్షణమ్ము శిక్ష జేతు రాక్షసాళిపైని వడిజూపెడు ॥ నంత ॥

వ. అని రోషకషాయితాక్షుండయి విభీషణుని గని యిట్లనియె;

తో : పిన్నతండ్రి వని నినుఁ జూడఁ దగ; దన్నిట రోసితివీవు, పన్నగ శత్రువుల పంచ గాచుకొని తిన్నగఁ బడియున్నావు ॥ రా ॥ ధర్మహీన, మామర్మంబులు శాత్రవులకు బ్రచురించితివి! దుర్మతి స్వకుల ద్రోహము జేయగ గూర్మితోడఁదలచితివి ॥ రా ॥

వ. ఎంత నీచుండయినను ఎంతమోట వచ్చినను బంధువుల విడనాటి పగవారి శరణు జొచ్చువారు గలరా! నీసహాయంబుచేతనే రావణుండు దేవతల గెలిచెనా! ఇప్పుడు నీవు తలఁగిన మాకు లోపమా! యని తూలనాడినఁ గలుషించి విభీషణుం డనుచున్నాఁడు.

దర్బారు: (వీరినం) వలె.

మీమేలుచాల్ చాలు! నాముందర బలుకకు నిలు ॥ మీ మేలు ॥ నామాటలు వినరైతిరి! యీమాడ్కిని మీమూర్ఖ మేమిముఁజెఱచెను నోరున్న దనుచు జాల దూఱకు దుశ్చారిత్రులఁ గూరిమిబంధువులైనను సారజ్ఞులు దూరముగా దొలగందగు ॥ మీ ॥ నీతండ్రి యును నీవునీతిలేని నీవారలు, ఘాతుక, విను మోక్షగుండనేతచేత భూతలమునఁ బొలియఁ గలరు ॥ మీమేలు ॥

వ. అని విభీషణుండు పలికిన, నతండు ప్రళయకాల రుద్రునిభంగి రౌద్రాకారుం డయి హనుమంతునిపయి నెక్కివచ్చుచున్న లక్ష్మణుని దిక్కుఁ దనరథంబు బోనిచ్చి పలుకుచున్నాఁడు.

పంచచామరము

వనాంతరంబులందు నుండి వంటకంబుఁ గాన కే
యానాదృతిం గృశించినా వహో నరాధమా!
ఘనాంగులన్ మముున్ జయింపఁగా దరంబెఁ యీనదీ
అ నాజిమాని లేచి పొమ్ము రాముఁ జేర నుర్వడిన్.

వ. అటుల పోక నెదిరించితివేని వినుము.

తో. వటువిశిఖంబుల పాలుజేసి నినుఁ బడఁగొట్టుదు భూస్థలిని। గటకబడి రాఘవుఁడు బడిన నినుఁ గనునటు జేతును లలిని ॥ రా ॥

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె:

పంచచామరము

అలంప నిర్జరాళిఁ దోలినట్లుఁ గాదు నిల్చిదో
ర్బలంబు జూపు నిన్ను నీవె ప్రస్తుతించు కొంటచే
ఫలంబులేదు! నాదుబాణపఙ్క్తి కోర్చి నిల్చినన్
బలాబలంబు లెల్లఁగానవచ్చుఁజూచు వారికిన్.

వ. అనిన వాఁడు రోషించి,—

ఇంద్రజిత్తు-లక్ష్మణసంవాదము.

ఇంద్రజిత్తు-జంఝూటి: రూపకము.

వచ్చెను నా బాణములవాడి జూడుమా! ॥ వచ్చె ॥ చెచ్చెర నీబొమ్మవియగఁ గ్రుచ్చును లోఁజొచ్చును మెఱమెచ్చులుగావిచ్చలుగను ॥ వచ్చె ॥

వ. అని పెక్కుసాయకమ్ములెక్కువెట్టి పుంఖానుపుంఖంబుగా లక్ష్మణుని ముంచి యార్చిన, నతండు లక్ష్యపెట్టక,—

లక్ష్మణ-జంఝూటి: రూపకము.

ముచ్చిలి యీవఱకు బోతి మూఁడుసారులు! వచ్చితి వీసారి మిడుత జిచ్చునఁ బడి చచ్చెడుగతిఁ జచ్చెద విపు డిచ్చటనే ॥ ముచ్చి ॥

వ. అని పలికి యాశరంబులు తన నిశితసాయకమ్ములచే రూపుమాపిన, వాఁడు క్రూరనారాచంబులు దొడిగి,

ఇంద్రజిత్తు-జంఝూటి: రూపకము.

వక్షము లక్షించినాను వ్రయ్య లయ్యెడున్! ఈక్షితి బ్రతుకంగ దరమె యక్షయ రణదక్షునిగా! నీక్షణమున వీక్షింపుము ॥ వచ్చెను ॥

వ. లక్ష్మణుని యురంబు గుఱిజూచి వైచిన నవి దునిమి వైచి సౌమిత్రి కోపోద్రేకంబున భయంకరమగు నొక్క బాణంబుఁ గార్ముకంబున నెక్కువెట్టి,—

జంఝూటి : రూపకము.

మోక్షగుండ దేవునికటాక్ష మున్నను దీక్షతో నీబాణమునఁ బరీక్షగ నోరాక్షస! ప్రత్యక్షంబుగ శిక్షించెద ॥ ముచ్చిలి యీ ॥

వ. అని యాకర్ణాంతముఁ దిగిచివైచిన, నాయేటునకు రాక్షసుండు మూర్ఛిల్లి మరలలేచి యెదిరించె. గాలూన నియ్యకుండ లక్ష్మణుండు బాణంబులు వ్రేయుచుండె. అపుడు దానవుఁడు దనమనంబున-

తో : అబ్బా! దేవతలందఱఁ గెల్చితి నాయాసము లే దాయె! । గొబ్బున నరుచే గూలుకాల మొనఁ గూడెనేమొ వడిబోయె ॥ రామ ॥

వ. పరాక్రమవంతులగు దానవు లందఱు వీరిచేత మడిసిరి. నేను బ్రదికి ప్రయోజనమేమి ? శరీరము దాఁపక యుద్ధంబుఁ జేయుద మని యెంచి భూకంపంబు గలుఁగగ సింహనాదంబుఁజేసి,

తో : పిన్నతండ్రిపైఁ గొన్ని బాణములు, భీకరముగ లక్ష్మణునిఁ గొన్నిబాణములు, గురుతుగ వాయుజుఁగొన్ని బాణములు విడిచి ॥ రా ॥

వ. నొప్పించిన, రోషించి విభీషణుండు....

తో : విల్లుగుణధ్వని వేగచేసి పటువిశిఖంబులు సంధించి । కొల్లగ నగ్రజుకొడుకు మేనిపైఁ గోపంబున దా ముంచి ॥ రామ ॥

వ. మఱియు ననేక మార్గణంబులు రాక్షసానీకంబుపై వైచి బాధింపుచు వానరసేనలం గాంచి విభీషణుం డిట్లనియె.

బేహాగ్-ఆదితాళము : (పోనియ్య) వలె.

మీరు తగ్గక తగ్గక గ్రమ్ముడు! ॥ మీరు తగ్గ ॥ నిగ్గుగ బగవారి మూఁక మొగ్గ వచ్చె లగ్గలెక్కి ॥ త ॥ దీక్ష లక్ష్మణునిచేత నీక్షణమె చంపించెద; । రాక్షసమూఁకల మీరు శిక్షింపుడు; పిమ్మటను మోక్షగుండవానునిచే రక్షోవిభు డీల్గినట్టి ॥ తగ్గక ॥

వ. అని కవియించిన, మహారోషాయత్తచిత్తులై జాంబవంతాది వీరులు పర్వత వృక్షాదులచే మోదుచు,

అర్ధకందము : వ్రేటుకు వ్రేటుకు రాక్షస
కోటులఁ బెక్కండ్ర నవనిఁ గూల్చిరి కడిమిన్.

వ. ఇంతలో హనుమంతుండు లక్ష్మణునిదించి రాక్షసులపైబడి అర్ధకందము : వాటుకు వాటుకు నొక్కొక

మా టనురుల బెక్కుమంది మహిపయిఁ గూల్చెన్.

వ. ఇట్లుపోరు ఘోరం బయిన నహింపలేక ఇంద్రజిత్తు ప్రతాపం బిగురొత్త విభీష ణుండు లోనగువీరులపయి దారుణాస్త్రంబులు వేయుచుండఁ గని లక్ష్మణుండు గోపించి యాంజనేయు నెక్కి యొక్క యర్ధచంద్రబాణంబున—

తో: సారథిఁగూల్చిన సారథికము రాక్షసుండు దాననల్పుచును। బోరొనరింపఁ గపులు గొందఱు వాని తేరు హరులఁ గూల్పగను ॥ రా ॥

వ. విరథుం డయ్యు వాఁడు వడిచెడక సింహనాదంబుసేసి,

తో: అదరుచు నాగ్నేయాస్త్రము వింటను దొడిగి విభీషణునేయ । నడుమవరుణ బాణమున లక్ష్మణుఁడునటికి తుంపులుగఁ జేయ ॥ రా ॥

వ. రాక్షసుండు లక్ష్మణునకు నభిముఖుం డయ్యె. నప్పుడు—

భైరవి. ఆటతాళము (నమిూలాలాంత్రి) వలె.

వారు బ్రయోగసంహారములతో బోర, బోరుఘోరంబాయెను శూరుఁడు రావణ సుతుఁడు మోక్షగుండేనని ప్రియసోదరుఁడు చూడజూడ ॥ వా ॥ ఘననాగశరము రావణిత్రేయ, సౌమిత్రి గరుడాస్త్రమునద్రుంచెను. ధనదాస్త్రము వాఁడుద్ధతి వ్రేయ, లక్ష్మణుడునయామ్య మున ద్రుంచెను, చూడ జూడ ॥ వారు ! అరసి వాయవ్యాస్త్ర మతడేయ, సౌమిత్రి యైంద్రాస్త్రమునఁ ద్రుంచెను సురవైరి గంధర్వశరమేయ రామానుజుఁడురౌద్రమున ద్రుంచెను చూడఁ జూడ ॥ వారు ॥

వ. ఇట్లుఁ గొంతవడకుఁ బోరినపిమ్మట లక్ష్మణు డింకవీని బరిమార్చుట కర్తవ్యం బని యెంచి దిశాభాగంబులు వగులఁ గార్ముక జ్యానినాదం బొనర్చి యుగ్రదృష్టిచేత నింద్రజిత్తును వీక్షించి,

ఇంద్రజిత్తు మరణము

తో: ఇంద్రాస్త్రంబును వింట దొడిగి రామచంద్రుఁడు ధార్మికుడైన । నింద్రాదుల కిది హితవైనను నాయిలసుత పతిహితయైన ॥ రా ॥ ఈయస్త్రము జని యింద్రజిత్తు తల యిలఁ గూల్చును గాకనుచు । నాయెడ నాకర్ణాంతము దిగిచి రయంబునవ్రేయ గనలుచు॥రా॥ ప్రళయకాలవైశ్వానరుగతి దాఁబ్రబలుచు నదియేతెంచెఁ । వలగొని మణికుండలయుతముగ రావణిమస్తకమును ద్రుంచెఁ ॥ రా ॥

వ. అప్పుడు—

క. తుంబురులు పాడి, రచ్చర
లంబరమున నిలిచి వేడ్కనాడిరి సుమ వ
ర్షంబులు గురిపించిరి మో
దంబున లక్ష్మణుని పైనిఁ దగనిర్జరులుజ్.

వ. ఇంద్రజిత్తుమరణంబుగాంచి లక్ష్మణుండు శంఖంబుపూరించి సింహనాదంబుఁ జేసె. అప్పుడు విభీషణుండు లక్ష్మణునిగౌఁగిలించుకొని యగ్గించె. వానరులు జయజయ శబ్దంబులఁ బొగడిరి. తరువాత రాముఁడున్నయెడ కందఱుఁ జేరి మ్రొక్కిరి. ఇంద్రజిత్తు మరణవార్తకు రాముండు సంతోషించుచు,—

కీర్తన: ఆదితాళము.

భయమడంగెను మనకు జయమెసంగెను! రయముననా యింద్రజిత్తు రణమున దెగెను ॥ భయ ॥ కొడుకు లీల్గిరి; హితులు గూలిపోయిరి. కడకు రావణుండు వచ్చుఁ గదనమునకును ॥ భయ ॥ దీక్షఁబూనెదవాని శిక్షఁజేసెద! మోక్షగుండమందు వెలసి మోద మందెద ॥ భయ ॥

వ. అని బహుభంగులఁ దమ్ముని శ్లాఘించె. అనంతరంబ—

ద్వి. ఇంద్రజిత్తటువలె నిలఁగూలుటయును
దంద్ర నొందుచు లేచి దానవభటులు
దరుచరుల్ దమ్మునదగ్రులై దఱుమ
బరువడి నఱుకుచు బలహీను లగుచుఁ
గొందఱుప్రాకిరి కొండలపయికి;
గొందఱు దూఱిరి గుహలలోపలికి;
గొందఱు వనధిలోఁగొబ్బున బడిరి;
గొందఱులంకఁగక్కున, బ్రవేశించి
వందనంబులను దీనభావంబు దోపఁ
బదములు గడుఁదొట్రుపాటు జనింప
రావణుకొలువు జేరఁగ వచ్చి మ్రొక్కి
దేవ పరాకు! తా దిగ్విజయంబు

చేసిన మనయింద్రజిత్తు యుద్ధంబు
చేసి రామానుజుచేతను గూలె
నని తెల్ప; నాలించి యధికశోకమున
మునిఁగి కొండొకసేపు మూర్ఛిల్లి తెలిసి —

హిం-తోడి : ఆటతాళము-(దేహికే) వలె.

హా కుమార! గుణాకరా! యేర! హా కదనపటుభీకరా! నాకు దిక్కిక నెవరురా! యీశోక మాపఁగఁ జాలరా ॥ హా ॥ గరుడఖేచర కిన్నరాదుల సురగణంబుల గెలిచిన వర బలం బేమాయెనో! యొకనరునిచేఁ బడు టాయెనా ॥ హా ॥ మోక్షగుండ పురీశుని వెను ముట్టి చంపుదుననుకొని యాక్షణంబున బంపితి నది యంత పోయెను చెడితిని ॥ హా ॥

తేవారము. కొడుకులనందఱఁ బాసి కడకు నే నిన్నుఁజూచి
యొడలఁ బ్రాణములు నిలిపియుంటి! నివు డీవు బొలిసి!
తిడుమలకు నేను లోఁగి! తికను బ్రతికేమి సాగి!
చెడెను నాకీర్తి యెల్ల! జిక్కితిని నరులవల్ల!

తో : నాకు నీవు పరలోకకృత్యములు నాయనచేయఁగవలయు నీకాలంబున విప రీతంబుగ నీకుఁ జేయగావలయు ॥ రా ॥

వ. ఇట్టి కాలవిపర్యాసమున కేమి చేయుదురా! కుమారా! సుకుమారా! యని బహుభంగుల వగచి యెట్టకేలకు ధైర్యంబునొంది కోపాగ్ని మానసంబున అపులుకొని వృద్ధిపొంద.

తో : అటు నిటుఁ జూచుచు నగ్నికణంబులు బొటబొడఁగన్నులరాలఁ। బటపటఁ బటపటపండ్లు గీటుచుఁ బలికె మంత్రులకుఁ జాల ॥ రా ॥ మున్ను బ్రహ్మవరమున నేఁ గొన్న మహోన్నతధనురస్త్రములఁ బన్నుఁగ దెండిక బవరమునకుఁ జని పరిమార్తును శత్రువుల ॥ రా ॥

వ. అని పలికి బ్రహ్మండంబుఁ బగుల భుజాస్ఫాలనంబుచేసి,

తో : నాతమ్ముల బాంధవుల భటుల మఱి నాతనయుల రాముండు। సీతకొఱకుగద చీల్చెను, నేఁ జని సీతనుజంపెదనుండు ॥ రా ॥

వ. అని కరవాలంబుఁ గొని కోలాహలంబుగా నార్చుచుఁ ద్రిపురంబులు గాల్పం బోవు ప్రళయకాలరుద్రునివలెఁ దీవ్రతమై నశోక వనంబుఁజేరె; తన్నుఁ జంపఁ బైకొనివచ్చు రావణుని తెంపుఁగని కంపంబు నొందుచు సీత విలపించుచున్నది.

హిందుస్థానిరాగము: ఆటతాళము - (ప్రాణనాథునెటు) వలె.

వీనిచేతఁ జావు నాకు విధి లిఖించె నేమొకో! పాణియందుఁ గత్తిఁ బూని పయికి వచ్చె నేలొకో ॥ వీని ॥ ఇంద్రజిత్తు చావువలని యీను చేతనూ, ఇంద్రవైరి నన్నుఁ జంప నిపుడు వచ్చెనేమొకో ॥ వీని ॥ మోక్షగుండేశుని జయించి మోద మందుమ నీక్షణంబు నన్నుఁజంప నిటకు వచ్చెనేమొకో ॥ వీని ॥

వ. అని విలపించి రామమూర్తిని తనహృదయారవిందంబున నిలిపికొని మూర్ఛిల్లి ధరణిజ ధరణిపయి నొరిగె. అప్పు డతని రౌద్రరసంబును గని సుపార్శ్వుం డనువాఁడు హితంబుఁ దెలుపగోరి,

క. నీపైకి నెత్తి వచ్చిన
యాపగతురఁ జంపు టర్హ మగు; నదిగాకీ
పాపమునకు నొడిగట్టకు!
మీపడఁతిని జంపుటుచితమే దనుజేశా!

వ. బ్రహ్మవంశ భవుండవయి నీతి విడిచి స్త్రీహత్యచేయ నుచితంబేనా! చేత నయిన రామలక్ష్మణులఁ జంపు పొమ్మన, నియ్యకొని తిరిగివచ్చి యాస్థానంబుఁ జేరి కొలువు దీరి,

తో: తనయునిశౌర్యము తన్మృతివిధమును దనవారికిఁ జెప్పుచును, మనమున శోకసముద్రగుండై యాదనుజుఁ డుండెనంతటను ॥ రా ॥

వ. ఇంద్రజిత్తు మరణసమాచార మంతఃపుర కాంతలు చింతతోడఁ జెప్పుకొనుచుండ విని యతనిభార్య సులోచన లోచనంబుల నీరుగార మూర్ఛనొంది చెలులు బోధింపఁ గొంత వడికిఁ దెలిసినాథునిఁ గూర్చి—

ముఖారి: ఆదితాళము.

నాకు నీకు ఋణము తీఱెఁగదా ప్రాకటముగ నేటితోఁ బ్రాణేశ! నాకనివాసుల నాకుల మేపిన లోకభీకరుఁడ వయ్యయ్యో ప్రాణేశ! ఎప్పటికి నాతోఁ జెప్పి పోవుదు! నేడు చెప్పక పోతి వయ్యయ్యో! ప్రాణేశ ॥ నాకు ॥ కొడుకుల గాకులకొల్ల జేసియు నీవు విడిచిపోతి వయ్యయ్యో ప్రాణేశ ॥ నాకు ॥ ఈక్షితి మోక్షగుండేశుఁడు మనపై నిటు దయతప్పెనయ్య య్యో! ప్రాణేశ ॥ నాకు ॥

క. ఉరగేశుఁడు మజ్జనకుఁడు
సరగున నన్నిచ్చిపెండ్లి సలిపెడివేళన్
వరరత్న మొకఁటి ప్రాణే
శ్వర నా కిడి యిట్టు పలికె వాత్సల్యమునన్.

తో: జయకాంక్షను నీప్రియుఁ డని కేగెడుసమయంబునఁ దలయందు । నయముగ నీరత్నమును నివాళించియుఁ బంపుము జయమొందు । మఱువకు మనుచును మఱి నీతో నసె దురమున కేగెడువేళ । స్థిరముగ శౌర్యకుఁ జెప్పి పొమ్మనుచు జెప్పియుండె నావేళ ॥ రా ॥

వ. మీమామమాటలు మఱచితివే! నాతోఁ జెప్పిపోయిన నిట్టి మరణంబు సంభవించునా! మనోనాయకా! అనిదుఃఖించి పిమ్మట దనతనయులఁజూచి యిట్లనియె.

### సులోచనాసహగమనము.

ముఖారి :ఆటతాళము.

ఏల యీలీల వగవఁ దనయులారా! ॥ యేల ॥ ఏల వగచి ఫలమేమీ! కాలము గడవ! నెంతవారికి జాలును దనయులారా! ॥ ఏల ॥ భీతి నొందకుడు! విభీషణు డున్నాడు! ప్రీతితో మన్నించును తనయులారా! ॥ యేల ॥ ఘనమోక్షగుండేశకరుణచే నే సహగమనము జేయుదును తనయులారా! ॥ యేల ॥

వ. అని యూరార్చి విన్నదనంబుతో దశకంఠుని యాస్థానంబుజేరి పతివియోగ దుఃఖమునఁ గన్నీరు మున్నీరుగాఁ గార వగచిమామతో నిట్లనియె:

తేవారము: పతివియోగంబు గలిగె! బ్రతికియింకేమిఫలము ।
బతిని వెన్నంటి చనుట పరమధర్మంబు గానఁ
బతిశరీరంబు మామా! పరగ దెప్పించి యిమ్మా!
సతులు మెచ్చంగ వేగ సహగమన మేనొనర్తు.

వ. అనిన సతండు దుఃఖాక్రాంతుండై—

తో. ఆహవమునఁ బడినట్టి నీమగని యడిగినవా రిచ్చెదరా! ఆహా నాచే నదిగా దనఁగా నానె సలి కెమదిచెదర ॥ రా ॥

హిందూస్థాని తోడి: ఆటతాళము.

ఎక్కడికాలము గ్రక్కున వచ్చెను అక్కట! నామది కద్భుతమాయెను ॥ ఎ ॥ గాలిని బట్టిన కీలినిముట్టిన కైలాసమెత్తిన నీలావుదూలెనె ॥ ఎ ॥ సురపతి గెల్చిన శూరున కిప్పుడు నరులకు వానరవరులకు లోగుట ॥ కె ॥ మోక్షగుండేశుని మ్రోలకు నే నేగి దీక్షతో నావిభు దెచ్చు కొనెద నిక ॥ నెక్క ॥

వ. అని నిశ్చయించి మామకు నమస్కరించి యతని నమ్మతంబున—

చ. అరదము, నెక్కితోడిచెలు లందఱు నద్భుత మందుచుండఁగా
బరువడి దీనభావమున భండనభూమినిఁ జేరి తేరు తీ
వరమున డిగ్గి కాల్నడను వచ్చి వినమ్రతఁ దోఁపనార్తివా
నరు లరుదంది చూడ, రఘునందను జేరి నమస్కరించుచున్.

వ. సులోచన కరకమలంబులు ముకుళించి వినుతించుచున్నది.

శంకరాభరణము: రూపకము.

రామ! కదనభీమా! జయ ॥ రామ ॥ ప్రేమతో నామనంబునందుఁ గొలుతు ॥ రా ॥ సామనుత, స్మరారిహిత, సురారిహత ॥ రామ ॥ కామనిభామలకాయా, సామజసన్నుత, భార్గవరామగర్వభంగ, పూర్ణసోమదివ్యవదనా, తామసాదిగుణవర్జిత, భూమిజవర, మోక్షగుండధామ, శుభద, నారాయణనామకవిస్తుత, సుందర ॥ రామ ॥

వ. అని నుతించిన, రామునానతి సుగ్రీవుం డత్తరుణింగాంచి

తో: ఎవ్వరిదానవో! యెవరు తండ్రి నీ వెందుకు వచ్చితి విపుడు?॥ ఎవ్వఁడు నీపతి? యెఱిగింపుముమా; కవ్విధమనఁ ననెనపుడు ॥ రా ॥ వెలయ సులోచన: నింద్ర జిత్తు నావిభుఁ డగు; శేషుని సుతను, నలరఁగ రావణు నను(గుగోడలను నని రామునితో ననెను ॥ రా ॥

క. రామ, దయాకర పటురణ
భీముం డగు నాపెనిమిటిఁ బృథివినిగూల్పం
గా మంచి దగునె! యకటా!
ఈమెయి వైధవ్యమెటు సహింతును దేవా?

పున్నాగవరాళి : ఏకతాళము.

రఘురామచంద్రమా! యఘహర! బ్రోవుమా? మ్రొక్కెదను ; పతిభిక్ష
వెతలెల్ల బాపుమా? పరమపురుష? ॥ ర ॥ నీ ప్రాపుజొచ్చితి గాపాడ వేడితి
॥ రా ॥ విడనాడ బోకుము చెడఁజూడ బోకుము మోక్షగుండ ॥ రఘురామ ॥

వ. అని ప్రార్థించిన రాముండు పరమదయాపరమూర్తిగాన, గరుణించి మే
బ్రతికింప నెంచె, అది యూహించి హనుమంతుం డిట్లనియె ;

తో : ఏమి రామ నీ వెఱుఁగని దున్నదె! హేమగర్భవరములను
మానింప దగదె యన, నెలఁతకు రాముం డనెను ॥ రా ॥

క. భామిని, యిం కొక భవమున
నీమగఁడును, నీవుఁ గలిసి నిత్యసుఖంబుల్
ప్రేమాను భోగపరతం
గామించి మదీయపదముఁ గాంతురు పిదపన్.

వ. అని పలికిన నానందించి యామె యిట్లనియె :

తో : దీనదయాపర, దేవదేవ యట్లైనను నాపతిమేను ! బూనిక నిప్పింపు
జేతును మానుగ సహగమనమును ॥ రా ॥

వ. అనునంతలో సుగ్రీవుండు నీవు పతివ్రతవేని నీపతితోఁ గొంత ము
మనియె ఆమె మంచి దని రణమధ్యమందుఁ బడియున్న పతి శరీరంబుఁజూచి ద

తో : పతియెదైవ మని, ప్రతిదినమును నే వ్రతముగ నలుపుదునేని!
నాపతిజీవనహితుఁడై చెలిమిఁబలికెడునుబూని ॥ రా ॥

వ. అనిన, ఇంద్రజిత్తు గనులు విచ్చి చూచి యందఱు విన సులోచన కి

హిం. తోడి : ఆదితాళము. (కరిరాజు) వలె.

ననబోఁణి వగవగను బనిలేదు పోగదే! నను దాకి పోరువాఁడు సహి జ
జూడు ॥ మన ॥ ఆతండు శేషుఁ డగు నీతండ్రి యగును గాన నాతోడ గెల్చి
నాతిరో! యిచట నేఁడు ॥ ననబో ॥ వడిగను మోక్షగుండవరపుత్రునానతి గడువగ శ
కాలము దీఱెను ॥ ననబోణి ॥

వ. ఇట్లు పలికి యింద్రజిత్తు కనులుమూసి పలుకకున్నదుఃఖించి లేచి వచ్చి రాముని కెఱగిన నంతసించి రాముం డానతియ్య నంగదుం డింద్రజిత్తు కళేబరంబు సులోచనకుఁ దెచ్చి యిచ్చె దాని నామె తేరి మీఁద నుంచుకొని రాముని వీడ్కొని కదిలి,

తో : కాంచనాంగి లంకాపురికిని వేగంబున నపు డరుదెంచి। యుంచఁ దగినతావున బతిదేహము నుంచి భటులఁ గాపుంచి ॥ రా ॥

ఉ. మామను జేరి మ్రొక్కి రణమధ్యముఁ జేరఁగ వేగఁబోయి శ్రీ
రాముని నాశ్రయించి సుకరంబుగ భర్తకళేబరంబు దా
ధీమతిఁ దెచ్చుకొన్న కథతెల్లముగా వివరించి నేఁడు నే
నామగ దేగుత్రోవను జనన్ దయనాకు ననుజ్ఞ యిమ్మనన్.

వ. రావణుండు మిగులఁ జింతాక్రాంతుండై కోడలిధైర్యసుగుణంబులకు నద్భుతం బంది కొండొక కాలంబునకు నిట్లనియె.

క. భామిని నీ వెఱుగనిపని
యేమున్నది! దుఃఖవార్ధినీగెడు నాకున్
ఏమియును దోఁప దాయెను
నీ మదిలో దోచునట్లు నెఱపుము సాధ్వీ!

వ. అనిన నతనివీడ్కొని స్వగృహంబునకరిగి చింతగూరియున్న తన తనయులం గ్రుచ్చి లేవ నెత్తి శిరంబు మూర్కొని యిట్లను చున్నది.

పీల్ రాగము: ఆటతాళము.

నాముద్దుసుతులారా! నాయన్నలారా! భూమిని నాకేలబుట్టితి రౌర ॥ నా ॥ మీ ముద్దు జూడ నే నోమగ నైతి! నేనువిధికృత మెఱుఁగకపోతి ॥ నా ॥ మహిమీఁద నుంట ధర్మముగాదు; నేను సహగమనముచేతు క్షణమాత్రముననను ॥ నా ॥ ఇందుండఁ దగఁదీర లిప్పుడే లెందు! ముందుగఁ బాతాళమునకుఁ జనుండు ॥ నా ॥ వాసి మోక్షగుండ వాసుని దయను శేషునియింటను జేరిన సుఖము ॥ నా ॥

వ. ఇట్లు కుమారులను శేషునియింటికిఁ బంపి సులోచన యిహ విషయములయందు విరక్తిఁజెంది.

ఉ. తానును భర్తదేహ సహితంబుగ స్నాన మొనర్చి దివ్య భూ
షానికరంబు దాల్చి నిజసంస్కృతి బంధమెడల్చి పుష్పవై
మానికరత్నమందుఁ దన మన్మథునుంచి పధూవరాళికిం
దానములిచ్చుచుం జని యుదగ్దిశయందున నిల్పియంతటన్.

తో: చితిపైఁ బ్రాణేశ్వరుఁ జేర్పించియు జిఱునగవొలయఁగఁజేరి। పతితో; సహగమనం బొనర్చి నచ్యుతపదంబు నెదఁగోరి ॥ రామ ॥

వ. అంత దానవు లనలంబు రవులు కొలిపి యిండ్లకు జనిరి, తదనంతరంబ—

తో: సతియుం బతియున్ సంతోషముతో సౌర విమానము నెక్కి। యతులితముగ సద్గతికిఁ జేరి సౌఖ్యంబుగ నుండిరి చొక్కి ॥ రామ ॥

మూలబలయుద్ధము.

ద్విపద: అప్పుడు రావణుం డధికరోషమునఁ
గుప్పలైన నిప్పుకల్ గురియ నేత్రముల
మూలబలంబుల మొనఁగట్టి యుఱికి
యాలంబునకు నేగి యగచరాధముల
రామలక్ష్మణులను రయమునఁ జంపి
మీమీ ప్రతాపముల్ మేవడిఁజూపి
వేగంబ రండిక వెడలిపొం డనిన
త్యాగశీలతదెచ్చి దానవభటులు
ప్రధన కేళికిఁ బ్రాభవం బొప్పనుఱికి
రథములు దురగవారణములు భటులు
లెక్కకుమీఱి బల్మిని కేక ఓడుచు
దిక్కులు వగుల విద్విషకోటినొగుల
సింహనాదంబులు సేయుచు వెడలి
రంహానరంభులై రణమునఁ జొచ్చి—

క. కేకలు గొట్టుచుఁ గోతుల
మూఁకలనాకట్టి మట్టి మొనసిపగతురన్

లోకంబులు( గంపింప(గ
జీకాకుగ నంపవానచే ముంచి రొగిఁ.

తో: అప్పుడు వానరు లధికాగ్రహమున నద్రులు మ్రాకులు గొనుచు। గు
ధర(గూలునట్లుగా గ్రుమ్మిటి యసురులుగనుచు

వ. ఇట్టిరువా(గువారును బౌరుషంబుచే పెల్లురే(గి విడువకపోరు చుండిరి
వానరబలంబులు రాక్షసబలంబుల లక్ష్యపెట్టక.

తో: కరులను దోలిన గరులచేతనె గరుల మోది చంపుచును। దురగంబుల
వానిచే( దురగంబుల మోదుచును ॥ రామ ॥ పటుతర రథములు బలప వానిచే(
షులు గూల్చుచును భటులుగదిసినను భటులచేతనే భటుల మోది చంపుచును ॥
కాల( గొందఱిని, గేల( గొందఱిని, వాల(బుల గొందఱిని కూలిచి ॥ పాదవిరి
దమజులుగూత లిడ(గ నత్తఱిని ॥ రా ॥

వ. ఇట్టి భయంకరరణంబున( బెక్కం(డ్రు రక్కసులనోర్చివానరులు పేర్చి
చుండిన నారభసంబు గని సహింపక,

రగడ. మూలబలము లడరి కో(తులమూకపయిన( బడిరి
విక్పతగాత్రులును, విక్పతనేత్రులును ;
విక్పతహాసులును, విక్పతనాసులును,
విక్పతవక్త్రులును, విక్పతకర్ణులును,
విక్పతపాదులును విక్పతనాదులును,
విక్పతపు(గరులును విక్పతాధరులును,
॥ మూ ॥ కరపత్రంబులు, గ్రకచముసలములు,
గరవాలంబులు, గదలు జక్రములు,
పరిఘలు, శూలలు, ప్రాస పట్టెనలు,
పరశు-ముద్గరలు, బట్టుతో మరములు,
మొదలగు నాయుధములు గ(డు బూనుచు
నదరక బెదరక నని వెను(దీయక.
॥ మూ ॥ కడుపడి జగములు గడగడ( వడకగ,

సుడివడి జలజలఁ జుక్కలు రాలఁగ,
జలనిధు లింకగ, సులగిరు లదరఁగ,
గలవరమున దిగ్గజములు బెదరఁగ,
బలువడి శేషుఁడు ఫణములు ముడువఁగ,
బలుమలు గ్రహములు; బథములు దప్పగఁ,
మూలబలము లదరి కోతుల మూకపయిన బడిరి.

వ. ఇట్లు క్రమ్ముకొని నిలుపోవనీక వానరులఁ జెల్లాచెదరు చేసిన వారిదాడికి భయభ్రాంతులై వానరులుఁ దరులు గిరులుఁ గ్రిందవైచి తమలోఁ దా మిట్లనుకొనిరి;

కీర్తన : చాపుతాళము - (సీతారామ) వలె.

రాముఁడేలా! యినజుఁ డేలా! యుద్ధమేల! జాలును! ఆలమును మాని పోవుదియె పోలును ॥ రాము ॥ కడుపు, నిండఁగాయపండ్లాకులు గొండవనముల దండిగ దిసుమండక దలలి రా నేల ॥ రాము ॥ పెంకెరాక్షసుల నీక్షణమె శిక్షసేయగ మోక్షగుండా వ్యక్షుఁ డిది యే మో కనడాయెగా ॥ రాము ॥

వ. ఇప్పుడు వీరిచేత జావ నేల నూపిరి యుండిన నుప్పమ్ముకొని బ్రదుకుదుము రండని సేతువుమీదుగాఁ బోవు కపుల సడ్డగించి నీల-హనుమంతాంగదులు మరలించిన వచ్చి; భయభ్రాంతచిత్తులై రాముని మఱుంగునకుఁ జనిరి. దయారసంబున గనిరాముండు,

తో : దానవు లలరఁగ వాసరు లలరఁగ ధనువు గుణధ్వనిఁ జేసి భానుదీప్తశరవర్షం బసురులపయి గురిపించెను డాసి ॥ రా ॥ దనుజులు వోవఁగ దారిగాన కసు రణములోన దిరుగుచును । వెనుకొని రాముఁడు విశిఖంబులు వడి వ్రేయ దాఁకి కూలుచును ॥ రామ ॥

వ. ఉండుట గని రాముండు మఱియు,

క, చరణంబులు వదనంబులు
గరములు శిరములును వ్రేళ్ళు గాత్రంబులు నె
త్తురు లురులఁగఁ దెగనేసిన
ధరఁద్రెళ్ళిరి పెక్కుమంది దానవవీరుల్

వ. అంత మిగిలిన రక్కసులు భయభ్రాంతులయి;

తో. అదిగోరాముం డదిగో వ్రేసెను! యిదిగోరాముఁడు వ్రేసెనదిగో వ్రేసెను నిదిగో వ్రేసెను! యదెపాసెను నిదె డాసె ॥ రా ॥

వ. అని తిరిగి తిరిగి చూచుచుఁ బొఱుచుండగా రాముండలుక రెట్టింప,

తో: నెమ్మిఁ దొడిగి సమ్మోహనాస్త్రమును నేర్పుమెఱయవడి విడువఁగను। దమ్మిఁ దా మెఱుఁగక దనుజులు భ్రమపడి తబ్బిబ్బుగఁ దిరుగఁగను ॥ రా ॥ ఒక్క రాముఁడే పెక్కు రాములయి యెక్కడ జూచినఁ దోఁచె; । అక్కజముగఁ గస, నంతారామ మయంబై వైరుల నేచె ॥ రామ ॥

వ. ఇట్లాజిమధ్యంబున ననంతరూపులుగా దోఁచి రాముండు గసిమసంగిన వెక్క డివా రక్కడనే సొలసిరి. చావఁగాఁ జిక్కనవారు తప్పించుకొని లంకలోని కరిగిరి :

క. పదివేలుగరులు, హరు లిరు
వదివేలును, భటులు నొక్కపద్మము, రథముల్
బదిపదులు గూలెనేనియుఁ
బదపడి యొకయట్ట లేచి పరుపడి నాడుౝ.

ఉ. అట్టలు నూఱుకోట్లెగసియాడిన మస్తక మొండు నార్చుచున్
దట్టనలేచుఁ గోటి యవి తప్పక లేచిన రామువింటికిన్
గట్టినగంట మ్రోఁగుఁ బదునాలుగుగంటలు నర్ధయామముౝ
గట్టిగ మ్రోఁగె నౌర దశకంఠుని మూలబలంబు గూలఁగౝ.

వ. ఇట్లు కోదండ దీక్షాగురుండగు రాముండు దేవతల కభేద్యం బయిన రావణు మూలబలంబులభేదించి సుగ్రీవ - విభీషణుల దిక్కుఁజూచి యిట్లనియె :

కీర్తన : ఆదితాళము - (కనలి) వలె.

ఇలలోఁ గలబాణముల కిది మేటిగా నలగాధినందనుఁడు చెలిమి నా కిచ్చినాడు; బలమైన కలహమునఁ బఱప మే లౌనుగా ॥ యిల ॥ రిపులను వ్రేయ, నుపశాంతి జేయఁ; త్రిపురారి నేను దక్కఁ దెలియ రన్యులు నిక్క; మిపుఁ డెంత నిపుణత్వ మిది జూపెఁ గంటిరే ॥ యిల ॥ సమ్మోహన మను శర మిది యౌను, అమ్మోక్షగుండపతి నైన నా యనుమతి సమ్మోహితులఁ జేసె నిమ్మూలబలమును ॥ యిల ॥

వ. అనిన, వారు సంతోషించి శ్రీరాముని గీర్తించిరి. అపుడు విభీషణుండు ——

తో: దేవతలను దోలిదేవతలను భేదింపలేని సైన్యమును । దేవదేవ సాధించితి వికవెగు రావణుండు రణమునను ॥ రా ॥

వ. అని పొగడుచుండె. అనంతరము మూలబలంబు డుల్లిన వార్తవిని రావణుండు—

క. కోపాగ్నిజ్వాలలుగడు
దీపింపఁగఁ గొలువు సెదర, దీక్ష బలంబుం
జూపుచు యుద్ధోన్మత్త వి
రూపాక్షాదులకు ననియె రోషముతోడన్.

బేహాగ్ : ఆదితాళము - (పోనియ్య) వలె.

పోదము పోదమురం డిక మనము బోదము! । మోదమునఁ గపిన్నృపుల ముట్టడించి చంపఁగను! బోదము ॥ అక్షయరణదక్షులయూపాక్ష శోణితాక్ష మకరాక్ష దవ ధూమ్రాక్ష ముఖరాక్షసయోధుల బట్టిశిక్ష జేసి వెలయుచున్న మోక్షగుండ నిలయుపయికి ॥ బోదము ॥

రావణుని రెండవసారి యుద్ధము.

వ. అని వారిని గూడుకొని రథారూఢుండయి యుత్తరద్వారంబునఁజని, యుద్ధభూమికిఁ జేరినపిమ్మట ముందు విరూపాక్షయుద్ధోన్మత్త సుపార్శ్వులు బహురాక్షసానీకంబులతో నార్భటించుచు వానరానీ కంబులపయికిఁ దొడరి—

తో: పరిఘ ఖడ్గ గద పరశు కుంత తోమర మునలాదులచేత । నటిముటిమోదుచు నార్భటింపవానరు లతికోపముచేత ॥ రా ॥ క్షితిజాతంబులు క్షితిధరంబులును శిరములపైఁ గొని తెచ్చి ; ధృతితో వైచుచు దేవారుల బాధింపఁ దొడఁగి రటుహెచ్చి ॥ రామ ॥

వ. ఇట్లు క్షణమాత్రంబున సుగ్రీవాది వానరయోధులు విరూపాక్షాద్యసురయోధులఁ బిలుకుమార్చిన, నది గని రావణుండు గోపోద్దీపితుండయి సారథికి నిట్లనియె:

కీర్తన: ఆదితాళము - (మాతామ) వలె.

రామలక్ష్మణులపయికి రథమును బోనిమ్మనేడు! భీమశరము నెడద గ్రుచ్చెద! సారథి! వినర బిలుకుమార్చి మరలి వచ్చెద ॥ రా ॥ వారుగూలినంత మీద వానరులు చెట్లపాలై పారిపోదు రింకదప్పదు । సారథీ; వినర! పీరతిప్ప లిపుడె చెప్పెదు ॥ రా ॥ రాక్షసాధ్యక్షులనెల్లశిక్ష జేసి యుప్పొంగెను! మోక్షగుండేశుల ముట్టుదు! సారథి వినరా! యీ క్షితిని బడగొట్టుదు ॥ రా ॥

వ. అని పలికి తేరుఁ బరపించి గుణధ్వనిజేసి తనపయి నెదిరించిన కపిపుంగవులం బరికించి,

తో : అవలీలగ సాయకవృష్టిని ఆప్లవగవల్లభుల ముంచి! దివిభువి యదరగ దినకరకులుపై దేరు వేగఁ బరపించి ॥ రా ॥

వ. రావణుండుఁ దనయుద్ధండంబు జూపుచుఁ గోదండపాణితో భండనం బొనర్ప నెదిరిన యడ్డంబుదూఱి లక్ష్మణుండు —

క. కొన్నిశరంబులు వైచిన
 నన్నియుఁ దనబాణనిహతి నడరించియుఁ దాఁ
 గొన్నిశరంబుల నాతనిఁ
 బన్నుగఁ జిక్కంగఁజేసి పఙ్క్తిగళుండున్.

వ. రామునిపైకి నెదిరిన రాముండును నెదిరించి,

తో : రామలక్ష్మణులు రయమున నుభయులు రణరంగంబునదగిలి । భీమబలంబులఁ బెనఁగ జొచ్చి రుద్దామప్రజ్ఞలను మిగిలి ॥ కరలాఘవమున శరలాఘవమున సరి సమానముగఁ బెనగ । సురలెల్లను సంబరమున నిలిచియుఁ జూచుచుండి రది సరగ ॥ రా ॥

కీర్తన : అటతాళము. (మేలైన) వలె.

రౌద్రబాణంబును రావణుఁడేయగ రయమున బైకిరాఁగ, రౌద్రబాణముచేత రాముఁడు దానిఁబరాస్తంబొనర్చె వేగ ॥ రా ॥ ఘనతమిస్ర బాణమున దశకంఠుఁడు గడుఁజీకటులు సేయగ గనుఁగొని రాముఁడు, గర ముగ్రమగుబాణగణములచేఁ బాపెగా ॥ రా ॥ అక్షయ బలుఁడగు నసురవల్లభుఁడు నహిశరములు వేయగా, మోక్షగుండేశుఁ డొప్పఁగఁ బెక్కుశరముల దీక్షతోఁ ద్రుంచెఁదగ ॥ రా ॥

తో : అసురసాయక మసురుఁడు ప్రేయగ నదియు నుష్ట్రశార్దూల । కేసరి కిటి కరి గృధ్రోరగనమ భానురముఖముల జాల ॥ రా ॥

వ. బహుసాయకంబులయి కవిసిన రాముఁ డలుకరెట్టింపఁదన విలువిద్యాప్రౌఢిమచేఁ బటాపంచలు చేసి,

తో : దహనాస్త్రము భూధవుఁ డేయ, రవి గ్రహ తటిదుల్కల భాతి బహు బాణములయి పయికిరాగ వే భంజించె నురారాతి ॥ రా ॥

తో : మయదత్తంబగు మాయాశరమును మఱియును రావణుఁడు బఱప, । రయమున గాంధర్వం బను శరమున రాముఁడు దానిని జెఱుప ॥ రా ॥

వ. ఇట్లలతివోక యిరువురుఁ బోరు నవసరంబున లక్ష్మణుండెడఁ జొచ్చి.

తో : ఏడమ్ముల దనుజేశుని పడగయు విల్లును సారథి నడచి । వాడిగల్గుశర పంచక మాతని వక్షము నొవ్వఁగ విడిచి ॥ రా ॥

వ. సింహనాదంబుజేసిన నంతలో విభీషణుండు —

తో : తురగంబుల దుత్తునియలు సేసిన, విరథుండై రావణుఁడు । ధరణికి దుమికియుఁ దగశక్తినిగొని తమ్ముని వైచెదురాగ్రహుఁడు ॥ రా ॥

ఆ. నడుమ దాని లక్ష్మణస్వామి మూఁడమ్ము
లేసి త్రుంచెదానవేశుఁ డంత
మయునిచేత గొన్న మహితశక్తి విభీష
ణాఖ్యుమీఁదవైవ నడరుటయును.

తో : రామునితమ్ముఁడు రావణుతమ్ముని రయమున వెనుకకుఁ ద్రోసి । తా ముందఱ బంతమున నిలువ, నగి దశకంఠుడనె డాసి ॥ రా ॥

కీర్తన : ఆటతాళము. - (బాళాబం) వలె.

ఓర్చియుండు మిక వచ్చెను శక్తి ॥ యో ॥ కార్చిచ్చువలెమంట గ్రక్కుచువచ్చెను ॥ యో ॥ విభీషణుని నీవు వెనుక నుంచుకొంటి ॥ వో ॥ మయునిచే గొన్నట్టి మహనీయ శక్తిది ॥ యో ॥ ఉరగేంద్రనిభమైన యుగ్రంపుశక్తిది ॥ యో ॥ మోక్షగుండేశుఁడు ముదమున మెచ్చును ॥ నో ॥

లక్ష్మణుని మూర్ఛ

తో : ఘనమున నది చిఱుగంటలచప్పుడు గణగణ యని మొఱయగను । వనధులు గలగఁగ పడిగఁ గులాద్రులు వడకగ దిశ లార్వగను ॥ రా ॥ పిడుగులు రాలఁగఁ బుడమి జలింపగ నుడు పంక్తులు జెదరగను । కడువడిఁ జని లక్ష్మణుని వక్షమునగాడిన ధరపయిఁ బడెను ॥ రామ ॥

వ. కాలావసానసమయంబునఁ బెంపుదక్కి కూలు మహామేరువుచందంబున రావణ ప్రయుక్తశక్తిచే లక్ష్మణుం డిలఁ బడియున్నఁగాంచి, శోకవ్యాకులిత చిత్తుండ య్యును,

క. సౌమిత్రియురము గాడియు
భూమికి దిగియున్నశక్తిఁ బుచ్చఁగ గపులున్
దామోపరైరి యొకరును;
రాముండది బెఱికెఁ గడుఁ బరాక్రమ మొదవన్.

వ. ఇట్లు పెఱికివైచి సుగ్రీవ హనుమంతాది కపులను గాంచి రాముండిట్లనియె :

కాఫీ : ఆటతాళము.

ఈదశకంఠుని నే దునుముటకైగాదె జనించుట, కష్టము లొందుట, మేదినిపుత్రి వియోగము సైచుట, గాదిలితమ్మునిఁ గడకుగోల్పోవుట ॥ ఈ ॥ చాల పరాక్రమశాలిని వాలిని గూలిచి యీకపికోట్లను గూడుట, యీ లవణాంబుధి నటువలె గట్టుట, పోలఁగ మోక్షగుండపురపతి నగు నాకు ॥ నీద ॥

తో : శౌర్యముఁ జూపెడు సమయముగా దిది కార్యము జెడవగచుచును । ధైర్యము దూలెడు తఱిగా దిక నాతమ్ముని గాపాడుచును ॥ రా ॥

వ. మీరేమఱక యుండు డింకఁ దెలిపెద :

కీర్తన : త్రిశ్ర జాతి. (వనమును) వలె.

ప్రతిన దప్పను వినుడు ప్రతిలేదు కపులార నేఁడు ॥ ప్రతిన ॥ క్షితిబట్టి కంటు బ్రతుకుతోఁ బో నీను నేను ॥ ప్రతి ॥ సురవైరిపోక నిల్చిబరిదెగి పోఱినజాలు ॥ సుర ॥ యిరువురితెంపు నెఱుఁగుదురు చూడఁగలవారు ॥ ప్రతి ॥ ధరణి దూఱిన విడువఁ దగ వార్ధిఁ జొచ్చిన విడువ ॥ ధర ॥ సురలచాటునఁ జొఱఁబాఱి దాగిన విడువ ॥ ప్రతిన ॥ తరణి వంశజుఁడనేని దశరథతనయుఁడనేని, వరమోక్షగుండవాసుఁడనైతినేని ॥ ప్రతిన ॥

వ. అని ప్రతిజ్ఞగాఁ బలికి కనులఁ గెంపు లొలుక ధనుష్టంకారంబుజేసి రావణ దిక్కున కభిముఖుండయి తండోపతండంబులుగాఁ గాండంబులు బఱపె.

క. ప్రతిసాయకంబు లేయుచు
నతులితగతిఁ గొంతవడికు నసురేశ్వరుఁ డు
ద్ధతి బోఱి రామబాణ
క్షతుఁడయి సమరంబుమాని చయ్యన బాసెన్.

వ. సింగంబును గని మాతంగంబు పరుఁగు పాఱుభంగి రామునిచే భంగపడి యసురపుంగవుండు సంగరంబుమాని ప్లవంగవిభులుం దఱుమ లంకఁ జొచ్చి యంతఃపురికిఁ జేరి మందోదరితో నిట్లనియె :

హిం - తోడి : ఆటతాళము

రాముని విక్రమము, రమణిరో నిర్వక్రము ! ఏమిజెప్పుదు భామినీ ! యెటుల గెలుతును గామినీ ! ॥ రాముని ॥ నామదిని భావించిన రామరూపమే తోచును ! లేమరో యెందున్నది రామమయముగ నున్నది ॥ రా ॥ మోక్షగుండేశ్వరుని ముట్టడింపఁగఁ జాలను ! త్ర్యక్షుని సేవింతును ! దప్పక జయ మొందుదును ॥ రాముని ॥

వ. అని పలికిన తత్క్షణంబున :

క. మానుగ సాత్త్వికవృత్తిని
బూనిశివాలయముఁ జేరి పూజించి మదిన్
ధ్యానముఁ జేయుచునుండిన
దానవపతి జేరి పలికెఁ దత్సతితెగువన్.

తో : ఇదివఱ కందఱ నెదిరి జయించితి వెన లే రెవ్వరు నీకుఁదుద కిటు మగటిమి దూలి పలుకు టిది త్రోవ యౌనె యన బోకు ॥ రామ ॥

కళ్యాణి : ఆదితాళము.

నీకింత భయమునే డేటికి నీకు వంతముచెడి భయపడువాఁడవు ? ఏకాంత నపుడు దేనేటికి ? తేనేటికి ? తేనేటికి ? ॥ నీ కింత ॥ తాతయు దమ్ములు దల్లియునేనును నీతిదెలుప వినగూడదావిన ॥ నీ కిం ॥ పుత్రులు మిత్రులు బొలిసినపిమ్మట శత్రులకును లొంగవచ్చునా ॥ నీ కిం ॥ ఈక్షితి శూరుఁడ వేని మోక్షగుండేశుని నెదురుముచాలును ॥ అంతెచాలు ॥ నీ ॥

వ. అని తూలనాడిన సిగ్గునఁ దలలు వంచుకొని కొంతవడికి భార్యదిక్కుఁ జూచి నిట్టూర్పుఁ బుచ్చుచు నిటు లనుచున్నాఁడు :

తో : అలివేణిరొ । నీ వన్నది నిజమే । యయిన రామునకు వెఱవ । జెలగి హోమమును జేసి పోయి నేఁ గెలిచెదఁ బొమ్మిఁక తెఱవ ॥ రామ ॥

వ. అని యిట్లు ధైర్యంబుగఁ బలికి మందోదరిని బంపి తానును హోమంబుఁ జాలించి గృహంబున కరిగి శయనించె- నిక్కడ రాముండు,

క. నెత్తుటఁ దోఁగినతనువున
నొత్తిగిలంబడిన తమ్ము నురుపడి గని తా
జిత్తంబు గరఁగి కన్నుల
నత్తటి బాష్పములు దొరగ హా యని యేడ్చెన్.

ఫీల్ రాగము : ఆటతాళము.

అయ్యో నాతమ్ముఁడ! యయ్యో! లక్ష్మణ! చయ్యన నను బాసి చనినావదివికి ॥ న ॥ అడవుల మాతోడ నిడుమలు గుడిచి కడకు దైత్యునిచేతఁ బడితివి యిచట ॥ న ॥ కావలె నన్నరాఁ గల దట్టిభార్య నీవంటి తమ్ముని నేనెందుఁ దెత్తు నయ్యో ॥ అ ॥ పలుమాఱు నే నింత పలవించి పిలువ నెలుగెత్తి యో యన వేమిరా యనుజా! ॥ అ ॥ ఎలమిని మోక్షగుండేశుఁడ వనుచుఁ బలుకుచు సేవలు సలుపుదు నాకు ॥ నయ్యో ॥

తే॥ నాకు యుద్ధంబి కేల! నాకు రాజ్యంబి కేల!
నాకు జయ మింక నేల! నాకు నీసీత యేల!
నాకు నీసౌఖ్యమేల? నాకుఁబ్రాణంబు లేల!
నాకు నీతోడి దైవలోక మేయగును జాల.

తో : నాతోఁ గూడి వనంబులకును దిన్నగ వచ్చితి వీ వపుడు । నీతోఁగూడ నేను దివంబున కేతెంచెద మఱి యిపుడు ॥ రా ॥ ఇంతెకాని ని న్నెడ బాసియు నే నెంతయు నుండఁగఁ జాల । బంతంబున నిఁకఁ బ్రత్యర్థులపైఁ బడి చంపుట నా కేల ॥ రా ॥

వ. అని యనేక విధంబుల సౌమిత్రి సుగుణంబులు దలఁచుకొని శోకించుచున్న రామచంద్రునిఁ జేరఁబోయి సుషేణుండు ధైర్యవచనంబు లాడుచు నిట్లనియె :

కళ్యాణి : రూపకము.

శోక మేలనయ్యా! విను, నీకు, మేలుగాదు మాను; ప్రాకటముగ నీతనికిఁ బ్రాణభయము లే దికను ॥ శోక ॥ మేనునఁ బ్రాణముఁ బాసిన నాననమున గళ లున్నే! మానుగ నిందీవరముల మాడ్కిగనులు జెన్నొందునె ॥ శోక ॥ అందములై యరచేతులు గెందామరలటు లున్నె! తొందరేల! మోక్షగుండమందిర నీడెందంబున ॥ శోక ॥

వ. అని పలికి రాముని శోకం బాపి హనుమంతునిఁజూచి సుషేణుండిట్లనియె;

క. మును జాంబవంతు ముఖమున
వినియుంటివి మూలికలను వివరింపంగా,
హనుమంత, ద్రోణగిరి ద
క్కినసంపుశిఖరంబునందుఁ గెలలెడురుచులన్.

వ. అందు విశల్యకరణి, సౌవర్ణకరణి, సంధానకరణి, సంజీవకరణి యనునాలు గౌషధలతలు గలవు. వానిని వెదకి తీసికొని వత్తువేని ఈలక్ష్మణుని ప్రాణంబులు మరలింప వచ్చును, లేకున్న నొండు సదుపాయంబులేదు.

కేదార : చాపుతాళము. (కోరియం) వలె.

పోయి రమ్మిక హనుమంత ॥ పోయి ॥ వాయునందన లేవోయి వేగమునంబో వోయి మందులుగొనిరా వోయి తేవోయీ యీ వోయీ కావోయీ ॥ పోయి ॥ మించి ద్రోణాద్రిని శోధించి గంధర్వుల జయించి, రాక్షసులను ద్రుంచి సాధించి, లక్షించి, కుప్పించి ॥ పో ॥ చండకిరణుఁడు పొడువకుండ రావలె మోక్షగుండరఘుపతి గనుచుండ ప్రొద్దుండ నేదండ నిలకుండ ॥ పోయి ॥

వ. ఇక్కడికి నాలుబలక్షల యిరువదివేల యిన్నూట పదియోజనంబుల దూరమున్నది. ప్రొద్దుపొడిచిన నౌషధములుఁ బనిజేయఁజాలవు. క్షీరాబ్ధిని దాఁటి జవంబునఁ జేరు మనిన, హనుమంతుం డొడఁబడియె అప్పుడు రాముండు——

క. ఈ తమ్ముని బ్రతికించియు
భూతలమున నీవు కీర్తిఁ బొందుము వత్సా!
సీతోఁ గూడఁగ నలువురు
నాతమ్ము లటంచు వాయునందన తలఁతున్.

వ. అనిన, విజృంభించి మహానందంబున నాంజనేయుం డిట్లను చున్నాఁడు;

శంకరాభరణము : ఏకతాళము ( అమ్మయ్య ) వలె.

నావంటిబం టుండ, నీ వేల వెరగంద! వేవేగ మందులు వెతకి నే; దెచ్చెద ॥ నా ॥ ఆయేడుదీవుల కావల నుండిన, నాయద్రి నేగెడు నంతలోనె దెత్తు ॥ నా ॥ ఆమిత్తి నదలించి యవనిపై బొలియించిసౌమిత్రి ప్రాణపంచకమును మరలింతు ॥ నా ॥ ఈలోకమున గాదు యేలోకమున నున్న నాలక్ష్మణుని దెచ్చి యర్పింపనా మీకు! ॥ నా ॥ మోక్షగుండేశ్వర, మ్రొక్కెద దీవించి యీక్షణమే పంపు మేతెంతుఁ దడయక ॥ నా ॥

వ. అని మ్రొక్కి దీవనలంది సుగ్రీవాంగద జాంబవంత విభీషణుల వీడ్కొ
పర్వతాగ్రంబు నెక్కి లంకాపురగోపురంబుఁ గూలునట్లుఁ గుప్పించి యెగసి వియన్మార్గఁబు
నదీనద పర్వతారణ్య పురంబులఁ బరికించుచుఁ బోవుచుండె. ఇక్కడ —

క. వేఁగులవారలు తెలుపఁగ
వేగంబున రావణుండు విని విహ్వలుఁడై
భోగీంద్రుపగిదిఁ గనలుచు
నేగెను నాకాలనేమి యింటికి జేరన్.

వ. ఇట్లు వచ్చినరావణుని సత్కరించి కాలనేమి యిట్లను చున్నాఁడు.

తో : యేమిపనికి నాయింటికి వచ్చి రీనిశివేళ నుననఁగా । వేమటు దెలిపెద వి
మొకపని, కాలనేమి సేయవలయునుగా ॥ రామ ॥

క. అదియేమి యన్న, నుడివెద
ముదమున నచ్చక్తి మూర్ఛ మునిగినయనుజున్
బ్రతికించుకొనుట కనుపా
సదుపాయం బెంచి రామచంద్రుం డార్తిన్.

క. సంజీవకరణి కొఱకై
యంజని పుత్రకునిఁ బంప నతఁడేఁగె వడిన్
భంజింపుము నీవడ్డము
గం జని యటు చేయఁ జేతగాకుండినచోన్.

వ. మాయోపాయంబుచేత వాని ప్రయాణంబు సాగకుండనయినఁ జేయుము. ద్రో
గిరి సమీపంబున నొక్క సరోవరమున్నది, దానియం దొక్క మకరియున్నది.

తో : అది దేవాదులనైనను మ్రింగును నగచరుఁడనఁగా నెంత । వదలక యచటి
వాయుజుఁ డేగెడుపగిది జేయు మిది వింత ॥ రా ॥

వ. వేగఁబునబొ మ్మన, విని కాలనేమి యిట్లనుచున్నాడు :

శంకరాభరణము : ఆదితాళము - ( మేలైన ) వలె.

మాయామృగాకృతి మారీచుఁ డేగియు మాయమైపోడె మునుగోయనియార్చుచుఁ
గుంభకర్ణాదులు గూలరె చూడుమును । లంక నీతమ్ముఁ డేలగ గట్టి సీతమ్మని

రామునకు నిడి । శంకరుగూర్చినిశ్చయముగ దపమును సలుపు మేలు గలిగెడి అదికానిచోఁ
బోయి యలమోక్షగుండేశ నెదిరించి వడిఁ బోరుము కదనరంగమునందు !, గడతేరి వైకుంఠ
పదమునకును జేరుము ॥ మా ॥

వ. అంతేకాని యీ మాయలవల్లఁ బ్రయోజనం బేమనఁ । గోపించి దైత్యేశ్వరుఁడు
చంద్రహాసంబునఁ గాలనేమి తల తెగ నేయఁ, బోయిన, నది యెఱింగి

తో : ఇదిగో పోయెద నేటికిఁ గనలేద, వింటికి జను పసి పలికి తుది యిది యెను
కొని తూణఁంబున వాతూలసుతునిపై నలిగి ॥ రా ॥

వ. కపటమునివేషంబున ననేకశిష్యగణ హితుండయి మనోవేగంబున ద్రోణాద్రి
నమీపమందున్న దివ్యవృక్షసహితంబయినయొక్క వనంబుఁ జేరి యాశ్రమం బేర్పఱుచుకొని

తో : మునివలెఁ గన్నులు మూయుచు గొణుగుచు బూనలు ద్రిప్పుచుండ, !
ననిలజుఁ డంబరమున బోవుచు నది గని యాశ్చర్యము నింద ॥ రా ॥

స్రగ్విణి.

ముందు ద్రోణాద్రికిఁ బోవునా డీవనం
బిందులే దింతలో నెట్టులన్ వచ్చెనో ।
దారి నే దప్పితిన్! తందరన్ వచ్చుచోనిన్!
విందుగా నీమునిన్ వేఁడి యోజించెదన్.

వ. అని యెంచి తత్క్షణంబునఁ గ్రిందికి జనుదెంచి మునికి నమస్కరించి యిట్లను
చున్నాఁడు :

తో : రాముని కార్యార్థంబుగ జనియెద; నే మారుతతనయుఁడను; । ఓమునివర
నాకౌదవెను దాహము! ఉదకము జూపుము తగను ॥ రా ॥

వ. అనిన, నక్కపట మునీంద్రుం డిట్లనియె;

కం. మా వనమునఁగల ఫలములు
నీవలసినవి యారగింపు; నీర్వట్టడఁగన్
ద్రావు కమండలముల జలములు;
పావని, నీయుద్యమం బవశ్యము సాగున్.

వ. మా కాగతానాగతములు దెలియును; చెప్పెద వినుము.

కీర్తన : ఆటతాళము - ( శంకరశం ) వలె.

వేమలు దెలిపెద వినవోయీ! నామాటలు గుటిపడునోయీ! రామునిభామిని రావణాసురుఁడు వేమఱించుకొని యేగెను లంకకు ॥ వే ॥ అది గని రాముం - డలిగి కపులతోఁ గదలి వచ్చి లంకకుఁ జేరి పొదలుచు రావణు పుత్రమిత్రులను జిదిపిన నాదశ వదనుఁడు గనలుచు ॥ వే ॥ మోక్షపురవరాధ్యక్షుని యనుజుని దీక్షమీఱ శక్తినివైచి, యీక్షితి గూల్చిన, నిపుడు ద్రోణగిరి కక్షయోషధులకై వచ్చితి విటు ॥ వేమ ॥

క. రాముఁడు లోకహితార్థము
గా మహి జన్మించినాఁడు గాన, సహాయం
బేమును జేయుట ధర్మం;
బో మారుతి! మంత్రతతుల నుపదేశింతున్.

వ. అమ్మహామంత్రపునశ్చరణంబున సమస్తకార్యసిద్ధులొదవు. ఇదియునుంగాక —

తో : సంజీవనిముఖసకలౌషధముల సమృద్ధి మావనమందు; నాంజనేయ, నే నర్కుఁడు వొడిచిన నవి తెచ్చిచ్చెద నిందు ॥ రామ ॥

వ. నామంత్రసామర్థ్యంబునఁ గనుఱెప్పవేయునంతలో లంకకుఁ జేరఁగలవు. లక్ష్మ ణునకు బాధలేకుండ ననిన, హనుమంతుం డిట్లనియె.

తో. అక్కడ లక్ష్మణు డట్టులుండ నా కిక్కడఁ దడయుట తగదు; । అక్కఱలేదు ఫలాదులు ; జలమును, జిక్కిన ద్రావియు జనుదు ॥ రా ॥

వ. మీకమండలోదకమ్ములు నాదాహంబు దీఱునన్ని లేవు. కొలనుగాని, నదిగాని యుండినఁ దెలుపుఁడు. త్రావి పోయెద. అనినఁ గాలనేమి—

తో : ఉన్నది చేరువ నొకకొల; నచటికి జన్నెనుదకములుగలవు; పన్నుగ శిష్యులఁ బంపెద వెంబడి బదుము చూపెదరు సెలవు ॥ రా ।

వ. ఇట్లు పలికి తన శిష్యులఁగూడ నిచ్చి పంపిన, హనుమంతుండు జని, కలహంస కారండవ చక్రవాక బకవ్రతతులచే నొప్పి కమలకల్హారసహితంబయి మీన మకర కర్కట జలూక గ్రాహసమన్వి తంబయి యలరారు సరోవరంబు మనోహరంబుగాఁ గనుపట్టె. అందు దిగి యుదకంబులు గ్రోలుచుండ, నప్పుడు-

వ. అప్పుడు రాముం డద్భుత వీరరసంబులు వెల్లుబ్బి పాజ శర సంధానంబుఁ జేసి మరలఁ గర-శిరంబులుఁద్రుంచె, అవి క్రమ్మర మొలిచె. అంతట రాముండు గోపించి నిలు పోవనీక,

తో: కరములు శిరములు గడుఁదీవ్రభయంకరముగ నగణితముగను। అటిమిటి ద్రుంచిన నవి యెప్పటివలె మరల మొలుచుచుండ గను ॥ రా ॥

వ. రావణుని తెగిన కరశిరంబులు మెండుగా భూనభోమధ్య భాగంబు నిండె, అప్పుడు—

తో: రామబాణహతి రాలుతలలుబీరము విడసలయపుచెడవు। వేమరు వాఁడవు విన్నుహోపు కడువిలపింపవు వెతపడవు ॥ రా ॥

వ. ఇట్లు శరపరంపరలు పఱపి రాముండు గరశిరంబులు దెగవ్రేయుటయు, నవి క్రమ్మఱ మొలచుటయు, నేర్పరింపరాక చూపరుల చూపులు మిఱుమిట్లు గొలుపుచుండ రామ-రావణయుద్ధంబునకు రామరావణయుద్ధంబే సమంబుకాని యన్యంబు నరిపోల దని దేవతలు ఆనందించిరి రాముండు రణంబు నిలిపి తనమనంబున—

గీ. ఏడహోరాత్రములు వీనితోడఁ గదిసి
యుద్ధ మొనరించినాఁడ ప్రసిద్ధముగను
జావదేయుక్తి చేతను! జేవఁ జెడదు!
తలలు ద్రుంచినఁ గ్రమ్మఱ మొలచునకట!

కీర్తన : రూపకము-(కాలికి) పలె.

ఈతనిఖండించుమార్గ మేది దోఁపదు! యీతఁడెంతశూరుఁడో యిఁకేమి చేయుదు ॥ నీతని ॥ చేతులు ఖండంబులుగఁ, జేసి రోసితిఁ ! గోతగా శిరంబు లెల్లఁ గోసి రోసితి॥ నీతని॥ ఈసుతో మర్మంబులెల్ల నేసి రోసితి! గాసినొంద బాణపఙ్క్తి లేసి రోసితి ॥ నీతని॥ మోక్షగుండ నేత నయ్యు రాక్షసేంద్రుని కక్షనట్టి త్రుంపజేతఁగాకయుంటిని ॥ఈతని॥

వ. అనితలపోయుచుండిన రాఘవేంద్రునిఁగని విభీషణుండిట్లనియె,

తో: నలినగర్భవరబలమున నీతని నాభియందు నమృతంబు। గలదు కుండలా కారంబుగ నది పొలియకున్న నిక్కంబు ॥ రా ॥

క. రావణుఁడు బొలియకుండును
గావున దన్నాభియందుఁ గలయమృతంబుల్
బావకశరమున నేయుము
తీవరమున నతఁడు జిక్కి తెగుఁ దత్క్షణముల్.



శహన: ఆదితాళము--(తలపైన) వలె.

మనుకులాంబుధిసోమ, రణరంగభీమ, పావనసురవినుతసోమ, రామరామ, దనుజగర్వవిరామ, అనలాస్త్రమున నాభి। యమృతంబు నింకించి వెనుక నాతని కరములు । రామ రామ ! దునుము వాని శిరములు ॥ మను ॥ పదపడి నూటతొమ్మిదిమాఱు లారీతిఁ జిదిమి రాసిన మీఁదను రామ రామ ! యుదయింపకయమానును ॥ పిదప మోక్షగుండ నదన, నీచే దశ । వదనుఁడు ధరగూలును రామ రామ. ఇది వాని మర్మమగును ॥మనుకులాంబుధి॥

వ. అని తెలిపిన రాముండు దేఱి విభీషణుని వినయవిజ్ఞాన విశ్వాసభక్తిభావంబులకు నాత్మ మెచ్చి విల్లుసారించి,

తో: అదరుచు నాగ్నేయాస్త్రము వింటను దొడగి లాగి విడువగను । గడువడి నాభినిఁగలయమృతంబుగ్రాగించెను వే గడవఁగను ॥ రా ॥ పిదప నూటతొమ్మిది సారులుగా జిదిమెను గర శిరములను । తదనంతర మొకతలయు రెండు హస్తములుఁ దక్క నన్నియును ॥ రా ॥

వ. మరల మొలవకుండ నిలిచి పోయె తెగిన తలలనుండి కాఱు రక్తంబుచేఁ దడిసి రక్తసిక్త శరీరుండయి రావణుం డలరారె. అరుణుని యరుణచ్ఛాయచే నావరింపఁబడిన యస్తాద్రిపయిఁ దోచుభానుబింబంబురీతి రావణదేహంబుమీఁద యొంటితలయొప్పె, ఇట్లుండి రావణుండు రోషభీషణుండై విభీషణునిజూచి యిట్లనియె :

నాటకురంజి : రూపకము-(సీతజాడ) వలె.

ఓరీ ద్రోహి ! యోరి పాపి ! యోరి నీచాత్మక ! యేరా ॥ యో ॥ క్రూరకర్మములుసేయ ధారుణి బుట్టితివిర ॥ యో ॥ కోరి పగ వారి మఱుఁగుఁజేరి కొల్చుచుంటి వధమ ! యేరికెఱుక లేనిమర్మ మెఱుగఁజేయ నిది ఘనమ ॥ యో ॥ మంచిది శ్రీమోక్షగుండ । మాధవుని వెంట నిను ద్రుంచివేతు రణములోన దోర్బలమునఁ గనుము కంట ॥నోరి॥

వ. అని నిష్ఠురంబులాతి భయంకరాకారంబగుశక్తిని విభీషణుని పయి వైచిన, నదియుఁ గాలాగ్ని చందంబున మంటలు గ్రక్కుచు వచ్చుచున్నఁ గని రాఘవుండు—

తో: నడుమనె బహుబాణములనేసి తానడఁకెను రఘురాముండు! గడువడి నది గని కసలున నార్చుచు గదిసెను దశకంఠుండు ॥ రా ॥

వ. అన్ని కరశిరంబులుగల లావెల్ల రెండుకరంబులు నొక్క శిరంబునందు నిండి తనరారఁ బ్రళయకాల విజృంభిత విలయకాయుండునుంబోలె మండిపడుచు రామునిపైఁ గవిసి,

క. శరములఁ బ్రాసంబుల ము
ద్గరముల ముసలములఁ గదల ఖడ్గంబులఁ తో
మరముల శక్తులఁ బరిఘల
నురుముచు వేయుచును బొడుచు చొప్పగ నడరెఁ.

వ. ఇట్లులరి రామ–లక్ష్మణ–విభీషణులను కోఁతిమూఁకలను బహువిధంబులఁ గాటించుచు నసాధ్యుండయియున్న రావణుని యాటోపంబునకు భయపడి మాతలి రాముని కిట్లనియె :

కాఫి : ఏకతాళము-(ఈశరాననంబసా) వలె.

ఇంత సేపు వీని నిల్పనేల రాఘవా ! పంతమునఁ జంపివేయవలదె రాఘవా! ॥ఇంత॥ మొలచునేమొ మగుడ వీనితలలు రాఘవా! చలమున నీవంతలోనె చంపు రాఘవా ॥ఇంత॥ ఈ కిరాతకుండు దెగిన నింక రాఘవా, లోకములకు మేలుగలుగు గాక రాఘవా ॥ఇంత॥ చెండుము బ్రహ్మాస్త్ర మేసి చెలఁగు రాఘవా ! యుండఁదగడు వీడు మోక్షగుండ రాఘవా॥

వ. అని మాతలి పలికిన జగదభిరాముండగురాముండుశస్త్రాస్త్ర విద్యావిశారదుండు కావున బ్రహ్మాస్త్రంబు సంధించుట కిదియ సమయంబని తలంచి గాధేయనవనసంరక్షణ కాలంబున నతం డిచ్చిన యక్షయ బ్రహ్మాస్త్రంబును దలంచి తదావాహనంబుఁ జేసికొని మంత్రపూర్వకంబుగా వింటను సంధించి ప్రత్యాలీఢ పాదుండయి నిలిచి నిండార దిగిచి విడచె, అది చని,

సురటరాగము : ఆదితాళము.

స్ఫుటంబుగను జెటపెటార్భటుల దిక్తటంబు లార్వగను దన యుత్కటంబు జూపు చును ॥స్ఫు॥ కులాచలంబులు జలింప జలధులు గలంగి కడు సోల్కఁ దహనస్ఫులింగములు

రాలఁ ॥స్వ॥ మహోల్క తొదపఁగ గ్రహంబు లురులఁగ విహాయసము పగులన్ బెల్లుగి మహీతలం బగలన్ ॥ స్వ ॥ జగత్కంటకునిఁ దెగించు మని సురలగణ్యముగ వేడన్ శ్రీ మోక్షగుండపతి నూడన్ ॥ స్వ ॥

తో: రావణ దనుజుని ప్రాణంబులు గొని రయమున భూమికి జొచ్చి । శ్రీవెలయగ రంజిల్లి రాము పాదిఁ జేరెను గ్రమ్మఱ వచ్చి ॥ రా ॥

వ. ఈప్రకారంబున శ్రీరామకర నిర్ముక్తామోఘ బ్రహ్మాస్త్రంబు, ఇంద్ర యమ వరుణ కుబేరాదులకైన భేదింపరాని రావణుని మర్మంబులు భేదించి ప్రాణంబు లాహుతి జేసికొని నీకూతుఁజెఱగొన్నవానిఁ జంపినా నని భూదేవికి చెప్పబోవుచున్నదో యనునట్లు భూమిందూఱి మరలినీరాముని తూణీరంబు జొచ్చె, ఇట్లు కులిశధారాహతిం గూలుకుల శైలంబుం బోలె రావణుని దేహంబు భూమిపయిఁ బడిన మాత్రంబున,

తో: క్రుంగె దిక్కరులు గ్రుంగె గూర్మపతి గ్రుంగె భుజంగ విభుండు । గ్రుంగెఁ జరాచరకోట్లతోడ నీకుంభునియెల్లను మెండు ॥ రా ॥

కీర్తన : ఏకతాళము. (మునుగు) వలె.

రావణుండు రణములో ధరాతలింబడ దేవతూర్యరవములలరె దెసలఁ బసువడ బోవున ॥ రా ॥ అసదుగాక రాముమీఁద నాదరంబున గుసుమవర్షములు సురలు గురిసి రింపున ॥ రావ ॥ తెలివినొంది దిక్కు లెల్లఁ జెలఁగుచుండెను । మలయవాయువువీచెను బరిమళము నిండను ॥ రా ॥ దీక్షతోఁ త్రైలోక్యవాను । లక్షయముగను మోక్షగుండవాను నకుసు మ్రొక్కులిడఁగ ॥రా॥

వ. అంత శ్రీరాముండు విల్లెక్కుడించి సౌమిత్రిచేతికిచ్చి దేహపరిశ్రాంతికొఱకు నొక్కచో విశ్రమించె, అప్పుడు రణభూమిని పడియున్న రావణుని కళేబరంబుఁ గని విభీష ణుండుడగ్గరి చింతాక్రాంతుడగుచు,

తో: ఆహవముల దేవారులకును భయ మావహింపఁగాఁజేసి । బాహుశాలివగు నీవు ఘూకముల పాలైతివిగా రోసి ॥ రా ॥ కుసుమతల్పమునఁ గూర్మి బండునీ కోమల మగు దేహంబు । అనువులెడలి యీ మననపు టాలను నడలి బడితె నిక్కంబు ॥ రా ॥

క. నవరత్న స్థగితంబై
 రవికోటిసమప్రభా విరాజిత మగుచున్

రవణించు దశకిరీటము
లవనీతలమందు బడఁగ నాయె నయారే!

ముఖారి: ఆటతాళము-(అయ్య మీ) వలె.

అన్నా విన వైతి వన్నా! నాహితములు ॥ అన్నా వినవైతివి ॥ యెన్నో విధముల నే విన్న వించుచునుండిన నాహితములు ॥ అన్నా ॥ సీతను దెచ్చుట చేటుతప్పదని నీతోను వివరించిన నాహితములు ॥ అన్నా ॥ వలదు రామునితోడ వైరమనుచు మును పలుమాఱు బోధించిన నాహితములు ॥ అన్నా ॥ నీ మనోగర్వంబు నీకిట్టిగతిఁ దెచ్చె నే మని సోకింతును! నాహితములు ॥ అన్నా ॥ మోక్షగుండేశుఁడు సాక్షాద్విష్ణుం డగు వీక్షింపు మని తెల్పిన నా హితములు ॥ అన్నా ॥

వ. ఇట్లు విభీషణుండు శోకించుచుండ హతశేష రాక్షసులవలన నీవార్త దెలిసి మందోదరి మొదలగు దనుజకాంతలు శోకావేశంబు వెల్లివిరియ వేగంబునఁ బానుపువయిఁనుండి దుమికి,

తో: అడుగులుఁ దడబడ హారములూడఁగ నడుములు వడి నసియాడ। జడలూడి శిరోజములు మూపువయిఁ బడి యటు నిటు వ్రేలాడ ॥ రా ॥

వ. కరమ్ములఁ బొమ్మ మోదుకొనుచు నేడ్పుల రవంబులునింగి ముట్ట లంకాపురంబు వెడలి శకలంబులయిన రథంబులును. భిన్నంబులయివడిన మదదంతావళంబులును, దెగి పడిన తురంగంబులును, జూర్ణంబులయిన గదా ముసల ముద్గర ప్రాసాద్యాయుధచయంబు లును, తెగిన చేతులును, నొగిలిన మూతులును, ఖండంబులయిన శిరంబులును, దునకలయిన పదంబులును, దుండెంబులయిన మాంసపిండంబులును, గలిగి తొలఁగఁ ద్రోయ రాకుండ భూత భేతాళ ప్రేత పిశాచ శాకినీ ఢాకినీ కాక మూక శ్యేన జంబుకాదులు, రక్తమాంస మేదో మజ్జాదుల నిండార యారగించి తృప్తిబొంది, రామునగ్గించుచు నృత్యంబొనర్చుచుండ భయావహంబై యున్న రణరంగంబుఁ జొచ్చి, క్రమంబున రావణుం డున్న దెసకుఁ జేరి; నిశ్చేష్టితుండై యిలఁగూలిన జీవితేశ్వరుని వయిబడి మందోదరి——

ఫీల్ : ఆటతాళము.

హా రాక్షసేశ్వర! హా జీవితేశా! హా రణాలంకార! హా వీరవర్యా! ॥ హా ॥ గడగడ నిమఁ జూచి వడకు దిశాపతు లుడువీధి నుబ్బుచునున్నారు నేఁడు ॥ హా ॥ కట్టా! యుద్ధములకుఁ గాలుద్రవ్వెడు నీకిట్టి దుర్దశ వచ్చె నేమందు విధిని ॥ హా ॥ అతులితభోగము

లందించి యిపుడు వెతలపాలుజేసి విడిచి పోయితివా ॥ హా ॥ మోక్షసందేహని ముట్టడింపకుము; కక్ష వద్దని తెల్పఁగా లేదా నేను ॥ హా ॥

తో: నరుడు గాఁడు శ్రీధరుఁడు రాముఁడని, సయముగఁ దెలిపిన వినక । రణమున నాతనితోఁ బోరియు నీ ధరణి డుల్లితివిగాక ॥ రా ॥

వ. సురల కయిన దేఱిచూడరాని లంకను హనుమంతుం డొక్కఁడు ప్రవేశించి, జనకజను గాంచి, వనంబువెఱికి, లంకఁగాలిఁచి చనుచున్న నేమిచేయ నేరక పోయితివే! యంతటనైనఁ దెలియవైతివిగదా! ప్రాణేశ్వరా!

క. ఖరదూషణాదిరాక్షస
వరులను ఖండించినట్టి వార్త దెలిసి నే
వెఱతు నది మొదలుగా మది
వెఱవక ధరఁ గూలి తీవు విక్రమధుర్యా!

వ. పతివ్రతాశిరోమణియగు సీతను చెఱఁ దెచ్చిన పాపంబు నిన్నింతచేసె. చేసిన కర్మ మనుభవింపక నెంతవారి కయినఁ దప్పునా! మనోహరా!

ముఖారి : ఆదితాళము- (నేమముం) వలె.

దిక్కులేని దాననైతిని హా! యెక్కడఁ బోదు నింకను! రావణ! అక్కడ పుత్రకు లందఱు ద్రెళ్ళిరి! గ్రక్కున నీవు బడితివి ॥ రావణ! ॥ మయుఁడు నాజనకుండు, మగడవు నీవని మది గర్వమొందుచుంటిని! రావణ! । మృత్యువునకు నీవు మృత్యువైయుండి, యిపుడు మృత్యువు వాతఁ బడితివి! రావణ! । ధాయణి మోక్షగుండధామునిపైనఁ గొన్న వైర మింతకుఁ దెచ్చెను! రావణ! ॥

తో: అతినీతిపరుం డగు విభీషణున కతులసౌఖ్యములు గలిగె! । నతిపాపాత్ముఁడవైననీకు ని ట్లవని ద్రెళ్ళఁగాఁ గలిగె ॥ రా ॥

వ. "నీకామాంధకారంబు నీకన్నులం గప్పె! నిన్ను గట్టుటకుఁ ద్రాళ్ళు నీవే తెచ్చుకొన్నట్లు సీతను దెచ్చితివే! కాని కుల దాక్షిణ్యరూప గుణగణాతిశయంబుల సీత నాతో నరిబోలునా! ప్రాణనాయకా," అని బహుభంగుల విలపించువదినె పదంబులవ్రాలి కన్నీరు మున్నీరుగా గాఱనేడ్చుచు విభీషణుండు——

హిం. తోడి : రూపకము.

కామినీమణి, కాలకర్మమేమని వేమరు దుఃఖింతు నింక వెలసె బైకొని ॥ కా! ఎన్నిగతులను జెప్ప నెఱుగ డాయెను! నన్ను గాఋలాడి సభలోఁ దన్నివంపెను ॥ గామిని ॥ దండివీరుఁడై రణోద్దండశూరుడై యుండువాఁడు గూలె మోక్షగుండదేవుచే ॥ గామినీ ॥

వ. అని బహువిధంబుల దుఃఖించుచున్న విభీషణునకు రాముం డిట్లనియె:

తో : పలదు విభీషణ, నిలువుము దుఃఖము! వనితలశోకముమాన్పు! ॥ పలపించుటచే ఫల మేమున్నది తలఁపున ధైర్యము జొనుపు ॥ రా ॥

వ. రావణుండు సామాన్యుండు గాఁడు. సురాసురుల కజేయుండై సమస్త సుఖంబులు బహుకాలం బనుభవించె. కొదవ యేమి! కర్మశరీరంబు స్థిరంబుగానుండునా! యతండుగృతార్థుండు! గానధైర్యం బవలంబించి యతని కుమారులందఱు నశించిరి గాననీవే యగ్ని సంస్కారాది విధులాచరింపుమన విభీషణుండదరిపడి యిట్లనుచున్నాడు.

తో : ఈ కష్టాత్ముం డెక్కడియగ్రజుఁ డెక్కడి తమ్ముడనేను!, ఈకలుషాత్మునికేటి విధులు! వీనిఁ దాఁకిన దోషం బగును ॥ రా ॥

వ. మీభార్యను జెఱదెచ్చిన దుర్మార్గునకు సంస్కారంబు గావలెనా! కంకగృధ్రాదులు బీఁకి భక్షించుటయే సంస్కార మనిన, రాముఁడు నవ్వి యిట్లనియె,

తో : పూర్వవైరములు బొలిసిన విమ్మటఁ బూన దగదు; రణమందు నుర్విని గూలుట నొప్పియనఘుఁడై యొనరజేయు విధు లిందు ।

వ. అని యాజ్ఞాపించినఁ జిత్త మని లేచి విభీషణుండు వనితల నూరడించి, యగ్రజాదుల కగ్ని సంస్కారంబులుసేసి, స్నానం బాడి తిలోదకంబులు విడిచి శుద్ధుండై వచ్చె. అంత రాముండు లక్ష్మణున కిట్లనియె;

కీర్తన : ఏకతాళము. (రామమంత్ర) వలె.

వినుము సోదరా! నీవు జనుము సోదరా! మనవిభీషణునకు లంకఁగట్టు సోదరా! ॥ విను ॥ అన్న తఱిమిన, నితడు నన్నుఁ జేరినఁ, బన్నుగ శరణంబొసంగియున్న విధమున ॥ విను ॥ నరసుఁ డగుటను మన శరణు జొరుటను, ధర మోక్షగుండదేవు కరుణ గలిగెను ॥ వినుము ॥

వ. అని రాముం డనుజ్ఞ యిచ్చిన మంచి దని లక్ష్మణుండు విభీషణునిఁ దోడ్కొని లంకకుఁజని వనచరులచేత సముద్రోదకంబు దెప్పించి శుభకాలంబున.

విభీషణుని పట్టాభిషేకము.

తో: వారిమంత్రులును వారిబంధువులును వారిపురోహితవరులజేరి చూడ నభిషేకము జేయించెను విభీషణున కపుడు; ॥ రా ॥

వ. ఇట్లభిషేకము జేయించి, సింహాసనాసీనుం జేసి లక్ష్మణుండు

క. శ్రీరఘురాముని చరితము
సారసహిత కైరవాప్తసమ్యగ్గతులీ
ధారుణి వఱలెడు నంతను
వారక నేలుదువుగాత, బౌరహితముగా.

వ. అని దీవింప విభీషణుం డనందాసందకందళిత హృదయారవిందుండై లక్ష్మణు నకు సభవారికి నమస్కరించి, దివ్యాంబరాభరణాదులు మంగళ ద్రవ్యపురస్సరంబుగాఁ గొని లక్ష్మణుని వెంటవచ్చి రామునిం జేరి సమర్పించి నమస్కరించె—

తో: అవి మాతలి కిడి యటుపీడ్కొలిపిన, నారాముని యనుమతిచే దివమున కేగెను– తేరిఁదోలుకొని యేతెంచె నతఁడు సమ్మతిచే ॥ రా ॥

వ. పిమ్మట రాముండు హనుమంతునిఁ గాంచి యిట్లనియె.

బేహాగ్ - ఆదితాళము : (రాజ రంగేలి) వలె.

లంకకు నేతెంచుమా కేసరీపుత్ర ॥ లం ॥ శంకలు దీఱ జానకి నెమ్మది; సంకట ములు దీర్పఁగఁ గేసరిపుత్ర! ॥ లంక ॥ మనవిజయంబు జనక తనూజకు వినిపించి ముదము జేయఁ గేసరీ! ॥ లంక ॥ ఇప్పటిరాజగు విభీషణునకుఁ జెప్పి వానియనుమతిఁ గేసరీపుత్ర! ॥ లంక ॥ శ్రీ మోక్షగుండ స్వామి కార్యంబుఁ జేయుభక్తుఁడ వీ వగుగేసరీపుత్ర! ॥ లంక ॥

వ. అని పలికిన రాముని వీడ్కొని హనుమంతుండు వేగంబున నశోకవనంబున కరిగి జానకీదేవిని గని నమస్కరించి,

తో: తల్లి నీమనోధవుఁడు రాఘవుండు దశకంఠుని దునుమాడె। నెల్ల కష్టములు దుల్లె నేటితో నీప్సితములు జేకూరె ॥ రా ॥

వ. రాముని విజయప్రభావంబు నీకుఁజెప్ప వచ్చితి ఏమియాజ్ఞ? యనవుఁడు నామె యానందబాష్పంబులు రాల నిట్లనియె:

క. జగ దీశ్వరుఁ డగు రాముఁడు
మగఁడైయుండంగ, సుగుణమాన్యలు మీరల్
దగినట్టిభక్తులైయుం
డఁగ లోపము గలదె పవనసందన నాకుఁ‌ !

వ. ఆపన్నివారక మగు నిట్టిమేలువార్త నా కెఱిఁగించినందునకు నేనే పచ్చి
ఋణంబుఁ దీర్చుకొందు నాంజనేయా రామకార్య సహాయా !

వ. అనిన, నతండిట్లనియె,

గీ. అమ్మ ! మీకృపకలిమియ యంతె ! చాలుఁ
గడమవస్తువు లిచ్చినఁ గార్యమేమి ?
యనిన దీవించి పలికె నా యన్న ! రాముఁ
జూతు నట్లుగఁ జేయుము శుభము లొదప.

వ. అనిన, మంచి దని మహానందభరితుఁడయి పునఃపునరభివందనంబు లాచరిం
కదలి వచ్చి రామునకు సర్వంబు నెఱిఁగించిన రాముండు విభీషణు నవలోకించి,

బేహాగ్ : ఆదితాళము.

దనుజాధినాయక, తడవిఁక జేయక జనకజఁ బాయక కొనిరమ్మెడపక ॥ దను
వడి జలకమార్చి వలువలు దాల్చి తొడవులు దీర్పతోడ్తెమ్ము దేర్చి ॥ దను ॥ తగ మో
గుండనగరేశ్వరుండ నగునాదు దండ కతిభక్తినిండ ॥ దను ॥

వ. అని యనుజ్ఞ యిచ్చిన నంతసించి హనుమంతయుతంబుగా విభీషణుండు స
జనకజాతకు——

తో : సరమ మొదలు రాక్షసకాంతలచే జలకములార్పించి సురుచిరదివ్యాంబ
భూషణములు సరగున గైసేయించి ॥ రా ॥

క. బంగరు పల్లికిలో సీ
తాంగన నెక్కించుకొని మహాగోప్యము గాఁ
గం గంచుకంబు గప్పిత
రంగించు ముదంబుగొలువ రామునికడకుఁ‌.

వ. ఇట్లు రాముఁకుఁ గొంతదూరమునఁ బల్లకియుండగానే వానరు లత్యంత కుతూహలంబున సీతాన్వేషణంబు చేయంగోరి చుట్టుకొని బెత్తములచే మోఁది యందఱిని తఱుము చుండిరి. అది గని రాముండు విభీషణున కిట్లనియె

శంకరాభరణం : ఆదితాళము - (తాపసేం) వలె.

వలదు నిలువు విభీషణ, వానరులం దఱుమంగ ఫలమేమి? మనవారిమీఁద బంటుతనముఁజూపగ ॥ వలదు ॥ ధారుణిసుతసుజాతఁ గోరి చేరినారుగ । వారిలోప మే మున్నది నేరములు గొనఁగ ॥ వలదు ॥ అల్లమోక్షగుండపభుఁడ నైన నాయిల్లాలిని దల్లిగా భావించి చూడ దాపుఁ జేరి రోలిని ॥ వలదు ॥

వ. వివాహమున, రణరింగమున, మహోత్సవమున, దుఃఖసమయమున రాణి వానం బక్కఱలేదు. ఇది రణరంగమై యుండి పతినైన నేను సమీపమం దున్నప్పుడు లోపంబులేదు. కాన సీతను శిబికనుండి దించి యందఱుఁ జూచుచుండఁ గాలినడకతో నాసన్నిధికి వచ్చునట్లు చేయు మన, నతండు జని యామెకుఁ దెలిపిన శిబికలోనుండి దిగి,

తో : నలిననయన కాల్నడకతోడఁ దిన్నగరాముని జేరగను । చెలి యగ్నిని దాఁటిన నిజరూపము చేకొను మని తెలుపఁగను ॥ రా ॥

వ. లక్ష్మణునిఁ గని రామున కపవాదము లేకుండునట్లు వహ్నియందు జొచ్చి వచ్చెర. జితిఁబేర్చి యగ్ని రవలుకొలుపుమనిన, లక్ష్మణుం డట్లుఁ జేసె అంత——

ఉ. రాముని నెమ్మదిన్ నిలిపి రాక్షసకాంతలు వానరుల్ సుర
స్తోమములెల్లఁ జోద్యముగఁ జూడ ధరామర దేవపాళికిన్
వేమరుమ్రొక్కి పావకుని వేఁడి హుతాశన, రామునిన్ సదా
నామదిఁ గొల్చుదాన నయినన్ ద్రిజగంబులవారు జూడ న
న్నీ మెయిఁ బ్రోతుగాక యని యేర్పడ జొచ్చెను నగ్నిగర్భమున్.

వ. ఇట్లగ్నిం బ్రవేశించిన, నందఱు నద్భుతం బందిరి. అంతఁ గమలాసన గౌరీశ్వర దిక్పాలకాదులు విమానారూఢులయి వచ్చి జయ జయశబ్దముల రాముని గొనియాడిరి. రక్తమాల్యాంబరాభరణ భూషితయగు సీత స్వాంకతలంబునవెలయ నగ్నిహోత్రుండుఁ బ్రసన్నుండయి రామున కిట్లనియె.

**కీర్తన : ఆదితాళము - (నీపను) వలె.**

జయజయ రఘురామ! జయజయ రామ! జయజయ శాంకరీ జపవరనామ ॥ జయ ॥ నియతురాల మన్నింపగఁ దగు నీ ప్రియురాలిని గొను రయమున రామ ॥ జయ ॥ మును నాలో దాచిన నిజరూపముఁ గొనివచ్చితి గైకొను మిదె రామ ॥ జయ ॥ దంభం బగు ప్రతిబింబమడఁగె నిజబింబం బిదిగో నిజంబుగ రామ ॥ జయ ॥ తవిలి చతుర్దశ భువనము బేలితిపి వరమోక్షగుండాధిప రామ ॥ జయ ॥

వ. అని యప్పగించి సీతను రాముని యంకతలంబున వసింపఁ జేసె అప్పుడు శంకరుండు రామున కిట్లనియె;

తో: శ్రీరామ! శ్రీమీఱ నయోధ్యకుఁ జేరిరాజ్యమును జేయు కోరినకార్యము కొనసాగెను నీకు గొదువలేదు దయచేయు ॥ రా ॥

వ. అనుసంతలో విమానారూఢుండయి స్వర్గంబునుండి దశరథుండు వచ్చినఁ, గాంచి సీతారామలక్ష్మణులు మ్రొక్కిరి. వారిని దీవించి యాలింగనంబు జేసికొని దశరథుం డిట్లనియె;

తో: నినునమ్మిన వారిని సంసారాబ్ధిని దరింపఁ జేయుదువు। తనయ, యయోధ్యకుఁ జని రాజ్యముగొని తగఁబాలింపుము నీవు ॥ రా ॥

వ. వంశాభివృద్ధియగు నని దీవించి చిన్నానియె అంత రాముం డింద్రునిఁ జూచి,—

తో: నాకృతముగఁ బడి-నారగణితముగ నగచరు లో సురవీరా! । చేకొని వారి నజీవులఁ జేయుము చిలికి యమృతధార ॥ రా ॥

వ. అనిన, నతం డమృతంబుఁ దెప్పించి పోసి మృతులయిన వానరుల జీవింపఁ జేసె అప్పుడు విభీషణుండు రామునకు నమస్కరించి యిట్లనియె:

గీ. అంగనయు లక్ష్మణుఁడు మీరు నతిముదమున
మంగళస్నాన మొనరించి మాల్యగంధ
భూషణాంబరములుఁ దాల్చి పోవు టొప్పు
భక్తుఁడను దోయవలదు నా ప్రార్థనంబు.

వ. అనిన, రాముండు—

కీర్తన : ఆటతాళము-(వినఁడిది) వలె.

వరసుకుమారులు సరసులు దమ్ములఁ బొరి జటావల్కలములు ధరియించి, సరగున సందుండ మఱియు నే నిచ్చట సరియగునా యలంకరణముఁ జేయఁగ ॥ వర ॥ గన మోక్షగుండేశు కరుణ విభీషణా! వనచరులకు నిడె నలుపు సత్కృతులు; మనమున సంతోషమగ్నుఁడ నౌదును; అనుమాన ముంపకు! మఱిఁ జేయఁగాఁ దగు ॥ వరసు ॥

వ. అని రాముండు నియమించిన మంచిదని విభీషణుఁడు,—

తో : నవరత్నాభరణములు వస్త్రములు నపిరళముగఁదెప్పించి రవిజాదుల కల రాక్షసవర్యుఁడు ప్రమదమెనఁగ నర్పించి ॥ రామ ॥

వ. అనంతరంబు విమానంబుఁ దెప్పించి నిలిపిన, రాముండు సీతాలక్ష్మణ యుతంబుగా నారోహించి యందఱిని గాంచి యిట్లనియె,

జంఝూటి : ఆటతాళము (ఒకదివ్య) వలె.

పోయి వచ్చెదమేము పుణ్యాత్ములారా! మా యయోధ్యకుఁ జేర మర్యాదమీఱ! కపులను దోడ్కొని కదలి సుగ్రీవా! యిపుడే కిష్కింధకు నేగు మిత్రోత్తమ ॥ పో ॥ దేవతలను గూడి, దేవతావర్య! యీవేళ దివమున కేగు గుణధుర్య! ॥ పో ॥ రాక్షసేశ్వర! లంకా రాజ్యంబునేలు మోక్షగుండేశునకు మ్రొక్కుచుఁ జాలు ॥ పోయి ॥

వ. అని పలికిన, రాముని గనుంగొని; విభీషణాద్యసురులును, సుగ్రీవాది వనచరులు నిట్లనుచున్నారు :

తో : మే మయోధ్యకును మీతోఁ గూఁడ మిత్రకులజ! వచ్చెదము! । క్షేమంబుగ మీకుఁజేసెడి పట్టాభిషేకోత్సవ మరసెదము ॥ రా ॥

వ. భరత శత్రుఘ్నులను, కౌసల్యాదిమాతలను, చూచి వత్తుము : దయానిధీ! నిరాకరింపవలదు. వచ్చుట కంగీకరింపవలయునని వేఁడిన, సమ్మతించె. అందుమీఁద—

తో : వానరు లందఱు దానవు లందఱు మానితపుష్పక మెక్క । మానవనాథుని యానతిచేఁ దమ మనికి కరిగి రాచక్క ॥ రా ॥

వ. ఇట్లు కదలి వియన్మార్గంబున పుష్పకంబుఁ బఱపి, దృష్టి గోచరంబులగు విషయంబులు రాముండు సీత కెఱిఁగించుచుఁ బోయి సేతువుఁ జేరవచ్చి.

మధ్యమావతి : రూపకము.

సేతుబంధనంబు జూచు ప్రీతితోడ సీత నేఁడు! ఖ్యాతిగఁగపి నిర్మిత మిది! పాతకంబులెల్లవీఁడు ॥ సేతుబం ॥ రామేశ్వరుఁడనులింగము నే మును స్థాపించితిందు! భామ, సేతుదర్శనంబుఁ గావించిన యామనుజుం డీమహి జనియింపఁబోఁడు ॥ సేతు ॥ ఇందుఁ బితృతర్పణంబు విడుచువారుఁ బితృయుతముగం దగ శ్రీమోక్షగుండ మందిరు కరుణను ముక్తినిఁ బొందుదు రానందంబుగ ॥ సేతు ॥

వ. ఇట్లు సేతుమాహాత్మ్యంబు సీతకుఁ జెప్పి, యనంతరము, విమానంబు నడపించుచు శీఘ్రంబునఁ గిష్కింధా సమీపంబునకు వచ్చిరి, అంత, రాముని యాజ్ఞాను సారంబుగా,—

తో : తారాముఖకాంతలు వేగంబునఁ దరలివచ్చి జానకిని । సారెకుఁ గనుగొని సలిపిరి సకలోపచారమ్ములు నెమ్మదిని ॥ రా ॥

వ. పిమ్మట వారితోఁగూడ విమానంబెక్కించుకొని క్రమంబున బంచవటిదండ కావనంబులు గడచి శరభంగాగస్త్యసుతీక్ష్ణాత్రి వాల్మీ క్యాద్యాశ్రమంబులు గనుచు బదు నాలుగు సంవత్సరములు పూర్తియయిన పంచమీదివసంబున భరద్వాజాశ్రమంబుఁజేరి యాతనిచే సత్కరింపఁబడి రాముం డిట్లనుచున్నాఁడు :

తో : భరతునకును గడపటితమ్మునకును భద్రంబే మునివర్యా! స్థిరముగ రాజ్యముఁ జేయుచుఁ దల్లుల సేవింతురె యోయార్యా ॥ రా ॥

వ. అనిన మునివర్యుం డిట్లనియె :

తో : మీరాకను మదిఁ గోరుచు జడలును నారచీరెలుధరించి ॥ ధారుణిభారము దనుపాదుకలం దారోపించి సహించి ॥ రా ॥

వ. నందిగ్రామంబున సుఖంబుగ నున్నారు. రావణాది రాక్షస కాననంబులుగాల్చి సుఖంబుగ మీవచ్చినవార్తయుష్మత్కటాక్షంబున గలిగిన దివ్యజ్ఞానంబున నెఱుంగుదు. రామా । త్రిలోకాభిరామా!

కీర్తన : ఆదితాళము - (ఓరామ) వలె.

ఓదేవదేవ! నిన్ను! యోగు లందఱు నాదిమధ్యాంతరహితుఁ డనుచుఁగందురు! ఆదివిష్ణుఁడవు నీవె! శ్రీదేవి జానకిదేవి! యాదిశేషుఁ డాలక్ష్మణుఁ డగును సత్యము ॥ ఓదేవ ॥ నీమాయచేఁ ద్రిగుణములు నెగడి సృష్టిస్థితిలయోద్ధామక్రియలుఁ జేయుచుండు

దగులపు నిన్ను ॥ ఓదేవ ॥ అజ్ఞులకు వేరైయుంద ! పరయ మోక్షగుండమందు పజ్ఞులకు దోచి చాల వెలుఁగుచుందువు ॥ ఓదేవ ॥ నారాయణశర్మవినుత నాయింట నీనాఁడు నిలిచి నన్ను ధన్యు జేయ గదవే! పతజనావన! ॥ ఓదేవ ॥

వ. అని వేఁడిన సమ్మతించి యందు వసించి హనుమంతుం జూచి రాముం డిట్లనియె :

తో: గంగాతటముసఁ గల దొకనగరము శృంగిబేరపుర నందు రంజిలుఁ జెంచుల రాజు గుహుండును బ్రాజ్ఞభక్తుఁ డింపొందు ॥ రామ ॥

వ. అతనితో మదాగమనవార్త యెఱంగింపుము. పిమ్మట, నయోధ్యకుఁ గ్రోశ మాత్రదూరంబున నందిగ్రామము గలదు అందు,

క. భరతుం డున్నాఁ; డాతని
సరసకుఁ జని జనకజాత సౌమిత్రులతో
నరుదెంచె రాముఁ డని స
త్వరముగ మత్కుశలవార్త పలుకుము వేఁగఁ.

వ. అతండు మునిఁబోలె జటావల్కలధారుండయి నావలెనే యున్నాఁడు! రయం బునఁ బోయి రమ్మని, నుహ్పొంగి మనుష్యాకారంబున బయలుదేరి వాయునందనుండు వాయువేగంబునఁ జని.

తో: గుహుని గనుంగొని కుశలంబుగ నినకులుఁడు వచ్చుచున్నాఁడు సహసీతా లక్ష్మణుడై; యెదురుగఁ జనికాంచుము నీవునేఁడు ॥

వ. అని పలికిన, నతం డానందభరితుండై కాచుకొని యుండె. అంత హనుమం తుండు నదిగ్రామంబుఁజేరి,

గీ. పాదుకలయందుఁ దనరాజ్య భార మునిచి
జడలు ధరియించి శత్రుఘ్నసహితముగను
రాముఁ డేమాయెనో యింక రాఁ డటంచు
నెంచుచున్నట్టి భరతునిఁ గాంచి పలికె.

కీర్తన : ఆదితాళము - (శంకరసం) వలె.

ప॥ మునిమాతను రాజవరా, స్వామి కార్యరత, సత్యధరా! క్షేమంబున శ్రీ రాముఁడు లక్ష్మణ-భూమిజయుతముగఁబొనుపుగ వచ్చెను ॥ రా ॥ రావణుండు దనదేవినిఁ

జెరగొనఁగా వానినిఁ దగ ఖండించి వైదేహిని విడిపించుక సుగ్రీవాదులతోఁ దా వచ్చెను విను ॥ రా ॥ రాముం డిపుడు భరద్వాజాశ్రమభూమి నిల్చినను బుత్తెంచె; భూమీవర, సొంపుగను మోక్షపురధాముని కెదురుగఁ ద్వరగా నేగుము ॥ రా ॥

వ. అను పలుకులు విని భరతుండు హర్షసముద్రంబున నోలలాడి మైమఱచి కొంత సేపుండి పిమ్మటలేచి, హనుమంతుని గౌఁగిలించుకొని యానందాశ్రుకణంబులచేనభిషిక్తునిఁ జేసి యిట్లనియె :

తో : నను(దేర్చితి విటు నాప్రియాగ్రజుని ఘనశుభవార్తను దెలిపి! । మనుజుఁడవో సురమాన్యుఁడవో నామదినెఱుఁగను గుఱినిల్ప ॥

క. వరలక్ష ధేనువులు, శత
పురములు సకలాభరణసుభూషిత లగు సుం
దరకన్యలఁ బదియార్వర
గురుభక్తిని నిచ్చినాడఁ గొను నీకొఱకుఁ

వ. అని ప్రశంసించి శత్రుఘ్నునితో నిట్లనియె;

హిం-కాఫీ : ఆదితాళము.

పోదాము రమ్మనుజా మనము ॥ పో ॥ మోదమున మోక్షగుండ కోదండపాణికి నెదురుగ ॥ పో ॥ పురిని గైసేయింపుము! రాజతరుణుల రావింపుము! కరిరథహయములు రాగ వరతూర్యరవములు మ్రోగ ॥ పో ॥ వారకామినులాడఁగఁ, జటులవందిబృందము గూడఁగ, నారాయణశర్మ హృద్విహారున కెదురుగ మనము ॥ పో ॥

వ. అని చెప్పిన శత్రుఘ్నుం డాక్షణంబున సన్నియేర్పాటులు జేసె అంత, సామంత, పౌరజన, వందిమాగధ, వారకాంతాదులుఁ బరివేష్టించికొలువ, బ్రాహ్మణు లాశీర్వదింప, భేరీమృదంగ కాహళాదిమంగళారావంబు లలర, రాజకామినులు బల్లకులయందురా రాముపాదుకాద్వయంబు శిరసావహించి తమ్మునితోఁ గూడఁ బాదచారియై కొంతదూరంబు జని యప్పుడు—

తో : కాంచెను భరతుఁడక్కజముగ రవిసంకాశము విధికల్పితము సంచితశశినిభ పతి సుందరమును నయిన దివ్యపుష్పకము ॥ రా ॥

వ. ఇట్లు గాంచి యానందభరితుండై యుండ, నాంజనేయుం డిట్లనియె ;

హిం-కాఫీ : ఆటతాళము. (మ్రొక్కెన) వలె.

కనుఁగొను భూవర ! కను లలరార ! యొసర విమానము ఇమదెంచుచున్నది ॥ కను ॥ అందు శ్రీరాముఁడు నవనిజ-సుమిత్రానందన సుగ్రీవనగచరు లున్నారు ॥ కను ॥ వరహేమ్మ గుండనివానునిఁ గొలుచుచు సరగ విభీషణుఁ డరుదెంచుచున్నాఁడు ॥ కను ॥

వ. అని పలుకునంతలో విమానంబు సమీపించె, రాజకాంతలు మొదలయినవారు శిబికాదులనుండి క్రింద దిగి నిలువంబడి చేతులెత్తిచూపుచు,

తో : అడుగో ! రాముం డడుగో ! లక్ష్మణుఁ డదిగో ! సీతాదేవి । కడువడి గన్నుల కఱవు దీఱఁగ గాంచుడు వారలఁటివి ॥ రా ॥

వ. బహువిధంబుల యెలుగెత్తి పెద్దగాఁ జెప్పుకొనుచుండిరి, భరతుండును రాముని జూచి క్రిందనుండి చేతులు ముకుళించి మ్రొక్కసఁ, గాంచి రాముండు మహానందంబున విమానంబు గ్రిందికిఁ బఱపించి,

తో : తమ్ములఁ బౌరులఁ దల్లుల దాదులఁ దక్కిన పరిజనములను । సమ్మదమునఁ బుష్పక మెక్కుడునటునలిపి పఱపె గ్రమ్మరను ॥

వ. అని బహుకాలంబునకుఁ జూచిన మక్కువచే రాముండు భరతుని దనయుంక తలంబునఁ గూర్చుండఁబెట్టుకొని కుశలంబడిగె; భరతుండును సీతాలక్ష్మణుల నాదరించి సుగ్రీవాంగద నల నీల జాంబవంత సుషేణ ప్రముఖవానరులఁ జిత్రంబుగా నవలోకించి క్షేమంబడిగి సుగ్రీవునిఁ గౌగిలించుకొని యిట్లనియె.

గీ నీసహాయంబుచే రావణాసురాది
శత్రులను గెల్చెమాయన్న మిత్రతనయ !
నలువురము సుమ్మి యన్నదమ్ములము మేము !
ప్రీతి నీతోడ నేవుర మైతి మిపుడు.

వ. అని శ్లాఘించె. అప్పుడు శత్రుఘ్నుండు రామలక్ష్మణసీతా దేవులకు నమస్క రించిన, దీవించిరి అంత రాముండు——

తో : తల్లులకును బ్రణమిల్లిన వారలు దనయుని లేవగ నెత్తియుల్లంబున వగనొందిన పిమ్మటను నుబ్బిరి యక్కున నొత్తి ॥ రా ॥

వ. అప్పుడు భరతుండు——

తో: తారయోధ్యకిత్తటిఁ జేరఁగ, సందర్శన భాగ్యముగూడె శ్రీరఘురామా ॥ రా ॥

జంఝూటి-అటతాళము: (ఆదిమారుని) వలె.

ఇఁక రాజ్యము నీవే యేలుము రామా! యొకనాఁటికి నాచేతఁ గాదో పరంధామ! ॥ ఇఁక ॥ పదిమడుఁగులు మునుపటికంటె దనము కొదవాయె ఖజానాకొట్టులో! వినుము ॥ ఇఁక ॥ పాదుకలను రాజ్యభారముంచితి; నీపాదుకలను నీకర్పణజేసితిని ॥ ఇఁక ॥ నీపంపుఁ జేయుచు నిను గొల్చెదను నేపట్ల మోక్షగుండేశ్వర నేను ॥ ఇఁక ॥

వ. అని యిట్లు పలికిన వనచరులు మోదించిరి. అంతలోవిమానంబు నంది గ్రామంబు సమీపించె. అప్పుడు రామానుమతంబున సందఱుదిగి భరతునియాశ్రమంబు జేరిరి అప్పుడు—

తో: ధనదునిఁ జేరఁగ బనిపినియెద నేనని పీఠ్యాసి పైకెగిరి। చనియె విమానము వినువీథిని వైశ్రవణునినగరము దారి ॥ రా ॥

వ. రాముండు కులగురువగు వశిష్ఠమహామునికి నమస్కరించి దీవనలంది యాయన యనుమతిచే నర్ఘాసనంబునఁ గూర్చుండె. అనంతరంబు భరతుండు—

తో: తల్లి నాకు దత్తంబుసేసె; నదత్తముచేసితి నీకు వల్లభుఁడవు యీపద్రాజ్యము నెమ్మిఁ బాలింపుము దయ విడకు ॥ రా ॥

వ. అని పాదంబులకు సాగిలిపడి, వేఁడుకొనియె। ఇంతలోఁగైక వచ్చి,

తో: నాతప్పిదము మనంబున నుంపక నా : న్నాదయయుంచి। నీతితోడ నవనీతల మెల్లను నీ వేలుము సైరించి ॥ రా ।

వ. అని యనేకవిధంబులఁ బ్రార్థించె. అప్పుడు వశిష్ఠుండు లేచి వీనియభిమత ప్రకారము నప్పుతింపు మని చెప్పిన రాముఁడు నియ్యకొనియె. అంత రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులకు క్షురకర్మంబులు జేయించి సుగ్రీవ విభీషణాదులు గూడి తైలంబుఁ బూసి.

క. జడ లూడఁదీసి స్నానము
గడుపడిఁ జేయించి వస్త్ర-గంధంబులు మేల్
దొడవులు నలంకరించిరి
పుడమి నిసువు కపుడు దారముఖచెలు లెల్లన్.

వ. అభ్యంగనస్నానంబుఁ జేయించి సర్వమాల్యాభరణాదులచే నలంకరించిరి. అప్పుడు కౌసల్య కొడుకును జూచి యానందించె శత్రుఘ్నుని యనుమతిచే సుమంత్రుండు రథం బాయితంబుజేసిఁ తెచ్చిన, రాముం డారోహించి

రగడ : సాకేతము జేరెఁ రాముఁడు సకుటుంబముగాఁగన్
సౌమిత్రియు మఱి శత్రుఘ్నుండును జామరలు విసఁగ
భరతుండును శ్వేతచ్ఛత్రము జెలఁగబట్టగఁ గోతులమూఁకలు
గూడను ముట్టగ, భానుజయువరాట్ప్రముఖవానరులు
దానవపతియు రథద్విపాశ్వముల రామునియానతి రయమున నెక్కియు,
వేమఱు రాగను, వెంబడిజొక్కియు, సాకేతము జేరెన్.
ఇంద్రుడు తనరథ మెక్కియు, రాగను, జంద్రముఖులుధరజాతను
వేగను, గైకసుమిత్రాకౌసల్యాదులఁ బ్రాకటతారాప్రముఖభామినుల
శిబికారూఢులఁ జేసుక నడవఁగఁ బ్రబలివాద్యములు బరువడి
మ్రోయఁగ
సాకేతముచేరెన్ రాముఁడు సకుటుంబముగాఁగన్.
వందిబృందకైవారము లలరగఁ ముందుభటులుసమ్మదమునఁ గొలువఁగ
వారకామినులువరుసగనాడగ వారకగాయకవర్యులు పాడఁగఁ
బౌరులు గురులైబరువడిఁ జూడఁగఁ గూరిమి నర్తలు గొబ్బున వెడఁగఁ
బురిశృంగారముఁ బొసఁగఁగఁ గాంచుచు నరుదగు నాశ్చర్యం బునఁ
దేలుచు
సాకేతముఁజేరెన్ రాముఁడు సకుటుంబముగాఁగన్.

వ. ఇట్లయోధ్యఁ జేరిరి. అవ్వార్తవిని రామసందర్శన కుతూహల మానసలై పౌర కాంతలు హర్మ్యాగ్రంబులపయి కెక్కి సేసలు చల్లుచు శరీరంబులు పులకాంకురములు సెండ నిట్లనుచున్నారు.

కీర్తన : ఏకతాళము - (సైరంధ్రి) వలె.

పట్టాభిరాముఁజూడరే! పట్టాభిరామునకు నిపుడు పట్టాభిషేకమగును! బట్టపుదేవి జనక పట్టియే యగు నౌర ॥ పట్టా ॥ నీలాబ్జనాత్రుఁడగు నితఁడు, నీరజనేత్రుఁడగు

లీలాపితామహుఁడగు బాలించి చూడనగు ॥ పట్టాభి ॥ శ్రీ మోక్షగుండేశుని నేఁడు సీతా సమన్వితుని శ్రీమీరలఁ గాంచితిమి యేమి సుదిన మగు ॥ పట్టాభి ॥

వ. ఇంతనురూపవంతుఁడగు ననంతతేజోభిరాముని రాముని గాంతాయుతంబుగఁ గాంతారమునకుఁబంపి దురంతచింతాక్రాంతులఁ జేసెఁగదా! కైక యత్యంత కఠినాత్మురాలు గాక,

తో: కైక పసఁగ నక్కరలే దెంతటిఘనులైనను లోకమునఁ । ప్రాలికర్మము పగిదిని నడతురు గాక యన్య మొక టసునా! ॥ రా ॥

వ. కైకప్రేరణలేకున్న లోకకంటకులగు కైకసి సుతప్రముఖానేక రాక్షసమూక లే కరణిని జెడుదురు? పాకారి ముఖ్యదివౌకసుల కే కరణిని మేలుచేకూఱు. ఇది యవశ్యంబు గాఁదగినకార్యమే! సరి। యనుకొనుచుఁడు నంతలో —

తో: నిజభవనము సన్నిధికిఁ జేరి మానితరథ మవరోహించి । నిజమాతలను ననేక దండములు నేర్పుతోడ నర్పించి ॥ రా ॥ కొలువు కూటమునకును జని రత్నోజ్జ్వలసింహాసనమును । గొలువుదీరి తనుఁ గొలుచుచుముందఱ నిలిచిన భరతున కనెను ॥ రా ॥

హంసధ్వని : ఆదితాళము. (సరోజాస) వలె.

మదాజ్ఞానుసారుండవై ప్రాజ్ఞతతో నడపుము ॥ మదా ॥ సంజ్ఞను సెల్లపనులుసరగున నెఱవేర్పుము ॥ మదా ॥ దానవభర్తకు వానరభర్తకు వేరువేరుగను విడుదులు జత పరుపుము ॥ మదా ॥ రాజకాంతలను రయమున నంతిపురంబులకును బంపు! ఘనముగ సురవదుగను ॥ మదా ॥ అభిషేకార్థము యత్నము సలుపుము! శుభముగ మోక్షపురవిభుమదిఁ దలఁచుచు వడి ॥ మదా ॥

వ. తదాజ్ఞలు శిరసావహించి భరతుఁడు సర్వము నెఱవేర్చి యన్నకు నిట్లనియె.

క. రవితనయ విభీషణ సుర
ధవయువరాజాదులకును దగ వేర్వేఱన్
నివసింపఁగఁ దావులు మ
ద్భవనంబున నేర్పఱచితిఁ బరమదయాళూ.

వ. అని విన్నవించి పిమ్మట సుగ్రీవుని చేరం బోయి యిట్లనియె:

తో : శ్రీరాముని కభిషేకము చేయగ సింధుజలముకావలెను ! ! మారుతిముసకు సమానంబుగ జను వారిని బంపగవలెను ॥ రా ॥

వ. అని తెలిపిన సుగ్రీవుండు మంచిదని గవాక్ష నీల స లాంజనేయుల చేరం బిలిచి క్రమంబున నిట్లనియె :

కీర్తన : త్రిశ్రజాతి - (సంతతంబున) వలె.

పోయి రాఁ దగు వాయుజవముతోఁ ॥ బోయిరా ॥ తోయధుల జలముఁ దూర్ణంబునఁ గొని తెచ్చుటకు ॥ బోయి ॥ ఓ గవాక్ష నీవుఁ । బ్రాగబ్ధిజలమును వేగమెకైకొని యేగెడులోపల ॥ బోయి ॥ నీల, దక్షిణాబ్ధినీరము ముహూర్త కాలమునకుఁ జేర్పఁగా వలెఁ గావున ॥ బో ॥ ఓసలుఁడా! పశ్చిమోదధిజలము లానందముగఁ దెచ్చి యర్పింపఁగా నీవు ॥ బోయి ॥ పావని, యుత్తర పాథోధిసలిలంబున్న పావనతీర్థము వేవేగఁ దేవడి ॥ బో ॥ శ్రీమోక్ష గుండ శ్రీరామాభిషేకార్థమై మీరు మోదాబ్ధియందోలలాడుచు ॥ బోయిరాదగు ॥

వ మఱియు సమస్త పుణ్యనదీతీర్థంబులు తెచ్చుటకు సుషేణ - జాంబవంతుల నియమించిన వారందఱును గనకకలశంబులు ధరించి వారివారి నియామక స్థలములనుగూర్చి యరిగిరి, అనంతరంబ,

తో : భరతుని పంపున దేశమంతటను భటతండమ్ములు జాటి । పురజనులెల్ల రలంకరణమ్ములు మురుపుగఁ దీర్చిరి పేఁట ।

శహన రాగము : ఏకతాళము-[ఎంతని నే] వలె.

పురము నలంకరణము జేసిరి పురుషులు చెలులుఁ । శోభా కరముగ సొగసుగఁ ॥ బురము ॥ పరిమళఘనసారమృగమద । భరితచందనంబుఁ జరగఁ గూర్చి యలికిరి ॥ పురము ॥ గోడలపై మేడలపైఁ జూడఁగ జిత్తరువుల్ వేడుకలర వ్రాసిరి నాడెముగను ॥ గో ॥ యీడులేని మాడుపుల ధ్వజములను బైడికలశములు బాగుగ నెత్తిరి ॥ పురము ॥ ముంగిళులఁ ముత్యముల రంగవల్లు లలరఁ, మంగళముగ భర్మస్తంభమ్ముల ॥ ముంగి ॥ రంగుమీఱఁ బచ్చలు గూర్చినతోరణములు శుభమా రంగ నటు గట్టిరి ॥ పురము ॥ చల్లని పందిళ్ళు దగఁ గొల్లఁగ నెల్లెడలఁ సల్లలితాగరు సౌరభధూపము జల్లని వెల్లివిరియ మోక్ష గుండ శ్రీరఘు! వల్లభుండు రంజిల్లి మెచ్చగను ॥ బురము ॥

వ. ఇటువలె నారాత్రి నాలుగుయామంబులు నిద్రాహారంబులు వర్జించి సమస్త జనంబులు పురము శృంగారించుట లోనగు కార్యములు బ్రవర్తించిరి. అంతఁ దెల్లవారిన వసిష్ఠుండు సనుదెంచి,

క. పట్టాభి రామమూర్తికిఁ
బట్టము గట్టంగ నేఁడు భవ్యదినం; బి
ప్పట్టున రామునకున్ ధర
పట్టికిఁ గై సేయవలయుఁ బదిలముగాఁగన్.

తో: అంత వశిష్ఠుని యానతిఁ దలకొని కాంతలు పురుషులు గలిసి । వంతులు వేసి వసంతము లాడిరి వావివరుసలను దెలిసి ॥ రా ॥

వ. ఇట్లు శ్రీ సీతారామసహితంబుగా సకల పురుషులు స్త్రీలునుజేరి మంగళ వాద్యంబులు మ్రోయుచుండఁ జెలరేగి,

కీర్తన: ఏకతాళము-(దారిజూ) వలె.

ఎంతో వైభవ మొదవఁ జెలఁగుచు, వసంతోత్సవము వేడ్క సలుప దొడగిరి ॥ యెంతో ॥ తరుణులున్ బురుషులున్ మురువుగన్ వరుసలన్ సరగ దెలిసి చల్లుకొనుచును ॥ జన మెంతో ॥ ఇతరేతరంబు దలుముచున్ జేతః ప్రీతిన్ ఖ్యాతి నెన్నుచున్ ॥ జనమెంతో ॥ బీరమ్ముజేయుచున్, బేగమ్ము దీయుచున్ వచనమ్ము లలర సరసమ్ముల నిమ్ముల నమ్మించి చిమ్మించి చల్లుచు ॥ నెంతో ॥ రారాదా చల్లగా రాదా! యని చీరుచు దూరము బారుచును ॥ జనమెం ॥ మంచివసుపునీరు ॥ సున్నము నిం పెనఁగగన్ గునుమ సద్రసముతో బిసిక చల్లులాడుచు ॥ జనమెం ॥ వరమోక్షగుండ రాఘవుని కటాక్ష ముండుటన్, బరీక్ష బట్టుచును దీక్షతో వంతులాడుచును ॥ జన మెంతో ॥

వ ఇట్లు కొంతవడవు వంతంబులు మెఱయ వసంతంబు లాడి శ్రీరామచంద్ర మహాప్రభువును జాయాయుతంబుగఁ బీఠంబుపయిఁ గూర్చుండఁ జేసి సువాసినులు వాళుని లిచ్చిరి. ఎట్లనిన,

ఉశేనిరాగము : ఆదితాళము : (ఈరాజా) వలె.

సీతారామునకు బ్రీతిగను హారతు లొసగరె ॥ సీతా ॥ యాతు ధానులఁ గోతి గోటుఁగ, భూతలంబునం దుదయించిన ॥ సీతా ॥ మేలుగ ధరాపాలు రరయఁగ నోలి శూలిచాపము విఱచిన ॥ సీతా ॥ చండిగను మోక్షగుండపురమున నిండు వేడ్కతో నివసించిన ॥ సీతా ॥ శ్రేయముగ నారాయణార్చితుఁడై యనంతముగ విలసిల్లెడు ॥ సీతా ॥

వ. ఇట్లు హారతులిచ్చి యామీఁద శోభనంబులు పాడిరి. ఎటులనిన;

కళ్యాణి : ఆదితాళము. (మనవి) వలె.

శోభన మనియనరే సుదతులార ॥ శోభన ॥ ప్రాభవమున సీతా భగవతితో శోభిలు రామునకు సుదతులారా ॥ శో ॥ భూతావళులను బ్రోచుచునుండెడు సీతారామునకు-సుదతు ॥ శో ॥ భానువంశసంభవుడయి వెలసిన జానకిరామునకు సుదతు ॥ శో ॥ దశకంఠుని శపథముగొని కూల్చిన దశరథరామునకు-సుదతు ॥ శో ॥ మోక్షగుండమున ముదమున వెలసిన మోహనరామునకు సుదతు ॥ శో ॥ పరగ నారాయణశర్మను బ్రోచిన ధరణిజరామునకు-సుదతు ॥ శోభన ॥

వ. ఇట్లుశోభనంబులు పాడుచు సంపెంగతైలంబున, నలుంటి యునంతరంబున నలుగుబెట్టు విధం బెట్టిన్నను,

నలుగుపాట ; రూపకము (దాసిన్) వలె.

రామల్ నలుగు లొనగిరి విరాజితకరుడైయా ॥ రామల్ ॥ రాముని కరిభీమునకు భూమితనయకుఁ దగఁగామితములు జెలువారఁగ ॥ అలరామల్ ॥ మోముల దరహాసములు ప్రేమం తరింపఁ గఁ గోమలతనువుల జిగి గలుగఁగ నా ॥ రా ॥ ఈదంపతులను గొలువ నీనాటికి గలిగెను మోదం బనుచును విశదముగానా ॥ రా ॥ మోక్షగుండమున వెలసిన మోక్షాంగనను గలసిసాక్షిగఁ జెలువొందినరాముని కా ॥ రామల్ ॥ నలుగు లొసఁగిరి.

వ. అటుపిమ్మట,

గీ. మంగళస్నాన మాడించి మధువతులిత
చికురమును గూర్చితడియార్చి చిక్కుదీసి
కీలుగంటులు ఘటియించి పూలు ముడిచి
పరగ సాంబ్రాణి నవ్యధూపములు వేసి

తో : శ్రీరామునకు సీతాదేవికి జీనాంబరములు గట్టిహార మకుట కేయూర కంకణాద్యాభరణంబులు వెట్టి ॥ రా ॥

వగల దేలు నగుమొగముల సొగసుగ మృగమదతిలకము దిద్దిదగ బరిమళయుత మగుచందన మింపుగ నెమ్మేనుల నద్ది ॥ రామ ॥

వ. ఇట్లు శృంగారించి సకల జనులు స్నానంబు లొనరించి శుచిర్భూతులయి నవీనాంబరములు ధరించిరి. అంత—

బేహగ్ : ఆదితాళము. [నిదురలేక]వలె.

సభామండపము చేరెను శ్రీరాముండు పట్టాభిరాముఁడు వేడ్క ॥ సభా ॥ ...
నీలప్రభాసమలంకృత భాసురనవ్య సోపానరంజిత ॥ సభా ॥ ధర్మమయస్తంభ ధ...
శశికాంతనిర్మలవేదికానిర్మాణమగు ॥ సభా ॥ ఖ్యాతిగ దనయనుజాతులు వెనువెంట ...
సీతాసమేతుఁడై దివ్య ॥ సభా ॥ కరుణాకటాక్షవీక్షణమున బ్రజలను నరయుచు ...
గుండాధిపు డపుడు ॥ సభామండపము ॥

సీ. బిరుదరాజముల పేర్వేఱ నెన్నుచు భట్టు
లొలసి కైవారముల్ బలుకుచుండ
సస్వరమ్ముగ యజుస్సామాదు లాశీఃపు
రస్కృతి భూసురాగ్రణులు సెప్ప
ప్రతిహితగాన సంగతి భావమెసయించి
నట్టువచెలు లభినయము సూప
ఐదుపుల్ కర్పూర హారతుల్ గైసేసి
పాడుచు మ్రోల నివాళియొసఁగ

గీ. జనకనందన వామాంకమున రహింప
భరత శత్రుఘ్ను లోలి వీవనలు వీవ
గోరి సౌమిత్రి వెలుపట్టుగొడుగు పట్ట,
ననిల తనయుఁడు చరణ పంకజము లొత్త
కొలు వమరె సింహపీఠి రఘూద్వహుండు.

వ. ఇట్లు కొలువు దీఱియున్న కాలంబున,

రగడ: వచ్చిరి సీతాపతి వైభవమును
ముచ్చటగాఁగని మోదమందుటను
గౌతమి సంయమి గర్గుఁడు శల్యుఁడు
శతానందుఁడును శాండిల్యుండును
యాజ్ఞ వల్క్యుఁడును అగస్త్యపాదుఁడు
భరద్వాజుఁడును భర్గుఁడు హారితుఁడు

ఆపస్తంబుఁడు నత్రి వసుండును
మౌద్గల్యుండును మాండవ్యుండును
రేణుకాత్మజుఁడు ఋశ్యశృంగముని
కౌండిన్యుండును గాలవ శౌనక
సాలంకాయన వాలఖిల్యులును
మైత్రావరుణ మరీచులు వ్యాసుఁడు
కణ్వ పరాశర, కౌశిక నారద
వాల్మీక్యాది తపస్వులు వనివడి ॥ వచ్చి ॥
నరు లురగులు కిన్నరులు చారణులు
సురలు గరుడ యక్షులు గంధర్వులు
సాధ్య సిద్ధ ఖేచరవర్గంబులు
విద్యాధరులును విశ్వేదేవత
లష్టదిగీశులు అష్టవసువులు
అప్సరోంగనలు నలకింపురుషులు ॥ వచ్చి ॥

వ. ఇట్లు వచ్చిన ఋష్యాదుల కెదురేఁగి తోడితెచ్చి సిద్ధాసనంబులఁ గూర్చుం
బెట్టి పూజించె. వారి యనుమతంబున సింహాసనాసీనుఁడైన రాముసను వా రిట్లనిరి :

సురటి : ఆదితాళము - (పూకులముపకీ) వలె.

శ్రీరామపట్టాభిషేకలగ్నము సమకూఱెను ప్రొద్దు మీఱెను; ఈ రాజ్యభార
వారక నీవు భరింపుము పరిపాలింపుము ॥ శ్రీ ॥ నీయవతారముచే సాధువులకు మేలాయె
వెతలు పోయెను శ్రీయుత మోక్షపురీశ్వర యండఁబుఁ జేరిరి ! చూడఁ గోరిరి !

వ. అని ప్రశంస చేయుచున్న సమయంబున—

తో : హనుమంతుఁడులో నగు ప్లవగులు చతురబ్ధుల జలములఁ గొనుచు
దెంచియు రాముని ముందల నుంచిన వారినతఁడుదయగనుచు ॥ రా ॥

వ. వారి నెల్ల సమ్మానించె. అంత వారు రామునకు నమస్కరించి, య
నిలిచి చూచుచుండిరి. అప్పుడు వసిష్ఠ వామదేవాది ఋషులు పట్టాభిషేకం బొనర్చు
సంకల్పించిరి.

# శ్రీ రా మ ప ట్టా భి షే క ము

కళ్యాణి : ఆటతాళము.

శ్రీరామపట్టాభిషేకమహోత్సవ మారూఢిఁ గనఁగ నేత్రానందకరము! చారుతులసీ కుశవిరాజితమై పరకుసుమ కస్తూరిసారమిళితసుగంధపూరితమై ప్రియమై జయమై తనరారు సింధుజలంబుతో మనసారనభిషేకం బొనర్చిరి ॥ శ్రీరామ ॥

భరతశత్రుఘ్ను లుభయపార్శ్వంబుల, సీత సరి యెడమదిక్కున లక్ష్మణుఁడు పడ పటను, పసున గరువలిపట్టి తూర్పునను, యువరాజజాంబవంత రవిజ విభీషణులుఁ దగను గలిమూల మొద లొరసి కోణములందు నిలిచి దృగుత్సవంబుగఁ గొలువ నలరెడు ॥ శ్రీరామ ॥

నవరత్నమయభూషణములు హారంబులు దివిజవల్లభుఁడు దెచ్చియియ్యఁగను, వివిధ వాద్యమ్ములు మొఱయఁగను, ఖేచరులు గూడి యవిరళంబుగ గుసుమవర్షమును గురి మ మొఱయఁ గోటిభానుకాంతులు గలకిరీటము రమ్యముగ ధరింప నలరెను ॥ శ్రీరామ ॥

వారక వశిష్ఠ వాల్మీకి జాబాలి వామదేవాదులు వైభోగముగను, సారెకు నాశీర్వదిం పఁగను వారాంగనలు నొయ్యారముగ మోదించి యాడఁగను, గరము ధరను దాళ్వారి నారాయణమనోబ్జ విహారుఁడగు శ్రీమోక్షగుండ ॥ శ్రీరామ ॥

తో : వామభాగమున వైభోగంబుగ భూమిసుతిక మెలఁగ క్షేమంబుగ మణిసింహా సనమున శ్రీరఘురాముఁడు వెలుగ ॥ రా ॥

క. కనుఁగొని శంకరఫణిపతు
లనిమిషపతి నిర్జరౌఘ యక్షాదులు శో
భనముగఁ గరములు మోడిచి
కొనియాడిరి రాము నసురకోటివిరాముః.

శంకరుఁడు : కేదారరూపకము - (సాటి) వలె.

రామ! సీతారామ! పరంధామ! భక్తకామ! జయసుందర! ॥ రామ ॥ సోమ సూర్య వహ్నిమండలగత! నీమహిమల్ సామాన్యమె రూపింపఁగ ॥ రా ॥ భూతలాదిభూత కోశాతీత! మోక్షగుండపుర రాజిత! వీతరాగ! నారాయణకవివరచేతః కంజాతస్థిత! ధాతృసుత! ॥ రామసీత ॥

తేవారము. నీమహామహిమఁ దెలియనేర లోకాభిరామా!
భూమి భారంబువాపి ప్రోచితివి రిపులజోపి!
క్షేమముగ దేవతాళి చిక్కులను బాసిహాయి
వేమరుఁజరింపఁ గలరు విశ్రమింపంగఁ గలరు.

కీర్తన: శంకరాభరణము - ఆదితాళము. (కరివరదా) వలె.

నినుఁ దెలిసి పొగడఁగలమా శ్రీరామా ॥ నినుఁ దెలిసి ॥ సులభముగాను సుషుమ్న నాడియం దలరుచు వెలిగెఁడు నాత్మమయుని ॥ నినుఁ దె ॥ అణువులో నణువువై, ఘనములో ఘనమవై యణిమాదులకును నందరాని ॥ నినుఁ దెలి ॥ అక్షయముగ నారాయణవరకవి మోక్షగుండమున వీక్షించెడు ॥ నినుఁ దెలి ॥

తో: నిరతము మమ్ముల నిలుప నీకఁ గడు వెతపించెడు రావణుని । బొరిగొంటివి మా పుణ్యంబున సుఖముగ నుండెద మిఁకభువిని ॥

క. తనముందఱ సంగీతము
మన మలరఁగఁ బాడు మనుచు మమ్మేచెడు నా
దనుజేంద్రునిఁ గ్రూరాత్ముని
దునిమితి విఁక నిన్నుఁ బాడుదుము శ్రీరామా!

తో: వెనుకొని యాగహవిస్సులు దానే గొనుచుండును దానవుఁడు । దునిసెను నీచే దురమునఁ గ్రమ్మఱ దొరకెను మా కవియిపుడు ॥ రా ॥

క. కడువడి నరులు గయాదుల
నిడుపిండంబులను జెంద నియ్యఁడు మాకున్
వెడరక్కసుఁ డీల్గిన ని
ప్పుడు మా కవి దొరకె నీదు భూరికరుణచేన్.

వ. అని యిట్లు యక్షకిన్నరకింపురుష విద్యాధరాదులు వేర్వేఱ బొగడి రామునిచే ననుజ్ఞాతులై స్వస్థానంబులకుంజనిరి. అంతరాముండు వేదపారగులగు బ్రాహ్మణులకు లక్ష గోదానంబులు లక్షతురంగదానంబులు జేసి-పిమ్మట వస్త్రాభరణసువర్ణదానంబు లమితంబుగా నొనర్చె.

తో: పొంగుచు సుగ్రీవునకుదానవపుంగవునకు హారములు, నంగదునకు మణియంగదములుఁ గపు లందఱికిని బహుమతులు ॥ రా ॥ సమ్మదమున నిడిసత్కరించి తన సన్నిధిఁ గొల్చుచు నున్నయమ్మారుతిఁ గనియడుగు వరములో యన్నా! యిచ్చెదనన్న ॥ రా ॥ నామదిలో నీనామస్మరణ మనారతమును జేయుచును నేమారక నే నెసఁగుభక్తి నాకిమ్ము పూర్ణ మగుదయను ॥ రా ॥

గీ. ఎంతదాఁక భవన్నామ మెంతదాఁక
నీదుస్మరణము భూమిపై నిలువఁగలదొ
యంతదాఁకను నాదేహ మవనియందు
నిలిచియుండఁగ వర మిమ్ము కలుషహరణ.

వ. అనిన, రాముండానందించి;

తో: చక్కఁగ నీయిష్టంబు లొనంగితిః జయ్యన నిను మెచ్చితిని। తక్కఁగఁ గల్పాంతమున నన్ను ధాతను జేసెద నమ్మతిని ॥ రామ ॥

వ. అటుమీఁద మత్పదంబు నొందగలవు. అని రాముండు వరంబు లిచ్చిన విని సీతాదేవి తానిట్లనియె:

తో: ఇలమీఁదను నీ వెచటనున్న నందిష్టమయిన భోగములు గలిగి సుఖింతువు గాక! నీకు నిఁక గలుగవు మతి లోపములు ॥ రా ॥

వ. అని యాపురాణదంపతులు తత్వం బుపదేశించి మహాశీర్వాదపూర్వకంబుగా ననుగ్రహించిరి. వరంబులకు హనుమంతుండు బ్రహ్మానందంబు నొంది, పునఃపునఃప్రణామంబు లాచరించి,

కళ్యాణి:ఆదితాళము - [సీతాధిపతీ] వలె.

జయ రమారమణ! గోవిందా! హరీ! జయ సుమాస్త్రశోభిత సముజ్వలాంగా! విలక్షమకుమారిమనోహరా ॥ జయ ॥ అరుణసితాసిత వరకృష్ణస్ఫటికాంచితవర్ణవిలక్షణా! విల ॥ జయ ॥ అమలమోక్షగుండాధిప, నారాయణకవిహృదయ విరాజితా ॥ జయ ॥

వ. అని పొగడుచు యథేచ్ఛఁగా జని హిమవత్పర్వతంబున హనుమంతుండ దపంబు జేయుచుండె. సుగ్రీవుండు గపికోటులుగొల్వ గిష్కింధ కరిగె విభీషణుండు లంక బ్రవేశించి రాజ్యంబేలుచుండె. రాముండు దన్నాశ్రయించి కరుణాపాత్రుండయిన గుహునిఁగని

తో: మంతనమ్మునం జింతించుచు నీమహిని భోగమున బ్రబలి! యంతపుండు నాయం దైక్యంబై యలరెదుపొమ్మిక గదలి ॥ రా ॥

వ. అని సెలవిచ్చి యనేకరత్నాభరణాదులచే నత్కరించె. గుహుండానందించి రామధ్యానంబుఁజేయుచు శృంగిబేరమునకుఁ జనియె పిమ్మట సాయంకాలం బయిన,

ఏకాంతసేవ ప్రారంభము.

తో: అంత రామ-సీతాంగనలకు నేకాంత సేవ నలుపఁగను! సంతరంగమును నలరి సువాసిను లాలోచనఁ జేయుచును ॥ రా ॥

వ. అన్యోన్యాహూయమానలైరి. ఎట్లనిన—

చెలుల కీర్తన: ఆటతాళము-[ఒకదివ్య] వలె.

శ్రీరామునికొలువుఁ జేయ రారమ్మ! కోరికలెల్ల చేకూరుగదమ్మ! ॥ శ్రీ ॥ భవబంధ భయములు బాయు గదమ్మ! యవిరళముక్తి కరామలక మమ్మ ॥ శ్రీ ॥ నారాయణశర్మా ధారుఁ డోయమ్మ! ధారుణి మోక్షప్రదాత గదమ్మ! ॥ శ్రీ ॥ మన పురాకృతములు మంచి వోయమ్మ! ఘనమోక్షగుండేశుఁ గన గలిగె నమ్మ! ॥ శ్రీ ॥

వ. అని పిలుచుకొనుచు నాక్షణంబున,

క. బంగారుసరిగ చీరెలు
రంగుగఁ బట్టించు బొగడ రవికలు మాణి
క్యాంగద భూషణములు మెఱ
యంగను ధరియించి వచ్చి రంగనలెల్లన్.

వ. ఇట్లు వచ్చి యత్యద్భుత జగన్మోహనదివ్యమంగళవిగ్రహుండగు శ్రీరామ చంద్రమహాప్రభువును వీక్షించి,

కీర్తన: ఆదితాళము-[నీతితో] వలె.

అంద మౌరాముని సుందరము జూడరే ॥ యంద ॥ కందర్పసహస్రదివ్యాకారుఁడని తెలియరే ॥ యంద ॥ వామభాగమున వేడ్కభూమి తనయ నిల్వఁగ, సామీప్యమం దా శ్రితులు సంతసమునఁ గొల్వగ, సౌమిత్రి లోనైన యనుజన్ములతో: జెల్వగ ॥ నందమౌ ॥ హారకేయూరాదిభూషణావళి ధరించెనే! ధారుణి శ్రీమోక్షగుండ ధాముఁ డనమించెనే! నారాయణశర్మ హృదయసారసమున నిలిచెనే! ॥ యంద ॥

గీ. అనుచు సభివర్ణనము జేసి యంతమీఁద
రామచంద్రుని యంతఃపురంబునందు
స్ఫటికమయహంసతూలికా శయ్యపైకి
వేడ్కతోఁ జేర్చి యిట్లని వేడి రపుడు.

కీర్తన : ఆదితాళము - (రామమంత్రం) వలె.

పవ్వళింపుము రామ ॥ పవ్వ ॥ జవ్వను లమరించినట్టి పువ్వుపాన్పుపై ॥ జవ్వ ॥ వివిధకాంతుల నలరు విపులవసతుల కవల శుద్ధస్ఫటికమయగేహంబులోపల ॥ బవ్వ ॥ ప్రీతినెక్కొన భూజాత నంగతి భాతిగ నారాయణహృత్పద్మశయ్యను ॥ బవ్వ ॥ జల్పసం దగు స్వయంకల్పితంబగు తల్పమందు మోక్షగుండధామశుభ మగు ॥ బవ్వ ॥

తో : ఆవిధమున నాత్మారాము నుషమ్నాఁతఃపురవరమునను। బావన మగు హృత్పద్మతల్పమునఁ బవ్వళింపఁ జేసియును ॥ రా ॥

వ. తిన్నగా సీతాదేవి తావునకు వెళ్ళియిట్లనుచున్నారు :

కీర్తన : ఆటతాళము - ( నమిలాం ) వలె.

పతిసంగతివేడ్కఁ బవ్వళింతువుగాని పదవమ్మ పడకింటికి, పతి వియోగంబునఁ బడినయలజడులెల్లఁబాసె సుఖమ్మున వఱలుము దేవి ॥ నారాయణార్చితుని సూరిజనస్తుతు శ్రీరఘునాయకునిఁజేరితివమ్మ ॥ పతి ॥

వ. అని చెలులు జానకినిఁ బానుపుఁ జేర్చి నట్లు పాడిరి.

కీర్తన : ఆటతాళము - (కాంతుఁడు) వలె.

చల్లగను శ్రీరామునిపైఁ జల్లరే విరజాజులు మల్లెమొల్లలు సంపెగలు చేమంతివిరులు లాజలు ॥ జల్లగను ॥ అందముగఁ జెలువొందు లనదరవిందములు జెంగలువలు బొందుగను దాసానసుమములుబొగడలును గురువకములు ॥ జల్ల ॥ పారిజాత ప్రసూనములు మందార ములు సుర పొన్నలుఁ గోరి నారాయణ మనోజ్ఞవిహారుని పయిఁ గన్నెలు జల్లగను శ్రీరామునిపై ॥ జల్లరే విరజాజులు ॥

తో : కమ్మనితావులు ఘుమ్మని దెసలను గ్రమ్మునుగంధముఁ దీసి । కొమ్ములు బంగరు గురిగలమొత్తముఁగొని దంపతులనుడాసి ॥ రా ॥

హంసధ్వని : ఆదితాళము. (రవిమల) వలె.

పరిమళకలిత గంధము బూయరే పరిమళ కలిత - లలితాతులిత భరిత పరిమళ కలిత ॥ సారతర మగు మృగమదసార పరిమళ ఘనకచోర సురజోయుతఘనసారపూరిత ॥ పరిమళ కలిత ॥ ప్రీతియొరీతిగా, గీతికల్ బాడుచుఁ, సీతాసమేతుఁడై చెలఁగిన రాముని చేతము రంజిలఁ జేసియు ॥ బరిమళకలిత ॥ భూమిమోక్షగుండంబున వేడ్క వసించివేమరు నారాయణశర్మను మన్నించి కామితముల్ గడు నొనఁగ్రేమ నెగడు రామునకును ॥ బరిమళకలితగంధము ॥

వ. ఈ విధంబున సుగంధంబు లలంకారంబుగా నలఁది,

క. మధురంబులైన ఫలములు
మధురాపూపములుగొన్ని మఱిపళ్ళెములన్
మధుకర వేణులమర్చిరి
పృథివిజకున్ రామునకును బ్రియము దలిర్పన్.

కళ్యాణి : రూపకము (పరమ) వలె.

ఆరగింపుము ముద మార జనకజాతసహితంబుగ ॥ నా ॥ నారికేళ కదలికా ఖర్జూర దాడిమంబులున్, జంబీర ॥ చూత ద్రాక్షలుఁ, సుసార పుష్పసార మిళితంబుగ ॥ నార ॥ మేలుగన్ జిలేబి మణుగుబూలు కర్జకాయలుఁ బూరీలు నామవడలు నతిరసాలు బూందిలాడు సురుచిరముగ ॥ నార ॥ చారపప్పు నెయ్యి పంచదార గూర్చి యుంచిరి తాళ్ళూరి శ్రీనారాయణాఖ్యచారుహృద్విహార ॥ మధురంబుగ ॥ నార ॥

వ. ఇట్లు సమస్తమయిన ఉపాహారంబులు సమర్పించి, యనంతరంబు—

గీ. పసిడిఁదాపిన రత్నాల పళ్లెరమునఁ
గప్పురపు వీడియములు బొంకముగఁ గూర్చి
నేర్పునన్ జానకీరామ నృపులమోల
నుంచి సౌభాగ్యవతులు బ్రార్థించి రిట్లు ;

బ్యాండుస్వరము - ఆదితాళము.

విడెము సేయు రఘువరా! కడు వేడు కలర నఘహరా! పుడమి కుమారి నేర్పునఁ జుట్టి యిచ్చిన మడుపులు మునిపంట నమలి యుండుకొని వేగ ॥ వి ॥

మెచ్చుగలుగు పోకలు, రుచి హెచ్చుపండుటాకులు, బచ్చకర్పూరసంభరితమౌ మౌక్తికచూర్ణ యుతముగఁ దెచ్చియుంచినాము ॥ విడెము ॥

రాజవంశభూషణా! నారాయణకవిపోషణా। జాజికాయలును జాపత్రి యేలకు లోజ లవంగాలు నొనర నుంచినాము ॥ విడెము ॥

వ. అనంతరము పూలచెండ్లు గట్టితెచ్చి యిచ్చినఁ గొంతసేపు నేర్పులు మెఱయ సీతారాము లాడి రెటులనిన—

కీర్తన : ఏకతాళము - (ఈశరాసనంబుబారి) వలె.

బంతు లాడిరి పూల బంతు లాడిరీ! వింతగా జెంతగాస్వాంతమం దెంతయుగా, సంతస మలరగా, గాంతలు మెలఁగగా బంతముజెలఁగన్ ॥

రా — నాతిగా ప్రీతిగా సీత నే నీతరిగావేతును దలఁపుగా ; జాతురు పీరల్ ఖ్యాతిగ సనుచు ॥ బంతు ॥

సీత — ఏమి స్వామీ వేమరున్ ప్రేయుచుగా, భామలఁ గలఁపన్ నీమదిఁ దలఁపన్ నిలువుము సైపనీ ॥ బంతు ॥

రా — మాటిమాటి కేటికేపోటిగ సయాట లాడఁగన్ ప్రేటుకు నిలుపు చాటుకు దొలఁగు ॥ బంతు ॥

సీత — వద్దు వద్దు దద్దయున్ బెద్దయున్ సుద్దులాడఁగన్ ముద్దుల గుమ్మన్ మోక్షపురవరా ॥ బంతులాడిరీ ॥

వ. ఇట్లన్యోన్యసరసాలాపంబులచేఁ బూబంతులాడుచున్న వారి యనురాగ భావంబులు గాంచి కాంతలు —

తో : పదరే కొంచెము పనియున్నది నా కిదిగోవచ్చెద ననుచు, నదిగో వచ్చెద నిదిగో వచ్చెద నని యొక్కొక్కరు నగుచు ॥ రా ॥

వ. వెలపటికిఁ జని తలుపు బిగించుకొనిరి. అంత రాముం డేకాంత మగుటచే—

క్షితికన్యను లాలించెన్ ; సిగ్గే లని వివరించెన్ ; అతివను గౌఁగిట నుంచెన్ ; యతనునిఁ గడు నదలించెన్ మించెన్ ; ఇంచెన్ ; రతికేళి లోనఁ గూర్మిఁ దేలించెన్ ; కాంతామణి నలరించెన్ ; గళలెల్లనుబాలించెన్ ; దంతక్షత మొనరించెన్ ; దగబంధములను ముంచెన్ ; బొంచెన్ గాంచెన్ ; ధర మోక్షగుండ దేవుఁ డలయించెన్.

వ. సీతారాములు దేలి క్రీడావినోదములం సొక్కి వర్తించుచు. నానవ్వుడివిసి యవ్వలనున్న జవ్వనులు నవ్వుకొనుచు వారిని నిద్రింపం జేయువారై —

జంఝూటి : త్రిశ్ర జాతి. (ఈబాలు) వలె.

శ్రీరామచంద్ర లాలి! సీతాసమేత లాలి! కారుణ్యసాంద్ర లాలీ! కల్యాణమయ లాలీ! లాలీ! కలుషాపహర లాలి ॥ శ్రీరామ ॥

సృష్టికిం బూర్వమున వ్యష్టి సమిష్టియైన దృష్టప్రపంచమునను ద్రష్టవు నీవగుచు నుండి తుష్టిగ నుండెదవు ॥ శ్రీరామ ॥

సుగుణులంబ్రోచుటకును, విగుణులం బెఱచుటకును తగురీతిధర్మమును స్థాపింప ధర లోన బుట్టెదవు ప్రతియుగమునను ॥ శ్రీరామ ॥

కాకుత్‌స్థవంశమునను గౌసల్యగర్భమునను సాకేతనగరమునను జన్మించితివి దుష్ట దనుజానీకము లదరంగను ॥ శ్రీరామ ॥

ఆ తాటకిని ద్రుంచి యధ్వరమును గాచి, గౌతమ సతిని బ్రోచి, కనకంతువిలు విఱచి, తలంచి సీతను వరియించి ॥ శ్రీరామ ॥

దశరథునాజ్ఞచేత దండకావనులం దిరిగి, ఓశ లార్చి ఖరదూషణ-త్రిశిరుల వధియించి, శబరి దెనంబూర్ణదయ యుంచి ॥ శ్రీరామ ॥

వాలినినంహరించి వారిధిం దగ బంధించి యాలంకఁ ముట్టడించి, యసురుల నెదిరించి మించి, యాలముం గావించి ॥ శ్రీరామ ॥

రావణఘటకర్ణాదిరాక్షసులను మోది, యావేళ ధరణీతనయ యనుజులతోంగూడి వెడలి యయోధ్యం జేరితివి ॥ శ్రీరామ ॥

పట్టాభిషిక్తుండవై జలువేడ్కతోడ జనకపట్టిని గూడుకొనుచుపాలించితివ రామ! రామ! పార్వతీనుతనామ! ॥ శ్రీరామ ॥

నీయందు మాయగలిగె, మాయవలన గుణము లాయెను; వానివలన నాయెను భూతములుః నందే యీ యఖిలం బాయెఁ ॥ శ్రీరామ ॥

శక్తిత్రయము నీవే; శ్రద్ధాత్రయము నీవే; ముక్తత్రయము నీవె; మూర్తిత్రయము నీవే; నీవె భక్తిత్రయము నీవే ॥ శ్రీరామ ॥

కాలత్రయము నీవే; కర్తృత్రయము నీవే; కర్మత్రయము నీవే, కాయత్రయము నీవే; నవే కళాత్రయము నీవే ॥ శ్రీరామ ॥

దీక్షాత్రియము నీవె; దేవత్రయము నీవే; చక్షుస్త్రయము నీవే; జగత్త్రియమునీవే; నీవే లక్ష్యత్రయము నీవే ॥ శ్రీరామ ॥

జ్ఞానత్రయమునీవే; నాడీత్రయము నీవే; స్థానత్రయము నీవే; తాపత్రయము నీవే; నీవే త్రైవర్ణములు నీవే ॥ శ్రీరామ ॥

కనుఁగొన నణువు నీవే; ఘనములో ఘనము నీవే; సనకాది యోగిహృదయసంచారుడవు నీవే; సచరాచరరూపములు నీవే ॥ శ్రీరామ ॥

ప్రళయవసానమందు ప్రపంచము నీయందుఁ బ్రభవించి వృద్ధినొందు; బ్రళయావసరమందు ముందుఁబవళించు నీయందు ॥ శ్రీరామ ॥

లోకులు నిద్రవోవు నాకాలమున జాగరూకూఁడ వగుచు నీవు జోకొట్టుచుండుదువు; నిన్ను జోకొట్టువారెవరు ॥ శ్రీరామ ॥

బంగారు మొక్కటయ్యు బహుభూషణంబు లయిన భంగి నీ వొకఁడవయ్యు బహు నామరూపములఁ బరగి ప్రబలితి విటునలెను ॥ శ్రీరామ ॥

బహుభిన్నభాండస్థితపటుదీపవలు దేహములబహిరంతరింద్రియముల భాసిల్లఁ జేయుచును మిగుల విహరించుచుందువు ॥ శ్రీరామ ॥

శ్రీరామ చిద్విలాస! శ్రీమోక్షగుండవాస! నారాయణాఖ్యదాసాధారామితోల్లాస! చంద్రికారమ్యదరహాస! శ్రీరామచంద్రలాలీ! సీతాసమేతలాలి! కారుణ్యసాంద్ర లాలి! కల్యాణమయ లాలీ! లాలి! కలుషాపహార లాలీ.

ఇట్లు లాలిపాటఁబాడి వారు నిద్రాముద్రితులైన పిమ్మట—

శహన : ఏకతాళము. (ఎంతని నేనం) వలె.

సందడిఁజేయం దగ దింపొందఁగ జనరమ్మా! మీమీమందిరములకును ॥ సందడి ॥ పొందుగ నిద్రానందంబుల రఘునందన - సీతాసుందరులుండిరి ॥ సందడి ॥ కానల నమ్మానులసాంగత్యము నలుపుచును, దానవులను వెనుదవిలి చంపుచును ॥ కానల ॥ మానుగ నిద్రలు మాని యుండిరటు గాన, సుప్తులై మేనులు మఱచిరి ॥ సందడి ॥ ఈరేయిఁ మీ

రెల్లక గూరికి వేగినను గూరిమితో సింగారము లలరఁగ ॥ ఈరే ॥ కోరి మోక్షపుర శ్రీరఘు వీరుని జేరి యాకొలుపు జేతుడుగా కిఁక ॥ సందడి ॥

వ. అని చెప్పుకొనుచుఁ దమ యిరవులకుఁజని నిద్రించి వేకువజామున లేచి,

క. అమ్మా శ్రీరాముఁడు సీ
తమ్మయు మేల్కొనఁగలేదు; త్వరగాఁజనిమా
దమ్మన మేల్కొల్పఁగ రా
రమ్మా? యని లేచి వచ్చి రాపూమణులున్.

వ. చనుదెంచి ద్వారంబున నిలిచి యారాము ననంతరామునిగా భావించి,

### మేలుకొలుపు : అటతాళము.

శ్రీరామ! రామ! సీతారామ! యిదెతెల్లవాఱవచ్చె నిద్రమేలుకో। పౌరులు సకలోపచారము లొనరింపఁ గోరి వచ్చినారు మేలుకో॥ రామా! మేలుకొనుమా॥

దశవిధప్రణవనాదములనే కుక్కుటధ్వనులు మెండయ్యెను మేలుకో! దిశలెల్ల వెలుఁగ దేదీప్యమానజ్ఞాన దినకరుఁ డుదయించె మేలుకో ॥ రామ ॥

రమణ నిక్షేపావరణశక్తు లగునట్టి కుముదముల్ ముకుళించె మేలుకో॥ విమలమైన జ్ఞాన - విజ్ఞానము లను కమలముల్ వికసించె మేలుకో ॥ రామ ॥ పలుపలురంగుల భాసిల్లు చున్నది కొలువుకూటముఁ జేరమేలుకో॥ అలరు నాపోజ్యోతి యనుసింహాసనమున నాసీనుఁడ వగుదువు మేలుకో ॥ రామ ॥

అనుపమావస్థాత్రయం బనునట్టి నీయనుజులు జేరిరి మేలుకో! ఘనముగఁ దదవస్థా కార్యము లొనరింపగను నియమింతువు మేలుకో ॥ రామ ॥

అంచితసద్బోధ మనెడు బురోహితుఁడరుదెంచియున్నా డదె మేలుకో॥ పంచాంగ మందలి భావమెల్ల విమర్శించి బోధించును మేలుకో ॥ రామ ॥

కనఁ జతుర్వాక్యమాగధవందిగాయక కవులు వచ్చినారు మేలుకో॥ అనయము నీకన్న నన్య మొక్కటియు లే దని పల్కుచున్నారు మేలుకో ॥ రామ ॥

అంతరాంతరత్రిపుటి యను నంతఃపురములో నవనిజతోఁ గూడమేలుకో॥ కాంతి నం దుంచి యొక్కఁడ వేఁగికడు రాజకార్యములను దీర్చ మేలుకో ॥ రామ ॥

అష్టవిధప్రకృతు లను సచివులు బరివేష్టింప వచ్చిరి మేలుకో! స్పష్టముగా సన్ని పనులను నియమించి ద్రష్టవై యుందువు మేలుకో! ॥ రామ ॥

అతులితకోటిసూర్యప్రభాభాసిత మగు కిరీటము దాల్తు మేలుకో। ప్రతి లేని బ్రహ్మాండ భాండసామ్రాజ్యముఁ బాలన సేతువు మేలుకో ॥ రామ ॥

కామాదిచోరవర్గము జ్ఞానధనమును గైకొనఁ బూనిరి మేలుకో! మరకయ వారి బోధివిద్వర తద్ధన మిఁక నుద్ధరింతువు మేలుకో ॥ రామ ॥

సాక్షాన్నారాయణస్వాంతవారిజసీమ లక్షించి యున్నాఁడు మేలుకో। అక్షయమైన స్వయంప్రభ జూపఁగ మోక్షగుండేశ్వర మేలుకో ॥ రామా మేలుకొనుమా ॥

వ. ఇట్లు మేలుకొలిపిన నిద్రలేచి రాముండు కాలోచితకృత్యంబులు దీర్చుకొని మజ్జనేంబాడి సీతానహితంబుగా సమస్తాలంకారంబులు చేసికొని భోజనంబొనర్చి మహా విభవంబుగా గొలువుకూటంబుఁ జేరి లక్ష్మణునకు యువరాజ్యం బిచ్చి తాను లోకాతీత పరమాత్ముండయ్యును లోకవిడంబనార్థం మవతరించె గాన, దుష్టనిగ్రహ శిష్టానుగ్ర హంబులు సేయుచుఁ బదునొకండు వేలసంవత్సరములు ధర్మంబుగా రాజ్యపరిపాలనంబుఁ చేయుచు సుఖంబుండె అట్టి కాలంబున —

తో: జనులకుదుర్భిక్షభయంబులు విషసర్పఘోరభయములును ననువుదప్పు రోగాదిభయంబుల నందక భోగము లొందుచును ॥ రా ॥

వ. సంతోషంబున నలరారుచుండిరి, పృథివిసర్వసస్య సంపూర్ణంబయియొప్పె. వృక్షంబులుఁ గుసుమఫలభరితంబులై రంజిలె పార్వతీ! యిట్టి మహనీయచరిత్రం బాద్యం తంబుఁ గర్ణరసాయనంబుగానీ కొఱకు వివరించితిఁ గదా। యట్టి రామమూర్తి కృపాప్రసాదం బనుభవించి ముక్తురాలవుగమ్మా ॥

క. నాచేనీకుపదిష్టం
బై చెల్లిన మోక్షగుండహరిచారిత్రం
బాచంద్రార్కంబుగ నీ
భూచక్రమునందు నలరుఁ బూర్ణేందుముఖీ!

వ. అని బోధించిన పార్వతీదేవి బ్రహ్మానందవారాశియందోల లాడి శంకరగురు పదారవిందంబులకు వందంబు లాచరించె. అనంతరం బయ్యాదిమదంపతులనుఁ గూర్చి మంగళంబు బాడె నెటులనిన:

బేగడ : ఆటతాళము. (కమలాంబ) వలె.

నిత్యమంగళం నిత్యానందునకు ॥ నిత్య ॥ అత్యంతజగదామణికి ॥ నిత్యమంగ ॥ సత్యజ్ఞానానంతసాక్షిరూపునకు నిత్యానపాయిని యగు సీతకు ॥ నిత్యమంగ ॥ సాక్షాన్నారాయణ సరసహృద్గోచర మోక్షగుండ రామమూర్తికి సీతకు ॥ నిత్యమంగ ॥

వ. ఇట్లు మంగళముఁ బాడి శ్రీ సీతారామబ్రహ్మప్రతిఫలిత దివ్యాపోజ్యోతిస్స్వరూపంబుఁ దనహృత్కమల కర్ణికాంతరంబున సూక్ష్మంబుగాఁ గనుచు నిజానందంబునఁ దేలుచు గైలానంబుననుండిరి.

## ఆశ్వాసాంతము

తో : అని తాళ్ళూరి నారాయణకవి రామాయణమును హరికథను । ఘనముగఁ జెప్పెను గథయం దిది రణకాండము చిలుకును సుధను ॥ రా ॥

ఇది వినువారల కిహసౌఖ్యంబులు గొదువలేక చేకురును । ముదమునఁ దుదకట ముక్తిలభించును మోక్షగుండహరికృపను ॥ రా ॥

రామ రామా యనవే - శ్రీరామాయణకథ వినవే! ॥ పార్వతీ ॥

గీ. మొదలి కావ్యమ్ము వాల్మీకిమునికృతమ్ము
రామచరితమ్ము భక్తలోకామృతమ్ము
హరికథగఁ గూర్చె రక్తి నారాయణుండు
వసుధ వెలయుత మాశశి భాస్కరముగ.

మోక్షగుండరామాయణము
సంపూర్ణము.

